# సాహితీ సుగతుని స్వగతం



డాక్టర్ తిరుమల రామచంద్ర

# సాహితీ సుగతుని స్వాగతం

(మూడవ కూర్పు)

డా॥ తిరుమల రామచంద్ర డి.లిట్.



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం. : 1547 ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : ఆగష్టు, 1969

ద్వితీయ ముద్రణ : మార్చి, 1977

మార్పులు చేర్పులతో తృతీయ ముద్రణ : జనవరి, 1991

టైటిల్ డిజైన్ : **ఉమ**

**వెల : రూ. 45-00**

ప్రతులకు :
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్,**
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం.
తిరుపతి, హన్మకొండ; గుంటూరు, కాకినాడ.

ISBN : 81-7098-230-8

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 5000 880.
ఫోన్ : 68418.

# అంకితం

ప్రజారక్షణ పరాయణులు

పరిపాలన దక్షులు

శ్రీ రొద్దం ప్రభాకరరావు గారికి

# మనవి మాటలు

అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసాలలో కొన్నిటి కదంబమే యిది. దీనిలో నాటి కదంబ కుసుమాలు; నేటి మద్రాసు కదంబాలు ఉన్నాయి. కొన్ని మౌలిక పరిశోధన మనస్కాలు; మరికొన్ని విషయ నివేదన మాత్ర పరాయణాలు; ఇంకా కొన్ని ఊహోన్మేష విలసితాలు. ఈ అన్నింటిలోను సహృదయులకు నా పరిశ్రమైక హృదయం, సత్య సన్నిహితవృష్టి కనిపిస్తాయి.

దీనిలోని వ్యాసాలు సమకాలిక పత్రికలలో ప్రచురితమయినవే. వీటిలో పెక్కు భారతిలో 'సాహితీ సుగతుని స్వగతం' అనే శీర్షిక కింద ప్రచురిత మయినట్టివి. కనుక ఈ వ్యాసకదంబానికి 'సాహితీ సుగతుని స్వగతం' అనే పేరు పెట్టాను. శ్రీ ప్రభాకరరావుగారు నా మిత్రుల పుత్రులు. ఉత్తమ సంస్కారం గలవారు. తమ పెద్దల లాగే న్యాయవాద వృత్తిలో ఉన్నా, గొప్ప కీర్తిమంతులయ్యే వారే. సహృదయతామూర్తులైన వారికి ఈ వ్యాస కదంబం అంకిత మిస్తున్నం దుకు చాల ఆనందిస్తున్నాను.

ఆధునిక రచయితలలో లబ్ధప్రతిష్ఠులైన శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారు మైత్రితో దీనిని లోకానికి 'పరిచయం' చేశారు. వారికి సస్నేహ నమస్కారాలు.

ఇది మూడవ ముద్రణ, దీనిలో అదనంగా కొన్ని వ్యాసాలు చేర్చాను. ప్రజలకు విజ్ఞానం పంచిపెట్టడమే పరమావధిగా పెట్టుకొన్న సంస్థ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. నేను కోరినదే తడవుగా ఈ వ్యాస కదంబాన్ని ప్రచురించి నందుకు దానికి, దాని నిర్వాహకులు శ్రీ పి. రాజేశ్వరరావు గారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కారాలు.

హైదరాబాద్-380,<br>ప్రమోదూత ఫాల్గుణ పూర్ణిమ

భాషాసేవకుడు,<br>**తిరుమల రామచంద్ర**

# పరిచయం

శ్రీ తిరుమల రామచంద్రగారు సాహిత్య జగత్తుకు సుపరిచితులు. వీరి లేఖినినుండి వెలువడిన "మన లిపి పుట్టుపూర్వోత్తరాలు", "నుడి, నానుడి" విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ద్వారా ఇదివరకే పాఠకలోకానికి అందచేశాము. ఇపుడు "సాహితీ సుగతుని స్వగతం" ప్రచురించుతున్నందుకు మా ప్రచురణాలయం గర్వించుతూంది.

ఈ "సాహిత్య సుగతుడు" ఎంతటి భాషాసంపన్నుడో అంతటి నిరాడంబరుడు; ఎంతటి సాహిత్య ప్రజ్ఞాపాటవాలు కలవాడో అంతటి నిగర్వి; సంస్కృతంలో సాహిత్య "శిరోమణి", తెలుగు సంస్కృతాలలో "విద్వాన్", హిందీలో "ప్రభాకర్" లాంటి పట్టాలు పుచ్చుకొన్నవాడు; కన్నడ భాషలో పాండిత్యమూ, తమిళంతో గాఢపరిచయమూ కలవాడు; మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రిగార్ల వద్ద ఆంధ్ర, ప్రాకృతభాషా పరిశోధకులుగా శిష్యరికం చేశారు; మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీలోనూ, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలోనూ పండితులుగా పనిచేశారు. ఎన్నో ఏళ్ళుగా పత్రికా రచయితగా జీవనం సాగిస్తున్నారు.

భాషాసేవక సమితి స్థాపకులుగా, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ సభ్యులుగా, "పరిశోధన"లాంటి ఉత్తమ సాహితీ పత్రికా సంపాదకులుగా తిరుమల రామచంద్రగారి భాషాసేవ అనల్పం.

వివిధ పత్రికల్లో రామచంద్రగారు అపుడపుడూ రాసిన రచనలను ఇపుడీ పుస్తకరూపేణ ప్రచురిస్తున్నాం. రచయితే వివరించినట్టు వీటిలో కొన్ని మౌలిక పరిశోధనకు చెందినవి; మరికొన్ని విషయ వివరణకు సంబంధించినవి; మరి కొన్ని ఊహాబలంతో తర్కించినవి.

ఈ వ్యాసాలను చదువుతున్నప్పుడు ఏవో పండితుల 'కొరకరాని కొయ్య' లుగా ఇవి అనిపించవు. ఏ మాత్రం సాహిత్యాభిరుచి కలవారికైనా ఎంతో ఆసక్తిని కల్గించుతాయి. సామాన్యంగా పాత్రికేయులు స్పృశించవలసిన విషయాలను సైతం

పరిశోధన దర్పణంలో ప్రతిబింబింప జేసి, ఎన్నెన్నో వింత వింత రంగులను చూపించారు. అందుకు ఒక్క ఉదాహరణ "బుద్ధునికి ముందునుంచే ఉన్న ధూమ పానం". సాహిత్యం, సంగీతం, నాటక రచన, సంస్కృతి రంగాలలో కృషి గురించి మన దేశానికే పరిమితంగాక వివిధ దేశాల విషయాలను ఎన్నో వెల్ల డించారు. ముద్రారాక్షసాలు మొదలుకొని సెక్స్ సమస్యలవరకూ ఈ వ్యాసా వళిలో చోటు చేసుకున్నాయి.

ఇంతటి విషయ వైవిధ్యంగల వ్యాసాలు రచించడానికి రచయిత కేవలం శ్రమపడినా చాలదు. అతనికి భాషలోని లోతుపాతులు తెలియాలి. శబ్దంమీద అధి కారం వుండాలి. ఇరుగు పొరుగు భాషల, ఒకే కుటుంబంలోని భాషలతో గాఢ పరిచయం ఉండాలి; అన్నిటికన్నా మథించితెచ్చిన అమృతాన్ని "అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు" పాఠకులచే ఆస్వాదింపచేయగల నేర్పుండాలి. పైగా లోకచరిత్ర, వృత్తాంతమూ, ఆచార వ్యవహారాలు గురించి తెలిసివుండాలి. వీటన్నిటినిమించి గాఢ పరిశ్రమ, దానికితగిన చిత్తశుద్ధి ఉండాలి: ఇన్నింటిని పుణికి పుచ్చుకొన్న భాషా సంపన్నుడు శ్రీ తిరుమల రామచంద్ర. అందుచేతనే ఈ రచనలో కృతకృత్యులయ్యారు.

—తుమ్మల వెంకటరామయ్య

# అనుక్రమణిక

# ఆంధ్ర వాఙ్మయంలో నాగేశ్వర యుగం

లక్ష్యశుద్ధి వుంటే లక్ష్యసిద్ధి సుకరం అన్నారు అభియుక్తులు. లక్ష్య శుద్ధికి సాధన సమృద్ధి సమకూరితే మరి సాధించరాని దేదీలేదు. కళాప్రపూర్ణ, దేశోద్ధారక, విశ్వదాత, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ త్రివేణుల సంగమం. వారు సంకల్ప సిద్ధులు కావడానికి కీలకం ఇదే. ఈ సిద్ధికి వెలుగు చూపింది వారి ప్రజ్ఞానం. ఆంధ్రావళి మనోవికాసానికి, సర్వతోముఖ ప్రకాశానికి వారు చేసిన కృషి ఏ ఒక్కటిని కలయజూచినా చాలు ఆ ప్రజ్ఞానరోచిస్సులు, మనస్వితా మహస్సులు మనస్సుకు హత్తుకుంటాయి.

సార్థకజీవు లందరివలె వారూ అంతర్ముఖులు. వారు విశ్వదాతలే కాని, మాటలలో మహాకృపణులు; పరోపదేశ పండితులుకాక మాటలను చేతలుగా మలచిన మహాశిల్పులు. కనుకనే, వారి చిన్ననాటి సంకల్పాలెన్నో సత్కార్యాలుగా సుమించాయి. చిన్ననాటి లేలేత గుండెలోని నారులే విజ్ఞాన వటవృక్షాలయాయి.

పంతులుగారిని ఇతర మహాపురుషులనుంచి వేరు చేసే విలక్షణతలు చాల ఉన్నాయి. కొందరు ఏదో ఘనకార్యం తలపెట్టి కృతార్థు లవుతారు. కొందరు కొన్ని ఘనకార్యాలు సాధిస్తారు. పంతులుగారిలో విశేషం అన్ని సముద్యమాలకూ అగ్రగాములు కావడం; ప్రజ్ఞను బహుముఖంగా పరువులు తీయించడం, అపూర్వ ఫలాలు పొందడమూను. ఈ ఫలాలలో మొదటిది ఆంధ్రపత్రిక వారపత్రిక.

"ప్రజలకు విద్యాభివృద్ధియు ప్రపంచ జ్ఞానాభివృద్ధియు గావించుటయే మా ముఖ్యాభిప్రాయము. ప్రజల యోగక్షేమాభివృద్ధికి దేశాభిమానమును, స్వామిభక్తియు మిగుల సహకారులని మే ముద్ఘోషించు చుందుము. స్వామి భక్తిలేని దేశాభిమానమును, దేశాభిమానములేని స్వామిభక్తియును ననర్థ ప్రతిపాదకంబు లగునని మా చదువరులకు హెచ్చరించు చుందుము. స్వామిభక్తి దేశాభిమానము లను గుణ ద్వయమును ప్రజల హృదయమున సదా నెలకొల్ప పాటుపడుచుండెదము... ఆంగ్లేయ ప్రభుత్వమునకు లోబడిన ఇతర రాజ్యములందువలెనే స్వకీయ పరిపాలనమును కాలక్రమమున బొందుటయే మా స్వరాజ్యాదర్శము... కాలమును, ధర్మమును, దైవమును మా యుద్యమముల సఫలీకృతములను జేయుగాత!"

శ్రీ పంతులుగారు 1908 ఏప్రిల్ 9 వ తేదీన (కీలక సంవత్సర భాద్రపద శుద్ధ చతుర్దశి బుధవారం) బొంబాయిలో ప్రారంభించిన ఆంధ్రపత్రిక వార పత్రిక తొలి సంచిక సంపాదకీయంలోని వాక్కులివి.

ఈ ఉదాహృత భాగంలోని "ప్రజలకు విద్యాభివృద్ధియు ప్రపంచ జ్ఞానాభివృద్ధియు గావించుటయే మా ముఖ్యాభిప్రాయము" అన్న వాక్కులలోని అంతర్యం శ్రీ పంతులుగారి ఆవేదనను స్పష్టపరుస్తుంది నిజానికి అప్పటికి తెలుగులో పత్రికలు లేకపోలేదు. కాని, వాటి లక్ష్యాలు, అవకాశాలు, ఉద్దేశాలు పరిమితాలు. కొన్ని కేవలం పండిత వేదండుల పద పదార్థ చర్చా ప్రమథాలకు, కేవలం దోషైకదృష్టి ప్రఖ్యాపనానికి, మరికొన్ని పైవారికి మహజరులు పెట్టుకొనడానికి ఉద్దేశించినట్టివి. మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు ఆంధ్రోపపదంతో, ఆంధ్ర భాషాపోషణోద్దేశంతో వెలువరించిన "ఆంధ్ర భాషా సంజీవని" వంటి ప్రతికలు, కేవలం పండిత మాత్ర సమాదరణీయా లయాయి. పత్రికల లక్ష్యం పండితమాత్రవేద్యాలు కావడం, విద్వన్మాత్ర ప్రయోజనకరాలు కావడం కాదుకదా! అంతేకాక, ఈ పత్రికలు చాలవరకు పద వాక్య విమర్శనకు, వ్యుత్పత్తికి, సారస్య వివేచనకు ప్రాధాన్యమిస్తూ, పాండిత గాంభీర్యానికి దోహదమిచ్చేవేకాని, సామాన్య పామర రంజకాలు కావు. శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారి "అముద్రిత గ్రంథచింతామణి" వంటిది కూడా సమకాలిక కవిపండితుల రచనలను మోమోటమిలేకుండా విమర్శించేదయినా, హెచ్చుగా భాషాచర్చకు ప్రాధాన్యమిచ్చినట్టిదే కాని, అప్పటికే మన దేశంలో పాశ్చాత్య సాహిత్య వ్యాపారసంబంధంగల భారతీయ మేధావుల జిజ్ఞాసనుగాని, ఆకాంక్షనుగాని సంతృప్తిపరిచేది కాదు; సామాన్యపామరులకు సులభోపసర్పణీయం అసలే కాదు.

విద్యావ్యాప్తికోసమూ, జ్ఞానప్రచారంకోసమూ శ్రీ పంతులుగారు ఇంతగా తహతహ పడడానికి మూలకందమైన మరొకగాథను పెద్దలనుంచి విన్నాను. అది శ్రీ పంతులుగారి చిన్ననాటి సంగతి. వారు మెట్రిక్యులేషన్ పరీక్ష కాగానే, ఏదో గుమాస్తాగిరి సంపాదించి, ఇంటికి రెండు రాళ్ళు వచ్చేట్టు చూడరాదా అని చుట్టాలు పక్కాలు పంతులుగారికి సలహా యిచ్చారు. కాని, పంతులుగారి మాతృదేవి శ్రీమతి శ్యామలాంబగారికి మాత్రం తమ కుమారుడు పెద్ద చదువులు చదివి, గొప్పవాడు కావాలనే కోరిక ఉండేది. ఆమెగారు పట్టుబట్టి ఇంట్లో పెద్దలను, చుట్టాలను ఒప్పించి శ్రీ పంతులుగారిని కాలేజీలో చేరడానికి గుంటూరుకు పంపారు. పంతులుగారు గుంటూరు వెళ్ళి ఇంటరుమీడియేటులో చేరారు.

పల్లెపట్టులలోనివారు తమ పిల్లలను చదివించుకోలేక పడేపాట్లు చిన్ననాడే శ్రీ పంతులుగారి మనస్సుపై చెరపరాని ముద్ర వేశాయి. వారు పెద్దవారైన తర్వాత స్వగ్రామమైన ఎలకుర్రులో తమ మాతృదేవి పేర "శ్రీ శ్యామలాంబా ధర్మపాఠశాల" అని ఒక మిడిల్ స్కూలు స్థాపించారు. దానిలో అందరికీ ఉచితంగా విద్య గరపే ఏర్పాట్లు చేశారు. హరిజనులకు కూడా ప్రవేశం కలిగించారు. పలువురు సవర్ణులు హరిజనులు బళ్ళోకి వస్తే తాము రామని భీష్మించుకున్నారు. అయినా శ్రీ పంతులుగారు తమ నిర్ణయాన్ని మార్చుకోలేదు. మాజీ మంత్రి శ్రీ వేముల కూర్మయ్య మొదలయిన హరిజనులు ఈ శ్రీ శ్యామలాంబా ధర్మపాఠశాలలో చదివినవారే.

శ్రీ పంతులుగారు అప్పుడు నివసిస్తున్నది జాతీయత, చైతన్యం, వివిధ నాగరికతల ప్రాభవం అలముకొన్న మహారాష్ట్ర రాజధాని అయిన బొంబాయిలో. మహారాష్ట్ర పాలనం దేశంలో అంతరించినా, జాతీయోద్యమానికి ప్రథమ భారత స్వాతంత్ర్య సమరానికి సేనానులు మహారాష్ట్రులే. 'స్వరాజ్యం నా జన్మహక్కు' అని గర్జించిన వీరసింహం లోకమాన్యుడు, మొదలయిన నాయకుల సింహగర్జనలను అటు రాజకీయాలలోనూ, శ్రీ భండార్కర్‌వంటి సాహిత్యపాథో నిధులు సంస్కృత సాహిత్య సేవామిషతో భారతజాతికి చేస్తున్న సేవను సారస్వత రంగంలోను చెవులార విని, కన్నులార కంటున్న శ్రీ పంతులుగారి హృదయం ఉత్తేజితమైంది. గణేశ నవరాత్రం అనే పేరుతో జరుగుతున్న జాతీయోత్సవాలు శ్రీ పంతులుగారిని గిలిగింత పెట్టినవి. మహారాష్ట్ర కేసరి, మహారాష్ట్ర విశ్వకోశ్ శ్రీ పంతులుగారిని ఆహ్వానించాయి. ఆ విజ్ఞానాన్ని, ఆ చైతన్యాన్ని ఆంధ్రదేశానికి తరలించి ఆంధ్రప్రజలను ఉత్తేజితులను, విజ్ఞానవంతులను, కార్యశూరులను, కర్మఠులను చేయాలని సంకల్పించారు. ఆ సంకల్పమే ఆంధ్రవారపత్రిక.

'మహారాష్ట్ర కేసరి' అనే పదం మహారాష్ట్రులను పరవశులను చేయడం వారు చూచారు. తెలుగులో 'ఆంధ్రభాషా సంజీవని' అన్న పత్రిక ఉండనే ఉంది. అది భాషకే పరిమితం కావడంవల్ల యావదాంధ్ర జాతిని ప్రోత్సహించలేకపోయింది. 'ఆంధ్రపత్రిక' అంటే, యావదాంధ్రజాతి, పత్రికను తనదేనన్న భావంతో చూస్తుందని వారు గ్రహించారు. 'ఆంధ్రపత్రిక' అని నామకరణం చేశారు. అటుతర్వాత బయలుదేరాయి ఆంధ్రోపపదంతో పత్రికలు, సంస్థలు పుంఖానుపుంఖంగా.

రాజకీయాలలో వారప్పుడు మితవాద పక్షం వారు. అయినా, బొంబాయి ప్రభుత్వం నిగా తప్పలేదు. పత్రిక లక్ష్యం సంస్కరణ, విజ్ఞాన విస్తృతి అన్నది రూఢి అయిన పిదపకాని ఆ ప్రభుత్వం మనసు మారలేదు; మీదుమిక్కిలి రావు

బహదూర్ బిరుదం ఇవ్వడానికి ఉద్దేశించింది. వారు మితవాదులయినా వార పత్రిక సంపాదకీయాలు వారి అనుభూత సిద్ధాంతాల గుబాళింపులు; వారి భావ స్వాతంత్ర్యానికీ, భావనా వైవిధ్యపరిణాహానికి, పాండితీ గాంభీర్యానికీ మేలి అద్దాలు.

బొంబాయి ప్రభుత్వం ఒకవిధంగా అనుమానించి నిగా పెడితే, కొందరు పురోభాగులు, ఆంధ్ర వార పత్రిక పురోగమనాన్ని మరొకవిధంగా శంకించారు. "కీలక సంవత్సర భాద్రపద శుద్ధ 14 బుధవారము ఆంధ్రపత్రికకు జనన దివసము; బొంబాయి జనన స్థానము, ముహూర్త స్థానములను జూచి గుణించిన జ్యోతిష్కు లరిష్టఫలమును దెలిపిరి. తెలుగు పత్రిక. మహారాష్ట్ర దేశమునందు ప్రచురణము. కాలము కల్లోలమయము. హైందవ నాయకుల కంతఃకల హములు. ప్రజలకు స్వదేశ స్వరాజ్యాందోళనము. పాలకులకు భయవిషాదములు. విదేశమునం దిట్టి సందిగ్ధ సమయమునందు బుట్టిన యాంధ్రపత్రికకు మంచి ఫలమునుజెప్పుట కెవరు సాహసించగలరు?" అని పంతులుగారే ఉదారతతో నిత్యశకింతుల కుశంకలను ఉట్టంకించి, "అదృష్టము దైవాధీనము. దైవాను గ్రహము సకలాభీష్ట సిద్ధికి సాధనము. ఆ సాధన సంపత్తి వలనను నాంధ్ర మహాజనుల సహాయ పోషణము వలనను నాంధ్రపత్రిక వర్ధిలు చున్నందులకు బత్రికా నిర్వాహకులు కృతజ్ఞతలు" అని సమాధాన మిచ్చారు; ఆంధ్రపత్రిక వారపత్రికకు తోడుగా 1914 ఏప్రిల్ 1వ తేదీన మద్రాసులో ప్రారంభించిన ఆంధ్రపత్రిక దినపత్రిక తొలి సంచిక సంపాదకీయంలో, ఈ వాక్కులలోని నిబ్బరం ఎంత బరువైందో చెప్పనక్కరలేదు.

ఎవ్వ రెంతగా, ఏమని విమర్శించినా, ఆంధ్ర వారపత్రిక వారం వారం వేళ తప్పక నవనవోన్మేషంగా వెలువడుతూ, ఆంధ్రావళికి మోదం కలిగించ సాగింది. అపూర్వ ప్రపంచ వర్తమానాలతో వినోదం, విజ్ఞానం కలిగించింది; ఆత్మజ్ఞానం, ఆత్మ విశ్వాసం అలవరించింది; మాతృభాషపై మమకారం ముప్పిరి గొనజేసింది. తెలుగునాట క్రొత్తతీరు చదువరులను సృష్టించింది. తెలుగులో పత్రికా రచనకే కొత్తబాటలు వేసింది. మూడు ముక్కలుగా చెదిరిన తెలుగు నాడును ఒక్కటి చేయడానికి యత్నించింది.

ఈ విధంగా రెండేళ్ళపాటు సాహిత్యసేవ నిరంతరాయంగా సాగింది. దానితో వారికి సంతృప్తి కలుగలేదు, ఆంధ్రుల జీవిత ప్రతిబింబం, ఆంధ్రుల ఆదర్శ స్వరూపం అనదగిన మహాగ్రంథంలో - సంవత్సర రాజకీయ చరిత్ర, అపూర్వ పరిశోధనలు, ప్రముఖుల జీవిత విశేషాలు, చిత్రాలు, వ్యాసాలు, కవితలు, కథలు కమామీషులు మొదలయిన వాటితో చూడగానే చవులూరేట్లు,

చదవగానే కడుపునిండేట్టు వుండగల మహాగ్రంథం-ఏటా సంవత్సరాదిన అంద జేయాలని సంకల్పం కలిగింది వారికి. వారపత్రికతోపాటే ఈ అభిప్రాయమూ కలిగిందేమో! 1910 లో సాధారణ సంవత్సరం చైత్రశుద్ధ పాడ్యమికి—సంవత్స రాది పండుగకు - ఈ ఉద్గ్రంథం వెలువరించారు. దీనిని ఉగాదినాడు వెలు వడుతున్నది కాబట్టి ఉగాదిసంచిక అన్నారు. ఈలాటి ఉగాది సంచికలను ప్రచు రించడంలోను శ్రీ పంతులు గారిదే ఒరవడి. ప్రపంచ పరిస్థితులను గూర్చిన సుదీర్ఘ ప్రస్తావన, 248 పుటలు వివిధ విషయాలపై ప్రముఖుల వ్యాసాలు, కవి తలు, కథలు, 126 చిత్రపటాలు, అన్నిటికీమించి రెండు రూపాయలచందాకే వార పత్రికను, దానితోపాటు ఉగాది సంచికను ఉచితంగాను అందజేయడం! పంతులుగారే తొలి ఉగాది సంచిక విన్నపంలో అన్నట్టు ఇదొక సాహసోద్య మమే! ఆంధ్ర ముద్రాక్షరశాలలులేని బొంబాయి నగరంలో వారపత్రిక ముద్రించడమే కష్టమయిన రోజులలో సవాలక్ష గ్రంథమైన భారతంవంటి ఈ ఉగాది సంచికను ముద్రించడం సాహసంకాక మరేమిటి? "ఆంధ్ర భాషయందు సంవత్సరాది సంచికలను ముద్రించుట కిదియే ప్రథమ ప్రయత్నము. దీని ముద్రణము పుష్యమాసాంతమునం దారంభమై చైత్ర మాసాదిని ముగిసినది. సుమారు రెండున్నర మాసములలో ముద్రణకు సాంతమైనది... దీనిలో ముద్రి తములైన వ్యాసములు భాషాభిమానులచేతను భాషాభిజ్ఞులచేతను వ్రాయబడుటం జేసి, యవి భాషాభివృద్ధికిని తోడ్పడగలవు" అని వారు ఆ విన్నపములో తెలిపి, గీతాతత్త్వం అకళింపుకున్నవారు గనుక తమ కర్తృత్వం దీనిలో ఏమీలేదని, "సంచికను బ్రచురించుటకుగల సామర్థ్యమాంధ్రమహాజనుల సాహాయ్యమువలన గలిగినది" అంటూ తమకు తోడ్పడిన ప్రముఖ సంస్థలకు, వ్యక్తులకు కృత జ్ఞత తెలుపుకున్నారు, సత్పురుషులకు సహజమైన వినమ్రభావంతో.

ఆంధ్రప్రజలే కాక ఇతర భాషలవారు కూడా ఉగాది సంచికలు చూచి దిగ్భ్రాంతులయారు. దానికోసం పండితులు, పామరులు ఒకేవిధంగా ఎంతో ఆసక్తితో, ఆతురతతో ఎదురుచూసేవారు. ఈ సందర్భంలో శ్రీ వడ్డాది సుబ్బా రాయకవి శ్రీ పంతులు గారికి అర్ధశతాబ్ది క్రిందట వ్రాసిన పద్యమయ లేఖ నుంచి ఒక పద్యం ఉదాహరించడం అప్రస్తుతం కాదు:

"మీ దేశ మాతృపూజ ప్ర
సాదము సంవత్సరాది సంచిక యింకన్
రా దందె జాబు వేతు ద
దాదిగ నద్దాని కనుల కద్దుకొనంగన్."

ఉగాదిసంచిక నాటినుంచి నేటివరకు చేస్తున్న భాషాసాహిత్యసేవ నిరుపమానం. అది ఎందరో చరిత్ర పరిశోధకులను, సాహిత్య విమర్శకులను, భాషావేత్తలను, వివిధ శాస్త్ర విజ్ఞానులను తయారుచేసింది. కళాకారులను, ఛాయాచిత్రకారులను కొన్ని వందలమందిని సృష్టించింది. ప్రతి ఏటా ఆంధ్రుల, ఆంధ్రేతరుల ఇళ్ళను ఉగాదినాటికి అలంకరిస్తూ, వారు సంవత్సరమంతా తీరికగా చదువుకోదగినంత విషయనివహాన్ని సంతరించి పెడుతున్నది.

ఈ విధంగా నాలుగేళ్ళు నిండాయో లేదో పంతులుగారు ఆంధ్రపత్రికను కూడా మద్రాసునుంచి ప్రచురించడం ప్రారంభించారు. వారికి తమతో అన్ని విధాల సాటి అయిన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారివంటివారి సహకారం లభించింది; శ్రీ లక్ష్మణరావుగారు మహారాష్ట్రాది బహుభాషావేత్తలు. పంతులుగారివలె విజ్ఞానాన్ని తెలుగున వెదజల్లాలనే ఉత్కంఠ, దీక్ష గలవారు. అదివరకే 'విజ్ఞాన చంద్రికా గ్రంథమాల' అనే గ్రంథమాలను మద్రాసులో నెలకొల్పి అపూర్వగ్రంథాలు ప్రచురించడానికి పూనుకొన్నారు.

"అవసరమైనపుడెల్ల యాంధ్రుల వృద్ధికి తగిన సదుపాయములను విసుకు విరామము లేకను ప్రజలకు, పాఠకులకు నివేదించెదము... శాఖాభేదములను, కులభేదములను, మత భేదములను, జాతిభేదములను గమనింపక మిత్రభావమును వ్యాపింపజేయుటకై ప్రయత్నించెదము. ఆంధ్రోద్యమము పట్ల సంపూర్ణ సానుభూతి నుపయోగించెదము. ఆంధ్రభాష, ఆంధ్రవిద్యా వ్యాపనము, ఆంధ్ర విశ్వ విద్యాలయ నిర్మాణము, ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకత మొదలగు విషయములను సమదృష్టితో సమర్థించుటయే దినపత్రికను ప్రచురించుటకు గల ముఖ్యకారణము." ఈ ముఖ్యోద్దేశంతో ఆంధ్రపత్రిక దినపత్రికగాను చెన్నపురి నుంచి 1914 ఏప్రిల్ 1వ తేదీనుంచి వెలువడ సాగినది. దీనికి వారం వారం సారస్వతానుబంధ మొకటి సహచరి. ఉగాదిసంచికలు, సారస్వతానుబంధం ఆంధ్రకవి పండితుల వైదుషీ శేముషీ ప్రకటనకు పట్టుగొమ్మలయాయి. నేడు సాహిత్యరంగంలో ఇంతో అంతో పేరుమోసిన ప్రతివారూ ఉగాది సంచిక, సారస్వతానుబంధాలతో సంబంధం వున్నవారే.

ఇంతచేసినా శ్రీ పంతులుగారి ఆశ తీరలేదు. "ఆంధ్రుల కళాసాధనములు ప్రకాశము నపేక్షించుచున్నవి. రసవంతమైన వాఙ్మయము ప్రకాశమును, పరిశీలనమును గోరుచున్నది. ఇది ఆత్మ సందర్శనాభిలాష. భారతియందు భాష, వాఙ్మయము, శాస్త్రములు, కళలు సాదరభావముతో చర్చించుట కవకాశము గల్పింపబడును" అని భారతి తొలిసంచిక స్వవిషయంలో వారు పేర్కొన్నట్టు ఆంధ్రజాతి కళాత్మక ప్రవృత్తిని వెలుగులోకి తీసుకొనిరావడానికి 'భారతి'ని

1924 జనవరి (రుధిరోద్గారి పుష్య మాసం) నుంచి ప్రారంభించారు. అంతకు ముందు 'శారద' వంటి మాసపత్రికలున్నా, నవరస విలాసాలతో వెలువడు తున్న భారతి ముందు ఆగలేకపోయాయి.

భారతి అవతరణతో ఆంధ్రదేశంలో యువరచయితలకు, రచయితలకు విశేషమైన ప్రోత్సాహం కలిగింది. ఆంధ్ర సాహిత్యవీధి ప్రకాశమానమై విశ్వ సాహిత్యం ఆంధ్రులకు అందుబాటులోకి వచ్చింది. భారతదేశంలోని ఇతర భాషల వారికికూడా 'భారతి' ప్రామాణిక సాహిత్య మాసపత్రిక అయినది. భారతి అంత వరకు చేసిన సేవను 1938 జనవరి (ఈశ్వర పుష్య మాసం) భారతి స్వవిష యంలో శ్రీ పంతులుగారు ఎంతో ప్రశ్రయంతో తెలుపుకున్నారు. "భారతి యును గతించిన పదునాలుగేండ్ల యందును ఆంధ్రాభ్యుదయమునకును, దేశ కల్యాణమునకును పాటుపడిన విధమునను భావికాలమునందును పాటుపడుటకు భగవంతుడును ఆంధ్రలోకమును అనుగ్రహించుగాత!" అన్నారు. ఇదే వారి చివరి "స్వవిషయము."

దానిలో వారు రెండు దశాబ్దాలుగా ఆంధ్ర దేశంలో చివురెత్తిన నూతన జీవితానికి సంతృప్తి ప్రకటించారు: "ఆంధ్రాభ్యుదయము గతించిన ఇరువది యేండ్లయం దవిచ్ఛిన్నముగా సాగుచుండిన విధమును రాజకీయ, సాంఘిక, సాహిత్య, కళాదిరంగములందు ప్రవర్ధమానంబగుచున్న నవీనవికాసము విశ దము చేయుచున్నది... నవీన సాహిత్య కళారచనలు ఆంధ్రుల స్వాతంత్ర్య ప్రియత్వమును విశదము చేయుచున్నది" అని.

ఇలాగే, బహుధాన్య ఉగాది సంచిక ప్రస్తావనలో వారు తమ సంతోషం ప్రకటించారు:— "గతించిన 30 ఏండ్లనుండియు ప్రజాహృదయము నందు గల్గిన మహాప్రబోధమును సంవత్సరాది సంచికలు దిఙ్మాత్రముగా సూచించు చున్నవి. ఆంధ్రులు సాహిత్య కళా మత సాంఘిక రంగములందు చిరకాలా గతములైన పూర్వాచారములను, నిర్బంధములను విసర్జించి నవీనమార్గము లను అవలంబించిన విధమును కావ్యములు, గీతములు, విమర్శములు, పరిశోధ నలు, చరిత్రాంశములు విశదము చేయుచున్నవి. సాహిత్యము నందు కల్గిన అపారమైన వికాసమును ప్రచురితములైన కావ్యములు, గీతములు విశదము చేయుచున్నవి. నవీన రచనలు ప్రజాదరణము బడయుచున్నవి. ముప్పదేండ్లకు పూర్వము పరిహాస పాత్రములయిన అప్పారావుగారి ముత్యాలసరములు నేడు ప్రజాదరణమునకు పాత్రములగుచున్నవి. ప్రాతపద్ధతులను, క్రొత్తరీతులను ఖండించుట ధీమంతుల లక్షణము కాదు. విమర్శనము చేయుటకు సకలజనులును అధికారులు. సంగీతకళయందును ఆంధ్రుల యభినివేశమును గాన సభలు, గాన

కళాశాలలు, పండిత సత్కారములును విశదము చేయుచున్నవి. కళారంగము నందు చిత్రకారు లవలంబించిన నూతన విధానము చిత్రప్రపంచము నందు ప్రశంసలను బడసినది..."

శ్రీ పంతులుగారు తలపెట్టిన ప్రతిపనీ అద్వితీయమని తెలిసినప్పుడు మనకు మరింత ఆశ్చర్యం కలుగుతుంది. అలాటి అద్వితీయమైన మరొక పని ఆంధ్ర వాఙ్మయసూచిక. (ముద్రితాముద్రిత గ్రంథముల పట్టిక.) ఇది 1929లో ప్రచురించబడింది. దీని తర్వాత ఇంతవరకు ఇలాంటి పట్టికను విశ్వవిద్యాలయాలు గూడ మరల ప్రచురించలేదు. అందువల్లనే అద్వితీయం అన్నాను.

శ్రీ పంతులుగారు మహారాష్ట్రంలో వాఙ్మయ సూచిని చూచారు. "శ్రీధర వేంకటేశ కేత్కరుగారు ప్రచురించిన మహారాష్ట్రీయ వాఙ్మయ సూచిని జూచి నపుడు ఆంధ్రవాఙ్మయ సూచిని ప్రచురింపవలయునను సంకల్పము గలిగినది. శ్రీ రిశేషులయిన కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు నా సంకల్పముతో నేకీభవించిరి. సాధన సామగ్రిని సమకూర్చుట కుపక్రమించితిని... వాఙ్మయ సూచి యందుగల గ్రంథముల నామములను గ్రంథకర్తల పేర్లను, గ్రంథవిభాగములను పరిశీలించుటవలన గతకాల ప్రతిభయు, భావ్యభివృద్ధి మార్గములును సుగ్రాహ్యములు గాగలవు." ఈ వాక్యాలతో ఆరంభమైన విపులపీఠికతో ఈ సూచిక అవతరించింది. ఈ పీఠికలో వారు ఆంధ్రుల పుట్టుపూర్వాలు మొదలు సమకాలిక సాహిత్యప్రక్రియల వరకూ సమగ్రంగా చర్చించినా, "ఈ పీఠిక యందు క్రొత్త విషయములు లేవు. ఇంతవరకు నితరపరిశోధకులు, వ్యాఖ్యాతలు తెలిపిన భావములే మరల తెలుపబడినవి" అని వినయభరంతో ఉగ్గడించడం "అనుద్ధతాః సత్పురుషాః" అన్నభర్తృహరి సూక్తిని మననం చేయిస్తుంది. ఈ పీఠికే తర్వాత 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర'గా ప్రత్యేక పుస్తక రూపంలో వెలువడింది.

"ఆంధ్ర వాఙ్మయ వికాస పరిణామములను గనుగొనుటకు కాలము, భావము, రూపము, విషయము" అనేవి సాధనాలని వారు పేర్కొని, కాలాన్ని బట్టి అజ్ఞాతయుగం, ఆదియుగం, మధ్యయుగం, ఆధునిక యుగాలని విభజించి ఆంధ్రులెవరు, ఆంధ్రప్రాంతమేది, నన్నయకుపూర్వం ఆంధ్రరాజుల కాలంలో వాఙ్మయం, పల్లవుల కాలంలోను, చాళుక్యుల కాలంలోను వికాసం వివరిస్తూ, "పల్లవుల కాలమునందు పల్లవించుట కారంభించిన యాంధ్రవాఙ్మయము రాజ నరేంద్రుని కాలమునందు వికసించుట కుపక్రమించినది" అని వర్ణిస్తూ, సంస్కృత ప్రాకృతాలతోను, ద్రావిడ కన్నడాలతోను తెలుగుకుగల సంబంధం వివరించారు. తమిళదేశ పరిశోధకుల విపరీతాభిమానాన్ని ఖండించారు. దేశ

సంపద వాఙ్మయ వికాసానికి ఎలా తోడ్పడుతుందో, ప్రజలకు, వాఙ్మయానికి గల అన్యోన్యాశ్రయ సంబంధం ఏమిటో తెలుపుతూ కొన్ని శాసనాలను ఉదాహరించారు. భారత భాగవతాదుల తర్వాత, ద్విపద కవులు, ప్రబంధాలు, శతక వాఙ్మయం, శతకాల వ్యక్తిత్వ విశిష్టతలు, గేయవాఙ్మయం, నాటకాలు, నవలలు క్షుణ్ణంగా చర్చించారు. మధ్యయుగాన్ని ప్రబంధయుగమని, స్వతంత్రయుగమని నిర్వచించారు. నాటక చర్చలో సమకాలిక నాటకాలను నిష్పక్షపాతంగా పేర్కొన్నారు. కావ్యలక్షణ చర్చలో మంచిని చెడును వారు కరుకుగా వివేచన చేసి, కచ్చితంగా తమ భావం చెప్పారు:- "విశాలమయిన విశ్వమునందు దేశ కాల పాత్రముల పరిస్థితుల ననుసరించి గ్రంథరచన లేర్పడుచున్నవి. సృష్టి రచనయందలి పదార్థములవలె వాఙ్మయ ప్రపంచమునందలి గ్రంథములును ఏదో కొంత ప్రయోజనము నొడగూర్చుట నిశ్చయము. స్వల్ప ప్రయోజనములను సమకూర్చెడి గ్రంథములు చిరంజీవిత్వము లేక యంతరించుటయును మహాప్రయోజనము నొనగూర్చెడి గ్రంథములు చిరంజీవిత్వము గలిగి మనుటయును ప్రకృతి ధర్మము."

ఈ పీఠిక లేనిపోని వాదవివాదాలను పేర్కొనక, పండితార్థాలనే చెప్పి, 'ఆంధ్రవాఙ్మయ స్వరూపస్వభావములను ప్రత్యక్షము చేసి, వాఙ్మయ వికాసమున కవసరమైన విధానమును సారస్వతోపాసకులు నిర్ణయించుటకు ఉద్దేశించినట్టిది కావడంవల్ల అత్యంత జనాదరం పొందింది.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ ప్రచురణ మరొక అపూర్వ కార్యం. అదొక తపస్సనే అనాలి. వారు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వానికేకాక 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా'కూ వ్యవస్థాపక సభ్యులలో ఒక్కరు. అంతకుముందు శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారు విజ్ఞానసర్వస్వాన్ని సంచికలు సంచికలుగా ప్రచురించేవారు. వారి కాలంలో అది అకారం కూడా పూర్తిచేసుకోలేదు, శ్రీ పంతులుగారు దాని పునర్ముద్రణకు పూనుకొని, డెమ్మి 1/4 సైజులో 800 పుటల పైచిలుకు రెండు సంపుటాలు—ఆంధ్రవరకు, లక్ష్మణరావుగారి నోట్సు ఆధారంగా పూర్తిచేసి ప్రచురించారు. దాని స్థాయి ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాకు ఏ మాత్రమూ తీసిపోదు. వారు దానిలో అజంతా, అనాహతము, అనుభవసారము, అపరోక్షానుభూతి, అల్లమ ప్రభువు, మొదలయిన వ్యాసాలు వ్రాశారు. అజంతావ్యాసం ప్రత్యేకంగా పుస్తక రూపంలో ప్రచురించదగినంత బృహద్వ్యాసం. విజ్ఞాన సర్వస్వం ప్రస్తావనలో "విజ్ఞాన వికాసమునకు ఆద్యంతములు లేవు. నూతన శాస్త్రములు పుట్టి విజ్ఞానము నిరంతరము వికాసము నొందుచుండుట అభ్యుదయమునకు లక్షణము...విజ్ఞానము పశుప్రవృత్తిని మానవప్రవృత్తికిని, మానవ ప్రవృత్తిని

దైవ ప్రవృత్తికిని, దైవప్రవృత్తిని బ్రహ్మప్రవృత్తికిని మార్చుటలో వినియోగ పడుచున్నది... సర్వతోముఖమైన విజ్ఞానార్జనము ఆంధ్రుల ఆత్మోపలబ్ధికి సాధన భూతము. మహా సామ్రాజ్యము లంతరించినను, యుగములు మారినను. మహాను భావులు గతించినను, జాతులు క్షీణించినను, దేశకాలప్రాయాతీతమైన విజ్ఞానము మాత్ర మవిచ్ఛిన్నముగా వికాసమును బొందుచు మానవధర్మాభ్యుదయమును గలిగించుచున్నది" అని విజ్ఞానార్జన ప్రాముఖ్యం విశదపరచారు.

ఉగాది సంచికలకు, భారతులకు ప్రస్తావనలు సాభిప్రాయ విశేషములు లాగే అపూర్వ గ్రంథ ప్రచురణకోసం 1926 లో స్థాపించిన ఆంధ్ర గ్రంథ మాలలో ప్రకటించిన గ్రంథాలకు వారు వ్రాసిన పరిచయ, ప్రస్తావన, పీఠికలు గూడ విశిష్టమైనవి. ఈ గ్రంథమాలలో వారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి వంటి పరిశోధకాగ్రగణ్యులతో పరిష్కరింప జేసిన బసవపురాణం, పండితారాధ్య చరిత్రవంటి ప్రాచీన కావ్యాలు, నీతినిధి, భగవద్గీత మొదలయిన ఆధ్యాత్మిక గ్రంథాలు, గాంధీజీ ఆత్మకథ, రాయసం వేంకటశివుడుగారి ఆత్మకథవంటి స్వీయ చరిత్రలు, జీర్ణవిజయనగర చరిత్ర, తంజాపూరు ఆంధ్ర నాయకుల చరిత్రవంటి ఇతిహాస గ్రంథాలు, మాలపల్లివంటి ఉత్తమ సాంఘిక నవలలు ప్రచురించారు.

వీటికి విడిగా సౌందర్యమంజరివంటి నవీన కావ్యాలకు వ్రాసిన పీఠికలు వారి భావుకతను, స్వతంత్ర విమర్శను, అభ్యుదయ దృష్టిని వ్యక్తం చేస్తాయి. వర్తమాన యుగంలో విశ్వమానవ సంఘాలు సన్నిహితమయినట్లే, విశ్వసాహిత్య స్రవంతులు ఆంధ్ర సాహిత్య స్రోతస్వినిలో చేరిపోయి కల్లోలం కలిగించక గట్లుఒరసి నీరు వృధాపోక విమర్శసేతువులు కట్టి ఆ స్రవంతులను జాతిశ్రేయో వ్యవసాయానికి వినియోగపడేట్టు ఎలా తీర్చిదిద్దారో మనకు తెలుస్తుంది. వారు జీవితంలో గాంధీజీ సిద్ధాంతాలను జీర్ణం చేసుకున్న మనుష్యులు గనుక, ప్రాచీ నాధునాతన సాహిత్య స్వరూప స్వభావాలను సమన్వయపరచి, ముందుకు ఉరక డానికి మార్గం సుగమం చేశారు. ఈ సమన్వయదృష్టి వారి రచనలలో సర్వత్ర కానవస్తుంది.

బసవ పురాణానికి వ్రాసిన ప్రస్తావనలో శైవమతతత్త్వం తరచి వెన్న తెట్టులను అందించారు. దానితోపాటు సమన్వయ శర్కరను "శైవమత పరి ణామము వైదికమత పరిణామమునకు బ్రత్యక్ష ప్రమాణముగ నున్నది. వైదిక మంత్రోపస్థితుడైన రుద్రుడు వేదాంతమునందు శివరూప పరిణామమును బొందుచు 'శివోహం' అను తత్త్వమును సువ్యక్తము చేయుచున్నాడు" అని కలిపి అందిం చిన వచనామృతం ఎంత స్వాదువో చెప్పాలా?

నడమంతరంగా చెలరేగిన గ్రాంథిక వ్యవహారభాషా వాదాన్నిగూడ వారు "గ్రామ్యభాష గ్రాంథిక భాషగాను, గ్రాంథికభాష గ్రామ్యభాషగాను మారు చుండుట ప్రకృతి సిద్ధము. ...సహజధర్మము మారకుండ భాషాభివృద్ధిని జేయుట భాషాభిమానుల విధి ... కొండమీద కూర్చున్న గ్రాంథిక భాషకును, పల్లపు భూమియందు నిలచియున్న వాడుకభాషకును, విద్యా వ్యాపనవలన సమాన ప్రదేశ మున సమావేశ మేర్పడ గలదు" అని 1912 ఉగాది సంచిక ప్రస్తావనలో సమన్వయం చూపారు.

అట్లే శాస్త్ర పారిభాషిక పదాలను ఏ భాషనుంచి గ్రహించాలనే సమస్య వచ్చినప్పుడు "సంస్కృత భాషలోలేని నూతన పరిభాషకుగాను అన్యదేశపదము లను వాడుట లోకాచార సిద్ధము. ఉన్న పదములకు బదు లన్యదేశపదములను వాడుట నిరర్థకము" అని తెగవేసి చెప్పారు.

వారు శివభాగవతులై శివపారమ్య వాదులయినా యోగరహస్యం తెలిసిన తత్త్వవేత్తలు గనుక ప్రజలు జ్ఞానులు కావాలని "హింసామూలము, కర్మపరము నైన భూతబలి అహింసా మూలమును, జ్ఞానపరమును నైన విధము విశ్వ కల్యాణమునందు మహోధ్యాయము"అని, "వర్తమాన సంధియుగమునందు గీతా తత్త్వ గ్రహణము స్వధర్మ నిర్వహణకు సాధనము గాగలదు" అని నమ్మిన వారు గనుక గాంధీజీ అనుయాయిత్వం పిదప, గీతలకు ప్రస్తావనతోపాటు అధ్యాయారంభ సమాప్తులతో వివరణ సారాంశాలు, మూలానికి సుబోధమైన టీకా తాత్పర్యాలు వ్రాశారు. ఈ టీకా తాత్పర్యాల రచనలో వారు ప్రధానంగా లోకమాన్యుని 'గీతారహస్య'మును, గాంధీజీ వ్యాఖ్యను అనుసరించారు. కర్మ యోగి కావడంవల్ల సన్యాసాన్ని ఖండించారు. ఎడనెడ ఆయా ఆచార్యుల భావాలు ఉట్టంకించారు. ఏ పూర్వాచార్యులను ఖండించక సమన్వయ మార్గంలో నడిచారు. గీతార్థాన్ని పూర్తిగా జీవితంలో ఇముడ్చుకొన్నారు.

కావ్యస్వరూపం, కావ్యప్రయోజనం, రసపోషణ, పాత్రౌచితి, సౌందర్యో పాసనలను గూర్చి శ్రీ పంతులుగారి వైయక్తికాభిప్రాయాలు తెలుసుకొనడానికి, శ్రీ వంగూరి సుబ్బారావుగారి ,శతక కవుల చరిత్రకు వ్రాసిన పీఠిక, శ్రీ కాళ్ళ కూరి గోపాలరావుగారి సౌందర్యమంజరికి పీఠికగా వ్రాసిన కావ్యపరిచయం, కావ్యాత్మకు వ్రాసిన పీఠిక గీటురాళ్ళు.

శతక కవుల చరిత్ర పీఠికలో కవితాచర్చచేస్తూ, "భావాను సంధానము లేని పద్యముల సముదాయము కావ్యముగ బరిగణింపబడదు" అన్నారు. తెలుగు శతకాల ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ "భావగీతములు భౌతికానందమును శతకము లాధ్యాత్మికానందమును గలుగజేయుచున్నవి. ప్రాచ్యసంస్కారపరములైన

శతకములకును, పాశ్చాత్య సంస్కార పరములైన భావగీతములకును సామ్యము దుర్లభము" అని మోమోటమి అవంతయినా లేకుండా చెప్పారు.

భక్తి ప్రాశస్త్యాన్ని మధురమోహంగా "శృంగార కరుణామూర్తియైన భగవంతుని శృంగారకరుణాలీలా విలాసము లనంతములు. అనంతమైన శృంగార కరుణా విలాసముల యానందానుభవమున కనన్యమైన భక్తిసాధనముగానున్నది' అని నుడివారు.

కావ్యపరమ ప్రయోజనం ప్రకృతి పురుషుల విలాసవైభవాల సంభావన సంసేవన వర్ణనసాధ్యమైన రసానందానుభూతికి పరమసాధనమనే విశాలదృష్టితో వారు విశ్వసాహిత్యాలన్నీ సముపాదేయాలేనని ఎలుగెత్తి చెప్పారు సౌందర్య మంజరి కావ్యపరిచయంలో:- "విశ్వ సాహిత్యాంగములు భిన్నములైనను సకలాంగములకును లక్ష్యము పురుషార్థము ... అనంతమైన విశ్వసాహిత్యమును సాహిత్యోపాసకులు స్వసంకల్ప సంస్కారానురూపముగా ధ్యానించి, కీర్తించి, దర్శించి, చిత్రించి ఆత్మరసానందానుభవమున కధికారు లగుచున్నారు."

రచయిత సృష్టికర్తయగు పరమాత్మవంటివాడని, అతడు 'బహుస్యాం ప్రజాయేయేతి' అని బహురూపుడుగా మారడానికి ఆది కారణమైన ఇచ్ఛాశక్తి లాగే కావ్యరచనకు కూడా 'ఇచ్ఛాశక్తి బీజము, జ్ఞానశక్తి శక్తి, క్రియాశక్తి కీలకము' అని వేదాంతపరంగా సమన్వయించారు. ఈ 'శక్త్యుపాసన యోగ సిద్ధికిని యంత్రరచనలకునువలె కావ్యరచనలకును సాధనమైన విధమును నాదోపాసన సాధ్యమైన భాషోపాసన పరిస్ఫుటము చేయుచున్నది' అని భాషోపాసనను యోగాది వివిధ ప్రాచీనార్వాచీన శాస్త్ర రహస్యాలతో అత్యద్భుతంగా, మనసుకు పట్టేటు సమన్వయించారు.

రచయిత ఏదో వ్యామోహంలో పడి బాహ్యరూపాలనే ఆరాధిస్తూ పురుషార్థ దూరుడవుతాడేమోనని 'కావ్య కళారచనలందు రూపసౌందర్య రసానందము సామాన్యము; భావసౌందర్య రసానంద మసామాన్యము' అని హెచ్చరించారు.

వీటన్నిటికన్నా భాషను గురించి వారు చేసిన నిగమనం నాకు మానవ చిత్తవృత్తి పరిశీలనాధ్వర ఫలంగాను, ఆలోచనా నవనీతంగాను కనిపిస్తుంది. "భాషల స్వరూప స్వభావములు ప్రజలు స్వరూప స్వభావములకు ప్రమాణము" అని. భాషలు రూపొందడానికి పరిసరాలు, జీవిత విధానాలు, మనస్తత్వాలు, ఆచారాలు, వ్యవహారాలు ఎన్నో సహకరిస్తాయి. కనుక ఇవన్నీ భాషల స్వరూపంలోను ప్రతిఫలించక తప్పదు.

శ్రీ పంతులుగారి ఈ సాహిత్య విరాడ్రూపం పరికిస్తే, అర్జునుడు విశ్వరూపం దర్శించి సమ్మోహితుడైనట్లే మనమూ సమ్మోహితులవుతాం. ఒకవైపు

వాణిజ్యవ్యాపారాలు చూస్తూ, మరొకవైపు జాతీయోద్యమంలో ప్రధానపాత్ర నిర్వహిస్తూ పుంఖానుపుంఖంగా, ప్రామాణికంగా ఇంత రచనా నైపుణ్యం ఎలా సాధించారో! అధునాతన సాహిత్య సరస్వతిని శిక్షణ సంస్కరణలతో ఎలా అల్లారుముద్దుగా పెంచారో!

ఈ ఆశ్చర్యానికి, ప్రశ్నపరంపరకు నాకు తోచిన సమాధానం ఒక్కటే. వారు సంకల్పసిద్ధులైన అవతారమూర్తి. కర్మ, నిష్కామకర్మ, వారి నైజం. లోక బాంధవు డెందుకు ఈ లోకాలకు ఆలోక మిస్తున్నాడు? సుధాంశువు ఎందుకు మనపై సుధాకిరణాలు కురిపిస్తున్నాడు? జగత్ప్రాణుడు ఎందుకు మనకు జీవం పోస్తున్నాడు? ధరణి ఎందుకు మనను తన ఆకర్షణశక్తితో ఆకట్టి మనజేస్తున్నది? మేఘా లెందుకు వర్షాలు కురిపిస్తున్నాయి? సాగరాలెందుకు మనకు ముత్యాలు, పగడాలు, రత్నాలు ఉపహారమిస్తున్నాయి? నదులెందుకు ఇరుగట్లు ఒరసుకుని పారుతూ క్షేత్రాలను సస్యశ్యామలం చేస్తున్నాయి? మల్లెలు ఎందుకు సాయం కాలం కాగానే గుబాళిస్తూ హాయి నిస్తాయి? చెట్లెందుకు పళ్ళు కాస్తున్నాయి? కోయిల తన గళమెత్తి ఎందుకు పంచమం కూజిస్తూంది? ఉభయసంధ్యలూ ఎందుకు తమ అరుణారుణకాంతులతో ప్రపంచాన్నే తరుణం చేస్తున్నాయి? పరిశోధకు లెందుకు అపూర్వ విషయాలు ప్రజావళికి అందజేస్తున్నారు? సత్పురుషు లెందుకు లోకసంగ్రహార్థం జీవితం వెచ్చిస్తున్నారు? శ్రీ పంతులుగారు అందుకే అన్ని సత్కార్యాలు-ఘనకార్యాలు ఆచరించారు.

వారు భాషాపోషకులలో మహారాజపోషకులు. రాజకీయ నాయకులలో మహానాయకులు. దాతలలో విశ్వదాత. పూర్ణులలో కళాప్రపూర్ణులు. ఉద్ధారకులలో దేశోద్ధారకులు. ఎంత పొగడినా మిగిలిపోయే గుణగణాలు వారివి.

వారి జీవితం శివమయం; కళామయం. మానవత పూచిన పసిడిపూవు వారు.

వారు అమృతమయులు, అమృతహస్తులు కావడంవల్లనే వారు నాటిన ప్రతి మొలక మహావటవృక్షమయింది. ఆంధ్రపత్రిక రెండేళ్లక్రితం స్వర్ణోత్సవం చేసుకుంది. భారతి స్వర్ణోత్సవాయత్త అవుతున్నది. వారపత్రిక, ఉగాది సంచిక షష్టిపూర్తి చేసుకొననున్నవి. ఆంధ్రపత్రికా సముదాయంతో పరివర్తితమైన ఈ అర్ధశతాబ్ది ఆంధ్ర వాఙ్మయాన్ని నాగేశ్వరయుగం అనడం భావ్యమని మిత్రులొకరు చెప్పినది ఎంతో సమంజసంగా వుంది.

ఆ అమృతమూర్తిని దర్శించుకుందామనే కోరిక నాకు చాలాకాలంనుంచే వుండేది. కాని అది ఎన్నో ఏళ్ళకుగాని నాకు తీరలేదు.

గాంధీ — ఇర్విన్ ఒడంబడిక భగ్నమైంది. సత్యాగ్రహం దేశమంతటా ముమ్మరంగా సాగుతున్నది. నాయకుల అరెస్టులు, స్వచ్ఛంద సేవకులపై లాఠీ ఛార్జీలు, విద్యార్థులపై చన్నీటి చిలకరింపులు, అతివలకు ఆతపస్నానాలు— పత్రికలు, కరపత్రాలు ఇలాంటి వార్తలను జనంపై కుమ్మరిస్తున్నాయి.

మంగళూరు బారిస్టర్ శ్రీ ఎల్. ఎస్. ప్రభు సతీమణిని మంగళసూత్రం అమ్మి జరిమానా చెల్లించవలసిందని మేజిస్ట్రేటు ముదల ఇవ్వడం, దీనిని పత్రికలు తాటికాయలంత అక్షరాలతో ముద్రించడం, జనం — ముఖ్యంగా మహిళా జనం గగ్గోలుపడడం, ద్రౌపదిని అవమానించినవారికి ఏ గతి పట్టిందో బ్రిటిష్ వారికి తెలీదా! అని విమర్శనలు, విలాపాలు — ఇదీ అప్పటి పరిస్థితి.

శ్రీబాగ్‌లోని తోటలో కృష్ణ విగ్రహం ముందున్న నికుంజంలో భస్మోద్ధూళితగాత్రులైన శ్రీ పంతులుగారు అప్పుడే శ్రీమద్భగవద్గీతాపారాయణం సమాప్తిచేసి, పత్రిక పుచ్చుకుని మంగళూరు వార్తను చదువుతున్నారు. అంతటి స్థితప్రజ్ఞుల ముఖంపైనా ఆవేదన తెలిపే ముడుతలు కనిపించాయి. క్షణమాత్రం బొమముడి పడినట్టు, ముఖం చిట్లించినట్టు కనిపించింది.

అప్పుడు, నేను, ఆ శివయోగిని అతిసమీపంనుంచి దర్శించుకొన్నది. నేను అప్పుడు మైలాపూర్ సంస్కృత కళాశాలలో విద్యార్థిని. సూర్యోదయం అయ్యీ అనగానే పంతులుగారి దర్శనం సులభంగా, ఎవరి మెహర్బానీ లేకుండా లభిస్తుందని తెలిసి పంచపంచ ఉషఃకాలంలోనే లేచి, సంస్కృత విద్యార్థి లక్షణాలతో తయారై శ్రీబాగ్ చేరి తోటలోని నికుంజంవద్ద వేచి ఉన్నాను.

పంతులుగారు లేచి ఇంట్లోకి వెళ్ళబోతూ నన్ను చూచారు. "ఎవరబ్బాయి?" అని ప్రశ్నించారు. ఆ తేజోమూర్తి ఎదుట మాట పెగల్లేదు. గొంతు తడి ఆరిపోయింది. ఒళ్ళంతా చెమట పట్టింది. తత్తరపాటుతో నిలబడ్డాను. నా దురవస్థ చూచారు వారు. దగ్గిరికి వచ్చి భుజంతట్టి "భయపడకు" అన్నట్టు చూచారు. ఆ కరుణావలోకనాలకు భయకంపం తగ్గినా, ఏమి మాట్లాడుతున్నానో తెలియక, "నేను జెయిలుకు వెళ్ళాను!" అన్నాను, ఎవరో తరుముకొని వస్తున్నట్టు.

వారు మందహాసంచేస్తూ, నా ముఖం పరకాయించి, "నీ నిర్వాకం విరంగు ఖద్దరు ఉత్తరీయం, గూడకట్టు, జుట్టూ చూస్తే జెయిలునుంచి వచ్చినవాడిలాగే ఉన్నావు" ఛలోక్తి విసిరారు.

నాకు ఆ భయంలోనూ నవ్వు వచ్చింది, (భయానక హాస్యరసాలు వైరి రసాలని ఆలంకారికులు ఎలా అన్నారో!) నా సంగతులు తెలిపాను. వారి దర్శనం కోసమే వచ్చానని మనవి చేశాను.

పంతులుగారు నేను సంస్కృత విద్యార్థినని విని చాల ఆనందించారు. "మన సంస్కృత కళాశాలే కదూ! (శ్రీబాగ్ ఎదుట ఉండే శ్రీ కె. బాలసుబ్రహ్మణ్య అయ్యర్‌గారి నాయనగారు న్యాయమూర్తి శ్రీ కృష్ణస్వామి అయ్యరుగారు స్థాపించిన కళాశాల అది. దానికి పంతులుగారి సహాయసంపద చాలా ఉంది. కనుకనే మన సంస్కృత కళాశాల.) కనిపిస్తూ ఉండు. నావద్ద పెద్ద లైబ్రరీ ఉంది. ఏ పుస్తకం కావలిస్తే ఆ పుస్తకం తీసుకో. ఏ సహాయం కావలసినా సంకోచం లేకుండా అడుగు" అని ఒక స్టాండింగ్ ఆర్డరు జారీ చేశారు. తర్వాత ఈ ఆర్డరు తమ పర్సనల్ గుమాస్తాకు చెప్పినట్టు కూడా నాకు గుర్తు.

ఆయన వితరణ గురించి ఎన్నో కథలు విన్నాను. ఎక్కడికైనా వెళ్ళితే నోట్లకట్టలు వెంట తీసుకొని వెళ్ళుతారని, అడిగినవారికి లేదనకుండా ఇస్తారని, ఐదు రూపాయలకు తక్కువ సహాయమనేదే లేదని, జీతాలు కట్టలేక మధ్యలోనే చదువు మానివేయవలసివచ్చిన విద్యార్థులకు, ఉద్గ్రంథాలు వ్రాసి ధనాభావంతో వాటిని అచ్చొత్తించుకోలేకపోయిన గ్రంథకర్తలకు, డబ్బులేక ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయలేకపోయిన తండ్రులకు, ఆపదలో ఉన్నవారికి ఆయన కల్పపాదపమని విన్నాను. నాకు తెలిసిన ఆంధ్ర విశ్వవిద్యాలయం విద్యార్థులు కొందరు ఆయననుంచి నెలకు ముప్పయి రూపాయలు (ఆ కాలంలో అది రెండు కుటుంబాల నెలబత్తెం) విద్యార్థి వేతనం పుచ్చుకుంటూ ఉండడమూ నాకు తెలుసు. గుప్తదానాలు అసంఖ్యాకం. నేను విన్నదానికి, కన్నదానికి అనుగుణంగానే ఆయన మాటలను ప్రత్యక్షంగా, వీనులవిందుగా విన్నాను. మరి రఘుమహారాజు విశ్వజిద్యాగంలో ఒక్కమారు ఇచ్చినట్టుగాక, నిరంతరం దానం చేస్తున్న పంతులుగారికి గాంధీజీ "విశ్వదాత" అని బిరుదు ఇవ్వడంలో ఆశ్చర్యమేముంది అనిపించింది, తర్వాత తర్వాత.

పిదప హరిజనోద్యమంలో, శ్రీబాగ్ ఒడంబడిక సమయంలో వారికి కొంచెం దరిదాపులలో వలంటీరుగా ఉన్నాను. హంపీవాడిని కావడంవల్ల శ్రీబాగ్ ఒడంబడిక విషయంలో నాకు శ్రద్ధాసక్తులుండేవి. రాయలసీమవారి అనుమానాలు పోగొట్టిన శ్రేయస్సు, రెండు చెక్కలుగా ఉంటున్న తెలుగుదేశాన్ని మానసిక బంధంతో, ప్రేమబంధంతో కట్టివేసిన కీర్తి శ్రీబాగ్‌కే దక్కింది.

వారిని తుదిసారిగా దర్శించింది, వారు శివసామ్రాజ్యం పొందడానికి వారంముందు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి అనుచరుణ్ణయి ఉంటూ. వారికి అదే నా తుది మొక్కు. ఈ ఆరముగ్గిన పండు ఏమవుతుందో, రాలిపోతుందేమో అని భయం భయంగా ఉండేది.

కొందరి కొందరి విషయంలో అలాగే ఉంటుంది; "వారు జన్మించకపోతే ఏమయ్యేదో? మరణిస్తే ఏమైపోతుందో?" అని. పంతులుగారి విషయంలోనూ అలాగే గాభరాగానే ఉండేవి. పంతులుగారు ఒక మహాసంస్థ. విజ్ఞానరాశి. వితరణ ఖని. ఇలాటివారు పరమపదిస్తే దేశం ఏమైపోతుంది? దేశం ఏమూల చూచినా, ఆయన పోసిన నారులు, ఆయన నాటిన మొక్కలు, ఆయన పెంచిన సంస్థలు కనిపిస్తున్నాయి. ఆ చల్లని తండ్రి పోతే ఏమైపోతాయి ఇవన్నీ? ముఖ్యంగా సాహిత్యం ఏమైపోతుంది? ఇక జన్మలో ఎవ్వరూ ఆంధ్రవాఙ్మయ సూచిక ముద్రించరు గదా? అపూర్వ అముద్రిత గ్రంథాలు ఇక వెలుగులోకి రావుగదా? ద్విపద వాఙ్మయం ఏమవుతుంది? ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం ఏమవుతుంది? అభిప్రాయభేదాల ప్రసక్తి లేక సకల కళలూ అభివృద్ధి చెందాలనే దృష్టితో అన్ని వర్గాలనూ ప్రోత్సహించిన పంతులుగారివంటి సంపాదకులు పోతే పత్రికా ప్రపంచం గతేమిటి? అన్నిటా అంతటి అగ్రగామి ఇక ఏడి?—అని పరిపరి విధాలుగా పోయేది మనస్సు.

అయింది; అనుకున్నంతా అయింది. పంతులుగారు 1938 ఏప్రిల్ 11 న అస్తమించారు. దేశంతోపాటు నేనూ విలపించాను. కాని, ఆ విలాపంలో ఒక గర్వరేఖ నా మనఃఫలకంపై మెరిసేది: నేనూ పంతులుగారితో పరిచయం కలవాణ్ణేనని. ఒక్క మహాపురుషునికి, ఆంధ్రదేశ నవయుగ నిర్మాతలలో ఒకరికి నేనూ సమకాలికుణ్ణేనని.

ప్రథమ ప్రపంచ సంగ్రామ విషయంలో పుట్టి, స్వాతంత్ర్యోద్యమ ప్రభలు చూచి, దేశ దాస్య విమోచనానందం అనుభవించి, అన్ని రంగాలలోను గొప్ప వారిని దర్శించిన వారందరిలాగే నేనూ గర్వపడుతున్నాను. పంతులుగారివంటి మహానాయకుని సన్నిధిలో మెలగిన మధురస్మృతులు నా మనోమంజూషలో భద్రంగా దాచుకున్నాను; దాచుకుంటాను.

# తెలుగు జాతి ప్రాచీన సంగీత రూపకం — బుర్రకథ

మనసులో పొటమరించి మాటలకు అందీ అందనట్టున్న భావాలను మధురంగాను, స్పష్టంగాను వ్యక్తపరచడంలో మానవుని కవిత్వం, సంగీతం ఆదుకున్నాయి. "ఈ రెంటినీ ఆసరాగా తీసుకొని, మరొక రస ప్రపంచంలోకి మనలను చేదుకొనిపోయి నిలుపగల జిగి, బిగి వున్న కళారూపం నాట్యం." కనుకనే కాళిదాసు "నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధాప్యేకం సమారాధనం" అన్నాడు.

"మాటలూ, పాటలూ, ఆటలూ మానవుని నాగరికతా ప్రాదుర్భావం నాటి నుంచి నేటిదాకా అలాగే మానవ హృదయ విస్ఫుటీకరణకు బలీయమైన సాధనాలుగా అనుశ్రుతంగా వస్తున్నవి." కనుక ఒక జాతి జానపద సారస్వతం తీరు తీయములు మరొక జాతి సారస్వత సరణికి యాదృచ్ఛికంగా పోలికలు కావచ్చునేమోకాని, అనుకరణలు మాత్రం కాజాలవు. అయినప్పుడు తెనుగుతనమే జీవగర్రగా గల బుర్రకథలు ఏ మహారాష్ట్రి పద్ధతినుంచో పుట్టుకువచ్చాయని అపాత జ్ఞానం కలవారన్నప్పుడు సత్యదృష్టీ, సహృదయతా గల ప్రతి తెనుగువాని మనస్సు చివుక్కుమంటుంది.

కవిత్వ, సంగీత, నాట్యా లనే కళాస్వరూపాలు మూడు, మూడు రేకులై విచ్చిన విరి బుర్రకథ. సంస్కృత రూపకాలలో నాటకానికి మూల మనదగిన వీథి, భాణంవంటి ఏకాంకికల వలె బుర్రకథకూడా ప్రాచీన రూపక మనదగిన యక్షగానానికి పూర్వ స్వరూప మనుకుంటాను. కాని, ఇంత మౌలికమైన బుర్రకథను సోమనాథుడు తన బసవపురాణంలో గాని, వీథి రూపకాన్ని తెనుగుచేసిన వల్లభరాయుడుగాని పేర్కొనక పోవడం చూడగా, ద్విపద భూయిష్ఠమైన ఈ రచనకు తర్వాత తర్వాత ఈ పేరు రూఢమై వుంటుంది.

జానపద గీతాలలో ప్రధానంగా గోచరించేది ద్విపద చ్ఛందమో, తద్వికారమైన మంజరియో. శ్రీనాథుని కాలానికి ఇంకా వైభవం తరగని ఏకశిలానగరంలో —

"ద్రుత తాళంబున వీరగుంభితక ధుం ధుంధుంకిటాత్కార సం
గతి వాయించుచు నాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడె నొ
క్కత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునందూలంగన్"

ఇక్కడ మద్దెల వాయిస్తూ పాడినది ఒక్కత. నేడు బుర్రకథలో గుమ్మె టను వాయించేవారు స్త్రీలే అయినా గాయకుడు, కథకుడు పురుషుడే. కనుక అది నేడు మనం విని చూచి ఆనందించే బుర్రకథ కాదని సందేహం కలుగ వచ్చు. కాని, దాని పరిణామమే నేటి బుర్రకథ.

బుర్రకథకు జంగం కథ, తందాన కథ, తంబుర కథ అనే ప్రాంతీయ వ్యవహారాలున్నాయి. ఆరెకాపులు తోలుబొమ్మలాటను వృత్తిగా ప్రచారం చేసినట్టు, సిరిజంగాలనే వారు ఈ కథలను ప్రచారం చేశారు. వీరి లక్ష్యం శివ పారమ్య నిరూపణం; ప్రచారం. ఇది క్రమంగా వృత్తి అయింది. ఈ పద్ధతిని రచించిన, చెప్పిన కథాంతరాలూ జంగం కథలనే వ్యాప్తికి వచ్చాయి. సిరి జంగాలు పగటి వేషాలు వేస్తారు; వీధి భాగవతాలు ఆడతారు; తందాన కథలు చెబుతారు.

బుర్రకథ అనే వ్యవహారం ప్రధాన కథకుడు శ్రుతి సారించే తంబురా బుర్రనుబట్టి వచ్చింది. తందానకథ, తందానపాట అనేవాడుక తందాన-తందాన అని వంతలవారు చేసే అనుశ్రుతినిబట్టి వచ్చింది.

ప్రధాన కథకుడు ఒక చేత్తో శ్రుతికోసం తంబురా మీటుతూ, జేబు రుమాలవంటి గుడ్డ కొసను కట్టిన జంతరను బొటనవేలికి తొడుక్కున్న మరొక చేత్తో తాళంవేస్తూ కథ చెబుతాడు. (తాళంవేసే జంతరను గుంచీలు, అందెలు అనడం కూడా కద్దు.) వెనుక ఇద్దరు స్త్రీలు గుమ్మెటలు వాయిస్తూ వంత పాడు తారు. వంతకు ఇద్దరు ఇంతులు కావాలని సిరిజంగాలు రెండు పెండ్లిండ్లు చేసు కొనడం కూడా ఆచారం. ఇది దీని ప్రత్యేకత.

తెలుగు బుర్రకథలో మహారాష్ట్రి 'పవాడా'కు గాని, కన్నడ 'లావణీ'కి గాని జానపద సంగీత మనడం తప్ప మరేమిటా పోలికలేదు.

శివాజీ సింహగఢ విజయగాథ విననివారుండరు. ఆ విజయం శివాజీకి చేకూర్చినవాడు తానాజీ మాలుసురే. తానాజీ, మరి కొందరు మరాఠీ సైనికులు "పవాడా" గాయక బృందం వేషంలో కోటలో ప్రవేశించి, దానిని జయించారు. జానపద గాన పద్ధతిని రాజకీయాలకు ఉపయోగించిన వారిలో ప్రథముడు తానాజీ.

'పవాడా' అంటే వీరచరిత్రాన్ని వర్ణించే జానపద కవితా విశేషం (కోణేక్ పరాక్రమీ పురుషాంచే జ్యాంత వర్ణనకేలే అసతే అసా ప్రాకృత కవితా విశేష ఆఇతో - రఘునాథ భాస్కర గోడబోలే మరాఠీ నిఘంటువు). దీనికి కీర్తి అనే మరొక అర్థం కూడా వుంది.

పవాడాను కూర్చుని, నిల్చుని పాడుతారు. మన భజన గోష్ఠివలె వుంటుంది. దీనిలో వీర రసం తప్ప మరొకటి లేదు. వెనుక వంత పాటగా - దీదీ దీదీ - అంటూ కొందరు రాగాలు తీస్తారు. స్త్రీల ప్రసక్తే లేదు. మన బుర్ర కథలోలాగ నిలుచుని నాట్యం, వివిధ రసాభినయం వంటి రూపకచ్ఛాయ దీనిలో కనుపించదు.

ఇక కన్నడ "లావణి" ప్రాచీనమైన మాట వాస్తవమే. ప్రాచీన ఛందః కారులు షట్పదిని పరిగణించినట్టుగా దీనిని పరిగణించక పోయినా తర్వాతివారు గ్రహించారు. 16వ శతాబ్దినుంచి లావణి లభిస్తుంది. 17వ శతాబ్దంలో నందివర్మ దీనిని తన ఛందోగ్రంథంలో ఉదాహరించి, లక్షణం చెప్పాడు.

లావణి అనేది జానపద గాథలు తెలిపే ఛందో విశేషం. రైతు జీవిత గాథలు, వివిధ రసాలు, ప్రకృతి సౌదర్యం వర్ణించబడుతాయి ఈ ఛందస్సులో. ఇద్దరుకాని, ఒకరుకాని నిలుచుని పాడుతారు. వంతపాట వుండదు. దీనికీ, బుర్రకథకూ నిలుచుకొని పాడడం అనే పోలికతప్ప మరే పోలిక లేదు.

మరాఠీ లావణిలో స్త్రీల అభినయం వున్నా, కథలేదు. కేవలం పాట, అభినయం ఉంటాయి.

"మహారాష్ట్రి కీర్తన పద్ధతినుంచి బుర్రకథ ప్రభవించకూడదా?" అని ప్రశ్నించేవారు ఉన్నారు. కీర్తన పద్ధతి లక్ష్యం దైవనిరూపణం. దానికి ఉదాహరణగా, దైవమాహాత్మ్యం తెలిపే పురాణం కథ. ఇదే మన హరికథగా పరిణమించింది. కీర్తన పద్ధతిలో వంత వున్నప్పటికీ, జోడుగుమ్మెటల చేడియలు, జంతర ప్రసక్తిలేదు. నాట్యం అసలే వుండదు. కాగా, శ్రీనాథుని కాలాన వీర గుంభితకల - నేడు గుమ్మెటల - "ధుంధుంధుంకిటాత్కార సంగతి"తో వీనుల విందవుతున్న బుర్రకథ - తెనుగువారి మౌలిక సంగీత రూపకం.

ఈ రూపక సంప్రదాయాన్ని కళాకారులెందరో శతాబ్దాలుగా తెనుగు జాతికోసం భద్రపరుస్తూ వచ్చారు.

# ఆంధ్రసాహిత్యంలో స్త్రీ పర్యాయపదాలు

మానవజాతి కలిక విజ్ఞానంతో వికసించడంతో పాటు భాషా సుగంధం కూడా నలుదిక్కులా ననలువారసాగింది. ఆదిమానవుడు తన భౌగోళిక పరిస్థితిని బట్టి అవసరానుబట్టి సంకేతించుకొన్న శబ్దాలు క్రమంగా కొంత మార్పుతో నానార్థాలనూ సంతరించుకొనినవి. ఒక సంఘం మరో సంఘంతో చేరడంతోనూ భావ శబ్దార్థ వినిమయమూ విశేషించింది.

మానవుడు పరిసరవస్తు పరిశీలనతో సంచితాలయిన భావాలను సంకేతించుకొని అనుభవపు మూసలో పోసి వాటికి శబ్దరూప మిచ్చినాడు. కమ్మదనంతో కళకళలాడే ప్రకృతిని పరిశీలించినాడు. ఆయమ అందానికి అమ్ముడు పోయినాడు తన సమీప వస్తువులకు దాని పేరు పెట్టడంతో సంతోషించినాడు. కావ్వెక్కి ఆకసమంతా అలమికొని గుండెలు గుభేలుమన గర్జించే మేఘరాజు నుండీ, అడవి అంతా తనదే అన్నట్లుగా జూలు జాలువార్చుకొని పొదలూ నదులూ దూరి వీరవిహారం చేసే మృగరాజునుండీ, పురిని విరబోసుకొని పర వశ్యతొక్కే శిఖిరాజునుండీ అందమూ, ఆత్మవిశ్వాసమూ అలవరచుకొన్నాడు. వాటిని తన భాషలో జీర్ణించుకొన్నాడు. చక్కని చిలుక చెలితో తన సహచరిని సరిపోల్చుకొని మురిసినాడు. నదుల ఒడ్డుల సికతాశయ్యలపై ఎకసక్కెములాడే ఆంచరాజుల మెల్లమెల్లని నడకలను తన చెలియందే భావించుకొని సంతృప్తి పడినాడు. ప్రకృతిలోని సోయగాన్నంతా ఒకేమారు ఆకళించుకొన అఖ్ఖులు సాచినాడు.

ప్రకృతి సౌందర్యలుబ్ధుడయిన మానవుని ప్రప్రథమ సంకేత సమూహం సాహిత్యంగా సాకారమయే కాలానికి తన సంకేతితార్థాన్ని సడలించుకొని మరో అర్థంలో రూఢస్థితికి వచ్చినది. కొన్ని సంకేతాలు మానవజాతి మారిన కొలది తమ వేషాన్నే మార్చుకొన్నవి. మరికొన్ని అసలే అడుగంటినవి. ఇక కొన్ని తమ వ్యక్తిత్వాన్నే కోలుపోయినవి.

మన భాషలోని స్త్రీవాచక పర్యాయపదాల పరిశీలన ఈ సిద్ధాంత నిరూపణకు మనకు కొంత సాధనం.

ప్రపంచంలోని అన్ని భాషల స్త్రీ పర్యాయపదాలూ గుచ్చెత్తినా కూడా ఒక తెలుగులోని స్త్రీ పర్యాయపదాల సంఖ్యకు సరిపోవని నా మిత్రు డొక

డన్నాడు. ఇది పూర్తిగా నిజం. ఆంధ్రనామసంగ్రహాన్నిబట్టి స్త్రీకి ౪౨ తెలుగు పర్యాయ పదాలూ, సాంబనిఘంటువునిబట్టి ౩౪ పదాలూ మనకు లభిస్తున్నాయి. వీనికి ఏలాటి వ్యుత్పత్త్యర్థాన్నీ మన నిఘంటుకారులు నిరూపించలేదు. ఆ ప్రయత్నంకూడా చేయలేదన్నా తప్పు లేదనుకుంటాను.

ఏ చికిలికండ్ల ఆమెనో చూచి మనం కమలాక్షీ, ఇందీవరాక్షీ మొదలయిన సుందర శబ్దాలతో సంబోధించవచ్చు. ఒక పవిత్ర బ్రాహ్మణిని 'పొలతి' అనవచ్చు. పేదరాలు పెద్దమ్మనుకూడా 'ప్రోయాలా' అని పిలువవచ్చు. ఇల్లు చక్కబెట్టజాలని ఇల్లాలిని కూడా 'గరితా' అనవచ్చు. కన్యాశుల్కమేమీ లేకనే కరగ్రహణం చేసిన కాంతను తొట్రుపాటు తొలగదోచుకొని 'తెరవా' అని పిలవవచ్చు. మరో విధంగా సంక్రమించిన ఆమెను 'పడతీ, మడతీ' అని అనవచ్చు. మోటుగా మొరకుగా మనకు దర్శనమిస్తున్న హస్తినినికూడా 'ఎలనాగా, నెలతా' అని ఎలుగెత్తి పలుకవచ్చు. అగ్నిసాక్షిగా వివాహమాడినదాన్ని 'చేడియా' అనడం అభావ్యం కాదు.

తెలుగునాట సాహిత్యం సొబగులువారే కాలానికే వీని సంకేతిత వాచ్యార్థం విలయమై మరొకటి రూఢమయిపోయినది. తెలుగు సాహిత్యం సంస్కృత వాఙ్మయ శిథిలాలలో మొలకెత్తిన మల్లెతీగ. దాని పూవుల తావులలో సంస్కృత శవ పూతిగంధం పొరలు వారడం అసహజమూ కాదు; అన్యాయ మంతకంటెనూ కాదు. నన్నయభట్టు రాజరాజనరేంద్రుని మన్ననలతో భారత రచనకు గంటం పట్టిన కాలానికే సంస్కృత సాహిత్య సౌధం నేలమట్టమయి పునాదికూడా బీటలు వారినది. కొన ఊపిరితో ఉన్న సంస్కృత పదజాలం దేశభాషలపై కడపటి దాడి జరిపినది. క్రమంగా సంస్కృత శబ్దాలు కూడా రూఢమయిపోయినవి. ఆ సంస్కారమే గల తెనుగు కవులు వానినే గ్రహించినారు. శబ్దప్రయోగ సారస్యంలో ఏమరినారు. "స్త్రీరితి నామాపి మధురం" అని చొంగలు కార్చే రాజాస్థాన పండితులూ, కవులూ వాని వ్యుత్పత్తి విమర్శకే వెనుకాడినారు.

నన్నయ మొదలు చిన్నయ వరకూ కవుల ప్రయోగాలే ఈ వాదానికి తార్కాణం. భారతం ఆది, సభాపర్వాలలోని ఈ క్రింది ప్రయోగాలను పరామర్శించండి (ఇది నన్నయ నాక్షేపించడమేమాత్రమూ కాదని మనవి).

వాసుకి తన చెల్లెలు జరత్కారువును 'అంబుజనేత్రా' అని పిలుస్తాడు. దుష్యంతుడు కొత్తగా ఆశ్రమంలో ప్రవేశించినవాడు అక్కడి ఆశ్రమ కన్యలను మర్యాదగా పిలవవద్దూ? శకుంతలను 'వనజనేత్రా' అని సంబోధిస్తాడు. సభలో శకుంతలపై కోపం వచ్చినప్పుడుకూడా 'అంబురుహాననా' అని అనడం మానడు. ఒళ్ళు మండుతున్నా ఒడలి అందాన్ని వర్ణించడం విడనాడదలచుకోలేదు కాబోలు?

ప్రతీపుడు తాను గంగఒడ్డులో ఒక అందగత్తెను (గంగను) చూచి, దానిని తనకు కుదిర్చి పెట్టమని తన కుమారుని కోరుతూ, 'కన్యను' చూచినా నంటాడు. ఆయమ కన్య అని ఈయనగారికి ఎలా తెలిసింది?

దీర్ఘతముడు 'సతులకు' శాపమిస్తాడు. మాద్రి కుంతిని 'అక్కా' అని పిలవడానికి మారుగా 'కమలాక్షీ' అని పిలుస్తుంది.

అన్నిటికంటే నవ్వు పుట్టించేదేమంటే హిడింబుడు తన చెల్లెలు హిడింబను 'కోమలి' అనడం; భీముని చంపి తీసుకొనిరమ్మని ఫర్మాయించడం. వెంటనే నన్నయగారి కంటికి హిడింబి 'రమణి' అయింది. భీమునికి కూడా అంతేలెండి! లేకపోతే 'వనజనేత్రా' అంటూ సరసా లాడుతాడా? ప్రేమ గుడ్డిదంటారు కదూ! హిడింబి భీముని రూపబలాలకు లొంగి తన ఆనతి అతిక్రమిస్తుంటే, నన్నయ దానిని "పతిస్నేహము 'కామినులకు' బలవంతము, పెరనెయ్యములు వేయుదత్సదృశములే" అని సమర్థిస్తాడు. కామిను లనే శబ్దప్రయోగం ఎంత వరకు ఉచితమో ఏమో?

స్వయంవరంలో తెచ్చిన ద్రౌపద 'బాలిక' అట. అర్జునుడు ఉలూపిని "తామరస నేత్ర ఎవ్వరవు?" అని పలకరిస్తాడు. 'ఎవరమ్మా నీవు?' అని కనుక్కోలేడూ? అర్జునుని సుభద్ర కుశలప్రశ్న వేస్తూ, "మా యత్త 'యంభోరుహాక్షి' కుంతీమహాదేవి కుశలయే" అని ప్రశ్నిస్తుంది. బృహద్రథుడు జరను "వారిరుహాయతచారులోచనా!" అంటాడు.

ద్రౌపదిని సభకు తేబోయి, ప్రాతికామి 'వనజాక్షీ!' వెంట రమ్మంటాడు. దుశ్శాసనుడు మాత్రం 'పొత్తీ' అని హెచ్చరిస్తాడు (ఇది యాదృచ్ఛికంగా పడిన మాట. ద్రౌపది అప్పుడు రజస్వల గనుక ఈ మాట అచ్చంగా సరిపోయింది). సభలో ద్రౌపదిపై జరిగే అత్యాచారాన్ని వికర్ణుడు ఖండిస్తూ ఈ 'కోమలికి' అన్యాయం జరిగిందని అంటాడు. పెద్దమ్మ కదా మర్యాదగా పిలువలేడూ? పెద్దమ్మ అని తనకు తెలీదనుకుందాము. కోమలి అనే మాటకంటే గంభీర మయినమాట అనలేడూ? పుట్టుకబోది ధృతరాష్ట్రుడు ద్రౌపదిని సమాశ్వాసిస్తూ, 'సుందరి, ఇందుముఖి' అంటూ దగ్గరకు పిలుచుకుంటాడు. ఆ అంధుని నోట ఇవేటి మాటలు? కోడలు బిడ్డ వరస కదా? ఆయమ సౌందర్యాన్ని ఎన్నగూడ దని శాస్త్రకారుల కట్టుదిట్టాలు కదా! అమ్మాయి, బిడ్డా అని పిలువలేడూ? భీష్మ డొకడే పెద్దమనిషిలా కనిపిస్తాడు. ద్రౌపదిని ఊరడించేప్పుడు 'అవ్వా' (అమ్మా) అని సంబోధిస్తాడు.

అచ్చులో పోసిన ఆకారాలులాగా, రవివర్మ రంగుబొమ్మల్లాగ నన్నయ గారి ఆడవారుపి న్నా పెద్దా అంతా ఒకటే. నన్నయగారే కాదు, తెనుగు కవుల

జనానా అంతా ఒకటే. అందరూ వారిరుహాననలే, వారిరుహ నేత్రలే: కన్యలే, కమలాక్షులే; సతులే, సీమంతులే; ఇంతులే, గొంతులే; భామినులే, బాలికలే; తరుణులే, తనుమధ్యలే; లలనలే, లలితాంగులే; మానినులే, మృగాక్షులే.

తిక్కన కూడా నన్నయ కేమాత్రమూ తీసిపోలేదు లెండి. చూడండి మచ్చుకు ఒక ప్రయోగం. విరాటుడు తన కుమార్తెను బృహన్నలకు పరిచయం చేస్తూ, 'ఇచ్చేడియ' అంటూ చెంతకు పిలుస్తాడు. ఉత్తరకు ఈ శబ్దార్థం తెలిసి వుంటే "నీ నాట్యమూ వద్దు, నాణ్యమూ వద్దు" అని తండ్రిని నానా చీవాట్లూ పెట్టి తొలగి పోయేదే. ఇలాగే తక్కిన ప్రయోగాలూను.

విలాసినీ విలాసాలు వరదలై పారిన ప్రబంధాల కాలంలో వావి వరస లేకుండా స్త్రీ పర్యాయశబ్దాలు ప్రయోగింప బడినాయి. పెద్దన వరూధిని విలాసాలకు వెంగలిగాక నైష్ఠికుడైన ప్రవరుని చరిత్రను ప్రశంసిస్తూ "కలంచునే 'సతుల' మాయల్ ధీర చిత్తంబులన్" అని సమర్థిస్తాడు. సతీశబ్దార్థ గౌరవంపై పెద్దన్న దృష్టిబరపివుంటే ఇలాటి ప్రయోగంలో ఎందుకు తన చిన్నతనాన్ని చాటుకుంటాడు? (శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు దీని విషయమై ఎంతో చర్చించారు కూడా.)

కొన్ని శబ్దాల సంకేతితార్థం కాల ప్రవాహంలో పడి కొంత, కవుల స్వైర ప్రయోగాలవల్ల కొంత సమసి పోయిందనడమే పై నిదర్శనంలోని పరమార్థం. కాని, మన భారత కాలంనాటికీ, అంతకు ముందునుంచీ కూడా వాఙ్మయ సౌరభాలు విరజిమ్మిన కర్ణాట, తమిళ భాషలలోని పదాలకు మాత్రం ఇప్పటికీ వ్యుత్పత్తి సౌలభ్యం లభిస్తూండడం తెనుగు పదాలలోని చిక్కును తెమల్చడానికి కొంత తెరవవుతూన్నది. ఒక సంఘానికి చెందిన వనగలిగి, కాల ప్రవాహంలో వేర్వేరు ఒడ్డులబడి, అన్ని సంఘర్షణలనూ ఎదుర్కొని, నానా సాంకర్యాలనూ సంతరించుకొని, ప్రస్తుతం తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొన్న అన్ని భాషలూ ఒకే అజ్ఞాత అక్షరేఖపై అంజవేస్తున్నాయి.

మూలశబ్దాలే కొంత మార్పుతో నానార్థాలతో, నానుడులతో నాటుకొని పోవడం భాషా ప్రధాన లక్షణమని చెప్పడం చర్విత చర్వణం. ఈ దృష్టితో పరిశీలన అన్ని శబ్దాల వ్యుత్పత్తి నిరూపణకూ నిర్ణాయక మవుతూంది. ప్రస్తుతం స్త్రీ పర్యాయ పదాలను పరామర్శిద్దాం.

**నెలత**

నెలత, నెలతుక, మెలత, ఎలనాగ శబ్దాలు ధ్వనిలోనే కాక అర్థంతోనూ సమానాలే. మూల భాషలోని ఇళం, ఎళం అనే శబ్దాలు లేత, చిన్న అనే అర్థాన్ని ఇచ్చేవి తెలుగుతనం పుచ్చుకొని (వర్ణ వ్యత్యయంకాగా)లే, లేత అని మారినవి.

కొన్నిట 'ఎల' గానే నిలిచినవి. ఎలనాగ, ఎలమావి మొదలగునవి మనకు దృష్టాంతం. కాగా, నెలతను చిన్న ఆడుది, పసిది, బాలిక, కోమలి అనవచ్చు. నెలత శబ్దానికే బహువచన ప్రత్యయంలోని 'క' వర్ణం చేరగా 'నెలతక' అయి, పదాంత్య ఉకార ప్రభావంతో 'నెలతుక' అయిందని మనం సరిపెట్టుకొనవచ్చు. లేమ శబ్దానికొక్కడ 'ఇళం' అనేదే మూలరూపం.

**పొలతి**

పొల, పొలసు శబ్దాలు అశుచి అనే అర్థంలోనూ, క్రమంగా మాంసానికి (మాంసాన్ని అపవిత్రమని భావించినారు గనుక) తెనుగులో ప్రయుక్తం ('పొల తుక కాంతియింత పొలివోవగనీక'—తిక్కన ప్రయోగం). కన్నడంలో పొలి, పొలె శబ్దాలు అశుచి, రజోరక్తం అనే అర్థంలో వాడబడినవి. ఈలాటి అశుద్ధ కార్యం చేసేవారు పొలసులు. పొలయతి, - హొలయతి, పొలతి, పొలయచ్చి— రజస్వల, మాదిగది, అశుచి అయిన స్త్రీ.

**పడతి**

పడతి, మడంతి వివాహిత స్త్రీవాచకాలు. 'మణం' తమిళంలో వివాహార్థకం. ఈ 'మణం' వల్ల లభించిన స్త్రీ మడందై - మడంది క్రమంగా పడంతి, మడం తిగా మారింది. మణం నుంచే మనువుకూడా పుట్టింది.

**ఇంతి**

ఇన్ ధాతువు అందమూ, రుచీ ప్రకటించేది. ఇన్‌పు = అందము. ఇంతి = సుందరి—ఇంపైనది. తమిళంలో ఇఞపం = తియ్యనిది, కమ్మనిది.

**తొయ్యలి**

ఈ శబ్దంలోని 'లి' కూడా ఇల్లాలు మొదలయిన వాటిలో లాగనే 'అళ్' శబ్దభాగమనేది స్పష్టం. తొళ్, తొళ్ ధాతువు సేవార్థకంగా సమకాలిక తమిళ భాషలో కనిపిస్తున్నది. తొళ్ + అళ్ = సేవిక, పరిచారిక, అనే అర్థంలో వాడ బడి క్రమంగా తొళ్ అళ్ - తొళ్‌యాళ్ - తొయ్యలి అయి వుండవచ్చునేమో!

**నాతి, నాచి**

నాయకస్త్రీ, ప్రాకృతంలో నాయకయిత్తి నాయకత్తి అయి, తవర్గం చవర్గం కావడం (దంపతీ, జంపతీ) సహజమే గనుక నాయకచ్చిగా మారి క్రమంగా నాచ్చి, మరల నాతి అయివుంటుంది. నంగనాచి శబ్దానికి మూలం 'నంగానాచ్' అనే హిందుస్తానీ పదం కాదనుకుంటాను. దిస మొలగా నాట్యం చేసేంతటి సాహసికురాలని శ్రీ ప్రతాపరెడ్డిగారు సెలవిచ్చారు. కాని చేసేదంతా చేసి తెలీనట్లు అమాయకంగా ప్రవర్తించే ఆడది అనే అర్థమే లోక ప్రసిద్ధం గనుక దీని మూలం వేరని నా ఊహ. నగ్నిక చిన్నపిల్ల—దిసమొలతో తిరిగేది.

నగ్నికలగా అమాయకంగా, నిష్కపటంగా ప్రవర్తిస్తున్నట్లు అభినయించే నాతి—నాయకుని స్త్రీ (చతురురాలు) నంగనాచి. నగ్నికా శబ్దానికి తమిళంలోని నంగై సమానార్థకం నంగై, మంగై, మండదై అనే అవస్థాత్రయం తెలిపే సంప్రదాయ వాక్కునుంచి కూడా పసిపాప అనే అర్థం నిర్ధారితమవుతూంది. నంగై = నగ్నిక, దిసమొలతో తిరిగే పసిపాప. మంగై = అంతకంటే పెద్దది, మడందై = వివాహిత.

**ప్రోయాలు**

శ్రీమతి, ఐశ్వర్యవంతురాలు, పురళ్ = ధనం, ఆళ్ = పురళాళ్. క్రమంగా. కురళ్-క్రోవి, తొరవు-త్రోవ, పురవ్-ప్రోవి మొదలయిన వాటిలో లాగ (వర్ణ వ్యత్యయంతో) ప్రోయాళ్-ప్రోయాలు అయివుంటుంది. ఈ శబ్దం లోని ఉవర్ణం ఆళ్ శబ్దభాగమని చెప్పడం చర్విత చర్వణం.

'చేడియ' చేటికా శబ్దభవం. పరిచారిక అని అర్థం గనుక తిక్కనయినా సరే, ఎవరయినాసరే యిష్టం వచ్చినట్లు ప్రయోగించడానికి వీలులేదు. 'బోటి' వధూటి శబ్దంనుంచి వచ్చింది. 'బోటి' సామాన్య స్త్రీ పర్యాయంకాదు. పెరయింటి నుంటి వచ్చిన స్త్రీ. కోడలు కావచ్చు, మరదలు కావచ్చు. 'చామ' శ్యామనుంచి పుట్టిన శబ్దం. 'చాన' జాణ—చతురురాలయిన స్త్రీ. జ్ఞానశబ్దం ప్రాకృతంలో నాణ, జాణలుగా మారింది. జాణయే చాన.

**చెలువ**

సుందరి. చెలువు—సౌందర్యం. సెల్వం తమిళ, కన్నడాలలో సౌందర్య వాచకం. చెలువు, చెలువంగలది చెలువ.

వెలది, వెలందు, వెలంది. వెళ్ ధాతువునుంచి నిష్పన్నమయిన శబ్దమిది. వెళ్—వెలుగు, కాంతి, తెలుపు. వెలంది = కాంతిగలది, సుందరి, గౌరి.

**గరిత**

గర్తి అని కన్నడరూపం గృహస్త్రీ అనే శబ్దం ప్రాకృతంలో ఘరత్తి అయి, గరత్తి, గర్తి, గరితగా మారింది. గరిత = గృహిణి, ఇల్లు చక్కబెట్టు కొనగలది.

**తెఱవ**

ఈ పదం మన ప్రాచీన సాంఘికాచారాలకు సాక్షి; కన్యాశుల్కం పాత పుంతల్లో నడచిందనడానికి నిదర్శనం. తెఱవ = శుల్కంతో కొన్న స్త్రీ. క్రింది జాతుల స్త్రీలు మారుమనువు చేసుకొనేటప్పుడు కులస్థులకు చెల్లించే దండుగ తెఱువు కన్యకిచ్చే శుల్కమని కన్నడ నిఘంటు కారులు తెఱువు చెల్లించే ఆచారం ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలలో యింకా పాతుకొని ఉంది.

**అన్ను, అన్నువ**

ఆన్నై అనేది తమిళంలో మాతృవాచకం. ప్రస్తుతం వ్యవహారంలోనూ ఉంది. భాష అభివృద్ధి కాని కాలంలో అనునాసికాలకు అట్టే భేదం లేకుండా వుండడం సహజం. పిల్లలు అమ్మ, అన్న శబ్దాలే మొదట పలుకనేరుస్తారు. ఈ రెండు అనునాసికాలకూ పరస్పర వినిమయం వాఙ్మయంలో ఉపలభ్యమవుతూంది. "లోకవంద్యమ్మని నప్పరాశరు" అని భారతానుశాసనిక పర్వంలో తిక్కన ప్రయోగించినాడు. అన్నై - అన్ను - అన్నువ=అమ్మ. ఎన్నైమదన్నై విలంగుగళ్ పోకుం - భారతి ప్రయోగం. (ఎప్పుడు మా తల్లి బేడీలు తొలగిపోతాయి.)

**ఆఁడది, ఆఁటది**

తమిళ, కన్నడ, మలయాళ, తుళుభాషలలో పురుషవాచకమయిన ఆణ్, ఆళ్ శబ్దాలకూ, తెలుగులోని స్త్రీవాచకమయిన ఆడశబ్దానికీ ఏమీ సంబంధం కనిపించదు. 'ఆఁడది'లోని అరసున్నను బట్టి మనం ఆణ్ శబ్దం నుంచే యిది నిష్పన్నమయి వుండవచ్చునని ఉహించవచ్చు.

ఆణ్—ఆళ్ శబ్దం మనుష్యసామాన్యవాచకం, ఉభయలింగం. ఈ శబ్దం మనిషి అనే అర్థంలో లింగభేదమేమీ లేకుండా పూర్వం ప్రయోగంలో వుంటుంది. ఉదాహరణంగా ఇల్లాలు శబ్దాన్ని పరికించండి. ఇల్ = ఇంటిలోని, ఆళ్ = మనిషి-ఇంటిని చక్కబెట్టే వ్యక్తి అని అర్థం. ఇల్లాలులోని ఇల్‌శబ్దం క్రమంగా వాడుకలో లోపించి ఆలు శబ్దం మాత్రమే మిగిలినది; గృహిణీ వాచకంగా రూఢమయినది.

ఆళ్-ఆణ్ శబ్దం ఒకచోట ఆలుగా మారి మరొకచోట ఆణు అయి, పదాంత్య ణకారం క్రమంగా 'ండు' అయింది. ఆండది, ఆంటది అనే రూపాలు ఇప్పటికిని దక్షిణదేశంలోని తెలుగువారిలో నిత్యవ్యవహృతాలు. పదాంత్య నకారం 'ండ'గా అయిన పరిణామం శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ 'సంధి' అనే పుస్తకంలో అవన్, రామన్, మొదలయిన శబ్దాల పదాంత్య నకారం అవండు, వాండు, రామండు అని ఎలా మారిందో నిరూపించడం పరిశీలిస్తే అవగతమవుతుంది.

ప్రాచీన తెలుగు కవులు ప్రయోగ కాలానికే స్త్రీ వాచకపదాల సంకేతితార్థం సమసిపోయిందనడమే నా అభిప్రాయం కాని, వారి ప్రయోగౌచితిని పూర్వపక్షం చేయడం కానేకాదు.

# పద్యాలకు రాగాల నిర్దేశం

**1930** ప్రాంతం నాటి మాట. నెల్లూరులో శాకుంతల నాటకం ప్రదర్శిస్తున్నారు. శ్రీ యడవల్లి సూర్యనారాయణగారు దుష్యంత పాత్ర ధరిస్తున్నారు. శ్రీ యడవల్లివారు దుష్యంతపాత్రాభినయంలో మొదట సంస్కృత శ్లోకాలు చదివి తర్వాత తెలుగు పద్యాలు చదవడం పరిపాటి. ఈ వార్త మా సంస్కృత విద్యార్థులకు కర్ణరసాయనమైంది. రంగస్థలం ప్రేక్షకులతో కిటకిటలాడుతున్నది. అతి కష్టంమీద ఆఖరు తరగతిలో చోటు సంపాదించాము.

ప్రస్తావన పూర్తయింది. "గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యందనే బద్ధదృష్టిః-" అనే శ్లోకం కేదారగౌళలో పాడుతూ ప్రవేశించారు యడవల్లివారు. ఒళ్ళు జలదరించిపోయింది. ఒకటి, రెండూ, మూడూ అంకాలు రసకందాయంగా సాగిపోతున్నాయి. దుష్యంతుడు శకుంతలను అనునయించేటప్పుడు "కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతాన్—" అని కన్నడలో చదివి "చల్లనివై శ్రమం బుడుపజాలిన" అని తెలుగు పద్యం అందుకున్నారు. కాళిదాసే అన్నట్టు రంగస్థలం "రాగానుబద్ధ చిత్తవృత్తిః అలిఖిత ఇవ" ఉన్నది.

ఎప్పుడు నాటకం భరతవాక్యం పాడారో! ఎప్పుడు ఇండ్లకు చేరుకున్నామో! తెలీదు. శాకుంతల శ్లోకాలు రకరకాల రాగాలతో చెవులలో గింగురుమంటూ, మెదడులో తిరిగిపోతున్నాయి. ఈ శ్లోకం ఈ రాగంలో పాడాలని గురుపాదు లెవరూ పాఠప్రవచనాలలో తెలుపలేదే! నాటకంలో పద్యాలు పాడాలా, చదువాలా? అనే ఉద్యమమొక్కటి ఉండనే ఉందాయె! యడవల్లివారు ఏ సంప్రదాయం ప్రకారం, ఏ నాట్యశాస్త్రానుసారం ఈ రాగాలలో శ్లోకాలు పాడారు? వ్యాఖ్యాతలు కూడా చెప్పినట్టు లేదే! ఏమో!—ఇలా ఆలోచనలు సాగిపోతున్నాయి. సందేహాలు చిలవలు పలవలుగా అల్లుకుపోతున్నాయి.

వ్యాఖ్యానాలే చూద్దాం మరొకమారు; రాగ నిర్దేశం ఉందేమో! ఊఁఉఁ! సూత్రధారుని ఆదేశంతోనే కదా నటి,

"ఇసి చుంబి ఆఅ ఇ భమరేహిం
సు ఉమార కేసరసిహాఇ,
ఓదంసఅంతి ద అమాణా
పమదాఓ సిరీస కుసుమాఇ"—

అని గ్రీష్మర్తును వర్ణిస్తూ పాడింది కోకిల కంఠమెత్తి. ఆహాహా! నీ గీతం బలే బాగుంది. చూడ వచ్చిన వారంతా చిత్తరువులై పోయారు.

తవాస్మి గీత రాగేణ
హారిణా ప్రసభం హృతః,
ఏష రాజేవ దుష్యంతః
సారంగేణాతి రంహసా"

అని నటికి జితాబు పడేస్తాడు సూత్రధారుడు. ఇక్కడ రాగమని, గీతమని ఉన్నాయికదా. వీటికి వ్యాఖ్యాతలు వివరణలలో రాగాల పేర్లేమైనా ఇచ్చారా అంటే...ఇసి చుంబిఅఇ అనేది 'త్రింశన్మాత్రా దలద్వయరూపో ద్విపదీనామ లయభేదః' అని రాఘవభట్టు వ్యాఖ్య చేశాడు. గీత రాగేణ అనేదాని వ్యాఖ్యలో 'గీతే గీతౌ నిబద్ధేన రాగేణ శ్రీరాగాదినా ధాతునా, హారిణా శ్రుతి సుఖదేన, హర్తుం శీలవ స్యేతిచ' అన్నాడు. రాగమంటే శ్రీరాగం మొదలయినది అని ఉదాహరించడమే కాని ఈ గీతం ఈ రాగంలో పాడాలనే నిర్దేశమేమీ లేదు. ఇక వైఖానస శ్రీనివాసాచార్యుడు "అత్ర గీతశబ్దేన రాగాద్యాశ్రయో వర్ణస్వర తాళాది నిబద్ధ సందర్భ విశేషోభిధీయతే. గీత రాగేణ గీత సంబంధ స్వరవిశేషే ణానురంజకేన" అని వ్యాఖ్యానించాడే కాని రాగం ఫలానా అని చెప్పలేదు. కాటయవేముడు కూడా రాగనిర్దేశ మేమీ చేయలేదు. (ఇది సారంగ రాగమన్నారు ఒక పండితులు. దాని సూచన 'తవాస్మి గీత రాగేణ... సారంగేణాతి రంహసా' అని సూత్రధార వచనంలో కలదని కూడా అన్నారు. సారంగరాగం అపరాహ్ణ రాగం గనుక ఈ మాట చాలా సహేతుకం.)

ఇక పంచమాంకం ప్రారంభంలో హంసపదిక పాడిన

"అహిణవ మహులోలుఓ తుమం
తహ పరిచుంబిఅ చూఅ మంజరిం,
కమల వసతి మెత్తనివ్వుదో
మహు అర విహ్మరిదోసి ణం కహం ?"

అనే గీతం లక్షణం వివరించారు వ్యాఖ్యాత లందరు. కాటయవేముడు దీనిని ధ్రువాగీతి అన్నాడు. కాని రాగమేమిటో? ధ్రువ అంటే దరువు.

విక్రమోర్వశీయంలో ఈ గీతాలు చాలవస్తాయి. విక్రముని ఊర్వశీ విరహోన్మాదాన్ని ఈ గీతాలలో అత్యద్భుతంగా చిత్రించాడు కాళిదాసు. చతుష్పది, షట్పది, జంభాలిక, ఖండధార, అక్షిప్తిక, చర్చరి, ఖండకం, ఖురకం, కకుభం, ఖండిక మొదయినవి ఈ గీతాలు. వీటిలో ఒక్క ఖండికా లక్షణంలో మాత్రమే రాగ నిర్దేశం కనిపిస్తుంది.

"పర్యాయేణ శనై స్తిర్యక్
నతముక్తం ధుతం శిరః,
శ్రీరాగ కుంభ తాలేన
నిబద్ధా ఖండికా మతా"

అని శ్రీరాగం నిర్దేశం ఉంది. తక్కినవాటికీ రాగాలు చెబితే ఎంత బాగుండే? రాగం అక్కడ లేక పట్టిదరువే నట కుటిలిక.

"రాగేణ రహితం యత్తు
అర్ధమత్తలికాయుతం,
భాషయైవ చ తన్నాట్యం
కుటిలీ సంజ్ఞకం మతం."

అయితే చర్చరీ గీతాలలో ఒక్కటిమాత్రం అచ్చంగా మన జాజరే. చర్చరే జాజర అయిందన్నారు గదా పెద్దలు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు.

"వీణాగానము వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
పేరు చెపిన పిన్నబ్రాహ్మణు వీట
జాణలు మెత్తురు జాజరపాట."

అనే జాజర నడకను విక్రమోర్వశీయంలోని

"మోరా పరహుఅ హంస విహంగ
అలిగఅ పవ్వఅ సరిఅకురంగం
తుజ్ఝిహ కరణే రణ్ణ భమంతే
కోణహు పుచ్ఛిఅ మఇరో అంతే."

అనే చర్చరితో పోలిస్తే అచ్చంగా రెండూ నడకలో ఒక్కటే అయాయి. కాని, ఈ జాజర రాగమూ తెలీదు; ఆ చర్చరి రాగమూ తెలీదు.

ఇక నాగానందంలోని నాయిక మలయవతి పాట విందాం. ఆమె అమ్మవారి ఎదుట-

"ఉత్ఫుల్ల కమలకేసర
పరాగ గౌరద్యుతే మమ హి గౌరి!
అభివాంఛితం ప్రసిధ్యతు
భగవతి యుష్మత్ప్రసాదేన"

అని సంస్కృతం ఆశ్రయించి వీణమీద పాడింది. దీనిని నాయకుడు జీమూత వాహనుడు చాటునుంచి విని "వ్యక్తిర్వ్యంజన ధాతునా" అని లక్షణజ్ఞాన పుర స్సరంగా వ్యాఖ్యానించి మెచ్చుకున్నాడు. రాగ మేమిటో చెప్పరాదూ? రాగం చెప్పి ఉంటే ఆ రాగం హర్షుని తర్వాత నేటివరకు ఎన్ని విధాలుగా మారి, ఎన్ని పేర్లు పెట్టుకుందో జాతకాలు కట్టే వాళ్ళమే?

ప్రియదర్శికలో ఆరణ్యిక వీణ సారిస్తూ "ఘణ బంధణ సంరుద్ధం", అని "అహిణవరా అక్ఖత్తా" అని పాడుతుంది (గాయంతీ వాదయతి). నాయకుడు రాగం పేర్కొనడం పరీక్షలాగా బేసబబుగా ఉందనుకుంటే వ్యాఖ్యాత వివరించ వద్దూ!

సరే, రుద్రకవి సుగ్రీవ విజయం ఉన్నంతలో నాటక పూర్వరూపమైన సంపూర్ణ యక్షగానమన్నారు కదా? దానిలో పాటలకు రాగ నిర్దేశం చేశాడా? - అంటే; త్రిపుట, జంపె. కురుచజంపె, ఆటతాళం, ఏక తాళం, అర్ధచంద్రికలు, ఏలలు - అనే విభజన ఉంది కాని రాగవిబోధం కలిగించలేదు. దీనికొక పండితు లన్నారు...రాగం రమణి, తాళం కాలపురుషుడు. స్వేచ్ఛగా సంచరించ దలచే రాగాన్ని కట్టుదిట్టంగా కట్టి వేసేది తాళం, కనుక తాళం ప్రధానం కాని రాగం ప్రధానం కాదు. ఒక పాటను ఏ రాగంలో నన్నా పాడుకోవచ్చు. తాళం మాత్రం చాలవరకు మారదు ... అని.

ఈ రాగం ఈ ఋతువులో పాడాలి, ఈ రసానికే వాడాలి, దీనికి ఇది దైవతం, ఇది దీని స్వరూపం, ఇది స్త్రీరాగం, ఇది పురుషరాగం అని కాల దేశాదులు నిర్ణయించారు సంగీత లక్షణ కర్తలు. ప్రధాన రాగాలు ముప్పై రెండు. వాటిలో ఎనిమిది బగళా, భూపాల, భైరవ, మాలవ, శ్రీరాగ. వసంత, సారంగ, ఫలమంజరి రాగాలు పురుషరాగా లన్నాడు "శివతత్త్వ రత్నాకర" కారుడు బసవరాజు. తక్కినవి కురంజీ, మేఘరంజనీ, మేలావరీ, మలహరీ, కర్ణాటీ, దేశాక్షి, గుండక్రియ, ధన్యాసి మొదలయినవన్నీ స్త్రీరాగాలట.

పూర్వయామంలో దేశాక్షి, భైరవ, ఫలమంజరి, భూపాలి, సాహురి, రామక్రియ మొదలయినవి; రెండవయామంలో కురంజీ. తోడి, వరాలి, ధన్యాసి, వసంత, లలితరాగాలు: మూడోయామంలో మేఘరంజని, రామక్రియ, గుండ క్రియ, మల్లారి మొదలగునవి; తురీయ యామంలో కర్నాట మొదలయినవి పాడాలన్నాడు బసవరాజు. ఇవన్నీ సూర్యాంశంతో పుట్టాయి గనుక పగలే పాడాలట. వీటిని ఉదయం పాడితే "స నర స్సుఖమశ్నుతే", ఇవి "సాయంకాలే అతి నిందితాః". శుద్ధనట్ట, పాలగనట్ట, శుద్ధవరాటక, వరాటక, ద్రావిడి మొద లయినవి చంద్రాంశవట. కనుక ''సాయమేతే ప్రగాతవ్యాః తస్యశ్రీరతులా భవేత్.''

''రాగావిబోధ'' కారుడు సోమనాథుడు మరొక అడుగు ముందుకు వేసి, ఉత్తమ మధ్యమ రాగాలు నిర్ణయించి ఈ ఈ రాగం ఇప్పుడిప్పుడే పాడాలని, ఈ ఈ గడియలోనే పాడాలని అనడానికి మారు ఉదయం,పగలు, సాయంత్రం, రాత్రి అనే విభాగంలో తోసివేశాడు. ముఖారి, తోడి, వసంతరాళి, నామవరాళి నిత్యం ఎప్పుడుపడితే అప్పుడు పాడవచ్చు. వసంతం, భైరవి, భూపాలి, గౌడి, పూర్ణ, శంకరాభరణం, హిందోలం, ఉషఃకాలంలో; సావేరి, భైరవరాగాలు ఉదయం; మల్లారి, నాటమల్లారి మధ్యాహ్నం; సారంగం అపరాహ్ణం; మాళవ గౌడ, శ్రీరాగం ప్రదోష సమయంలో; టక్క, రేవగుప్తి సాయంకాలం; నాద రామక్రీ, కర్నాటీ రాత్రి.

తోడిని హర్షానికి: వసంతాన్ని శృంగారానికి; భైరవాన్ని ప్రార్థనకు; శ్రీరాగం వీరరసానికి; ధన్యాసినికూడా వీరరసానికి పాడా లన్నాడు "సంగీత సమయసార" రచయిత శ్రీపార్శ్వ దేవుడు.

'సంగీతదర్పణ' కారుడైన చతుర దామోదర సూరి ఈ గడియలోనే ఇది పాడాలనే నిర్బంధం సడలించి ఫలానా సమయం నుంచి, ఫలానా సమయం తర్వాత అని మరికొంత అనుమతి యిచ్చాడు; మధుమావతి, దేశాఖ్య (దేశాక్షి), భూపాల, భైరవ, వేలావతి, మల్లారి, వల్లారి, గుర్జరి, పంచమం, ఘనశ్రీ, మేఘరాగం, భైరవి—ఇవన్నీ "ప్రాతరారభ్య నిత్యశః" శ్రీరాగం తృతీయ ప్రహరం తర్వాత ; కామోది (కాంబోజి) ద్వితీయ ప్రహరం తర్వాత; శ్రీరాగం రాగిణులతోసహా శిశిరంలో; వసంతం వసంతంలో; భైరవం గ్రీష్మంలో, మేఘ రాగం వర్షర్తువులో, పంచమరాగం రాగిణులతో సహా శరదృతువులో.

'సంగీత పారిజాతం'లో అహోబలుడు మధ్యమాది, భూపాలి, భైరవ రాగాలు ఉదయం; హంస, దీపక, కాంబోది, కంకణ, సారంగ, దేవగాంధారి రాగాలు ద్వితీయ ప్రహరోత్తరం; ఘంటారవ, శ్రీరాగాలు తృతీయ ప్రహ రోత్తరం; నీలాంబరి, ముఖారి, భైరవి, లలిత, మేఘనాద, ఆనందభైరవి, సావేరీ రాగాలు "సర్వదా చ సుఖప్రదాః" అన్నాడు.

పచ్చకప్పురపు తిరువేంగళనాథుడు (1540) చొక్కనాథ చరిత్రలో పల్లాణుడనే పెద్ద గాణ పాండ్య భూపతి ఆస్థానానికి వచ్చి 'వేళలెరింగి యా స్వరము లేర్పరచి' పాడాడట.

రాగవిషయాలను అతడు ఈ విధంగా తెలిపాడు;

"శ్రీరాగ రాగమంజరియు నాటయును
భైరవి భూపాళ బంగాళ మాళ
వియును వసంతంబు వెలయంగ నెనిమి
దియు మగరాగముల్; దీని సతులు

మలహరి దేశాక్షి మంచి కాంబోది
లలిత వరాళి నీలాంబరి తోడి
కన్నడ గౌళయు గౌళిక లలిమి
ధన్యాసి దేవగాంధారి సౌరాష్ట్రి
పారి గుండక్రియ భల్లాతకియును
రామప్రియము మేఘరంజి రంజి
సామంతయు ముఖారి శంకరాభరణ
ములు నిరువదినాల్గు ముదితరాగములు;
నలరంగ బురుషుల నతివల నెరిగి
వరగమిత్రముల ముప్పది రెంట దెలిపి
పురుష స్త్రీరాగముల్ పొందుగా గూర్చి..."

'సంగీత దర్పణ' రచయిత రాగాల కాలాదులు చెప్పినా ఆఖరున 'రాజాజ్ఞాయా సదా గేయాః నతు కాలం విచారయేత్' అని మంచి హెచ్చరిక చేశాడు. "రాజా కాలస్య కారణం" కదా మరి? అయితే బసవరాజు మాత్రం దేవతాస్తుతిపూర్వకమైన గానానికి వేళ, అవేళ అనేది అవసరం లేదన్నాడు. పెండ్లి ముహూర్తాలు ఎప్పుడుబడితే అప్పుడు ఉంటాయా? మరిరాగాల వేళ పాళా అంటూ కూచుంటే శుభముహూర్తాలు అగుతాయా? కనుక

"వివాహ సమయే గానం దేవతాస్తుతి పూర్వకం,
అవేలా దాన మాకర్ణ్య నదోషః పరికీర్తితః" అన్నాడు.

అవేళ అనగానే, అవేళ పల్కిన నాటరాగ మేళం విని కటకటపడిన అల్లసానివారి ముఖం చిట్లింపు కనిపించి, మందలింపు వినిపించడం లేదూ?

"వాలారున్ కొనగోళ్ళ నీ వలసతన్
వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్
నీ వంటమింజేసి ఆ
ఆలాపంబె అవేళ పల్కెడు ప్రభా
తాయాత వాతా హతా
లోలతంత్రుల మేళవింప గదవే
లోలాక్షి దేశాక్షికిన్,"

అనే పద్యంలో మనకు! నాట సాయంకాలం పాడేరాగం. వరూధిని నాట వాయిస్తూ ప్రవరుని చూచి విస్తుపోయి అరుగు దిగ వచ్చింది; తిరస్కృతయై, తిరిగిపోయి తన వీణను మేళానుగుణంగా మేరువు ఒద్దుకోలేదు. తెల్లవారింది. తెల్లవారి నాట పాడరాదు. ఉదయరాగాలలో ఒక్కటి దేశాక్షి. కనుక దానికి అనుగుణంగా మేరువు సర్దమని చెలికత్తెల హెచ్చరిక. "వీణను అంతకుమునుపు చలించు మేరువుతో వాడుచుండిరి. ఆయా మేళములకు అనువుగా మెట్లను సర్దుటను గురించి 'వాలారున్ కొనగోళ్ళ నీ వలసతన్ వాయింపమిన్' అను అల్లసాని పెద్దన మనుచరిత్ర పద్యముతో స్పష్టమగును. వీణ మేరువులను ఇప్పటి వలె కదలక నిర్మించు పద్ధతి భట్టుమూర్తి, గోవింద దీక్షితులు మొదలగు విద్వాంసులనేకులు పరిశోధనలు చేసి కనిపెట్టిన పెద్ద విషయము" అన్నారు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుగారు. కనుక మన కవి పండితులు రాగాల కాల దేశాలను సాధ్యమైనంతవరకు పాటించారనే అనవచ్చు. ఆవేళ, అపశ్రుతి కర్ణకటువులు కదా! అందువల్లనే గిరిక-

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డా
        యన్ లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమున బటా
        గ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చె, గిన్నరవధూ
        రాజత్కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవ సుధా
        పూరంబు తోరంబుగాన్". 4-52

కాంభోజి (కామోది) ద్వితీయ ప్రహరోత్తర గేయరాగం గనుక గిరిక వెన్నెల సెగలకు వసివాళ్వాడి (కాంభోజిలో) ఏడ్వడం సమంజసమే.

ఈసునబుట్టి డెందమున
        హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి ఏడ్చె ప్రాణవిభు
        కట్టెదుటన్ లలితాంగి పంకజ

శ్రీసఖమైన మోముపయి
జేలచెరం గిడి బాలపల్లవ
గ్రాస కషాయకంఠ కల
కంఠ వధూకల కాకలీధ్వనిన్."

అని సత్యావధూటి ఏడుపు పంచమరాగంలో అయితే, పంచమరాగం "ప్రాతరా రభ్య నిత్యశః" పాడవచ్చును గనుక సమంజసమే. పద్యంలోని లలిత అనే పదం లలితరాగాన్ని సూచిస్తుం దనుకున్నా మరేమీ ఆక్షేపణ ఉండదు. కల్పనలకు కల్పవృక్షమైన కృష్ణరాయలు వర్షర్తువులో మేఘరంజన రాగం పాడాలనే సంప్రదాయానికి మరింత సొగసు తెచ్చి మధురానగర మానినులు మేఘరంజన రాగంతో మేఘాలనే ఆకర్షిస్తారన్నాడు :

"ఆ పురసౌధ వీధి నధ
రాధర భూముల గర్జ మున్నుగా
నా పయికి న్వినంబడని
యట్లుగ గ్రాలు ఘనాలి దార్చి లీ
లాపరతన్ ఘటింపుదురు
లాస్యము సేయగ మేఘరంజనా
లాపముజేసి పోషిత క
లాపి కలాపి కలాప కుంతలల్." 2-14

ఇంతకూ, ఈ మేఘరంజని "సర్వదా చ శుభప్రదా."

సంగీత విద్వాంసుల సంగతి ఎలా ఉన్నా మన పూర్వులు తెలుగు కవి పండితులు మాత్రం ఏ రాగంలో పద్యాలు చదవాలో కొంత సూచ్యార్థ సూచనగా, కొంత స్పష్టంగా చెప్పారనే అనవచ్చు. రామాయణంకూడా గానం చేసిందే అంటారు గనుక పద్యం ఏదో గతితో నడవాలి కదా— రాగం లేకపోయినా తాళంతో; ఈ గతినే గమకమన్నారు. కవి కవిత్వం చెప్పవచ్చు; గ్రంథాలు వ్రాయవచ్చు; కాని శారీరంలేనిదాని వల్లనో, సంగీతజ్ఞానం లేనిదానివల్లనో పద్యం రంజకంగా చదువకపోవచ్చు. కనుక కవి రచనను ప్రసన్నంగా చదివి సభాసదులను మెప్పించడానికి ప్రతి రాజాస్థానాలలోను గమకి ఉండేవాడు. గమకంలో రాగచ్ఛాయే కాని, రాగకల్పనలతో పనిలేదు. పెద్దన "ఇంతలు కన్నులుండ" అనే పద్యం వ్రాసి రామలింగకవికి వినిపించగా "ఏం తాతా? ఇంతలు కన్నులుండ అంటే చింతాకంతనా" అని చిటికపట్టిచూపి వెక్కిరించాడని,

పెద్దన గాథరాపడగా, తనే గమకంతో తన చేయిచాపి చారెడు చూపించి సమర్థించాడని ఒక కట్టుకథ. తిక్కన ఉద్యోగపర్వంలో "ఉండం గవి గమకి ప్రముఖ విద్వజ్జనంబులు" (3-232) అని ప్రయోగించగా గమకి పదం అర్థంకాక 'గణక' అని పరిష్కర్తలు దిద్దివేశారని పరిశోధకు లంటారు.

తిక్కన సమకాలికుడైన శివదేవయ్య పురుషార్థ సారంలో వాచక లక్షణాలు చెబుతూ,

"అయ్యై రసంబుల కనురూపముగ పెక్కు
రాగముల్ పణితులు బాగుపుట్ట
చదువుచున్నారు వీరల చదువు బోలు
చదువు లేదని పొగిడిరి సభికవరులు."

అన్నట్టు సకలనీతి సమ్మతంలో ఉదాహృతమైంది (పుట, ౩౭). తెలుగు భారతం పురాణ పద్ధతిని చదివేతీరు చెప్పేటప్పుడు హరివంశం ఉత్తర భాగంలో,

"మునుకొని పోవ కెంతయును
ముట్టక నిల్పక భావమున్ రసం
బును వెలయ న్దగుల్పడక
పొందుగ వాక్యవిభాగ మొప్పగా
నెనిమిది తానకంబులను
నేర్పడి వర్ణము లుల్లసిల్ల నే
ర్పెనయగ వాచకుండు కడు
నెంపగురీతి పఠింపగా దగున్. 10-297

అని ఉంది. ఇక్కడ తానకం, వాచకుడు అనే పదాలనుబట్టి, పురుషార్థ సారంలో తెలిపిన విధంగానే, రాగయుక్తంగా పద్యం చదవాలనే అభిప్రాయం కదా!

పురాణం శ్రీరాగంలో చదువాలని తామరపల్లి తిమ్మయ్య శేషధర్మములలో ఇలా తెలిపాడు:

"పదపదంబును విభజించి తుదయు మొదలు
నెరపడన్ శబ్దభావంబు లెరిగి రాగ
సమితినైనను శ్రీరాగ సరణినైన
సభ నుతింప పురాణముల్ చదువ వలయు." 2-831

తిమ్మయ్య 1500 ప్రాంతంవాడు. అప్పకవి ఇతని గ్రంథంనుంచి పద్యాలు ఉదాహరించాడు. శ్రీరాగం తృతీయ ప్రహరోత్తరరాగం గనుక పురాణానుకూలం కదా!

ఇక సంగీత సాహిత్యకళానిధి అయిన భట్టుమూర్తి వసుచరిత్ర పద్యాలలో రాగాల పేర్లిమిడించి, ఆ పద్యాలు ఆ రాగంలో పాడాలని సూచించాడు; "నానా సూన వితానవాసనల నానందించు సారంగ మేలా నన్నాళ్లదటంచు" అనే పద్యం సారంగరాగంలోను; "అరిగా పంచమ మేవగించి నవలా లవ్వేళ హిందోళ వైఖరి" అనే పద్యం హిందోళ రాగంలోను పాడాలని సూచించాడు. వసు చరిత్రను శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు వ్యాఖ్యానించి, ఏయే పద్యం ఏయే రాగంలో చదువాలో తెలిపారు. ఈ వ్యాఖ్య విశాఖలో పరవస్తువారి గ్రంథాలయంలో ఉంది. యక్ష గానాలలో పద్యాలకు రాగ నిర్దేశం ఉంది. ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు ప్రచురించిన తంజావూరు 'అన్నదాన మహా నాటకం' యక్ష గానంలో రాగ నిర్దేశం ఉదాహరిస్తాను:

తిప్పాభట్టు రాగాన చదివేపద్యం, శంకరాభరణం, ఆటతాళం.

"క్రూస్తున్నవి కోకిలంబు లవిగో
కోలాహల ప్రక్రియన్;
వేస్తున్నాడు మనోభవుం డశిషుగా
వేమారు; నీవు న్ననున్
చూస్తుందానవు నీకు ధర్మ మషవే
శుద్ధాత్ముడను బ్రాహ్మడన్ ?
త్రెస్తున్నానిదె గూర్పుమెక్కటిరతిన్
దేలింపవే లంఝమా !"

బళ్ళాణరాజ నాటకంలో ద్విపద శహనా రాగంలోను (పుట 20), సంధ్యా వర్ణన సీసం ఆనంద భైరవిలోను (పుట 22) పాడాలని సూచన ఉంది.

ఇంత చెప్పినా, ఎవరికివారు ఏదో నిర్ణయం చేసినట్టే కనిపిస్తుంది కదూ? ఔను. తాళానికి తప్పనిసరి నిర్ణయం ఉంది కాని, రాగానికి నిర్ణయం లేదని మొదటచెప్పిన పండితులమాటలే సత్యమనిపిస్తుంది. వావిళ్ళవారు రెండు వ్యాఖ్యానాలతో దేవనాగరిలో ముద్రించిన శాకుంతలంలో అంకాలలోని ఆయా శ్లోకాల గేయరాగాల పట్టిక ఇచ్చారు. ఆ రాగాలను ("సంస్కృత నాటక ప్రదర్శన మార్గదర్శక ప్రథమాచార్యైః శ్రీమద్భిః (రిటేర్డు జడ్జి) సి. వి. కృష్ణస్వామి అయ్యర్ మహాశయైశ్చ ఏతద్గేయ రాగానుసంధాన మకారి.") శ్రీ గోమఠం శ్రీనివాసాచార్యులు, శ్రీ సి.వి. కృష్ణస్వామి అయ్యర్‌గారు నిర్ణయించారట. ఈ నిర్ణయం కూడా వారి అభిరుచి కార్యమే.

గ్రామైకరాత్రంగా దేశమంతా తిరిగాను. చాలావరకు ప్రతి రాష్ట్రంలోను దేసి నాటకాలు, సంస్కృత నాటకాలు, నృత్యకలాపాలు చూశాను. బెంగాలీల "ఒనా ఘ్రాతాం పుష్పం కిసోలాయొ" విని చెవులు మూసుకొన్నాను. ఉత్తర ప్రదేశ్ వారు చప్పయ్, చౌపాఈ బాణీలలో చదివే సంస్కృత నాటక శ్లోకాలు విని తులసీదాసుకు, ఆయన ఆరాధ్య దైవమైన జానికీజానికి నమస్కారం పెట్టాను. శ్లోకంకంటే రాగానికే ప్రాధాన్యమిచ్చే తమిళుల తీరుకు తలఊపడం మానుకున్నాను. ఫారసీ గజల్ లాగ, శేర్ లాగ చదవే పంజాబీల పద్ధతి విని పరుగుతీశాను. చిన్ననాడు విన్న యడవల్లివారి పురుషకంఠంలోని పస వినిపించ లేదు. 'కింశితలైః' అన్నప్పటి కన్నడరాగం - తుర్యమాయ గేయరాగం. గనుక, నాటకంలో దుష్యంతుడు శకుంతలను అనునయిస్తూ సాయంకాలం కావచ్చినట్టు, "సాయంతనే సవనకర్మణి సంప్రవృత్తే" అని స్పష్టమౌతుంది గనుక-ఎంత ఉచితంగా ఉంది! యడవల్లి వారు ఎంతో ఆలోచనతో కాలదేశాలను, సంగీత లక్షణాలను ఆకళించుకొనే ఆయా రాగాలతో పాడి ఉంటారు. ఆయనను తీర్చిదిద్దిన గురువర్యుడు శ్రీ మల్లాది అచ్యుత రామశాస్త్రిగారి చేతి చలవ అదంతా నని అంటారు.

# ఆంధ్రచ్ఛందోవిశేషములు

౧

బ్రహ్మ శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిలుగారు క్రొత్తగా నీనడుమ 'వీరసింహుఁడు' అని స్వయంకృతమును మంజరీచనము నొక దానిని బ్రకటించిరి. దానిలో ద్విపద రచనమును గూర్చి చర్చను గల్పించుకొని యీ క్రింది వ్రాఁత వ్రాసిరి :

"చిన్నన్నగారి యష్టమహిషీ కల్యాణములోని ద్విపదలక్షణమును విశ్వసించుచు నేఁటి లాక్షణికు లీ క్రిందిరీతి నభిప్రాయపడుచున్నారు. ద్విపదమున నితరులెవ్వరును బాటింపని ప్రాసయతి నీతఁడు చేర్చెను రంగనాథ రామాయణమునఁగాని, గౌరన హరిశ్చంద్ర చరితమునఁగాని ప్రాసయతి యెక్కడను గానరాదు. ఈతఁడును, నీతని కనుయాయులగు శివకవులు మఱికొందరు మాత్రమే యీ ద్విపద ప్రాసయతిని జేర్చిరి."

—బసవపురాణ పీఠిక ౮౮-వ పుట.

సరిగాఁ బరిశీలింపకయే పీఠికాకర్త లిట్లు వ్రాసిరి గాని రంగనాథ రామాయణమునఁ బ్రాసయతి ప్రయోగములును పదమధ్యపద్యావసాన ప్రయోగములును ననేక స్థలములం దగపడుచున్నవి.

౧. ప్రాసయతి.

**ఎనసి** గోహత్య **చేసిన**వాని గతికి

౨. **శరణార్థి**బ్రోవని **దురితాత్మ**గతికి

(రంగనాథరామాయణము ౧౩౧ వ పుట.)

౩. **రసరసా**న్నములను **మెన**వెఱువాడు

(రంగ. రా. ౧౩౭ - వ పుట)

౪. **నిలువ**గాకుండ **నిశ్చలు** నొసంగుదు వె

(రంగ. రా. ౧౩౮ - వ పుట)

౫. అని తన పెండ్లి వార్తను నంతదాను.

(రంగ. రా. ౧౪౬ - వ పుట)"

ఇది యెల్ల 'వీరసింహుఁడు' అను శ్రీ సీతారామస్వామిశాస్త్రిగారి గ్రంథపుఁ బీఠిక. ౨౦ వ పుట.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవ పురాణ పీఠికలో ద్విపద రచనమునందు పాల్కురికి సోమనాథాదులగు శివకవులయు, రంగనాథాదు లగు తదితర కవులయు మార్గములు వేఱుతీరుగలవి యని వ్రాసిన పీఠికాభాగమునకు శ్రీ సీతారామస్వామి శాస్త్రిగారు నిక్షేపించిన యాక్షేపగ్రంథభాగమే మీఁద నే నుదాహరించినది.

ఇందు శ్రీ సీతారామస్వామిశాస్త్రిగారు రంగనాథ రామాయణముననుండియే ప్రాసయతి ప్రయోగముల నెత్తి చూపిరి గాని, గౌరన హరిశ్చంద్ర చరిత్రమున నుండి చూపరయిరి. సమ్యక్పరిష్కృతితో ముద్రితమయిన హరిశ్చంద్ర ద్విపదలో నవి యగపడమి కారణము కాఁబోలును. ఇంచుమించుగా నేడువేల ద్విపదలుగల సోమనాథుని గ్రంథమున ప్రాసయతులు వేలకొలఁదిగా వేలు నగపడుచుండఁగా నించుమించుగా పదునాఱువేల ద్విపదలు గల రంగనాథ రామాయణమున, ప్రతి ద్విపదకు రెండు చోటులందుఁ గానరావలసిన యతులలో పదునైదువేల తొమ్మిదివందలపైఁ గొన్ని పదులకుంబై చిలుకు ద్విపదలందుఁ గానరాక వ్రేళ్ళ సంఖ్యతో లెక్కింపఁదగిన ద్విపదపాదములందే కానవచ్చిన ప్రాసయతి కవిప్రయుక్తము గాక లేఖ కాది ప్రమాదతిత మగునేమో యని సందేహించుటయు, చక్కఁగాఁ బరిశీలించి తత్త్వము నిర్ణయించుకొనుటయు సహృదయ రీతి యగును. అందును రంగనాథ రామాయణ మింతదాఁక సమ్యక్పరిష్కారముతో ముద్రితము గాదయ్యెను సరిగాఁ బరిశీలింపకయే యట్లు వ్రాసినారని ప్రభాకరశాస్త్రిగారి నాక్షేపించునపుడు సీతారామస్వామిశాస్త్రిగారు సరిగాఁ బరిశీలించియే వ్రాసినారని గదా సహృదయ సామాన్యదృష్టికిఁ దోచును! ప్రభాకరశాస్త్రిగారే ప్రమాదము పాలయిరని నమ్మి నేను వారి నడుగఁగా వారిట్లు నాకు బదులు చెప్పిరి.

"ఇట్టి యాక్షేపము నింతకుముందే శ్రీ బండారు తమ్మయ్యగా రాంధ్ర సాహిత్యపరిషత్ పత్రికలోఁ గాఁబోలును ప్రకటించిరి. వాఙ్మయవివాదరంగమున నుండి పెక్కేండ్లకుముందే యెడదొలగిన నే నేమియు బదులు వ్రాయనయితిని. తత్త్వమెఱుఁగఁగోరెదవేని నీవే చక్కఁగాఁ బరిశీలనము జరపుదువుగాక" యనిరి. వారి తోడ్పాటుతోనే నేను కడుఁగుతూహలినై ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారముగల రంగనాథరామాయణపు వ్రాఁతప్రతులఁ బరిశీలించితిని. అట్లు పరిశీలింపఁగా శ్రీ సీతారామస్వామి శాస్త్రిగారి యాక్షేపము నిరాధారమయినది గాను, పరిశీలింపకయే వ్రాసినదిగాను స్పష్టపడినది. ఎట్లనఁగా క్రీ. ౧౮౩౯-వ

సంవత్సరమున బ్రౌను దొరగారు పదునైదు తాళపత్రప్రతులలోని పాఠములను బండితుల సాహాయ్యమున సేకరించి, కాగితమున కొక్క ప్రక్క మాత్రమే వ్రాయించి ఎదిరిపుటమీఁద పాఠభేదములనెల్లఁ జేర్పించి బైండుచేయించిన రంగనాథరామాయణప్రతిలో (నెం. ౧౧-౧౨-౧౪) నీ క్రింది పాఠములున్నవి.

౧. 'ఎనసి గోహత్యచేసిన వానిగతికి' సీ. శా. ఇచ్చిన పాఠము.

'చెనసి గోహత్యచేసిన వానిగతికి' బ్రౌనువ్రాయించిన పాఠము.

'ఎనసి'కంటె 'చెనసి' సముచితార్థ సందర్భముగలది గదా!

౨. 'శరణార్థి బ్రోవని దురితాత్ముగతికి' సీ. శా. పా.

'శరణార్థి బ్రోవని చపలాత్ముగతికి' బ్రౌన్.పా.

'దురితాత్ముగతికి' అన్నపాఠము సరియైనది గాదనుటకు తర్వాతి ద్విపద యిదిగూడ సాధకము.

'పగల సొమ్ముల కాసపడువాని గతికి
పరసతిఁ గోరిన పాపాత్ముగతికి'

'పాపాత్ముగతికి' యనియు 'దురితాత్ముగతికి' యనియు రెండు ద్విపదలలో నేకార్థకపదములఁ జెప్పుట చతుర రచనము గాదుగదా!

౩. 'కసర సాన్నములను మెసనెడువాఁడు. సీ శా. పా.

'పొసర దివ్యాంబరంబులు గట్టినాఁడు
మునివృత్తి వల్కలంబులు గట్టినాఁడు
పొసగ రసాన్నముల్ భుజియించువాఁడు
కసరుగాయలఁ బ్రొద్దు గడపుచున్నాఁడు.' బ్రౌన్. పా.

'పొసర దివ్యాంబరంబులు' 'పొసగ రసాన్నముల్' అని యున్న బ్రౌనుపాఠములో రచనా సౌందర్యము గలదుగదా!

౪. 'నిలువగాకుండ నిచ్చలు నొసంగుదువె.' సీ. శా. పాఠము.

'కొలిచినవారికిఁ గోరి జీతములు
నిలువగాకుండ సన్నిధి నొసంగుదువె.' బ్రౌన్ పాఠము.

జీతములిచ్చు క్రిందినౌకరులు మోసగింపకుండుటకు (తనసన్నిధి.) కావున 'నిచ్చలు'కంటె 'సన్నిధి' పాఠము సమంజసముగదా!

౫. 'అని తన పెండ్లివార్తను నంతదాను.' సీ. శా. పాఠము.

'అని తన పెండ్లి వృత్తాంత మంతయును.' బ్రౌను పాఠము.

ఈ రెండిట నేది రచన మనిపించుకొనునో యెఱుఁగజెప్ప నక్కఱలేదు గదా!

పయిఁవ్రాత ప్రతులతో శ్రీ సీతారామస్వామి శాస్త్రిలుగా రిచ్చిన పాఠమేదిగాని, యెందునుగాని కానరాలేదు. మఱియు ముద్రిత గ్రంథమునుండి శ్రీ సీతారాస్వామి శాస్త్రిగారు దాహరింపని పాఠము నొకదానిఁ గూడఁ జూపుచున్నాఁడను.

'కడవఁజేసెడు పాపకర్ములరాలైతి
నడురేయి నిన్ గడువడినిఁ బొమ్మంటి'

(అచ్చుప్రతి, అయోధ్యాకాండము, దశరథహతుఁడగు మునిబాలుని వృత్తాంతము.)

ఈ పాఠము తప్పు పరిశీలింపఁగా వ్రాఁతప్రతిలో నిట్లున్నది:

'నడిరేయి నిన్ను నే నదికిఁ బొమ్మంటి.' ఇట్టి వెన్నో కలవు.

ఇట్లు పరిశీలింపఁగా రంగనాథ రామాయణమునఁ బ్రాసయతి గలదని తలఁచుట సరిగాదని యేర్పడుచున్నది గదా!

౨

మరియును బసవపురాణ పీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రి గారిట్లు వ్రాసిరి:

"మఱియు ద్విపదయు ద్విపదయుఁ గలయునప్పు డొక్కపదమే యిటు గొంతయు, నటుగొంతయునై యుండునట్లు రంగనాథాదు లెక్కడను గూర్పరయిరి. 'ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద, మపుడు ప్రయోగింప నదియ యుక్తంబు' అని చిన్నన్న స్పష్టముగా నిర్వచించినాఁడు. అయినను మన సోమనాథుఁడీ నిర్ణయముం బాటింపలేదు.

౧. జాతులు మాత్రానుసంధానగణవి -
నీతులు గాన యనియత గణౌర
నియుఁ బ్రాసోవా యనియు యతిర్వాయ...

౨. అతిశయప్రీతి బ్రహ్మాండపురాణ
మత'మహో మోహస్య మాహాత్మ్య' మనమొ
దలఁ 'త్రిపుండ్రం మోక్షదం త్యక్త' మన 'వి-
రళ మేత దన్యత్ర రమతే' యనగను
చితసూక్తి యట్ల వాసిష్ఠలైంగంబు.

—పండితారాధ్య చరిత్రము.

ఇట్లు గూర్చుట పండితారాధ్య చరితమందే హెచ్చుగాఁ గానవచ్చును. బసవపురాణమున నేద్విపద కాద్విపద విడఁబడియే యున్నది."

పయి, ప్రభాకరశాస్త్రిగారి నిరూపణమునకు విరుద్ధముగా రంగనాథ రామాయణమున ప్రయోగములు గలవని శ్రీ సీతారామశాస్త్రిలవారు 'పదమధ్య పద్యావసాన ప్రయోగములు' అని పేర్వెట్టి యీ క్రిందిపట్టులఁజూపిరి:

౧. తమ తమ యిండ్లకుఁ దా రర్థి నరుగ
శమితాత్ములకు మునిసంఘంబు **లప్పు-**
**డంత** నావృత్తాంత మాయోగదృష్టి. రంగనా. ౩౨ పుట.

౨. విశ్వంబు కలగొని వెదకి నాయెదుట
నశ్వంబు గొనక మీ రరుదేర **వలవ**
**దని** పల్క నౌగాక —రంగనా. ౪౦. పుట.

౩. చిన్నారినూగారు సింగంపుగౌను
పొన్నపూబొక్కిలి వొదలెడు **పిఱుదు**
**లూరుల** తీరు... —రంగనా. ౬౦ పుట.

౪. కౌసల్యసతి వామకర మంటబట్టి
కైసేత లుడివోయి గతపుష్పకర్ణి
కారశాఖయు బోలి —రంగనా. ౩౭ పుట.
("కర్ణికార, పు. కర్ణికామృచ్ఛతి" శబ్దస్తోమ మహానిధి)

౫. వసుధ రాలెడి విరుల్ వర్షోపలములు
ముసురు తేనియసోన ముంచినవాన
**గా** నొప్పుచు వసంతకాలంబు. —రంగనా. ౧౫౮ పు.

శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు చెప్పిన లక్షణమునకు నుదాహరణములకును, శ్రీ సీతారామస్వామి శాస్త్రిలుగారు తథావిధములే యని రంగనాథరామాయణముననుండి యెత్తిచూపిన యుదాహరణములకును సంగతియే లేదు. సంస్కృత శ్లోకములలో "యతిర్విచ్ఛేద సంజ్ఞకః" అన్నచొప్పున యతిస్థలములందుఁ గల్గు పదసంధివంటిది శ్రీ సీతారామస్వామి శాస్త్రిలు గారు చూపిన పద సంధి. అది కూడదని యెవ్వరును జెప్పలేదు. చిన్నన్న,

"ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద
మపుడు ప్రయోగింప నది యయుక్తంబు"

అనెను. ప్రభాకరశాస్త్రిలును ద్విపదయు ద్విపదయుఁ గలయునపుడు ఒక్కపదమే యటు గొంతయు నిటు గొంతయు నుండునట్లు గూర్పరాదని వ్రాసిరి. దానికి లక్ష్యములుగా **"గజై ర-నియు, అనమొ-దల ద్రిపుంద్రం, అనగను-చితసూక్తి"** యను వాటిని జూపిరి. సీతారామశాస్త్రిలుగారు చూపిన ప్రయోగము లట్టివి గావుగదా! రెండు ద్విపదలకు సంధియే యుండరాదనుట చిన్నన్న మతము కాదు. అతఁడు 'ద్విపదతో ద్విపద సంధిల' అనెను. **పూర్వ**

పరద్విపదలం కందచంపకోత్పలాదులవలె నంత్యాదులందు సంధియే లేక తెగిపోవలెనని ఎవ్వరును జెప్పలేదే!

మఱియు చిన్నన,

"మఱియు సంస్కృతపు సమాసరూపమున

నెఱయ నెన్నిటినైన నిర్మింపఁదగును" అన్నాఁడు గదా!

కర్ణికారప్రయోగ మీలక్షణముచొప్పునఁ జక్కఁబడుచున్నదిగదా!

అనంతామాత్యుఁడు చెప్పిన "సముద్రగ**సాహ, సాయ**" అన్న ప్రయోగమును "పిబేచ్చ మృగతృష్ణికా **సు సలిలం** పిపాసార్దితః", "రామోనామ క్షితి మవతి **కాకుత్థ్సవంశో**ి నృపాలః", "రామోనామ క్షితిమవతి **సీతాపతి** ర్భూమిపాలః" ఇత్యాది యతిస్థలములందలి పదమధ్య యతిచ్ఛేదములవంటివియు, శ్రీ సీతారామస్వామి శాస్త్రిలుగారే తమ యక్షగానమునఁ బ్రయోగించిన

"కాణాచి స్వర్గలోకము వీడ దేవ

**శముల** *సాహస్రంబులములందు విడిసి"

"విద్యాపురమహోచ్చ విభవంబయను **న**

**యస్కాంత**మణిచేత నాకృష్టుఁడగుచు"

"రాగకల్పకవల్లి యాగతిన్ **విఫలి**

**తంబుగా**ఁగ జయధ్వజం బెత్తలేదే"

ఇత్యాది ప్రయోగములును కూడనివని చిన్నన్న చెప్పెను. రంగనాథాదులును ప్రయోగింపరైరి. కాని 'రామోనామ క్షితిమవతి సీతాత్మనాథో మహాత్మా' ఇత్యాది విధముల సత్సంధి గల స్థలములును, శ్రీ సీ శాస్త్రిలుగారే ప్రయోగించిన

"దక్షిణ హైందవ స్థానయోధాగ్ర

ణీ ధైర్యమున రోహిణీ కుజగ్రహము"

అన్నచోట అగ్ర + ణీ పదమును, రంగనాథుఁడు ప్రయోగించిన కర్ణి + కార (కర్ణికా + అర, కర్ణి + కార, ఎట్లయినను సరియే) అన్న పదమును ద్విపద సంధిలోఁ బ్రయుక్తములగుట దోషముగాదు. ఇట్లు పరిశీలింపఁగా చిన్నన్న చెప్పిన ద్విపదలక్షణమే పర్యాప్తమయినదని, రంగనాథాది ప్రాచీన కవి సంప్రదాయ సమ్మతమని తెలియనగుచున్నదిగదా!

మఱియు పాల్కురికిసోమనాథుని ద్విపదరచనము రంగనాథాదుల ద్విపద రచనమునకును, తదనుసారియైన చిన్నన్న ద్విపదలక్షణమునకును విరుద్ధమైనదని స్పష్టముగాఁ దెలియనగుచున్నది గదా!

---

* 'సాహస్రంబులములందు' అనఁగా అర్థమేమో!

రంగనాథాదుల ద్విపదరచనా విధానమును కవి జనాశ్రయాది లక్షణ గ్రంథములు బాగుగ నిరూపింపఁజాలకున్నవని గుర్తించియే ప్రభాకరశాస్త్రిగారు పర్యాప్తమయిన చిన్నన్న ద్విపద లక్షణ నిర్వచనమును బసవపురాణ పీఠికలో నుదాహరించిరి.

"ద్విపదమునఁ బ్రాసయతిని జేర్చుట మొదలుగా సోమనాథుఁడు చూపిన ఛందస్స్వాతంత్ర్యమును శివకవులంగీకరించిరిగాని, యితరులు గర్హించిరి. కాకతి ప్రతాపరుద్రుని కాలముననే యిట్టి గర్హ మేర్పడినట్టు పద్యబసవపురాణము తెలుపుచున్నది. అర్వాచీనుఁడగు నొక శివకవి యిట్లు చెప్పినాఁడు:

...ఇలఁ బాలకురికి సోమేశుండు మున్ను
తొలగక ప్రాసయతుల్ ద్విపదులను
లలి రచించుట యది లక్ష్యంబుగాను
నెలమి రేఫఱకారములు శివకావ్య
ములయందుఁ జెల్లుఁ దప్పులుగావు కాన
ఆ పాల్కురికి సోము ననుమతి నేను
దీపిత ప్రాసయతిచ్ఛందసరణి
నామహాగురుదేవు ననుమతి యట్ల
శ్రీ మెఱయంగ రచించితి నిట్లు" (బసవపు. పీఠిక ౯౭ పు.)

పయి వాక్యములవలన ప్రతాపరుద్రునికాలముననే పై మతభేదము వెలసినట్లు తెలియవచ్చుచున్నదిగదా! దీనిఁబట్టి సోమనాథు ననుసరించినవారు కొందఱును, రంగనాథాదుల ననుసరించినవారు కొందఱును, నుండిరనుట స్పష్టమగుచున్నదిగదా!

పయి చర్చవలన శ్రీ చినసీతారామస్వామిశాస్త్రిగారు బసవపురాణ పీఠికా వాక్యములమీఁదఁ జేసిన యాక్షేపము నిరాధారమయినదని విస్పష్టపడుచున్నదిగదా!

# నువ్వులు కొట్టిన ఇడి నూటిడి.

ఈ రమణీయ ప్రకృతిలో చందమామ మానవుణ్ణి ముగ్ధుణ్ణి చేసినంతగా మరొకటి చేయలేదేమో! పసిపాప మొదలు పండు ముసలివరకు జాబిలి చల్లదనానికి మురిసిపోనివారు అరుదు. ఇక సాహిత్యంలో శశాంకుని స్థానం మరీ పెద్దది—మన సాహిత్యంలో మన్మథునికి సాక్షాత్తు మేనమామ. ఈ సంబంధం వల్ల మన్మథుడికి పడే అక్షతలలో చంద్రుని పైగూడా కొన్నికొన్ని పడడం, ఒకప్పుడు పూర్తిగా ఉపాలంభనీయుడు కావడం కద్దు. ఈ ఆవేశంలో చంద్రుణ్ణి, అతని కళంకాన్ని వివిధాలుగా వర్ణించడం, ఉత్ప్రేక్షించడం చెప్పనక్కరలేదు. అలాటి వాటిలో శృంగార నైషధంలోని చంద్ర వర్ణనలోని ఒక పద్యం ప్రమేయ మిది:

నలచక్రవర్తి దమయంతితో ఇలా అంటున్నాడు—'ప్రేయసీ! చూచావా? రాత్రి అనే ఇల్లాలు, ఆకాశమనే నీలాల కంచంలో మన్మథునికి నేయి, నూటిడితో పాటు వడ్డించిన పాయసంలాగా చంద్రుడు కనిపిస్తున్నాడు. చకోరాలు బంతి కూటికి రావాలని ఉవ్విళ్ళూరుతున్నాయి."

ఈ పాయసం మనక్కూడా నోట నీరూరిస్తున్నది కదూ! ఆ పద్యం చదవండి మరీ రుచిగా వుంటుంది:

"ఉడువీథీ హరినీల రత్నమయ పా
త్రోత్సంగ భాగంబునం
గడు గారా మొనరన్ ఝషాంకునకు నం
కచ్ఛాయయన్ కమ్మనూ,
టిడితో గూడ సుధాంశుబింబమను నే
యిం బాయసాహారముం
గుడువంబెట్టెనొ బంతికూళ్ళకును జా
కోరంబు లేపారగాన్."

ఈ పద్యం పూర్వ ముద్రణాలలో ఇలాగే ఉంది. కాని శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారు నూటిడిలోని టిని బిగా పఠించి, వ్యాఖ్యానించడంవల్ల నూటిడి వంటి తినుబండం చవిచూచే అవకాశం మనకు లేకపోయింది. శ్రీ వేంకటరాయ శాస్త్రిగారి వ్యాఖ్యాన మిది:

"చాకోరంబులు = చకోర సమూహములు, బంతి కూళ్ళకున్ పిమ్మట = తామందఱు బంతులుతీరి భుజించుటకై (ముందుగా), కడుగారా మొనరన్ = మిక్కిలి భక్తియొప్పగా, ఏపారగ = విజృంభణతో, ఉడు... భాగంబునన్ = నక్షత్ర మార్గమనెడి (ఆకాశమనెడి) ఇంద్రనీల రత్న రచితమైన కంచముయొక్క ఒడి ప్రదేశములో (ఇంద్ర నీలపు గంచములో), ఝషాంకునకు = మన్మథునకు, సుధాంశుబింబము = చంద్రమండలము, అను = అనెడు, సర్పిః పాయసాహార మున్ = నేతితో గూడిన పరమాన్నమును, అకాంచ్ఛాయయన్ కమ్మనూబిడితో గూడన్ = కళంక కాంతియనెడి మధురమైన (శర్కరాసాధితమైన), నూబిడితో = పిడికెడు నువ్వులతోగూడా (నూవు + పిడి—ప్రాంతాదిలోపనుగా గమ ద్రుతకార్యములు), కుడువంబెట్టెనో = నైవేద్యము సమర్పించినవి గావలయును: దీనికి సమాన రూపమైన మూలము దొరకలేదు."

నూఁటిడి అనేది తప్పనుకొనడంవల్ల శ్రీ శాస్త్రిగారు దానిని నూబిడిగాను, యతికోసం సర్పిఃపాయసాహారమున్ గాను సవరించారు. ఆ సవరణను సమర్థించు కొంటూ వారు ఈ విధంగా చర్చించారు.

"కమ్మనూబిడి—ఇట 'నూఁగిడితో గూడ శశాంకబింబమున నెయ్యం బాయసా' అని పూర్వముద్రణము. అందులకు 'నూటిడి' యను భేదముతో నదే తత్పూర్వతర ముద్రణము. ఇందుముద్రణ ప్రమాదములుగా నెన్నదగినవానిని "నూటిడి" "బింబమను" అని సవరించి యర్థం చేయుచో కమ్మని ఊటఇడి = పెట్టినదంతయు పరమాన్నమేగావున తీపుచే మొగము మొత్తకుండుటకై రసాంత రార్థమై కమ్మని యూటను పోసి అని గ్రహింపవలయును; కడమకు ముద్రిత పాఠార్థమే. కాని, 'తోఁ గూడన్' అనుదానికి తోన్‌తోన్ - అనియేని కూడఁ గూడ - అనియేని అర్థము చెప్పవలయును. మఱియు "బింబమను" - అను అనెడు - ఇది తద్ధర్మార్థక విశేషణము, నేతితో నన్వయించును; దీనికి పాయ సాహారములతో నన్వయము లేదు. మఱియు 'నేయిన్' — ద్వితీయయేని నేతిన్ అనవలయును; ప్రథమయేని యువర్ణలోపము అప్రశస్తము. కావున నీపాఠము శ్రీనాథ కవిదని విశ్వసనీయముగాదు. ప్రకృతపాఠము అర్ధానుస్వారహీనముగా నొక వ్రాఁతలో నుపలబ్ధము. ఈ పాఠమున 'అను' శబ్దమునకు "పాయసాహార ముతో" అనన్వితత్వము లేదు. లేఖకాదులు కీటహత్యాది కారణములచే 'సర్పిః'

శబ్దమును 'నేయిన్' అని గ్రహించి తదనుగుణ యతికై 'నూబిడిని' నూఁటిడి'గా మార్చిరని తలంపవలసి యున్నది. మఱియు 'ఊట' యనగా 'అవకాయ' యూటయా? చకోరములు సైతము దానిని నంజుకొనునా? మఱియే యూటయు అంత ప్రసిద్ధముగాదు. వివక్షించిన యూటను పేర్కొనుట యుచితము. కావున అది పాఠముగాదు "సర్పిః" - థాళథళ్య స్థానీయము"

ఒక్క చిన్న అపోహతో ఎంత ప్రమాదం కలిగిందో తెలుపడానికి వ్యాఖ్యానమంతా ఉదాహరించడం.

శృంగార నైషధం శ్రీ హర్షుని సంస్కృత మూలానికి తెనుగు గదా? మరి మూలంలో ఇలాటిది వుందా? అంటే 'దీనికి సమానమయిన మూలం దొరక లేదు' అని శ్రీ వేంకటరాయశాస్త్రిగారే అన్నారు. అక్కడవున్న శ్లోకమిది :

"ఉపనత ముడుపుష్ప జాత మాస్తే
భవతు జనః పరిచారక స్తవా యమ్,
తిల తిలకిత పర్పటాభ మిందుం
వితర నివేద్య ముపాస్స్వ పంచబాణం." 22-149

ప్రేయసీ! నక్షత్రాలనే పూలు దగ్గరలో వున్నాయి. నేను నీకు పరిచార కుడుగా వున్నాను. (ఆ పూలు నేను అందివ్వగా) నీవు మన్మథుణ్ని పూజించి నువ్వులు అద్దిన అప్పడంలావున్న చంద్రుణ్ని నైవేద్యం పెట్టి సేవించు — కనుక, మూలానికీ శ్రీనాథుని రచనకు ఏమీ సంబంధం లేదు. ఈ ఉత్ప్రేక్షకు ఆకరం కనౌజ్ రాజధానిగా కొంత భాగాన్ని పరిపాలించిన జయచంద్రుడు రంభ అనే రాజకన్యను పెండ్లాడిన గాథ వస్తువుగా నయన చంద్రుని 'రంభా మంజరి' అనే నాటికలో లభిస్తున్నదని శ్రీ వేంకటరాయశాస్త్రిగారే తెలిపారు.

"నక్ఖత్తయక్ఖయ సణాహ తలే విసాలే
థాలే హరిమ్మణి మయె ణిసిదేవియాఏ,
అంకచ్ఛలేణ తిల తెల్లగుడంసయుత్త
చందో వి భాది గయణే బలిదుడ్డియువ్వ"

(నక్షత్రకాక్షత సనాథతలే విశాలే
స్థాలే హరిన్మణిమయే నిశాదేవ్యాః
అంకచ్ఛలేన తిలతైల గుండాంశయుక్త
చంద్రో విభాతి గగనే బలిదుగ్ధికేవ.)

చంద్రుడు నిశాదేవికి నీలాల కంచంలో పెట్టిన బలిపాలులా వున్నాడట. బలిహరణమప్పుడు అక్షతలు వేసి; నువ్వులు, నూనె, బెల్లం కలిపిన ముద్ద పిడుచగా పెట్టి పాలు వదులుతారు. నక్షత్రాలు అక్షతలులాగా నీలాకాశం నీలాల స్థాలిలాగ, చంద్రుడిలోని కళంకం చిమ్మిలి పిడచలాగ ఉన్నాయట. దీనిలోని 'తిలతైలగుండాం'శాన్ని శ్రీనాథుడు కమ్మనూఁటిడిగా చేసుకున్నాడు; అక్కడి బలిపయస్సును 'పాయసాహారములు'గా వండుకున్నాడు.

అయితే ఈ 'నూఁటిడి' ఏమి తినుబండం? ఇడి అంటే పిండి, పిండితో చేసిన పదార్థమూను. ఇడియుట - కొట్టుట. కొట్టడంవల్ల ఏర్పడినది ఇడి. తమిళులో ఇడి యప్పం, ఇడియాప్పం, ఇడ్డలి మొదలయిన వస్నీ దీని వికారాలే. కన్నడంలో కుడుముల్లోను, కజ్జికాయలలోను పెట్టే పూర్ణానికి ఈ ఇడి వ్యవహారం ఉంది. నువ్వుల ఇడి - నూవుల - పిట్టుతో - నూవులు కొట్టిన పిట్టుతో - చేసిన పదార్థం నువ్వుటిడి. నువ్వు + ఇడి = నువ్విడి నూవిడి కావాలికదా. మధ్యటకారం ఎలా వచ్చిందనే శంక కలుగుతుంది. భాషలో కొన్ని ఇలాంటివి వింత వింతగా ఇతర పదాల సాదృశ్యంతో ఎలాగో ఉండిపోతాయి. కమ్మ + ఊరు = కమ్మూరు కావాలి. కాని కమ్మటూరు అని వ్యవహారం. ఎలా టకారం వచ్చింది? లేఖక ప్రమాదంవల్ల ఈ నూటిడిలోని టి బిగా అయి ఉంటుంది. దానితో ఈ రుచ్యమైన పదార్థం పోగొట్టుకుంటామా? మరెక్కడైనా ఇలాటి ప్రయోగం ఉందేమో, నూటిడి దొరుకుతుందేమో చూద్దాం, మరెక్కడో ఎందుకు ఈ శ్రీనాథుడే హరవిలాసంలో ఇలా అన్నాడు :

"ఉండ్రాళ్ళు నూఁటిడి పుండ్రేక్షులుం దేనె
యనఁటి పండ్లుం బూరియలు ఘృతంబు
పెసరుఁబప్పును బాలుఁబెరు గోగిరంబులు
బాయసాన్నంబులుఁ బానకములు
వాళివేరంపు బొండాలు మీఁగడయును
నవనీత పిండ ఖండములు గుడము
లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు
మండంబు చలిమిడి మండ పప్పు
లాదిగా భక్ష్య చోష్య లేహ్యాదులైన
బహుపదార్థంబు లర్పించి ప్రణతులైరి
వేలుపులు రాక్షసులును నా విఘ్నపతికి
దుగ్ధపాథోధి మంథనోద్యోగవేళ." 6-55

ఇక్కడ నూటిడిని భక్ష్యాలలో చెప్పడంవల్ల నూఁటిడి నూలు పిడికెడు గాక, నూవులతో తయారు చేయబడిన భక్ష్యవిశేషమేనని స్పష్టం గదా! ఊహూఁ! ఇవి యతిప్రాసలలోలేదు. ప్రమాణంగా స్వీకరించడానికి అవకాశంలేదు - అని మీరు వాదిస్తారు కదూ! అయితే శ్రీనాథునంతటి వాడూ, పదకవితా పితామహుడూ అయిన అన్నమాచార్యుడుకూడా ఈ 'నూఁటిడి'ని ఏడుకొండల వానికి నివేదించడం; ఆయన సుష్టకృత్తుగా ఆరగించడం చూడండి;

"నువ్వులు చిటిబెల్లాలు
నువుఁటిడియును జన్ని మరుగులును
ఎవ్వరు వేంకటపతి కెరిగించ నారగించి
కివ్వ కివ్వ నవ్వ నాకించీఁజుండీ!"

(ఆధ్యాత్మ కీర్తనలు, 42వ రేకు)

సంక్రాంతి పండుగనాడు రాయలసీమలోను, తెలంగాణాలోను నువ్వులు నానబోసి, ఆర్పి, పొట్టు పోయేటట్టు రుద్ది, తెల్లనూలుచేసి, కొబ్బెర, బెల్లం ముక్కలు వేసి—ఇష్టం, యోగ్యత ఉన్నవారు పిస్తా, అక్రోటు, బాదంపప్పు వేసుకోవచ్చు-నని ప్రీత్యర్థమనే దృష్టితో ఇష్టమిత్ర బంధువులకు పంచిపెడతారు. ఆ విధంగా నువ్వులు చిటిబెల్లాలు వేంకటేశ్వరునికి ఆరగింపు పెట్టటమన్నమాట. 'నువ్వులు చిటి బెల్లాలు' తర్వాత 'నువ్వుటిడియు' అని చెప్పడంవల్ల ఇది నువ్వులుదంచి బెల్లం, నేయి వేసి కలిపి చిమ్మిలిలాగానీ, ఉత్తరాదివారి రేవడీ - లేవడీ - లాగాని చేసే మరొక భక్ష్యమైవుంటుంది. చిమ్మిలి పూర్ణంగా పెట్టి బొబ్బట్లు చేయడం బళ్ళారి ప్రాంతంలో నేటికీ కద్దు. కనుక వ్యాకరణాల నదరు బెదురు లేకనే నువ్వులకు ఇడికి మధ్యన టకారం చేరి నువ్వుటిడి అయింది. ఇది పూర్తిగా వేరే తినుబండమేకాని, ముడిపదార్థంకాదు. నూటిడి = నూవులతో చేసిన భక్ష్య విశేషము—అని సూర్యరాయాంధ్ర నిఘంటువు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు నూటిడి సాధు ప్రయోగమని సారంగధర విమర్శ సందర్భంలో, 1923 లో భారతిలో ప్రసక్తానుప్రసక్తంగా ఉట్టంకించారు.

దీనిని శ్రీ వేంకటరాయ శాస్త్రిగారు చవి చూడక, "ఊఁటయనగా ఆవకాయ' యూటయా? చకోరములు సయితము దానిని నంజుకొనునా?" అని ఆక్షేపించారు. ఆ నూలబిడికెడుకోసం నేయిని కూడా 'సర్పిః' అని సంస్కృతీకరించారు. "'నేయిన్' ద్వితీయయేని 'నేతిన్' అనవలయును. ప్రథమయేని యువర్ణలోపము అప్రశస్తము. కావున నీ పాఠము శ్రీనాథ కవిదని విశ్వసనీయము కాదు" అన్నారు.

నేయిన్ అనేది, నేతిన్ అని మారనక్కరలేదు.

"వేయేల బూది వేల్చిన
నేయిని బోలియును మీద నిష్ఫల మందున్."

అని మడికి సింగన వాశిష్ఠరామాయణంలో ప్రయోగించాడు. ఆ. 4-66 ఔప విభక్తికాలు రానివి ఇంకా ఎన్నో ఇలాటివి ఉన్నాయి. "నోరికొలందు ల్పరికొల్పగ"—కుమారసంభవం. ఆ. 1-88. "నీరిలోన దోచు తారక బింబంబు" - భారతం. ఆది ఆ. 1-207

ఉడువీథీ - పద్యం ఉన్నదున్నట్టుగా చదివితే చకోరాలు మన్మథునికి పరమాన్నం వడ్డించినట్టు అర్థమౌతుంది. చకోరాలు ఇలా వెన్నెల విందు చేయడం పారిజాతాపహరణంలోను ఉంది. శ్రీనాథుని ఈ పద్యం మరింత రమణీయం కావడానికి వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'కడుగారామొనరన్' అనే దానిని 'కడుగారామున రే' అని కొద్దిగా మార్చి చదువుకోమన్నారు. దానితో కర్తృపదం రేయి—రాత్రి అయింది. చకోరాలను మన్మథుని సహపంక్తికి పిలిచింది. వాటికి 'పంతి కూళ్ళకును' రావాలనే ఆతురత హెచ్చింది. ఇప్పుడు పద్యం పూర్తిగా చదువుకుంటే కలిగే రుచి ఇది—రాత్రి అనే ఇల్లాలు ఎంతో గారాముతో ఆకాశమనే ఇంద్రనీలాల కంచంలో చకోరాలుకూడా బంతికూళ్ళకు రావడానికి తహతహ పడుతుండగా, మన్మథునికి నేయి, నూటిడితోపాటు పరమాన్నం వడ్డించింది పరమాన్నంలో నేతి బొట్టు పడితే కలిగే పరమానందం చెప్ప నక్కరలేదు.

చూచారా? చిన్న అపోహతో ఎంత అర్థం, ఆనందం మరుగైపోయాయో!

# పాతదైనా కొత్తదారిన వచ్చిన ఏకాంకిక

దృశ్యవిద్యా విధానం విపరీతంగా విస్తరిస్తున్న ఈ కాలంలో నాటకమంటే ఏమిటని మనం వివరించ నక్కరలేదు. ప్రతి విద్యార్థికీ తన పాఠ్య పుస్తకంలోని ఒక్కటో ఆరో నాటకంగురించి తెలుసు. మరి కొంచెం తెలివిగల వాడయితే, నాటకం అతిప్రాచీనమైనదని, మనదేశంలో -ముఖ్యంగా తెలుగునాట- రెండువేల యేళ్ళకు ముందునుంచే ఉందని చెబుతూ తను చెప్పడానికి ప్రమాణంగా గాథాసప్తశతిలోని

మాణ ద్దుమ పరుస పవణస్స
మామి సవ్వంగ ణివ్వుఇఅరస్స,
అవగూహణస్స భద్దం
రఇణాడక పువ్వరంగస్స. 4-44
[మానద్రుమ పరుష పవనస్య
మామి సర్వాంగ నిర్వృతికరస్య,
అవగూహనస్య భద్రం
రతినాటక పూర్వరంగస్య.]

అనే గాథను ఉదాహరించి మనకు ఆశ్చర్యం కలిగించనూగలడు. పండితులయితే యమయమి సంవాదం మొదలయినవి ఉట్టంకించి నాటకం పుట్టు పూర్వాలు వేదంలోనే చూచుకోండనీ అనగలరు. ఇక జానపద సాహిత్యాభిమానులు నాటకం మాట వేదానికి ముందుదే నని వాదించకపోరు.

ఇంతకూ మానవుని పుట్టుకతోనే- అనుకరించగల ప్రాణి పుట్టుకతోనే- పొటమరించిన రూపకం రూపురేకల జాతకం కట్టడం కష్టమేనేమో!

నాటకం సంగతే ఇట్లయినప్పుడు, దానికి మాతృక అనదగిన ఏకాంకిక ముందువెనకలు కనుక్కోవడం మరీ కష్టం. ఇతివృత్తాది విభేదాలనుబట్టి భరతాచార్యులు మొదలయినవారు రూపకాలను పెక్కురీతుల వింగడించారు. వాటిలో

భాణం, వీథి, అంకం, వ్యాయోగం వంటివి ఏకాంకిలని వాటి రస ప్రాధాన్యం బట్టి ప్రధాన రూపకాలలో చేర్చారు. వీటన్నిటిలోను వీథి అతిప్రాచీనంగా తోస్తుంది. ఎందుకంటే, వీథీరూపకానికి ఆలంకారికులు నిర్ణయించిన లక్షణాలు, సంపూర్ణ నాటకానికి ఆముఖమన్న దాని లక్షణాలూ సమానమైనవి. కనుక విడిగా, ఏకాంకికగా అభివృద్ధి అయిన వీథిని, పాత్రల పరిచయానికి అనుకూల మన్న దృష్టితో నాటకానికి—సంపూర్ణ నాటకమని వారు భావించినదానికి—అంగంగా చేర్చారని అనుకోవచ్చు.

కాని, ఆధునికాంధ్ర సాహిత్యంలో వికసించిన ఏకాంకిక మాత్రం నూతన ప్రక్రియ అనడం నిర్వివాదం. దీని మూలం సంస్కృతైకాంకిక అయినా, దోహదం పాశ్చాత్యం- కనుక ఇదొక అంటు మామిడి. నిజానికి నేటి ఏకాంకిక ప్రపంచ సాహిత్యంలోనే నవవిధానమన్నా తప్పులేదు. మాటలు పూర్వాపర విరుద్ధంగా కనిపిస్తున్నాయి కదూ! విరుద్ధాభాసం మాత్రమే. నేడు నాట్యకళా దృష్టితో దేనిని మనం ఏకాంకిక అంటున్నామో అలాటిది ఈ శతాబ్దం ప్రథమ పాదంవరకు మన సాహిత్యంలో కనిపించదు. భాణం, వీథి, అంకం, వ్యాయోగం ఏకాంకిలే అయినా, వాటి తీరు వేరు. భాణంలోను, వీథిలోను రెండు పాత్రలకు మించరాదు. భాణం సంభాషణరీతి ఆకాశ భాషితం. వీథిలో రసం పూర్తిగా పచ్చి శృంగారం. ఇద్దరే సంభాషించే వారుండడంవల్లే తక్కినదంతా ఆకాశ భాషితంగాను, శూన్యంగానూ ఉంటుంది. అంకపు ఇతివృత్తం స్త్రీల శోకం. వ్యాయోగం స్త్రీ నిమిత్తంకాని సమరం. భాణిక, డోంబి, నాట్యరాసకంవంటి ఏకాంకికలన్నీ గొల్లకలాపం, భామాకలాపం వంటివి - వీటి లక్షణాలనుబట్టి పరిశీలిస్తే—ఏకాంకమంటే, ఒక్క విషయంగాని, విషయాంశంగాని గ్రహించి, పరిమిత పాత్రల- ఒకటి రెండు మూడుకు మించని పాత్రల- చిన్న పాత్రల నాటకమని, నాటకంలో భాగమని అనుకోడానికి అవకాశం ఉంది. ఇది నేటి ఏకాంకికకు పూర్తిగా భిన్నం- స్వరూపంలోను, లక్ష్యంలోను, కళాసౌష్ఠవంలోను.

"నేడు మనం గుర్తించిన ఏకాంకిక అనేది ఏ దృష్టితోను నాటకంలో ఒక భాగం అని చెప్పలేము. తద్విరుద్ధంగా పెద్ద నాటకంలో ఉండవలసిన అన్ని అంగాలూ ఏకాంకికలో ఉండవలసి ఉన్నది. ఏకాంకిక స్వరూపమేమో నాటకంకంటే చిన్నదిగా ఉండాలనేది నిర్వివాదమైన విషయం. మూడుగంటల సేపు తెర ఒక్కసారికూడ పడక - రంగస్థలంపై నడిచే నాటకాన్ని ఏకాంకిక అనలేము; పదిహేను నిమిషాలు మొదలు ఒక గంట (ఎక్కువయితే గంటంబావు) వ్యవధిలోపల ఏకాంకికా ప్రయోగం సమాప్తం కావాలి. ఈ అల్ప వ్యవధిలో ప్రయోగం సఫలంగా (అంటే ప్రేక్షకులను తల్లీనులను చేసి) సమాప్తం కావాలంటే, ఒక విశిష్టమైన కౌశలం ఉంటేనే సాధ్యం. పెద్ద నాటకాలలోవలె వివరాలు చెప్పడం సాధ్యం కాదు. అయితే ముఖ్యమైన వివరాలు వదలడానికి

పీలులేదు. పాత్రల సృష్టి పోషణలకు అవకాశం లేకపోయినా అవి సజీవంగా ఉండాలి. ఇతివృత్త విస్తృతికి అవకాశం లేకపోయినా ఆరంభంనుంచి సమాప్తి వరకు సంఘటన ప్రవాహం ఉండేతీరాలి. ముఖ్యమైన విషయ మేమిటంటే, ఏకాంకికా స్వరూపం చిన్నదన్నంత మాత్రాన ఆ ప్రయాణంలో పరిణామం లేక రసాస్వాదనం తక్కువైనా సాగిపోవడమని కాదు" అంటారు కన్నడ రూపక మర్మజ్ఞులు.

తెలుగు సాహిత్యంలో ఏకాంకిల ప్రాదుర్భావానికి కారణాలు రెండు : ఒకటి. పాశ్చాత్య సాహిత్య ప్రభావం, రెండు. నాటకాభిమానుల రసపిపాస. ఒకరకం ఏకాంకికలు గడిచిన శతాబ్ది ఉత్తరార్ధంలోనే బయలుదేరాయి. అప్పటి సుప్రసిద్ధనాటక కర్తలు కూడా నాటకాలకు ముందే ప్రహసనాలు వ్రాశారు. అవి ప్రదర్శితాలై ప్రజల మనస్సులనూ చూరగొన్నాయి. "ముఖ్యంగా పాఠశాలల్లోను కళాశాలల్లోనూ, తెనుగు ఉపాధ్యాయులూ అప్పుడప్పుడూ ఇతరులుగూడానూ, తరచు ప్రహసనాలు వ్రాసి విద్యార్థులద్వారా అందించడం పరిపాటి అయిపోంది." కాని ప్రారంభంలో అదొక విశిష్ట కౌశలంగల దృశ్యకావ్యమనే అభిప్రాయం రచయితలకు అంతగా కలుగలేదు. ఇంతలో భాసునిరూపకాలు ముఖ్యంగా మధ్యమ వ్యాయోగం వంటివి కేరళుల పుణ్యాన ప్రచురితమయ్యాయి. అవి మన పండితులను, పాశ్చాత్య విద్వాంసులను గూడ చకితులను చేశాయి. ఏకాంకికలు మనవేననే దొమ్మతో సాహిత్య నిష్ణాతులే ముందుకు వచ్చారు; ఏకాంకిలను ప్రాచ్యపాశ్చాత్య సత్సంప్రదాయ రీతులతో అలంకరించారు.

అలాటి మొదటివారిలో అగ్రగణ్యులు శ్రీ పి. వి. రాజమన్నారు గారని అనడం అతిశయోక్తికాదు; ఆయన ఏకాంకికలు ఈ శతాబ్దం మొదటి పాదంలోనే వెలువడ్డాయి. శ్రీ రాజమన్నారు పెక్కు సంస్కృతుల మిన్నేరు. పెక్కు విజ్ఞానాల మున్నీరు. ఆయన నాటికలు, నాటకాలు సంఘంలోని అపోహలకు గొడ్డలిపెట్టు : కళాపారమ్యానికి తేనెపట్టు. ఆయన తదితరుల ఏకాంకికలు పోసిన నారులు నేడు పసిడి పంట పండించాయి; పలువురు యువకులు ఈ సాహిత్య ప్రక్రియను విశిష్ట రీతులతో తీర్చి దిద్దుతున్నారు. అయితే మన ఏకాంకిక పెరగ వలసిన రీతిగా పెరగలేదని విమర్శించేవారు ఉండనే ఉన్నారు; బలపడడానికి ముందే బరువు మోసినందువల్ల వెన్ను వంగిపోయిందనేవారూ ఉన్నారు. అంత మాత్రాన దాని వివిధ రీతి వికాసం కాదనలేము. అది నేటి నాటక రంగాభివృద్ధికి చాల తోడ్పడడంకూడ నిరాకరించరాని సత్యం. దాని స్థానమానాల విషయంలో తీర్పుచేసే కాలమింకా చాలా దూరంలో ఉంది.

నాటకమైనా, నాటిక అయినా, ఏకాంకిక అయినా— ప్రజల హృదయాలపై దాని రాజ్యం అతి ప్రాజ్యం. కాళిదాసు అన్నట్లు "నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధాప్యేకం సమారాధనం."

# కర్ణాటక భాషాభూషణం కేతన అనుసరణ

కొందరిదొక ఉత్తమ మనఃప్రవృత్తి: ఏ రమణీయ వస్తువును చూచినా స్వాయత్తం చేసుకొందామని చేయిచేసుకోక అలాటిది తమ పరిసరాలలో సృష్టించుకొని సంతసిస్తారు. కృష్ణరాయడు కళింగ గజపతిని గజిబిజిచేసి, సింహాచలం దర్శించాడు. అక్కడి సౌందర్యము, గాంభీర్యం అతని మనసును హత్తుకున్నాయి. తన విజయనగరంలో ఉగ్రనరసింహుని మహామూర్తిని నిర్మించాడు. తిరువనంతపురం మనోహరదృశ్యం అనుదినమూ తన కన్నులపండువు చేయడానికి "అనంతశయనగుడిని" కట్టించాడు. కేతనది కూడా ఇలాటి ఉత్తమ ప్రవృత్తే.

కేతన కాలానికి మార్గ దేశిరీతులలో ఎంతో తెలుగు సాహిత్యం వెలసింది. తమకు గ్రామ్యమని తోచినవాటిని కొందరు వదలపెడుతున్నారు. కాని, దేశి కవులు—ముఖ్యంగా శివకవులు—ప్రజల నాలుకపై నిరంతరం నెలవుకట్టుకొని ఉన్న ముచ్చటైన పలుకుబళ్ళను స్వేచ్ఛగా వాడుతున్నారు. ఇప్పుడు కొన్ని ప్రాంతాల వాడుకలో ఉన్నట్టు వాండు, పేండ, పాంత, కూంతురు అన్న రూపాలు నన్నయ కాలానికే కొందరు వాడారు. "కూంతు సరియె వోల్ప గాంత లందు" అని దక్షారామంలోని సోమలదేవి శాసనంలోనూ కూంతు అన్న పదం ఎక్కిందన్నప్పుడు నిడుపులమీద నెరసున్నలుగల పదాలు అప్పటికి చాల వాడుకలో ఉండేవనే కదా! కాని, ఈలాటి కొన్నిమాటలు శిష్టవ్యవహారంలో ఉండలేదు కాబోలు! నన్నయాదులు, తదనుయాయులైన మార్గకవులు వాటిని గ్రంథస్థం చేయలేదు. ఈ ఉభయ పక్షాల ప్రయోగాలకు సామరస్యం చేకూర్చి భాషను వ్యాకరిద్దామనుకున్నాడు కేతన.

పొరుగునఉన్న కన్నడ తమిళ దేశాలలో అప్పటికే భాషను పలువురు వ్యాకరించారు. తనేమో సంస్కృతాది భాషా కావ్య కర్తృత్వమున నుతిగన్న" వాడు (దశకుమార చరితము 1 — 28). కన్నడంలో తనకు దాదాపు నూటయాభై సంవత్సరాలకు ముందే 'కర్నాటక భాషా భూషణం' అనే వ్యాకరణం ఉండటం చూచాడు; పాణినీయ పరిభాషలో నడిచే ఆ కర్నాటక భాషా

భూషణం సూత్రపద్ధతిని పరిశీలించాడు; దాని జిగీ, బిగీ తనకు నచ్చాయి. దానిని రచించినవాడు ద్వితీయ నాగవర్మ. ఇతడు మొదట వేంగీ విషయంలోని వేంగీ నగరవాసి. జైనమతానుయాయి. వేంగీ విషయంలో రాజకీయ కల్లోలం ఏర్పడగా కన్నడదేశానికి వలసవెళ్ళి తుంగభద్రా తీరంలోని పొళలు (ఇప్పటి హొళలు) పట్టణంలో స్థిరపడ్డాడు. ఇతని తక్కిన రచనలు కావ్యాలోకన, ఛందోంబుధి, వస్తుకోశ, కాదంబరి. వీటి నన్నిటినీ కేతన చూచాడో లేదో గాని కావ్యాలోకన అనే లక్షణ గ్రంథాన్ని మాత్రం చూచాడనే నా నిశ్చయం. తెనుగు కన్నడాల చుట్టరికం ఈనాటిది కాదు. అభివృద్ధి పొందిన పరిసర భాషా సాహిత్యాల ప్రాభవం మరొక భాషపై పడటం కూడా తప్పదు గదా!

అంతేకాదు! కావ్యాలోకనం సూత్రీకరణ పద్ధతి కేతనకు మరీ బాగుం దేమో! దీనిలో సూత్రాలు కందాలలోను, ఉదాహరణలు ఇతర పద్యాలలోనూ ఉన్నాయి. కనుక సంస్కృత వ్యాకరణ పరిభాష ప్రసక్తే లేక సుబోధంగా తెలుగుకు లక్షణం చెప్పదలచాడు. ఈ కన్నడ లక్షణ గ్రంథాలు సహాయాలుగా ఉండనే ఉన్నాయి. అందువల్లనే తేటమాటలతో శాస్త్ర చర్చ కొనసాగించాడు.

ఇంతవరకూ తెలుగుకు వ్యాకరణం లేదా? నీవెవడవోయ్ వ్యాకరించ డానికి? నీ అధికారమేమిటి? - అని ఎవరైనా ప్రశ్నిస్తారేమోనని తన అర్హతను ఇలా చెప్పుకున్నాడు :

"వివిధ కళా నిపుణుడ నభి
నవదండి యనంగ బుధజనంబుల చేతన్
భువి బేరు గొనినవాడను
గవి జనమిత్రుండ మూలఘటికాన్వయుడన్"

"ఖ్యాత శుభ చరితుడను వృష
కేతన పాదద్వయీ నికేతను డనగా
గేతన సత్కవి యనగా
భూతలమున నతిశయంబు బొందినవాడన్."

ఇంతమాత్రమే కాదు. తనకొక పెద్ద 'సర్టిఫికెటు' చాలా పెద్దవాడు ఇచ్చాడని సగర్వంగా చెప్పుకొని మురిసిపోయాడు.

"కవితజెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతడు మెచ్చ
బరగ దశకుమార చరితంబు జెప్పిన
ప్రోడ నన్ను వేరె పొగడనేల?"

ఇంతకంటే ముఖ్యమైన అర్హత మరొకటిఉంది. అదేమిటంటే,

"మున్ను తెనుగునకు లక్షణ
మెన్నడు నెవ్వరును జెప్పరు"

ఇంత ధైర్యంగా కేతనవంటివాడు ఈ మాటను ఎన్ని గుండెలతో చెబుతాడు—మరొక వ్యాకరణం ఉండి ఉంటే? అదీని తిక్కన కాలంలో. కనుక,

"......ఏజెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చగ
నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్."

అని ఆదికవి అయిన నన్నయ్యను స్మరించి వ్యాకరణం వ్రాస్తానన్నాడు. ఈలాటి అవకాశం కలుగడం తన మహాభాగ్య మనుకున్నాడు:

"సంస్కృత ప్రాకృతాది లక్షణము జెప్పి
తెనుగునకు లక్షణము జెప్పకునికి యెల్ల
గవిజనంబుల నేరమిగాదు నన్ను
ధన్యుగావింప దలచిన తలఁపుగాని"

అని సంతృప్తిపడ్డాడు అప్పటికి మనసు కుదుటపడింది. పరిణతబుద్ధితో, ఎంతో ఆత్మవిశ్వాసంతో

"భాషావేదులు నను నివి
యా షణ్ముఖ పాణినులకు నగు నెన యని సం
తోషింప నాంధ్రభాషా
భూషణమను శబ్దశాస్త్రమును రచియింతున్."

అని వ్యాకరణం వ్రాయబూనుకున్నాడు.

నిజమే! "విద్వా నేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం." భాషా వేత్తలు పొగడుతారు కదా! ఇక సంకోచ మెందుకు? అయినా, కేతన తిక్కన వంటి మహోదాత్తుని సన్నిధానంలో ఉన్నవాడు! విద్య యొసగును వినయంబు. కనుక నమ్రతతో

"ఒప్పులు గల్గిన మెచ్చుడు;
తప్పులు గల్గిన నెరింగి తగ దిద్దుడు; త
ప్పొప్పనకు; డొప్పు తప్పని
చెప్పకుడీ; కవు లుపాస్తి చేసెద మిమ్మున్."

"గుణదోషంబు లెరిగి యిది
గుణ మిది దోషమని పూజగొందురు సుకవుల్;
గుణదోషము లెరుగక దు
ర్గుణముల్ గుణములని పూజగొందురు కుకవుల్."

అని ప్రార్థించాడు. అయినా, అసూయ అనేది అపరిణతచిత్తుల సహజ లక్షణం. వీడేమి చెప్పవచ్చాడులే—అని ఈసడిస్తారు అలాటి అపరిణతమతులు. కనుక వారిని ప్రత్యేకంగా మొక్కాడు:

"కొత్తగా నాంధ్ర భాషకును
గొండొక లక్షణ మిట్లు చెప్పె నే
యుత్తమబుద్ధి వీడ యని
యోరలు వోవక విన్న మేలు; మీ
రొత్తిన మీకు మారుకొని
యుత్తరమిచ్చుట చాల వ్రేగు; మీ
చిత్తమునందు నన్నెరవు
సేయకుడీ కవులార మ్రొక్కెదన్"

అని, తప్పులు ఎవరికైనా వస్తాయి. మహామహావాళ్ళకే వస్తాయి. నేనిది గొప్ప శబ్దశాస్త్రమని చెప్పుకోడం లేదు; ఇదిగిదిగో అని దారిచూపాను అంతే—అని మరొకసారి వినయ వినమిత మస్తకుడయ్యాడు!

"నేరములు కాళిదాస మ
యూరాదులకైన గలుగ నొరులకు లేవే?
సారమతులైన సుకవుల
కారుణ్యము కలిమి నేర్పు కవిజనములకున్.

"కంచి నెల్లూరు మరి యోరుగ ల్లయోధ్య
యను పురంబులపై గంగ కరుగు మనిన
పగిది నొకత్రోవ జూపెద బహుపథంబు
లాంధ్రభాషకు గలవని యరసికొనుడు."

కేతన మాటలనుబట్టి తెలుగులో తొలివ్యాకరణం ఆంధ్రభాషా భూషణమే అనుకుందాం. కన్నడ వ్యాకరణముద్ర మనసులో ఉన్నందువల్ల కాబోలు కేతన మార్గం కొంత వింతగానే ఉంటుంది. తెనుగును తత్సమం, తద్భవం, అచ్చ

తెనుగు, దేశ్యం, గ్రామ్యం—అని ఐదు విధాలుగా నిర్వచించాడు. అచ్చ తెలుగు విభాగంలో సర్వసాధారణ వ్యవహార రూపాలను, దేశ్యవిభాగంలో వ్యవహార చ్యుతమై సాహిత్యమాత్ర గతమైన తెమ్మెర, ఎలనాగవంటి వాటిని ఉదాహరించడం గమనార్హమైన సంగతి. కేతన ననుసరించే చిన్నయ సూరిగారు "సంస్కృత సమేతరంబగు భాష అచ్చ యనంబడు" అని లక్షణం చెప్పారు. కేతన నకారాన్ని నకారంగానే గ్రహించాడుగాని కళాద్రుత ప్రకృతిక విభాగానికి పోలేదు. చతుర్థీ విభక్తికి కొరకు అనే ప్రత్యయం చెప్పలేదు (కొరకు కై చతుర్థ్యాః స్తః—ఆం. చిం.). తృతీయా విభక్తిలో తోడ ప్రత్యయంకూడా చెప్పలేదు (తోడ సహార్థేలూనః—ఆం. చిం.). తెనుగును వికృతి అని వికారం కూడా చేయలేదు!

"తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును
దానివలన గొంత గానబడియె
గొంత తాన గలిగె నంతయు నేకమై
తెనుగు బాసనాగ వినుతికెక్కె."

అని ముద్దుగా చెప్పుతూ పోయాడు.

శివకవులు విరివిగా ప్రయోగించిన తింట, కొంట, వింట, అంట అనే ప్రయోగాలను కొన్నింటిని గ్రహించి నిష్పాక్షికంగా వ్యాకరించాడనవచ్చు. "మధుకైటభారాతిమరది రమ్మని పిలిచి పనిగొంట నీకు ప్రాభవము గాదె" అని శ్రీనాథుడు 'కొంట' ప్రయోగింపగా, అహోబల పండితుడు ఈ 'కొంట' గ్రామ్యమని నిరసించినా, రాఘవపాండవీయ వ్యాఖ్యాత ముద్దరాజు రామన్న తనకుసుందున్న అనంతుని ఛందస్సును, విన్నకోట పెద్దన్న కావ్యాలంకార చూడామణిని, తాతంభట్టు కవిలోక చింతామణినికాక, అతి ప్రాచీనమని నమ్మినందున ఆంధ్ర భాషా భూషణాన్ని ప్రమాణంగా గ్రహించారు.

కేతన కన్నడంలోని సృష్టిని చూచి తెలుగులో పునస్సృష్టి చేశాడనుకున్నాము గదా! దాని వివరాలు తెలుసుకుందాం. దానిలో మంచిని ఇతరుల పంచలనుండి ఎలా తెచ్చుకున్నాడో, గౌరవంతో తన గ్రంథానికి "భాషా భూషణం" అని ఎలా నామకరణం చేసుకున్నాడో స్పష్టమౌతుంది.

నాగవర్మ కావ్యావలోకనం ఐదధికరణాల లక్షణగ్రంథం. శబ్దస్మృతి, కావ్యమలవ్యావృత్తి, గుణవివేకం, రీతి, క్రమ రస నిరూపణం, కవి సమయం అనేవి ఆ ఐదు అధికరణాలు. వీటిలో మన వివక్షితం శబ్ద స్మృత్యధికరణం మాత్రమే ఈ అధికరణంలో సంధి, నామస్థితి, సమాన క్రమం, తద్ధితం, ఆఖ్యాతం అనే ఐదు అధ్యాయా లున్నాయి.

"...సంధి నామస్థితి వితతసమా
సక్రమం తద్ధితం వి
స్తరరూపాఖ్యాత మాఖ్యాతము మెనెదొరె వె
త్తయ్దు మధ్యాయవర్గం."

అని శబ్దస్మృత్యధికరణ ప్రారంభంలో చెప్పాడు నాగవర్మ. కావ్యాలోకనము లోని లక్షణాలు కందాలలోను, ఉదాహరణాలు ఇతర వృత్తాలలోను ఉంటాయని ఇదివరకే తెలుసుకున్నాము. ఇతడు తన కావ్యాలోకనంను

"కవిగళ్గిదు కైగన్నడి,
కవితెగె బాళ్మొద, లుదాత్తవాగ్దేవతె గు
ద్భవహేతు, కోశగృహమెనె
భువనదొ ళిదు సరెదు నిల్పుదొం దచ్చరియే?"

(కవులకిది చేతి అద్దం. కవితా జీవితానికి మూలం. ఉదాత్తవాగ్దేవతకు ఉద్భవ హేతువు. కోశగృహం వంటిది. ఇలాటిది విశ్వవ్యాప్తి చెందడం ఆశ్చర్యమా?) అని పొగడుకున్నాడు.

ఇక నాగవర్మ రచించిన కర్నాటక భాషాభూషణం పాణిని అష్టాధ్యాయి లాగ సంస్కృత సూత్రాత్మకం. ఇతడు అష్టాధ్యాయి సూత్రాలను - ముఖ్యంగా సంధి స్త్రీ ప్రత్యయాధికారాలలోని సూత్రాలను - యథాతథంగా అతికించుకున్నాడు తన గ్రంథంలో చిత్రంగా. ఈ సూత్రాల వివృతికూడా సంస్కృతంలోనే. పూర్వ కవులైన పంప, నయసేన, హరిపాలాదుల కావ్యాలనుంచి ప్రయోగాలు ఉదాహరించాడు. ఇది సంజ్ఞా, సంధి, విభక్తి, కారక, శబ్దరీతి, సమాస, తద్ధిత, ఆఖ్యాత, అవ్యయనిరూపణ, నిపాత నిరూపణ విధానాలనే పది పరిచ్ఛేదాలు గలది. ఈ కర్ణాటక భాషాభూషణం కావ్యాలోకనంలో ప్రథమాధికరణమైన శబ్ద స్మృత్యధికరణానికే విస్తరణమని పరిశీలిస్తే స్పష్టమౌతుంది. కావ్యాలోకనం సంధ్యధ్యాయం ప్రారంభంలో చెప్పిన శబ్దశాస్త్ర సంకేతాలు కర్ణాటక భాషా భూషణంలో "సంజ్ఞావిధాన"మని ప్రత్యేక పరిచ్ఛేదమైంది. రెండవ అధ్యాయం లోని నామస్థితికి విస్తరణమే కర్ణాటక భాషాభూషణంలోని విభక్తి, కారక, శబ్ద రీతి విధానాలనే మూడు పరిచ్ఛేదాలు.

కేతన సూత్రీకరణ పద్ధతిలోను, అధ్యాయ విభాగంలోను కావ్యాలోకనం స్మృత్యధికరణాన్ని, విషయ విస్తరణకు కర్ణాటక భాషాభూషణాన్ని అనుసరించినట్టు తోస్తుంది. కేతన అధ్యాయాలని ప్రత్యేకంగా విభజించకపోయినా, "అనంతరంబ సంధు లెరిగించెద, అనంతరంబ విభక్తులు చెప్పెద, అనంతరంబ సమా

సంబు లెరిగించెద, అనంతరంబ క్రియాపదంబు లెరిగించెద" అని వక్ష్యమాణ విషయ ప్రారంభంలో ఉపక్రమించాడు.

శబ్దస్మృత్యధికరణంలో అధ్యాయాలు ఐదు : సంధి (ప్రారంభంలోనే సంజ్ఞా వివరణ), నామస్థితి, సమాసక్రమం, తద్ధితం, ఆఖ్యాతం. ఆంధ్ర భాషా భూషణంలోని విషయ వర్గీకరణ తెరగిది: తత్సమ భాషా లక్షణాది సంజ్ఞా వివరణం, సంధి, విభక్తులు, సమాసాలు, తద్ధితాలు, క్రియలు. దీనిలో 161 వ పద్యంనుంచి 169 వ పద్యంవరకు గల తొమ్మిది పద్యాలూ తద్ధితాలకు సంబంధించినవి. ఇవి 136 వ పద్యం తర్వాత క్రియాపద వివరణకు ముందు ఉండవలసినవి. కాని లేఖక ప్రమాదంవల్ల క్రియాపద వివరణ మధ్య అసందర్భంగా వచ్చి పడ్డాయని అనుమానించడానికి అవకాశం ఉంది. తాళపత్ర గ్రంథలేఖకులు ఒక్కొక్కప్పుడు ఒక తాటాకును పొర్లించడానికి మారు రెండు పొర్లించడం, కొంత వ్రాసిన తర్వాత పొరపాటు తెలిసి, వెనుకటి తాటాకులోని దాన్ని కూడా హంసపాదు వంటిదేమీ లేక ఆ వరుసలోనే వ్రాయడం తాళపత్ర గ్రంథ పరిశోధకులకు అనుభవవిదితం. (సారంగధర చరిత్రలో ఈలాటి లేఖక ప్రమాదంవల్ల కలిగిన రెండు పద్యాల పౌర్వాపర్యాన్ని శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు నిరూపించడం పండితులకు విదితమే.)

కర్నాటక భాషా భూషణానికి, ఆంధ్ర భాషా భూషణానికి గల రచనా క్రమ సామ్యాన్నిబట్టి కేతన కర్నాటక భాషా భూషణాన్ని, కావ్యాలోకనాన్ని ఎదుట పెట్టుకొనే తెనుగులక్షణం చెబుతూ-వచ్చాడా అన్నంత ఆశ్చర్యం కలుగుతుంది. స్థాలీపులాకన్యాయంగా అనుకరణ లివి :

(1) ఆదులు స్వరములు నచ్చులు
కాదు లొగిన్ వ్యంజనములు హల్లులు ననగా
మేదిని నెల్లెడ జెల్లును,
కాదులు నెదైదు కూర్పనగు వర్గంబుల్

ఆం పద్యం - 15

అకారాదయః ప్రసిద్ధావర్ణాః, క. భా. సూత్రం-2
కాదయః త్రయస్త్రింశద్వ్యంజనాని. ,, ,, 6
వర్గాస్తే మాంతాః పంచ పంచ పంచ ,, ,, 7

ఎద్దె కకారది రిర్ప
త్తదయక్కరమెద్దు వన్నెగం పరివిడియిం
దద్దయ్య గెయ్ద వర్ణది
నయ్దుంవర్గంగళక్కు ముళిదు దవర్గం

కా. శ. (పద్యం—12) సూ-1

మనకు దంత్య చ జకారాలున్నాయి; కేతన అనుసరణ ప్రవాహంలో కొట్టుకొనిపోయి కన్నడంలో "ఆద్యయ్దు గెద్యు వర్గది నయుం వర్గంగళక్కుం" అన్న విధంగా "ఐదైదు కూర్పనగు వర్గంబుల్" అన్నాడు.

(2) మొదలి పదము తుదివర్ణము
వదలక పైపదము మొదలి వర్ణముతోడం
గదియగ సంధులు నాదగు
విదితపు తత్సంధు లెల్ల వివరింతు దగన్.

ఆం. పద్యం—43

పరస్పర సన్నికర్షస్సంహితా. క. భా. సూత్రం—17

సంధౌ : క. భా. సూత్రం — 18.

స్వరేస్వరస్వలోపః క. భా. సూ. — 19. వివృతిః — స్వరేపరతోవ స్థితే పూర్వ స్వరస్య లోపో భవతి.

(3) అచ్చుగ బెరయచ్చులపై
నచ్చు యకారంబు దాల్చు నబలా యేతే
యిచ్చ యపూర్వ మొకో యిది
యచ్చెరువై యునికి నా నుదాహరణంబుల్.

ఆం. పద్యం—48

అ ఈః వర్ణైకా రేకా రేభ్యో యః క. సూ. — 22

(4) అనంతరంబ విభక్తులు చెప్పెద...

ఆం. వచ - 67

తతో విభక్తయః క. 39

(5) నెల నెలలన దల తలలన
జిలుక చిలుకలనగ జగతి జెల్లుటవలనన్

ఆం. పద్యం → 68

మమిన్కు యరదోళ్. క. సూత్రం — 40

ప్రయోగః నెల—నెలనం—నెలనిం—నెలక్కె—నెలద త్తణిం—నెలద —నెలదోళ్.

(6) గురునికి గురునకు ననగా
బరగగ బాలునికి ననగ బాలున కనగా
గరగకు గొరవకు ననగా
దరమున కురమునకు నా నుదాహరణంబుల్.

ఆం. పద్య - 85

ఉకారాంతా తృతీయాది ష్వినాగమో భవతి. క. సూ - 55 ప్రయోగః గురువినం నీతియజ్ఞం - గురువిమతం.

(7) కరివచ్చెన్ గరినెక్కెను
గరిచేతం జచ్చె గరికి గవణము వెట్టెన్...

ఆ. పద్యం - 97

అన్యస్మాల్లోప; క, సూత్రం - 47. వివృతిః అనకారాంతాల్లింగా దుత్తరస్య ప్రథమావిభక్తేః ఏకవచనస్య లోపస్స్యాత్. హరి, కరి...

కరియివు కరియల్లివు గిరి
గిరియల్లివు కరి కరీంద్రమల్లిమ గిరిపో

కావ్యాలోకం - 148

(8) సమ్ముఖంబు సేయునది సంబోధనంబునగు...

ఆం. వచ - 67

సంబోధనేచ, సంబోధన మభిముఖీకరణం. క. సూ - 77

(9) దేవా మాచే నాకున్
నా వలనన్ నాధనంబు నాయందనగా
దేవా మాచే మాకున్
మావలనన్ మాధనంబు మాయందనగన్.

ఆం. పద్యం - 108

దీర్ఘోక్తి ర్నయసేనస్య. క. సూ - 74. సంబోధనార్థే వర్తమానస్య సర్వస్యాపి శబ్దరూపస్య నయసేన మునే ర్మతే దీర్ఘో భవతి. దేవాబిన్నపం, దేవ బిన్నపం.

(10) ఒడయండుషష్ఠీ...

ఆం. వచ - 67

స్వస్వామి సంబంధే షష్ఠీ క. సూత్ర - 67
ప్రయోగః ఎన్నొడ నాడెరెయుం.

(11) యుష్మదస్మత్పదంబు లెరిగించెద.

ఆం. పద - 104

ఎలమి నీవు మీరు నే నేము ప్రథమలు
నిన్ను మిమ్మ నంగ నన్ను మమ్ము
నన ద్వితీయలయ్యె నని యుష్మదస్మత్ప
దములు దెలియ నూత్నదండి సెప్పె. 105

నీ మీలకు నా మాలకు
ధీమహితా వరుసతో దృతీయాదులయం
దేమరక చేతనాది
స్తోమం బిడ నేక బహువచోనియతి యగున్. 106

నీంనాతాన్ప్రథమావిభక్తౌ క. సూ - 99

విన్వనతనా శ్చతుర్థ్యాస్తృతీయాత్వం చ స్యాత్ క. సూ - 100

ద్విబహ్వో ర్నస్య మః. క. సూ - 101

నీనాం తానెనికుం ప్రథ
మానిర్దేశక్కె నినగె యనగె తనగె యెం
బీనుడి చతుర్థియొళ్ సలె
తానక్కుం యుష్మదస్మ దన్యోక్తిగళోళ్. కావ్యాలోకన - 152

(12) లలి నేకాక్షర పదములు
వెలిగా దక్కిన పదముల వెలసిన తుదియ
చ్చుల నిడుపు లుడుప దెనుగగు
నిల నెప్పటి యట్లయుండు నీ యంతంబుల్. ఆం. పద్యం-30

స్త్రీయన ధీయన శ్రీయన
నీ యేకాక్షరపదంబు లీక్రియ జను గౌ
రీయన గౌరియగున్ వా
ణీయన వాణియగు మణి మణీయనుచోటన్ -31

ఈదూతౌ హ్రస్వేచ. క. సూత్ర-108

నైకాక్షరపదే. క. సూత్ర-109

ఆ ఈ ఊ ఇత్యేకాక్షరం యత్పదం తస్మిన్నే తేషాం హ్రస్వోన భవతి. ఉ-జ్యా-శ్రీ-హ్రీ-భ్రూ.

ఆ కారక్కె లఘూకృత
మేకారం బహుళ మక్కుమీ ద్మూ దంత
క్కేకాక్షర పద ముళియె ని
రాకుళదిం హ్రస్వమక్కు మెల్లదెళోళం. కావ్యాలోకన-39

(13) అనంతరంబ సమాసంబు లెరిగించెద. మొదటి పదంబు విభక్తుల బుచ్చి మీది పదంబులతోడ సమ్యక్సంసక్తంబు లగుటంజేసి సమానంబులయ్యె...
ఆం. వచ-109

తత్రాంతర్వర్తిన్యో విభక్తయో లోప్యాః. క. సూ-132

(14) సమాసాలకు లక్షణం చెప్పడంలో కేతన కావ్యాలోకనాన్ని అనుసరించి నాలుగు భేదాలను-పూర్వ, ఉత్తర, అన్య, ఉభయ పదార్థ ప్రధానాలని మాత్రం-తెలిపాడు. తత్పురుష, ద్విగు అనే పేర్లతో గ్రహించలేదు.

(15) నడురే యెడకాలు... ఆం. పద్యం-110
మేగాల్ క. సూ-189 ప్రయోగం

(16) ఎలమావిమొక్క కెంజిగు
రలరమ్ములు నాగ నివి యుదాహరణమ్ముల్. ఆం. పద్య-112

స ఏవైకాశ్రయః కర్మధారయః, క.సూ-134. కెందావరె, కెందళం.

(17) పేరనియెడు శబ్దం బే
పారం దెనుగులకు మొదల నధికత దెలుపున్
బేరాకలి పేరామని
పేరాముదపాకు లనగ బేరింపనగన్. ఆం. పద్యం-126

ఇకారస్యేద్ధిస్వకః. క. సూ-143 పెర్మరం, పెర్బావు.

ఉత్తరపదం విశేష్యదొ
ళొత్తరిసిరె పూర్వపద దుపాంత్యస్వరదిం
దత్తిర్దు వల్కె లోపం
మత్తమికారక్కె బహుళ మక్కు మెకారం కావ్యాలోకన-26
పెర్మరన నదర్ద వనలతె
కార్ముగిలం తళ్తమించు వింధ్యాచలమం. కావ్యా-217

(18) తెనుగు పదంబులపై బెం
పొనరగ సంస్కృతము చెల్లు నొక్కొకచోటన్
మును సుకవీంద్రులు కృతులన్
బనికొని రచియించినట్టి పరిపాటిమెయిన్. ఆం. పద్యం-132

సమసంస్కృతం దేశీయపదేన సమస్యతే. క. సూ - 139
బెరసి సమసంస్కృతంగళ్
బరె కన్నడదొళగె సమతెయిందం సల్గుం
నిరవద్యమాగి పదవిధి
విరుద్ధమక్కుం తదన్యథావృత్తిగళోళ్. కావ్యా-282

(19) ఏకపదముపై గాడు నేర్పెల్లదెలుపు
గొనబుకాడు బలిమికాడు కొంతెకాడు
చనవుకాడు చెలిమికాడు జాడగాడు
బందికాడన నెల్లెడ బరగుచుండు.
ఆం. పద్యం - 161

వ్యావృతే ప్రవణే చ కారః. క. సూ - 177. క్వచి ద్వ్యాప్తే వ్యాస క్తేచ వాచ్యే కారప్రత్యయః. ఆటగారం, ముండుకారం, బిల్కారం.

(20) అత్, ఇత్, ఉత్ - మొదలయిన సంస్కృత వ్యాకరణ సంజ్ఞ లుండగా, కేతన అఙ్, ఇఙ్, ఉఙ్, ముఙ్, డుఙ్ అని ప్రత్యయాలు చెప్పడం కూడ కన్నడ వ్యాకరణంలో కనిపించే రేఫాంత కృత్తద్ధిత ప్రత్యయాల అనుసరణే అని అనుకుంటాను.

తద్ధర్మార్థకాలం తెలుగుభాషకు విశిష్టం. కేతన కన్నడ వ్యాకరణాన్ని అనుసరించడంవల్ల తద్ధర్మార్థ కాలం మరచిపోయాడేమో!

కళాద్రుత విభాగం కన్నడంలో లేదు. కనుక కేతన సూత్రీకరించలేదను కుంటాను.

ఈ అనుసరణలన్నీ కాకతాళీయం అనడానికి అవకాశంలేదు. కన్నడం భాషాంతరం గనుక, కన్నడ వ్యాకరణాలు తన ప్రయత్నానికి ప్రేరకాలు మాత్రమే గనుక వాటిని పేర్కొనడం అవసరమని కేతన భావించి ఉండడు

(మన ప్రాచీనకవి పండితులందరూ ఇరుగు పొరుగు భాషలను పెక్కు తెలిసిన వారే. అందులోను కేతననాటికి జైనసంప్రదాయం, తద్వారా కన్నడ సాహిత్యం విద్వాంసులకు పరిచిత ప్రాయాలే). వాటినిచూచి మన ఇంటినికూడ చక్కబెట్టు కొన్నాడు. కనుకనే

తెనుగునకు లక్షణము భువి
సలవడుక్రియ దండి జెప్పె నభిదానములో
పల జెప్పిన క్రియలన్నియు
దెలియుడు సత్కవులు మేలు దేటపడంగన్."

అని సత్కవులను అభ్యర్థించి తన లక్షణం ముగించాడు. ఇది ఉత్తమ ప్రవృత్తి కాదూ!

* * *

(దాదాపు ముప్పై సంవత్సరాల క్రితం శ్రీ ప్రభాకరశాస్త్రిగారి గోష్ఠిలో ఆంధ్రభాషాభూషణం ప్రస్తావన వచ్చింది. "కర్నాటక భాషా భూషణం నామసా దృశ్యాన్నిబట్టి ఏవైనా పోలికలుంటా యేమోనండి!" అని విన్నవించాను. "పరిశీలించవలసిందే. మన ప్రాచీనులందరూ కన్నడాది భాషలు వచ్చినవారే" - అన్నారు శ్రీ శాస్త్రిగారు. తర్వాత పరిశీలించగా ఈ పోలికలు కనిపించాయి, నా దురదృష్టంవల్ల శ్రీ శాస్త్రిగారికి దీనిని నివేదించే సదావకాశం లేకపోయింది. పండితులు దీనిని పరిశీలించ గోరుతున్నాను.)

# ఎసగు - ఒసగు

'ఎసగు' 'ఒసగులు' అరసున్నలతోనే నేఁటి పండితుల యెఱుకలో నున్నవి. నడిమి కాలపు లాక్షణికులును వానిని సబిందుకము లనియే తలఁచిరి. శబ్దరత్నాకరకారులుగూడ నట్లే తమ నిఘంటువునందు గ్రహించిరి. శ్రీ ప్రభాకర శాస్త్రిగారును తమ బసవపురాణ పీఠికయందు ౧౯౨౬ సంవత్సరమున

'జగతి పద్మపురాణ సంహితలం దె
సఁగె శంభురాఘవ సంవాదమునను'

అను ద్విపదను సోమనాథుని సార్థబిందు నిర్బంధు ప్రాసమున కుదాహరణముగాఁ జూపిరి. నేఁడు వఝ్జల చిన సీతారామస్వామి శాస్త్రిులుగారును తమ 'వీరసింహుఁడ'ను నవ్య కావ్యమునందట్టి ప్రాసయతులఁ బ్రయోగించి 'ఖండాఖండప్రాసము మహాకవి సమ్మతము. ఉదా: భారత. ఆశ్రమవాస, ౨ ఆ. ౧౨౧ ప

క. తగునాకురు వృద్ధునకు నొ
సఁగె నాటికి దివ్యదృష్టి."

అని ప్రమాణముఁ జూపిరి *

సార్థబిందు నిర్బంధు ప్రాసము మహాకవి సమ్మతమగుట సరియా యని నేను శ్రీ ప్రభాకరశాస్త్రిగారి నడిగితిని.

"బసవపురాణ పీఠికయందు పై ప్రాసమును సోమనాథుఁడు ప్రయోగించె ననుటకు సాధనములలో నొకదానినిగాఁ బూర్వోదాహృత ద్విపదను నేను జూపితిని. అప్పటికి నాకది సందేహమును గొల్పుచునే యుండెను. తర్వాత భారతమునుఁ బరిశీలించుటలో నీ క్రింది ప్రయోగములు దొరకినవి.

క. బిగువెడలక నిలిచిపడున్
నగమయి వేతసచయంబు నమ్రంబై పె
ల్లగు మావేగము గడపియె
సఁగుపూర్వస్థితిన బ్రదుకు సమకూరంగన్.

భా. శాంతి. ౩ ఆ. ౮౯.

---

* వీరసింహుఁడు, 34 వ పుట.

క. తగునా కురువృద్ధునకు నొ
నంగె నాటికి దివ్యదృష్టి సాత్యవతేయుం
డగణిత తపః ప్రభావం
బు గని యధికవిస్మయంబు బొందగ జనముల్.

ఆశ్రమ. ౨ ఆ. ౧౨౦ ప.

తిక్కనగూడ నిట్లు 'ఎసగును' దానివంటిదే యగు 'ఒసగును' సార్ధ బిందుక నిర్బిందుక ప్రాసమునఁ బ్రయోగించుట నాకు మరింత వింతను గొల్పినది. ప్రాచీన తాళపత్ర ప్రతులతోఁ బెక్కింట నీపదములు సబిందుకములు గనే యుండుట గమనించితిని. కాని నేను శాసనపద్యములు సేకరించుచు శాసన బింబములఁ జూచునపుడీ శబ్దములర సున్న లేనివిగనే పెక్కుచోట్ల నగపడెను. అట్లు నిర్బిందికముగా పై శబ్దములఁ జూపు శాసనములఁ గొన్నింటి నొసగుదును చూడుము" అనివారు వ్రాసియుంచుకొన్న పద్యశాసనములఁ గొన్నింటిఁజూపిరి. వానినే క్రింద పొందుపఱచుచున్నాను.

* ౧. పెరవలి శాసనము

(South Indian Inscriptions No. 664 of 1920).

సీ. వననిధివేష్టితావనిలోనంగల యగ్ర
హారంబులకు మణిహార లీల
మానైన పెరువలి మాధవ దేవర
కెత్తించె గుడిభక్తి యెనగం గొమ్మ
మాంబిక తత్పూనుండగు చోడదండేశుం
డద్దేవునకు నివేద్యమున కత్తిన్

* ౨ ద్రాక్షారామభీమేశ్వరాలయశాసనము

(S. I. I. Vol. IV, No. 1061)

శకము ౧౦౭౧,

ఉ. అంబుజగర్భున్ వంశమణి
యైదయం బట్టపుమెట్ట యగ్రహా
రంబుగనిచ్చి యంధ్రయుడు
రాజశిఖామణికిన్మరున్నివా

* ౨, ౬, ౭, ౮, ౯ శాసన పద్యములు శాసనపద్యమంజరిలోఁ గూడ గలవు.

నంబెనగంగ నిల్పి విల
సన్మతి నొప్పిన దండనాథర
త్నంబగు నాగదేవ విబు
ధస్తుతుతముడు ప్రోలణ్ణున్నతిని.

౩. నాదెండ్ల శాసనము
(No. 830 of 1919. శకము ౧౦౭౮)

చ. అనుపమ కీర్తిన్ మూలఘటి
కాంబరుహాంబుజ మిత్రుణ్ణుంబుజా
సనకులుండన్వయాన్న న్వ వి
శాల సుధాఘృణి యట్టివానికిని
మనుమండమాత్యవేముని కు
మా[రరికివాజ్ని]భసూరమాంబ్బకుం
బెనుపెనగను జనించె రిపు
బేక ఫణీంద్రుండహార్యధీరుండు.

౪. ఏలూరు శాసనము (శకం ౧౧౦౩)

క. నరసిపురి మంత్రి మాదము
వరభూమిని నాచమాంబ వనజాక్షునకున్
ధరంబెట్టె సంధ్యదీపము
హరయనక భేందు శశికాబ్దములెనగన్.

౫. కొమ్మూరిశాసనము (శకము ౧౧౬౬
No. 826 of 1922)

సీ. శ్రీ(ర?)యుతమైన కొమ్మూరి యగస్తేశ
విభునకు జీవంబు విస్తరిల్ల
నెనగు దీపావలి వసుధలోం బంచన
గస్తీశ్వరస్వామి కర్థితోడ

౬. తాళ్ళ ప్రొద్దుటూరి శాసనము

సీ. ఏనుకతలలలో నెనగిన ముత్తియం
బులుం గుంకుమాక్షతంబులుగం బోసి

౭. ఉప్పరపల్లె శాసనము (శకము ౧౧౫౭)

క. చరణ సరోరుహరాగ [సంధ్యా
స్ఫురణన్ మహిషునిశిరంబు వొలుపుగ
భ్రరుచి నెనయ మెట్టిన స
త్కరుణాన్విత దుగ్గిన్ వరము గాట య గొస్సగున్. *

౮. గణపేశ్వర గ్రామ శాసనము (శకం ౧౨౩౧)

(S. I. I. Vol. IV No. 952)

"స్వస్తిసమస్త రాజన్యచూడామణి
కిరణరంజిత పాదసరసి జాతుం
డగు కాకతియ్య ధరాధీశ శ్రీవాకి
లికి సంగరక్షయై ప్రకట శౌర్యన్
ధనుండనంబరగి యమ్మను జేంద్రుడుం డొనగిన

౯. పైశాసనముననే మరొకచోట
"యింటినొనగి పెయ్యలేంభది వెరసినూ"

క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దపు ప్రారంభమునుండి పదమూడవ శతాబ్దము తుదిదాఁక(గల పై శాసనముల యందు పయిశబ్దములు నిర్బిందుకములు గనే కలవు. కాని, శ్రీనాథుడు తన హరవిలాసమున,

ఉ. ఇంటికిదెచ్చి యోగి పర
మేశునకున్ వణిజుండు తాను వా
ల్గంటియు భక్తియున్ భయము
గౌరవము న్వినయంబు నాత్మలో
నంటుకొనంగ నప్డు ముస
లమ్మకు సైతము కమ్మనూనె మై
నంటి నలుంగుతో జలక
మార్చియొసంగిరి ధౌతవస్త్రముల్.

---

* ఇచట శ్రీజయంతి రామయ్యపంతులుగారు (శాసన పద్యమంజరియందు) శాసన ప్రతిబింబములో లేకున్నను దాము కుండలీకరణమున నున్న జేర్చినారు.

అని 'ఒసగు'ను సబిందుకముగానే ప్రయోగించినాఁడు. ఈ పాఠము వ్రాయస కాండ్ర ప్రమాదమున వచ్చినదేమో యని కొట్టివేయుదమన్న శ్రీనాథుడు స్వయముగ చెక్కించినదని తలఁపబడుచున్న పద్యశాసనమందుఁ గూడ నిట్లే యున్నది.

"ఈ గ్రామములు మూఁటికెల్ల కాలంబు భో
గైశ్వర్యసవన్ మాన్యతల నొసంగె *

వయి ప్రయోగములనన్నింటిని బరిశీలింపఁగా నీశబ్దములలో శ్రీనాథుని కాలము వఱ కరసున్న లేమియు, శ్రీనాథాదులకాలమునఁ గలిమియు తోఁచుచున్నది.

కాని యాఱవ శతాబ్దమువాఁ డగు పింగళి సూరనగూడ 'ఎసగు' నందు బిందువు ప్రాచీన ప్రయోగములందు లేకుండుట గమనించియే రాఘవపాండవీయమున శ్లేషయందు

మ. స్వనిదేశోన్నతినంతటన్ నెఱయుచున్
శక్తిం జతుర్దిక్షు రేం
ద్రనికాయంబును గెల్చి తమ్ముల సమా
న ప్రాప్త విత్తార్పణం
బునదన్నన్ వశులైన బ్రాహ్మణులతో
పూర్ణాధ్వరారంభుడై
యనఘ శ్రీపృథివీశుఁ డొప్పె నగ రూ
డా పూర్వ సత్కీర్తితోన్.

అని నిరనుస్వారముగనే ప్రయోగించెను. తరువాతి వ్యాఖ్యాతలు 'ఎసగు'నందు బిందు వున్నదను భ్రాంతితో "రామాయణార్థమున "ఒప్పెసగున్" అనుచో సకారోత్తరార్థానుస్వార విశిష్ట రూపంబును, భారతార్థమున 'ఒప్పెన్ + సగురూఢాపూర్వసత్కీర్తితోన్' అనుచో నర్ధానుస్వార రహిత రూపంబును గూర్చునెడ సమాధానంబు గల్పనీయఁ"బని వ్యాఖ్యమొనర్చుచు "శ్లేషే సఖండనిర్బిందోర్వైకశనం కుత్రచిన్మత"మ్మని లక్షణ వాక్యమును నుడిపెట్టిరి. ఇట్లే "ఒప్పెనగు రుచిర యశో మహోదయతను" యను చోటను.

ఎసగు ఒసగులతో ననుస్వారము నర్వాచీను లుంచుటకు వీనితో సారూప్యము గల పొసఁగు ఆదినుండియు సానుస్వార మగుట కారణము కావచ్చును.

---

* శాసనపద్యమంజరి ౯౦ వ పుట.

"సంధికినేగి కార్యము పొసంగగ కృష్ణుని రాకయున్".

భారత. ఉద్యో. ౪ ఆ.

ఎసగు ఒసగుఁ కుం బోలె చీకటి, తీగ, డాగు, దాచు, పీపు మొదలగు వానియం దరసున్న యిటీవల వచ్చినది. వీనియం దన్నిట నరసున్న గలదని యప్పకవి తప్ప నుదాహరించినాఁడు.

మరియు నిట్లే 'ఏగు' మొదలగువాని యందున్న సున్న యిటీవల లోపించి నది. ప్రాచీన ప్రయోగముల 'నేఁగు' నం దరసున్న యుండుట గమనించియే సూరన రాఘవ పాండవీయమున,

క. విని యతనిం దనపై నిడు
కొని యేఁగి నియమికిందగని ఘోరా యొన
ర్చినవాఁడ మీకు దండ్యుఁడ
నని తనుఁదెలుపుచును వారి కప్పన జేసెన్.

అని ప్రయోగించెను. 'ఏఁగు'నం దరసున్న లేదన్న తలఁపున వ్యాఖ్యాతలు రామాయణార్థమున ఏగి + నియమికిన్ అనియు, భారతార్థమున ఏన్ + కినియ మికిన్ అని బేదము సరిపడుటకై 'శ్లేషేఖసండే' త్యాది లక్షణమునకుఁ దావొసగిరి.

కవిలోక చింతామణిలో తాతంభట్టు-

క. 'వాఁగుదరి కేఁగి యుయ్యేల
లూఁగెడు గోపికల గుబ్బలొగ్గిబిగియరతిన్
దోఁగుచు దొంగతనంబున
నేఁగితి వన నర్ధబిందు లిల నివి కృష్ణా.'

అనెను.

కాన పయి శాసన ప్రమాణములవలన 'ఎసగు ఒసగు' లందు సున్న లేకుండుటయు, సార్ధబిందు నిర్బిందు ప్రాసము భారతకవిసమ్మతము గాకుండు టయు రాద్ధాంతిత మగుచున్నది గదా!

# నవ కవులలో పాశ్చాత్యుల భావ చిత్రణ

ఆరు నెల్లో వీరు వారౌతారన్నది నానుడి—సావాసబలం అటువంటిది. ఇక రాజకీయ ప్రాబల్యమూ, సాహిత్య ప్రాచుర్యమూ గల భాషలను, జాతులను లోబరుచుకొనడంలో ఆశ్చర్యమేముంది? సహస్రాబ్దాలుగా ఇతర దేశాలతో—ముఖ్యంగా పాశ్చాత్య దేశాలతో— సంపర్కంగల భారతదేశం సంగతి వేరే చెప్పాలా? కౌటిల్యునికి ముందునుంచి మనకు గ్రీకులతో సంబంధం ఉంది. కాలయవనుని కథ చూస్తే అంతకుముందునుంచీ ఉందేమో! ఆ గ్రీకు నాగరికత నుంచే నేటి పశ్చిమావని కళా సంస్కృతి సభ్యతలను తీర్చుకుంది. మన గాంధార శిల్పం గ్రీకుల కళా ప్రాభవానికి లోనైన సంప్రదాయ మంటారు కళాభిజ్ఞులు. కాని, సాహిత్యంలో వారి ప్రభావం కొన్నిపదాల ప్రయోగంవరకే పరిమితమైంది.

తర్వాత మనకు కలిగిన సంబంధం ముస్లింలతో. మొట్టమొదట మన దేశానికి వచ్చిన ముస్లింలు "తురక్"లు. వారి సామ్రాజ్యం వెయ్యేళ్ళకు పైగా సాగింది కొద్దిగనో, గొప్పగనో. కాని, మతాలు వేరు కావడంవల్ల వారి సాహచర్యం భవన నిర్మాణాది వస్తువులలోను, చిత్రకళలోను ప్రతిబింబించినంతగా తాత్త్విక నిర్దేశం ప్రధానంగా ఉండే సాహిత్యంలోకి ప్రతిబింబించలేదు. ఢిల్లీ పరిసరాల వ్యవహార భాషగా ఉన్న హిందీశాఖ ఒకటి ముస్లిం మత రాజకీయ భాషలైన అరబ్బీ, ఫారసీల సంప్రదాయాలను పాటించి ఉరుదూగా అవతారం దాల్చి సూఫీ సిద్ధాంతం వంటి తత్త్వాలను చూపకపోలేదు. అయితే తక్కిన ప్రాంతీయ భాషల్లోకి కొన్ని పదాలను మాత్రమే ప్రవేశపెట్టగలిగింది ఇస్లాం. పరిపాలన మార్గంగా తెలుగులోకి చొచ్చుకువచ్చిన ఉరుదూ, ఫార్సీ, అరబ్బీ తుర్కీ పదాలూ ఎక్కువే— కాని సాహిత్యంలోకి వచ్చినవి చాల తక్కువ. వాటి జాబితా చెప్పడమేమంత కష్టంకాదు.

విదేశాలతో మనకు కలిగిన మూడవ సంబంధం ఆధునిక పాశ్చాత్య దేశాలతో. ఇది మున్నూరు సంవత్సరాలది. బుడతకీచులు మన దేశానికి ముందుగా వచ్చినా, తర్వాత ఒళాందులు(డచ్) వారిని అనుసరించినా, పిదప పరాసులు పయనమై ఏతెంచినా, హెచ్చు సంబంధం మనకు కలిగింది ఇంగ్లీషువారితోనే.

ఇంగ్లీషువారి పరిపాలన మత ప్రాతిపదికపై దేశంలో నడువలేదు—లౌకికంగా నడిచింది. వారి పాలనకు పునాది విద్యావిధానం. మెకాలే మాటలే దీనికి నిదర్శనం. కనుక ఇంగ్లీషు విద్య దేశంలో బాగా పాదుకొని, బలిసి, ఇరుదేశాలమధ్య రాకపోక లెక్కువై, సంస్కృతి సంబంధం పెరగను పెరగను మన ప్రాంతీయ భాషల్లోను, మన భావనా పద్ధతిలోను కళల్లోను వారిప్రభావం ప్రతిభాసించింది; ఇటీవల యాభై యేండ్లుగా, ఈ ఆంగ్ల ప్రభావం—పాశ్చాత్య ప్రభావం—తెనుగు కవిత్వంలో స్ఫుటంగా కనబడుతున్నదని చెప్పవలసి వుంది. కవిత్వం సంగతే ఎందుకు స్మరిస్తున్నానంటే తెలుగువారి విలక్షణత ఇతర ప్రాంతాల వారితో పోల్చినప్పుడు ఇతర కళలకంటే అందులోనే ఎక్కువ గనుక. వారి కవిత్వంలో ఒక భాగంగా ఉండే "భావ చిత్రణం" (Imagery) మన కవులను ఎలా ముట్టడి వేసిందో వివరించడానికి ముందు మనకూ, పాశ్చాత్యులకూ అలంకారిక సమయంలో ఉండే ఒకటి రెండు భేదాలను మనవి చేస్తాను.

కవిత్వం ప్రాణుల ప్రవృత్తి వీథులను అభివర్ణిస్తుంది. ఇది మనకూ, వారికీ సమానమే. కవిత యెందుకంటే ఆనందంకోసమంటాం మనం. ఆ ఆనందం మనకు రసరూపంగా ధ్యేయం. మన 'సహృదయుడు' పరగతమైన సుఖ దుఃఖాలను భావన చేసి, అనుభవించగల శక్తిలో సాత్త్వికుడు. ఈ సత్త్వ గుణాన్నే పాశ్చాత్యులు 'మనుష్య సహజమైన ఆసక్తి' (Human interest) అంటారు. కావ్య ఫలంగా మనం కోరేది సద్యఃపర నిర్వృతి రూపమైన ఆనందమైతే, వారు సుఖ సంవిద్రూపమైన అనుభవాన్ని (Pleasure) కోరుతారు. అది తాత్కాలిక చిత్త విస్మృతి రూపమని వారి నమ్మకం. మన ఆలంకారికులు ఈ తాత్కాలిక చిత్త విస్మృతిని చమత్కారమన్నారు. అయినా చమత్కారమే కావ్య ఫలమని గాని, నారాయణభట్టపాదు లన్నట్లు అద్భుత మొక్కటే రసమనికాని ప్రాస్థానికంగా మనవా రొప్పుకోరు. కేవలం చమత్కారం అవసరమనీ, రసానందమే శ్రేష్ఠమని, అది సుఖ దుఃఖాతీతమైన అఖండానుభవమనీ అంటారు. ఇంతకూ మన అలంకార శాస్త్రం పెరిగినంతగా పాశ్చాత్యుల అలంకార శాస్త్రం (Aesthetics) పెరగలేదనడం అంత సాహసం కాదు.

మరి కావ్య నిర్మాణాన్ని, దాని ఫలమైన రసానుభూతిని గూర్చి చర్చించే మన అలంకార శాస్త్రం "శాస్త్రం" అయి, నిష్కర్ష ప్రధానమైపోయింది. ప్రయోగించిన ప్రతి పదం, అలంకారం, గుణం, వృత్తి, రీతి, శయ్య, పాకం—అన్నీ రసోపస్కారాలు కావాలి. పాశ్చాత్యులలో రసచర్చ లేదు. కనుక, కావ్య నిర్మాణం విషయంలోను, కావ్యానుభూతి విషయంలోను ఇంత నిష్కర్ష కనిపించదు. ఆ కవులలో ప్రతివాడూ ఒక స్వతంత్ర మార్గంలో నడవడం

మామూలు. కాని, మహాకవులుగా పేరుపొందిన అచటి కవులుగూడ కావ్యనిర్మాణ వైచిత్రికి, రామణీయకానికి, తత్త్వదర్శనానికి, ఎక్కువగా ఉపకరించా రనడంలో సందేహం లేదు. మనం పాశ్చాత్యులకన్నా ఎక్కువ ప్రత్యయంతో వేదాంతశాస్త్ర విషయాల్లోను కాళిదాసాది మహాకవుల వాక్యాలను ఉదాహరించుకొని కావ్యాలకూ శాస్త్రప్రామాణ్యమిచ్చి గౌరవించుకున్నాము. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే పాశ్చాత్యుల కవిత్వంలో కవులకు 'స్వేచ్ఛ' హెచ్చని, మన సంప్రదాయ రచనల్లో కొంతవరకూ తక్కువ అని. ఇక భావ చిత్రణం సంగతి చూద్దాం.

మనకు నూజికిపైగా అలంకారాలున్నాయి. ఇంగ్లీషులోను ముప్పై దాక 'ఫిగర్స్ అఫ్ స్పీచ్' అనే పేరుతో అలంకారా లున్నాయి. కాని ఇంగ్లీషు కవిత్వంలోని 'భావచిత్రణ' (Imagery) అనేది ఈ అలంకారాలకు సంబంధించిందే అయినా, అంతమాత్రమేకాదు - కావ్య నిర్మాణంలో అలంకారాలకు ఉన్న ప్రాధాన్యం అంతాఇంతా కాదు. మనం కాళిదాసు గొప్పదనాన్ని స్థూలంగా ఉపమాలంకారంతో కొలిచినట్లుగానే, పాశ్చాత్యులలోనూ కవి అయినవాని నిర్మాణ మార్మికతను 'మెటఫర్' (Metaphor)తో కొలిచే అలవాటుంది; ఇంగ్లీషు కవిత్వంలోని ఈ భావచిత్రణ అలంకారాల్లో ఉపయుక్తమయ్యే సామగ్రికి సంబంధించింది. మనలో ఈ 'సామగ్రి' నంతా పరిశీలించి, రసోపస్కారాలైన వాటిని ఏరుకుని, జాతి గుణక్రియా విభాగంతో వింగడించుకొని అలంకారాలుగా తీర్చుకుంటాము అలా తీర్చుకొనే మన అలంకారాల్లో ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, దృష్టాంతం వంటివాటి సామగ్రికి సన్నిహితంగా ఉంటుంది పాశ్చాత్యుల భావచిత్రణ సామగ్రి. Image అనేది కవితలో ఉంటే దానిలో భావోద్వేగం, వైషయికత, చెప్పిన అభిప్రాయాన్ని టార్చిలైటు వేసి చూపినట్టుగా వెలుగుపూతలు పూసేశక్తి, ఒక సంవిధాన క్రమం ఉంటాయని పాశ్చాత్య కావ్యజ్ఞులు అనేమాట. 'ఇమేజెరీ' అనే మాటను భావన, మనఃకల్పనా సృష్టి, స్వకపోలకల్పన అనే మాటలతో వ్యవహరించవచ్చు. కాని, భావచిత్రణ, మనే రెండు మాటల కూర్పులో విశిష్టస్ఫోరకశక్తి ఉందని భావిస్తున్నాను. కనుక ఇమేజెరీని భావచిత్రణమనే సంకేతించుకుందాం. ఈ భావచిత్రణం ప్రయోజన మేమిటి? అదెన్ని రకాలు? అనే విషయమై పాశ్చాత్య విమర్శకులు ఏమంటారో చూద్దాం.

భావచిత్రణ మనేది స్థూలంగా ఐదు విధాలు. ఒకటి : చెప్పానంటే చెప్పానన్నట్టుగా ఉండవచ్చు (Conceit), దీనిలో సొగసుగాని, చెప్పిన అభిప్రాయం మరింతగా వ్యక్తీకరించే శక్తిగాని, వర్ణ్య వస్తుతాత్త్విక వివేచనకు, యథార్థ్య గ్రహణానికి తోడ్పడడం గాని వుండవు-ఇలాటి భావచిత్రణం అధమం - మన.

గుణీభూత వ్యంగ్యంలాగ - రెండు : అలంకార ప్రాయంగా ఉండవచ్చు (Ornamental). అంటే కావ్యగతమైన అర్థంతో సంవదించక ఏకదేశంగా వుండడం : సొగసు మాత్రం తప్పదు. మూడు : కవి చెప్పిన అభిప్రాయాన్ని వ్యాఖ్యానించినట్టుగా వెలుగు చిమ్మి దాని వ్యక్తీకరణకు తోడ్పడడం (Functional). నాలుగు : కావ్యం సృష్టిలోని ప్రవృత్తి రూపమైన యాథార్థ్యాన్ని (General Operative Truth) తెలియ జెప్పుతుంది. కనుక అలాటి దానిని పొదివిపట్టి ఉండడం. అయిదు : సకల సృష్టిలోను సంవిధాన పద్ధతి ఒకటి వుంది. దానికి సమగ్రత, అఖండత ఉన్నట్లే కావ్యంలోకూడా ఆ ప్రవృత్తి రూప యాథార్థ్యాన్ని చెప్పడంలో సమగ్రతను, అఖండతను సాధించి, ఆ విశ్వ సృష్టితో సంవదింప జెయ్యడం. ఈ భావచిత్రణం ఎంతవరకు సమగ్రంగా తెలుగులోకి వచ్చిందో పరిశీలించే ముందు ఆధునిక కవిత్వానికి, కవులకు, ఈ భావ చిత్రణ సామగ్రికి సంబంధించిన ఒకటి రెండు సంగతులు ఉట్టంకించవలసి వుంది.

కాల్పనిక కవితా ప్రస్థానానికి చెందిన కవులు (Romantic Poets) మొదలుకొని ఇమేజిస్టులు, ఇంప్రెషనిస్టులు, సింబాలిస్టులు, ఫ్యూచరిస్టులు, సర్రియలిస్టులు, డాడాయిస్టులు దాకా ఆయా ప్రస్థానాలకు చెందిన కవు లెందరో వచ్చారు. రాను రాను రచనలో ఈ భావచిత్రణ ప్రధానమైపోయింది. మరీ ఆధునిక కవిత్వంలో ఈ భావచిత్రణ ఏ ఉదాత్త ప్రయోజనాన్నీ సాధించలేక పోతున్నదని, సార్వకాలికమైన విషయాలను స్పృశించడం లేదని అచ్చటి సహృదయుల విమర్శ. అయినా భాష ఉన్నన్ని నాళ్ళు, కవిత్వమంటూ ఉన్నన్ని నాళ్ళు ఈ భావచిత్రణ పోయేది కాదు. మరొక వైపు విజ్ఞాన శాస్త్రాభివృద్ధితో నాగరిక జీవితం బొత్తిగా సంకీర్ణమైపోయి మనకు మన జీవితాల మీదనే పట్టు తప్పిపోతున్నది. ఇట్టి స్థితిలో ఆధునిక కవి సమకాలీన వస్తుసామగ్రి సాహాయ్యంతో భావచిత్రణ చేస్తాడు. లోకంలో ఆ సామగ్రికి లేని క్రమం నిబంధన, కావ్యంలో యేర్పడుతున్నాయి. కాగా, బయట, నిగ్రహం లేని లోకాన్ని కావ్యంలో నిగ్రహించి, అదుపులో పెట్టుకొని, పట్టుతప్పకుండా చూచుకుంటున్నామన్నమాట; సంయమాన్ని సాతత్యానికి సంతరించదలుస్తామన్న మాట. ఆధునిక కవులు వాడే ఈ సామగ్రిలో టెలిగ్రాఫ్ స్తంభాలు మొదలుకొని ఏదైనా ఉండవచ్చు, కానీ, ఆ సామగ్రి అంతా మనకు నిత్యజీవితంలో పరిచితమే అయినా, అది కవిత్వంలో వాడినప్పుడు కవితాస్థాయికి అంది వచ్చి పాఠకుని స్పందింప జేయగలదా, లేదా అన్నదే ప్రశ్న. అంటే వాటికి అనుభవ గోచరత ఉన్నా ఊహాచోదకశక్తి ఏర్పడిందా, లేదా, అనేది కవులు పరిశీలించుకోవలసిన విషయం.

మరి మన కవుల్లో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మొదలుకొని దాశరథి కృష్ణమాచార్యులుగారి వరకు ఆంగ్ల కవితా ప్రభావం పడినవారు అనేకులున్నారు. ఆ ప్రభావం మన ఈ కవులమీద ఎలా ప్రసరించిందో, ఆ పద్ధతి ఎంత సమగ్రంగా మనకు అందివచ్చిందో స్పృశిస్తూ పోదాం. మొదట అడవి బాపిరాజు గారి "వరద గోదావరి" గేయంలో భావచిత్రణం దర్శిద్దాం.

ఉప్పొంగిపోయింది గోదావరీ తాను
తెప్పున్న ఎగసింది గోదావరీ.
... ... ... ... ...
అడివిచెట్లన్నీని
జడలలో తురిమింది.
ఊళ్ళు దండగ గుచ్చి
మెళ్ళోన తాల్చింది.

ఇక్కడ వివక్షితమైన భావచిత్రణం ఉప్పొంగి కొండలూ, కోనలూ ఏకంచేస్తున్న గోదావరిని ప్రాకృతిక శక్తి (Primival force) గా వర్ణించడం. నదిని స్త్రీగాను, ప్రళయ బీభత్సభావాన్ని కరాళ శక్తిగాను నిర్దేశించడం మన సంప్రదాయమే కాని, ఇక్కడ కవి తన వశం తప్పి పెల్లుబికిన నదిని స్త్రీగా, ఆకల్ప రచనాయత్తగా చిత్రించి కావ్యజగత్తులో తన వశవర్తినిగా చేసుకుంటున్నాడు. ప్రయోజనం అంతవరకే. ఇలా సహృదయులే సమన్వయించుకోవాలి.

దినములు పరస్పర ప్రతిధ్వనులుగాక
ఇరువదైదేండ్ల నా బ్రతుకు కిట్టె గడచె,
ఈ రహోదుఃఖ వీథులం దే నెఱుంగ
సఖుల యడుగుల జాడ లీసరికిగూడ.

అంటారు వేదులవారు "దీపావళినాడు." దినములు పరస్పరం ప్రతిధ్వనించడ మనే సమయం, భావచిత్రణం మన సంప్రదాయకం కాదు. ఈ చిత్రణకు నారులు పోసింది వెనుకటి

బాణసంచుల ఫెళ ఫెళార్భటులు విరిసి
దశ దిశాంతరముల బ్రతిధ్వనుల నీన
పేదవడియున్న మౌనజీవితపుటాశ
లిపుడు మ్రోగించుకొనుచుంటివేల నీవు?

అని చిమ్మటను సంబోధించే పద్యం. బాణసంచుల ఆర్భటులే ఈ దినాలలో ప్రతిధ్వనించాయి. అలాగే

ఆకొనిన యాశ లెప్పటి కప్పు డేవియొ
కలయద్రిప్పును స్వప్న సాగర తటాల

అంటారు కవి. ఆశలు సచేతనాలై ఆకలి గొనడం, స్వప్న సాగరతటాలను తిప్పడం మన భావనా ప్రపంచమా?

"సుప్తాస్థికలు" అన్న శ్రీశ్రీ కవితలో పాశ్చాత్య భావచిత్రణం ఎంతగా పొదవికొన్నదో వినండి :

అవి ధరాగర్భమున
మానవాస్థికా పరంపరలు
సుప్త నిశ్శబ్ద సంపుటములు
అటనాకే దీర్ఘయామిని
ఆ నిశాశ్మశాన శయ్యకు
ప్రాతః ప్రసక్తి లేదు,
ఆ అగమ్య తమో రహస్యాంగణాన
తాండవించును
మృత్యుశైత్య మొకటె !
అవి నితాంత హేమంత హృదంతరంత
రనుభవాళి
ఘనీభవించిన సమాధులు,
ఆ మనుష్యాస్థికలు
నిద్రలో మునింగి
సంచరించును భైరవస్వప్న వీథి !
అవి చలించును,
తమ చర్మ కవచమెపుడొ
బ్రతికిన దినాల తలపోత బరువుచేత !

నా కనుంగవ కన్నీళులై కరంగు
అవి ఒనర్చెడి నీరవాహ్వాన మెరిగి;
ఇంత శోషిల్లునేలొ నా హృదయపుటము
వణుకు నేటికో నా అస్థిపంజరమ్ము

ఈ భావచిత్రణం పరమార్థం ధరా గర్భంలోని మానవాస్థి పరంపరల ఎడ కవి తన సానుభూతి ప్రదర్శించడం వరకే కనుక అసమగ్రమంటారు విమర్శకులు. కవి మృత్యువును గూర్చి ప్రస్తావించాడు. దానిని అర్థాంతరన్యాసంవంటి దానితో ఉల్లేఖించిఉంటే చిత్రణ సమగ్రమయ్యేది. సుప్త నిశ్శబ్దసంపుటములు, ఘనీభవించిన సమాధులు, అవి చలించును — మొదలయిన చిత్రణ సామగ్రి అంతా పాశ్చాత్య మత సంప్రదాయంలో తెచ్చుకొన్నదేనని చెప్పనక్కరలేదు.

"ఒక రాత్రి" లోను శ్రీశ్రీ పాశ్చాత్య కల్పనా స్రవంతిని పూర్తిగా పుణికి పుచ్చుకున్నారు :

గగనమంతా నిండి
పొగలాగు క్రమ్మి
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను !
ఆకాశపు ఎడారి
అంతటా అకట !
ఈరేయి రేగింది
ఇసుక తుపాను,
గాలిలో కనరాని
గడుసు దయ్యాలు
భూ దివమ్ముల మధ్య
ఈదుతున్నాయి !
నోరెత్తి హోరెత్తి
నాగులు సాగరము
కరి కళేబరములా
కదలదు కొండ !

ఆకాశపు ఎడారి
లో, కాళ్ళు తెగిన
ఒంటరి ఒంటెలా
గుంది జాబిల్లి !
విశ్వమంతా నిండి
వెలిబూదివోలె,
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను !

భయ సమ్మిళితమైన నైరాశ్య భావ చిత్రణమిది. తత్స్ఫురక సామగ్రి అంతా పాశ్చాత్యం. నైరాశ్యానికి చిహ్నం పొగమంచు. భయపెట్టే వెన్నెల అలా ఉండే. శ్రీ శ్రీ చూచిన బహుళ పంచమిజ్యోత్స్న మార్గశిర పుష్యమాసాల బహుళ పంచమిదేమో! అప్పుడుగాని వాతావరణంలో పొగమంచు కనిపించదు. ఇసుక తుపాను, గాలిలో కనరాని గడుసు దయ్యాలు ఈదడం, ఆకాశపు ఎడారి, కాళ్ళు తెగిన ఒంటరి ఒంటె - అవన్నీ క్రైస్తవ, మహమ్మదీయ దేశకాల సంప్రదాయ గతాలు. ఏనుగును కొండతో పోలుస్తాము మనం. ఇక్కడ కదలని కొండ చచ్చిన ఏనుగులాగ ఉందనడం మన సంప్రదాయ భిన్నమైంది, జాబిల్లికీ ఒంటెకూ రూప సాదృశ్యం లేదు; ఆపాతతః కనిపిస్తున్నా. కనుక భారతీయ మనస్సుకో, మస్తిష్కానికో జాబిల్లి ఒంటెలాగ తోచదు. మనం మరుమరీచికలను నైరాశ్యానికి ఉదాహరిస్తాము, పొగమంచును కాదు.

శ్రీ శ్రీ 'ఋతురాణి' తలిరాకు జొంపాలతో, విరులగుంపులతో కాక పాశ్చాత్యుల మాంత్రికురాలిలాగ 'వసంతకాలం మంత్ర కవాటం తెరుచుకొని' ప్రవేశిస్తుంది.

ఇక నండూరివారి 'కలతనిదుర'లో-

ఆకాశమో తీరు
ఆవులించిన రేయి

మనదా? ఇది పూర్తిగా నోరారచేసిన ఆంగ్లేయుల ఆవులింత.

అంతో ఇంతో షెల్లీ భావచ్ఛాయలలో విహరించిన కృష్ణశాస్త్రిగారి "అన్వేషణ" లోనిది మన భాషా భావాలతో, ఆలంకారిక సమయాలతో మేళవించిన పాశ్చాత్య భావచిత్రణ పరిపాకమే.

విశ్వనాథవారి 'చిన్నమబ్బులు' పాశ్చాత్య విమర్శకులు నిర్వచించిన మూడో భావ చిత్రణానికి మచ్చుతునక. మేఘాదులు ఉద్దీపన విభావాలు మన కవి సమయంలో. వాటికి వ్యక్తిత్వ మేమీ లేదు. కాళిదాసు దౌత్యం అప్పగించిన మేఘం దానిని వినలేదు, కనలేదు, అనలేదు. తనదారిని తను గాలికి కొట్టుకొని పోయింది. ఇక్కడ అచేతనమైన మబ్బు సచేతనమై తనకు ప్రకృతిలో సమకూడే మార్పుతో నవవధూసాధర్మ్యం పొందడం, కవి వివక్షకు జిలుగులు వెలుగులు చిలికి వ్యక్తీకరించడం సుందరమైన భావ చిత్రణం.

తొలి చిన్ని చూలాలు
కొలసిగ్గు ప్రేమతో
విభుని చూచినవేళ
విన్న బోయిన వేళ
ఒరపు మిన్నులలోన ఒక నీలితెర మబ్బు
సంజలో తారిందిలే!
జూలుగా మారిందిలే!

తొలికాన్పు పసిపాప
సాకనేరని బాల
తెలవోయి పతిచూచి
కళవళించిన వేళ
తూరుపుకోనలో తొంగలించిన మబ్బు
తెగ పరుగులెత్తిందిలే!
సొగసుల్లు పోయిందిలే!

నవ వధువు సోయగాన్ని, నిండుతనాన్ని మబ్బు ముచ్చటతో వెలుగు పూసి వ్యాఖ్యానించారు కవి.

సుళ్ళు తిరిగే కడలి నడుమా
సూపు కందీ అందకుండా
తెప్పలేసుకు వాము పడుచులు
తేలిపోతారో

అంటారు విశ్వనాథవారు కోకిలమ్మ పాటలో. తరగలను ఉరగఫణాలుగా వర్ణించడం మనకు కొత్త కాదు. ఇక్కడ పైకి లేచిన తరగల తలలను పాముపడుచులుగా, తరగల మొదళ్ళలోని ఒంపును తెప్పగా వర్ణించడం మనకు కొత్త. పాశ్చాత్యులకు మత్స్యాంగనలు (Mermaid) ఉన్నారు.

సవరింతునా అగ్నివీణ
సవరింతునా దిశాంచలము రింగులువార
నవనవాంగార సంభవ కీల బుసదేర
... ... ...
మనసులో మిన్నాగు ఫణమెత్తి పారాడ
సవరింతునా అగ్నివీణ

అంటారు పుట్టపర్తి నారాయణాచార్యులు. అగ్నిపీణ అనడం, మనసులో మిన్నాగు ఫణమెత్తడం అన్యసంప్రదాయపు మెరుపులు.

"బరువు బండి"లో పిలకా గణపతిశాస్త్రిగారి గుండెబరువు ఆధునిక జీవిత గతిలో పడిన పాశ్చాత్య సంబంధపు ఉరువే.

ఎద్దయినా మోయలేని పెద్ద బరువుబండి మిట్ట
మధ్యాహ్నం తారురోడ్డు మంటల్లో ఈడ్చే ఓ
అన్నా ! నీపై ఒక చిన్నపాట రాస్తే ఇక
అరుగుమీద కూర్చుని విని ఆనందిస్తుంది లోక
మన్నన్నా ! ఈ మోసం మన్నిస్తావా ! ఇంకా !

ప్రతిక్షణం దిగలాగే గతుకుల్లో పడి అతుకులు
బ్రతుకుబండి లాగి లాగి చితికి తూలిపోతూంటే
అన్నా ! నీపై ఒక చిన్న పాట రాస్తానొక
అరుగుమీద కూర్చుని విని ఆనందిస్తుంది లోక
మన్నన్నా ! ఈ మోసం మన్నిస్తావా ఇంకా !

విన్నావా ఈ చిత్రం ! నిన్నుగూర్చి రాస్తేనట !
పిన్న పెద్దకవులల్లో పేరు మోగిపోతుందట !
అన్నా అయింది ఏదో ! చిన్నపాట రాశానొక
అరుగుమీద కూర్చుని విని ఆనందించింది లోక
మెన్నటికీ ఈ మోసం మన్నించవులే మరింక !

దీనిలోని వ్యంగ్యం శాస్త్రిగారి జీవితపు లోచూపుల పరిపాకమే.

జగత్తు పోస్టాఫీసు ముద్ర
ఫగత్తు ఇదే నంటుంది కలం.
ముద్ర కింద నల్లసిరా
మాసిపోదు ససేమిరా.

తమస్సు ముద్రించిన జాబులు
కట్టేసిన సంచికి సీళ్ళు.
ఈ దుర్వార్తల ఉత్తరాల సంచీ
ఎప్పటికీ పో దిక్కడనుంచీ.

ఏమంటే ఏరాక టడ్డం
ఎప్పటికీ వంతెన మెమోరాండం.
సామాన్యుడు రన్నరు పాపం
పోకుంటే వీళ్ళకు కోపం
కానీ పోలేడు వాడు
కానీ కెవ్వడు పోతాడు ?

* * *

ఆ ఘడియ మన కాదివారమై కూచుంటే సరి
శతాబ్దాల తర్వాతనె మన కది డెలివరీ.

అంటారు సాళ్వ కృష్ణమూర్తి "నిరీక్షణ" లో. కావ్యం సృష్టిలోని ప్రవృత్తి రూపమైన యాథార్థ్యాన్ని తెలియ చెప్పుతుందనే నాల్గో భావ చిత్రణ కిది చక్కని ఉదాహృతి. రచయిత తను జాబుకోసం ఎదురుచూచే మిషతో అనంతకాలంలో ఎన్ని జగత్తులలో, ఎన్ని జన్మాలలో కాచుకూచోవాలో అనే తత్త్వ చింతనను — యాథార్థ్యాన్ని ఈ చిత్రణలో మనకు స్ఫురింపజేశారు.

మూడు లోకాలలో
మూడు కాలాలలో
నినదించు నిజమెరుపు
నిండు మనసెరుపు

పొడవబోయే ప్రొద్దు
పాల బుగ్గల ముద్దు
కొంచు వచ్చు మరో
ప్రపంచమ్మె నాది.

అంటారు రాంభట్ల కృష్ణమూర్తి. మన సంప్రదాయంలో సత్యం తెలుపే. ఈయన ఎరుపంటారు పాశ్చాత్య సంప్రదాయ సంగతితో. రెండవ గీతంలో 'రేపు నాది' అనే భావంకూడా పాశ్చాత్య సంస్కృతి జన్యమే. గడ్డకట్టి తమ జీవితానికే గొడ్డలి పెట్టుగా వున్న మంచు-తెల్లని మంచు - దుఃఖదాయకం కావడంవల్ల పాశ్చాత్యులు మంచినంతా ఎర్రగానే చూస్తున్నా రనుకుంటాను.

విశ్వం 'జవరాలు' 'నా హృదయం'లో
చుక్కల మనసుల నెరుగదు
చక్కని పూబాస తెలిసి చావదు మరి యే
చిక్కు సమస్యల నెరుగదు.

తనియించి వైయక్తి
కత బెంచి దంతాల
మేడలో నుంచి పా
రాడ నీనట్టి
బంధనము కా దీమె
ఇంధనము కాని.

చుక్కల మనసు ఎరగడం—వాటికి మనసు అనేది ఉన్నట్టు—పూల బాస తెలియడం, దంతాల మేడలో ఉండడం—ఇలాంటివి మన సంప్రదాయానికి విలక్షణమైనవి.

శిశు గృహాలూ బాలోద్యానాలూ
చెక్కు బుక్కుల బరువునుబట్టీ
చిక్కే దుర్గతి నశించేదాకా.

దీనిలోని చెక్కు బుక్కుల బరువు ఐశ్వర్యపరంగా పాశాత్య సంకేత మనడం చర్విత చర్వణం.

కాళోజీగారు 'పోటీ తెన్నుల'లో నేటి విశ్వ మారణాయత్తులసర్వ సర్వం సహా జిఘృక్షను చిత్రించారు ఇలా :

చాపచింపు—సామ్రాజ్యం
కోడిగుడ్డు—కోహినూరు
పాటిమన్ను—ప్లాటీనం
బస్సుసీటు—బ్రహ్మరథం
ఏదైతేం! ఏదైతేం!
పోటీపడి కాటులాడ?

ఈ భావ చిత్రణంలోని రెండు రెండు జంటలూ పరస్పరం నిమ్నోన్నతాల అంచులు. మనస్తత్వం ఒకటే. మనిషేమీ పెరగలేదనేది వివక్ష కవికి.

విజ్ఞానం వేయి చేతులతో మానవజాతిని పరిరంభణం చేసుకొంటున్నది. కనుక కావ్యవస్తువు, కవి సమయాలు మారక తప్పదు. నేటి విజ్ఞానశాస్త్ర వికాస ప్రకాశాన్ని చిదిమి ఎక్కడి కక్కడే దివ్వెలు వెలిగించి ఆ వెలుగులో తన భావ చిత్రాల శాలను తెలుస్తారు దాశరథి "పీడిత ప్రజావాణికి మైక్ అమర్చి అభివాదులకున్ వినిపింప జేసెదన్" అంటారు. మైకును మరొకరెవరూ ఇంత యిదిగా వాడలేదనుకుంటాను.

జగత్తుకు ప్రాణం ప్రసాదించిన
కార్బన్ పరమాణువు
అందులో సెంట్రల్ న్యూక్లియస్ చుట్టూ
చాంద్రాయణం చేసే ఆరు ఎలెక్ట్రానులు.

*   *   *

కాలం అక్కడక్కడే పెరగ్గలదా?
నయాగరా జలపాతంవలె
నడుం విరిగేట్టు దూకింది తప్పదుకదా!

*   *   *

బ్రతుకు నాగజముడు కూడ
పూలు పూయనీవయ్యా
మెతుకులో ప్రొటీనులు
మిక్కిలిగ రానీవయ్యా

*   *   *

మథనపడే మేధావుల
శిథిలాశలు చివురించే
రసరాజ్యం లేబరేటరీ.

అని 'మస్తిష్కంలో లేబరేటరీ'లో పంక్తులు. కార్బన్ పరమాణువు, ఎలెక్ట్రానులు, ప్రోటీనులు, ఇవన్నీ పలువురికి నిత్య జీవితంలో పరిచితమైన విషయాలే. వాటినే దాశరథి కవితా భావావేశంస్థాయికి తెచ్చి మన హృదయాలను స్పందింపజేశారు. శిథిలాశలు చివురించే "రసరాజ్యం లేబరేటరీ" అని ముగించడంతో మనకు ఆశా సందేశ మిచ్చారు. మరొక మహాద్భుత చిత్రణం ''మేల్కొన్న మనిషి."

శవం బతకడం ఎంత విచిత్రమో
మనం మేలుకోడం అంత చిత్రమే.
ఎవడో కొత్తరకం వైద్యుడు
ఏదో కొత్త తరహా ఔషధం వాడివుండాలి.
లేంది ఇన్నాళ్ళ నల్లమందు మత్తు
ఇంత త్వరగా విడిపోవడం సులభమా?
ఏమైతేం వెళ్ళి చూచిరావడం మంచిది
మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్తున్నాను.

నిద్రాణమైన జాతి మేల్కొన్నది; నవచైతన్య విలసితమైంది. తంద్ర తొలగింది. ఇక జాగ్రదవస్థే కాని సుషుప్తి లేదు. దళిత జాతులు ఇక అణగి వుండవు. లేచి నిలనదొక్కుకుంటాయి అన్న గంభీర సత్య దర్శనంతో ఈ చిత్రం సమగ్రమైంది.

ఇలా వెతుకుతూ పోతే సానలు తీరి పక్షపక్షాన రంగురంగుల రోచిస్సులు విరజిమ్మే మణులకు, కలరవాలు కురిపిస్తూ, వంపు వంపునా కర్పూర కాంతు లీనే కలరవ కంఠాలకు, వివిధ సౌరభాలను వెలార్చే కదంబ ప్రసూనాలకు దీటయ్యే భావ చిత్రణలను తీవలు సాగిస్తూనే పోవచ్చు. ఇది పలువురు రస ప్రబుద్ధులు పెక్కేళ్ళు తరచవలసిన విషయం. అలాటి కృషికి స్వాగతం.

# నూరు, నూట ఎనిమిది, నూట పదహారు

**నూ**ట పదహార్లు—అనేమాట మన వ్యవహారంలో తరచు వినిపిస్తుంది. "ఏమిటి కట్నాలు, కానుకలూ?" అని ఏ పెండ్లి వారినైనా ప్రశ్నిస్తామనుకోండి: "ఏముందీ? మామూలే, వెయ్యిన్నూటపదహార్లు అల్లుడుకి, ఆడపడుచుకు లాంఛ నాలకింద నూటపదహార్లు" అని సమాధానం వింటాము. "అష్టావధానం చేశారే? ఏమిటి సన్మానం?" అంటే "ఆం! నూటపదహార్లే!" అని కొంత అసంతృప్తితో ప్రత్యుత్తరం వస్తుంది. "ఆ కథకు నూటపదహార్లు ఇచ్చారటనే !" అని ఆశ్చర్యం ప్రకటిస్తారు కొందరు, కథలకు కమామీషులకు ఇంత బహూకార మేమిటని.

మరి ఇంత ప్రచారంలో ఉన్న ఈ నూటపదహార మూల మేమిటి? ఎలా ఇంత ఖ్యాతి సంపాదించింది ? అంటే, సమాధానం చెప్పడం కష్టమే.

నూరు మనకొక పెద్ద మొత్తం ; పెద్ద సంఖ్య ; సంపూర్ణ సంఖ్య. "నూరేళ్ళు జీవించు నాయనా !" అంటారు పెద్దలు పిన్నవారు ఆశీస్సులు కోరితే. "శతమానం భవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యే వేంద్రియే ప్రతితిష్ఠతి" అనే ఆశీర్వచనం మనం తరచు వినేదే. మన పూర్వుల లక్ష్యం :

"పశ్యేమ శరద శ్శతం జీవేమ శరద శ్శతం
నందామ శరద శ్శతం మోదామ శరద శ్శతం
భవామ శరద శ్శతం ప్రబ్రవామ శరద శ్శతం
అజీతాః స్యామ శరద శ్శతం."

అన్నది. నూటపదహారు ప్రసక్తిలేదు. జ్యోతిషశాస్త్రం ప్రకారం వింశోత్తరీ దశాగణనను అనుసరించి మన పూర్వులు మానవుని వయస్సుకు కట్టినలెక్క 120 సంవత్సరాలు. ఈ లెక్క అరవైని రెట్టించి, ఏర్పాటు చేసిందన్నారు కొందరు పండితులు. "గ్రహాలన్నీ ఒక్కస్థానం నుంచి ఒకమారు బయలుదేరిన పక్షంలో మళ్ళీ అక్కడే చేరడానికి 60 సంవత్సరాలు పడుతుంది. కనుక ప్రభవ మొదలు క్షయ వరకు 60 సంవత్సరాలు లెక్క ఏర్పరచిరి. దానిని రెండుతో హెచ్చవేసి 120 అన్నారు" అన్నారొక పండితులు. కనుక నూటపదహారుకు మారు 120 అనేదే వ్యవహారంలో ఉండవలసింది. కాని,

నూరొక సంపూర్ణ సంఖ్య. పదహారో సంఖ్య మనకు చాల ముఖ్యమైంది. చంద్రుని కళలు పదహారు. పదహైదు మనకు కనిపిస్తాయి; పదహారోది సూర్యునిలో చేరిపోతుంది; కనిపించదు. పదహారో సంఖ్య అంత ముఖ్యమైంది గనుక నూరును మొండిగా ఉంచడం ఇష్టం లేక పదహారు చేర్చి నూటపద హార్లన్నారు మర్యాదచేసే సందర్భంలో - అన్నారొక పండితులు. పదహారే ఎందుకు? మనకు మంత్రశాస్త్రం ప్రకారం 108 కదా శ్రేష్ఠ సంఖ్య. అష్టోతరం, అష్టోత్తర శతనామావళి, అర్చన, జపం మొదలయినవి ఉన్నాయి. కనుక 108 అన్నదే ప్రచుర వ్యవహృతం కావలసింది-ఎందుకు కాలేదు? అనే ఎదురు ప్రశ్న పుడుతుంది.

మనకు నాల్గుతో హెచ్చవేస్తూ పోయే పద్ధతి— నాలుగు, నాలుగు రెండ్ల ఎనిమిది, ఎనిమిది రెండ్ల పదహారులాగ— అతి ప్రాచీనం. ఛాందోగ్యోపనిషత్తు లోనూ ఉంది ఈ నాలుగు గుణింతం. దీనిని పదహారు కళలు అనే సంప్రదాయం కలిపి నూటపదహారు అన్నారేమో! అంటే - వాదం మనస్సుకు ఏమీ సరిగాలేదు.

పూర్వం సంస్థానాలలో పండితులకు సంభావన లివ్వడం వల్ల ఈ వ్యవ హారం ఏర్పడింది. పూర్వపు నిజాం ప్రభుత్వం హాలీ సిక్కా నూరు రూపాయలకు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం (గాడీ) నూరు రూపాయలకు మారకం వారా పదహారు రూపాయలు. కనుక నిజాం సంస్థానాల ప్రభువులు ఇతర ప్రాంతాల కవిపండితులకు సంభావన లిచ్చేటపుడు మారకం వారాతో కలిపి నూటపదహారు రూపాయలు ఇచ్చేవారు. హాలీ రూపాయలు నూటపదహారయితే గాడీ రూపాయలు నూరు. అందువల్ల అప్పటినుంచే ఈ నూటపదహారు మర్యాద ఏర్పడింది - అని ఒక పండితు లన్నారు.

అబ్బే! అదేమిటి! నూటపదహార్ల సంప్రదాయం విజయనగర కాలం నుంచే ఉంది. తెనాలి రామకృష్ణుడు కృష్ణరాయలపై చెప్పిన-

"నరసింహ కృష్ణరాయల
కర మరుదుగ కీర్తి యొప్పె కరిభిద్ గిరిభిద్
కరికరిభిద్ గిరి గిరిభిద్
కరిభి ద్గిరిభిత్తురంగ కమనీయంబై"

అనే చాటుపద్యంపై అతనికీ, భట్టుమూర్తికీ వివాదం జరిగింది. అంత తిమ్మ రుసు లేచి పై పద్యంకన్నా బాగా పద్యం చెప్పిన కవి సింహాసనం అలంకరించ వలసిందని సవాలు చేశాడట. దానికి భట్టుమూర్తి ఉగ్రుడై,

"తొట్ట యిదేటి మాట పెను
లోభులతో మొగమాట మేల దా

..............................

పెట్టుదు దండముల్ సుకవి
బృందము కే నతిభక్తి సారెకున్
గట్టితి ముల్లెలేబదియు
గాగల నూటపదారు లియ్యెడన్
రట్టడి భట్టుమూర్తి కవి
రాయని మార్గ మెరుంగ జెప్పితిన్"

అని ఎదురు సవాలు చేసినట్లు గురజాడ శ్రీరామమూర్తి గారు కవి జీవితాలలో పేర్కొన్నారు. ఆ చాటూత్పల మాలిక సుప్రసిద్ధం గనుక నూట పదార్ల వ్యవహారం నిజాం రాజ్యానికి ముందుదే అని ఒక పరిశోధకులు అన్నారు. ఇంత ప్రసిద్ధమైన మాట నిఘంటువులకు ఎక్కలేదేమి - నూరార్లు, నూట యెనిమిది తిరుపతులు అన్నవి ఎక్కినప్పుడు?

"దివ్యములు నూటయెనిమిది తిరుపతులకు
బరమపదమైన శ్రీసర్పపురమునందు"

అని భీమఖండం (2-66) లో శ్రీనాథుని ప్రయోగమే ఉంది నూటయెనిమిదికి, చాటువులనుంచి ప్రయోగాలు ఏరకపోవడం నా తప్పా? అంటారు ఆ పరిశోధకులు.

ఇతర ప్రాంతాలలో ఈ సంప్రదాయం ఉందా అంటే, లేదు. ఉత్తర భారతమంతటా 100 అని మొండిగా ముగించడం మంచిదికాదనీ, దానికి సాతత్యం ఉండాలని ఒక్కటి చేర్చి-నూటఒక్కటి ఇస్తారు. ఇది దక్షిణాదిలోను, ముఖ్యంగా నాటు కోటిసెట్లలోను-ఉంది. 110 కూడ కొన్ని ప్రాంతాలలో ఉంది.

పరిశీలన చేయగా, నూటపదార్లు అనేది వేలఏళ్ళ నాటిదే నని స్పష్టమౌతుంది. మొహెంజోదారో తవ్వకాలలో దొరికిన ప్రాచీనజాతి వారి గృహోపకరణాలలో దువ్వెనకూడా ఒకటి ఉంది. దానికి పండ్లు నూటపదహారున్నాయని ఇండియన్ యాంటిక్వెరీ (1918) లో ఎవరో పండితులు వ్రాశారు.

ఛాందోగ్యోపనిషత్తులో నూటపదహారు సంవత్సరాల ఆయుస్సు కోసం పలుపాట్లు పడినట్లు కొన్ని మంత్రా లున్నాయి.

"ఏత ద్ధస్మవై తద్విద్వా౯ నాహ మహిదాస ఐతిరేయః స కిం మా ఏత దపతపసి యోహ మనేన న ప్రేష్యామీతి సహషోడశం వర్ష శత మజీవ త్సహషోడశం వర్షశతం జీవతి య ఏవం వేద" (3-6,7)

ఇతరుని కుమారుడైన మహీదాసుడు ఈ యజ్ఞాన్ని తెలుసుకొన్నవాడు రోగంతో ఇలా అన్నాడట: "నన్నెందుకు ఊరికే బాధిస్తావు? నీతో నేను చావను." అతడు అలా రోగాన్ని ప్రతిఘటించి నూటపదహారు సంవత్సరాలు జీవించాడు. ఈ యజ్ఞం తెలుసుకొన్నవాడు నూట పదహారు సంవత్సరాలు జీవిస్తాడు.

"తద్ధైత ద్ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా యోక్త్వా వాచా పిపాస ఏవ స బభూవ సోంత వేలాయా మేత త్త్రియం ప్రతిపద్యేతాక్షత మ ప్యచ్యుత మపి ప్రాణసగంశిత మసీత తత్రై్తే ద్వే ఋచే భవతః"

అంగీరస వంశజుడైన ఘోరుడు దేవకీసుతుడైన కృష్ణునికి ఈ యజ్ఞాన్ని (దీర్ఘాయుష్య విద్యను) తెలిపాడు. ఆ తర్వాత దేవకీనందనుడు మరొక జిజ్ఞాసకు పోలేదు. అవసానం సమీపించినపుడు తన్ను ఉద్దేశించి "నీవు అనశ్వరమైన వాడివి, మారనివాడివి, ప్రాణంకంటే మధురమైనవాడివి" అని చెప్పాడు. ఈ విధంగా నూటపదారేళ్ళు బదికాడు.

దీనినిబట్టి మన పూర్వులు శతమానం జీవించే విద్యను సాధించిన తర్వాత మరి నాలుగు నాలుగుల కాలం జీవించడానికి ప్రయత్నించారనీ స్పష్టం. అంటే వేదకాలంలో శతమానానికి పాటుపడినవారు అరణ్యకాల కాలానికి తమ జీవితాన్ని మరి పదహారు సంవత్సరాలు పెంచుకోడానికి మార్గాలు వెదకారన్నమాట. అప్పటి ఆ వైదికాచారమే మనలో సకృత్తుగా నిలిచిపోయి ఉంటుం దనుకుంటాను.

ఇంతేకాక, మన పూజలలో షోడశోపచార విధి మనకు తెలిసిందే. ఇది మంత్రశాస్త్ర, వ్రతకల్ప సమ్మతమూను. ఈ షోడశోపచార విధిలోని షోడశ సంఖ్యే ఔపచారికంగా నూటపదార్లలో చేరిందేమోనని ఒక మిత్రు డన్నాడు. ఇది సమంజసంగానే ఉంది. వంద రూపాయలిచ్చి, అర్ఘ్యపాద్యాది షోడశోప చారాలకోసం చెరిఒక సువర్ణ పుష్పమో సాధారణ పుష్పమో ఇవ్వడం ఆచారమై, క్రమంగా నూటపదార్లయి ఉంటుంది.

అపరకర్మలలో చేసే దానాలలో షోడశ దానా లున్నాయి. నూరు రూపాయలు దక్షిణ, ఒక్కొక్క దానానికి ఒక్క రూపాయో, రూకో చొప్పున పదహారూ కలిసి నూటపదారు అనే వ్యవహారం వచ్చిందేమో! ఈ దానాలకు, ఈవికి మూర్తికల్పనే షోడశభుజ దుర్గాదేవి కావచ్చు. షోడశ సంఖ్య ప్రాధాన్యం తెలిపేవి సంస్కృత భాషలో ఎన్నో ఉన్నాయి.

# నేటి సాహిత్య విమర్శ

జ్వలతి చలితేంధనోగ్నిః
విప్రకృతః పన్నగః ఫణాం కురుతే,
ప్రాయః స్వం మహిమానం
క్షోభాత్ ప్రతిపద్యతే హి జనః

కొరువులు కదిలిస్తే అగ్గి భగ్గుమంటుంది. పొడిస్తే పాము పడగ విప్పుతుంది. కలవరం పుట్టిస్తే మానవుడు స్వస్వభావాన్ని చిక్కబట్టుకుంటాడు— అన్నాడు కాళిదాసు; ప్రకరణాంతరంలో. ఈ సూక్తిని మనం సాహిత్యరంగానికి సమన్వయించుకుందాం ప్రస్తుతం.

ఆత్మవిమర్శలాగే ప్రతివిమర్శా అవసరం. సానబట్టితే కాని వాడి పుట్టదు కదా మరి? అందులోను వ్యష్టి సమష్టుల భూతభవిష్యద్వర్తమానాలతో పెనవేసుకొన్న సాహిత్యానికి విమర్శ పరామర్శలు మరీ అవసరాలు. మానవుడు ఏవేవో కలలు గంటాడు, ఊహిస్తాడు. వాటిని మొదట సాహిత్యంలో సాక్షాత్కరింపజేసుకుంటాడు; వాటి సాధ్యతాసాధ్యతల విచక్షణ లేకనే జీవితంలోను వాటిని సాధించడానికి పూనుకుంటాడు; కొంత సాధిస్తాడు; మరికొంత సాహిత్యంలో మిగుల్చుకుంటాడు. మరలా కలలూ, కలం, కార్యదీక్షా— ఈ శృంఖలిక నిరంతర. కనుక సాహిత్య రంగంలో విమర్శ విధాయకమన్నది చర్విత చర్వణం.

విమర్శమంటే గుణదోషాల సాకల్య సమీక్షే కాని, దుమ్మెత్తి పోయడం కాదు. అప్పుడే అది సద్విమర్శమౌతుంది. కాని మన విమర్శదృష్టి గతాన్ని చొచ్చుకుపోయినంత తీవ్రంగా వర్తమానంలో చొరదు. సమకాల విషయంలో ఏవో జంకు కొంకులూ, దాక్షిణ్య దూషిత బుద్ధులూ బయలుదేరుతాయి. అందు కోసమే "ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!" అన్నారు చేమకూర వేంకటకవి.

కాని, నిజానికి సమకాలిక విమర్శం ఉద్ధృతంగా ఉండక తప్పదేమో! ప్రతి యుగానికీ కొన్ని స్థిరమైన సంప్రదాయాలు ఏర్పడి ఉంటాయి. ఏదైనా

గ్రంథం వెలువడితే అది విమర్శకు యోగ్యమా, కాదా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. కాదన్నప్పుడు ఉపేక్షితమై కాలగర్భంలో లీనమౌతుంది. యోగ్యమన్నప్పుడు ఆ రచన కొంత వ్యక్తిత్వం కలదై ఉండక తప్పదు. ఆ వ్యక్తిత్వం కళాత్మకంగా ఉంటుందనడం చెప్పనక్కరలేదు. అది సమకాలిక సంప్రదాయాలకు, అభిరుచులకూ అనుగుణంగా—సమ్మ సరిగా—ఉండడం కష్టం. కొంచెం ముందూ వెనుకలుగా ఉంటుంది. కనుక విమర్శకునికి సంతృప్తి కలిగించకపోవచ్చు; అతని మనఃప్రవృత్తి భిన్నమైనప్పుడు సంతృప్తిని కలిగించనూవచ్చు. ఏ దృష్టితో చూచినా, పొగడ్త అయినా, తెగడ్తయినా తీవ్రంగా ఉండడం... సహజం. విమర్శకుడు వెనుకచూపు కలిగిన సమకాలిక సంప్రదాయవాది అయితే అభినివేశంతో ప్రశంసిస్తాడు. కొంత ముందుచూపు కలవాడైతే తీవ్రంగా అభిశంసిస్తాడు.

విదేశాల్లో సమకాలిక విమర్శ తీవ్రంగానూ, నిష్పాక్షికంగాను, ఒకప్పుడు ప్రమాదకరంగానూ ఉంటుంది. అర్ధశతాబ్ది క్రితం సుప్రసిద్ధ మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఫ్రాయిడ్, ఎల్లిస్‌లకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు పరికిస్తేచాలు సమకాలిక విమర్శ ఎంత తీవ్రమో తెలుస్తుంది. కీట్స్, 'బ్లాక్ ఉడ్స్' పత్రికలో తన రచనలపై వెలువడిన విమర్శలకు గుండె పగిలి అకాల కాలధర్మం చెందాడంటారు. వర్డ్స్‌వర్త్ మహాకవి ఎంతో తీవ్ర విమర్శకు తట్టుకోవలసి వచ్చింది.

విదేశాల వరకు ఎందుకు? మనదేశంలోని ప్రాచీన విమర్శ సంప్రదాయం ఎంత తీవ్రమయింది! దానికి నిలువదొక్కుకోగల రచనే నిలుస్తుంది కొంత కాలమూ, కలకాలమూను. సమకాలపు అభిరుచులకు సరిపడేవాటి విషయంలో స్థాలీపులాకన్యాయం పర్యాప్తమౌతుంది కాని, కొంచెం ముందూ వెనుకగా ఉన్న రచన విషయంలో సముద్ర మథనం తప్పనిసరి.

మన విమర్శన పద్ధతికి నికషం వ్యాఖ్యాన పద్ధతి. మహా వ్యాఖ్యాత మల్లినాథ సూరి చప్పున మనకు జ్ఞాపకం వస్తాడు వ్యాఖ్యానం అనగానే.

"పదచ్ఛేదః పదార్థోక్తిః
విగ్రహో వాక్యయోజనా,
ఆక్షేపస్య సమాధానం
వ్యాఖ్యానం పంచలక్షణం"

అన్న నిర్వచనంలో సంగృహీతమైంది మన విమర్శమంతా. దీనిలో వ్యాఖ్యాత వివిధ శాస్త్రాది పాండిత్యం వ్యక్తమౌతుంది. మల్లినాథుని వ్యాఖ్యానం చూస్తూ ఉంటే మూలకారుడే మరల ఆ రూపంలో అవతరించి వ్యాఖ్యానిస్తున్నాడా?... అన్నట్టు ఉంటుంది ఒక్కొక్కప్పుడు.

అలంకారికుల విమర్శపద్ధతి మనకందరికీ తెలిసిందే. దాని పర్యవసానమే భామహాలంకారం మొదలు అలంకారమణిహారం దాక ఉన్న వివిధ చర్చా గ్రంథాలు.

రాజాస్థానాల సంగతి మరింత రంజకం. ఆ ఆస్థానాలలో దిగ్గజాల వంటి వారు - కొన్ని పుష్కరాలపాటు శాస్త్రాలు అవలోడించిన వారు - ఉండేవారు. సాహిత్య గోష్ఠులకు, శాస్త్రవాక్యార్థాలకు అధ్యక్షత వహించే రాజుకో, అభిమానికో అన్ని విషయాలూ ఎంతో కొంత తెలిసి, గుణదోష వివేకం ఉండేది. ప్రతిదాన్నీ 'స్తనశల్య' పరీక్ష చేసేవారు పండితులు. ఒక శ్లోకం చదివితే దాని అన్వయాకాంక్షలు మొదలు, అంతరార్థాల వరకూ చర్చ హోరాహోరీగా సాగేది. ఒక్కొకప్పుడు కొంటె సమాధానాలు కుంటి ప్రశ్నలూ చెలరేగేవి.

రాయలవారి ఆస్థానంలో జరిగినట్టు చెప్పే కథలు కొన్ని మనం విన్నవే. రాజరాజభూషణుడు వసుచరిత్రను ఆస్థానంలో చదివి వినిపించడానికి ఉపక్రమించి "శ్రీ భూపుత్రి వివాహవేళ" అని ప్రారంభించగా, రామలింగడు లేచి 'శ్రీభూ' అని పూత్కారంతో చదివి దీపం ఆర్పివేసి, ప్రారంభంలో అనిష్ట సూచకాక్షరాలు పడ్డాయని ఆక్షేపించాడట, అలాగే పెద్దన "ఇంతలు కన్నులుండ తెరు వెవ్వరి వేడెదు భూసురేంద్ర" అని చదివినపుడు "ఇంతలు అంటే ఎంతలు?" అని ఆక్షేపించి చిటికపట్టి, చూపుడు వ్రేలిని కొంచెం ముందుకు పోనిచ్చి 'ఇంతలా?' అని ప్రశ్నించాడట. పెద్దన చేరెడు పట్టి చూపుతూ "ఇంతలు" అన్నాడట. ఇలా విధవిధాలుగా సాగేవి విమర్శలు.

ఇక పండిత పరిషత్తుల సంగతి వేరుగా వివరించ నక్కరలేదు. వాక్యార్థ ధోరణి తీవ్రంగా, యుద్ధోన్మాదంగా, సంహారకాండగా ఉండేది. కాని, అదంతా వాదంవరకే. వైయక్తికంగా రాగద్వేషాలు లేవు. రచన, శాస్త్రవిషయం క్షుణ్ణంగా చర్చితమై నిగ్గుదేరాలన్నదే పరిషత్తు పరమార్థం. వాదతీవ్రతలో వైయక్తిక దూషణ తిరస్కారాలు కూడా లేకపోలేదు క్వచిత్తుగా. పరస్పరం శపించుకోవడం, న్యాయస్థానాలకు ఎక్కడం కూడా కద్దు. అయినా, అదంతా పాండిత్య ప్రకర్ష ప్రఖ్యాపనకే; వ్యక్తిగత సౌశీల్య దౌశ్శీల్యాల ప్రసక్తితో కాదు.

రచయిత తన రచనను చదివి వినిపించడం, ఎవరో ఒకరు ఆక్షేపించడం, మరొకరు సమాధానం చెప్పడం, దానిపై మరొకరికోటి, దానిని ఇంకొకరు పూర్వపక్షం చేయడం, రచయిత అభిప్రాయం తెలుసుకొనడం, సిద్ధాంతీకరించడం - ఇలాటి ప్రాచీన సంప్రదాయాన్ని ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు చాలాకాలం పాటించేవారు.

మన ప్రాచీన సాహిత్య పత్రిక "అముద్రిత గ్రంథ చింతామణి" సాగించిన సమకాలిక విమర్శలు కూడా నిష్పాక్షికంగానూ, ధీరోదాత్తంగానూ ఉండేవే. "ఈ నరమాంస విక్రయమను కన్యాశుల్కము ముఖ్యముగ నింగ్లీషు వాసన తెలియని వారిలో నిపుడు జరుగుచున్నది. దాని నాపవలయునని గ్రంథకర్తగారి యుద్దేశము, అట్టివారికి స్పష్టముగ దెలియుటకై గ్రామ్యోక్తు లిందు జేర్పబడి నందులకై మే మామోదించితిమి. ఇట్టి గ్రంథములకు సలక్షణమగు గ్రాంథికభాష నిరుపయోగము గాన 'శశిరేఖ' యభిప్రాయముతో మే మేకీభవింపము గాని యింగ్లీషు పదములు విశేషముగా జేర్చినందులకై మాత్రము కొంచె మాలోచించు చున్నారము. గ్రంథకర్త యభిప్రాయానుసారముగ నీ కాలమునందలి తెలుగు సంభాషణలలో నింగ్లీషు పదములు జేరుచున్న వనుట నిజమే. అయిన నవి యందరకు వాడుకగా నుండు సైద్ధు కాలువ, మిటికిలేషన్ ... అనునట్టి సర్వ సాధారణ పదమువలెగాక సింప్లిసిటీ, లవ్ సిగ్నల్స్, ఇన్ఫిన్సిరిటీ, కంపారిజన్, డ్రెడ్ ఫుల్లీ ఇన్ లవ్—లోనగు నపూర్వ పదము లింగిలీషు రానివారి కెట్లు బోధపడునో తెలియదు. సర్వసాధారణమగు సంభాషణ కానందున గ్రంథకర్త గారి యుద్దేశమునకు భంగము కలిగినదని సంశయించు చున్నారము. నాటక రంగమున నిట్టిమాట లుచ్చరించుటయు నందులకై లోకము నవ్వుటయు నొక ముఖ్యోద్దేశము కాదు గదా! అర్థముగానినా డిది బధిర శంఖారావమే గాని వేరు గాదు ... ఇంగ్లీషు పదములలో వాడుకలో నుండువానిని ప్రయోగించినచో నా భాషా జ్ఞానము లేనివారికి తెలియునని మా వాదము గాని, వాని బొత్తుగా ప్రయోగింప గూడదని కాదు. ప్రాకృతమునకు ఛాయ వ్రాసినట్లుగ నట్టి వాడుక లేని ఇంగ్లీషు మాటలకు నొక తెలుగర్థముగల ఛాయ సంపూర్ణముగా నున్నను గొంతమేలని తోచెడి. అది నాటక రంగమునకు నిష్ప్రయోజనమైనను జనులకు గ్రంథము జదువునపు డుపయోగపడునని నమ్ముచున్నాము..." (1899 మార్చి, సం-10, సంచి-3)అని ఈ పత్రిక గురజాడవారి కన్యాశుల్కాన్ని విమర్శించింది.

"నలచరిత్రమును దమ యిష్టానుసారముగ గొంత మార్చి, మరికొంత జేర్చి యిందు వ్రాసియున్నారు. పీఠికలో వ్రాయబడిన విధముగా నేది యెట్లున్నను నలదమయంతులకు బరస్పరానురాగము గలిగించిన హంస ప్రచార మిందు లేకుండుట కథకు లోపము గలిగించు చున్నదని మా యాశయము. సంస్కృతాంధ్ర నైషధ గ్రంథములయందును హంస ప్రస్తావ మున్నది గదా! ఇట్టివరికి వా రిష్టానుసారముగ గ్రొత్తగ్రొత్త యుక్తుల గల్పించి వ్రాసినచో గొంతకాలమునకు నలుని చరిత్రలో ననేక భేదము లగపడి వాస్తవము మరుగు పడుచున్నది. ఇంకను గొన్ని నూతన కల్పనలు వ్రాయబడియున్నవి. మూలానుసరణముగ

వ్రాయవలయునని మా యిష్టము. అప్పుడెట్టి శంకయుం బుట్టదు గదా!" (1895 మే. సం-8, సం. చి 5.) అని చిత్రనళీయాన్ని విమర్శించింది. విమర్శ ఎంత ఉదాత్తంగాను, సంయమ సంయుతంగాను ఉందో పాఠకులకు విదితమే.

కవులు తమ కావ్యం ప్రజల సొమ్మని అనుకున్నప్పుడు, విమర్శకుడు తన విధి సంఘసేవ అనుకున్నప్పుడు, ఈలాంటి సద్విమర్శ సాధ్యం. అప్పుడు సంయమం, సహృదయత వాటంతట అవే అగుపడుతాయి. అయితే, కవి తన రచన ప్రజల దనుకోవడం, విమర్శకుడు తన పని సంఘసేవ అనుకోవడం-ఈ రెంటికీ యౌగపద్యం కూడా అవసరం. ఈ రెండిటిలో ఏ ఒక్కటి ఉన్నా ప్రయోజనం విపరీతమే. కవి తన రచన—తన సృష్టి కనుక—గొప్పదనుకుని మురిసిపోతాడు. అందువల్ల ఎలాటి విమర్శనూ సహించలేడు. ఈ అసహనం చూచి విమర్శకుడు మరీ మరీ రెచ్చగొడుతాడు. కనుక విమర్శ అభివృద్ధికి వాదోపవాదాల అర్భటి ఎలాంటిదైనా—సుఖాంతమైన సహనం మూలబంధం కావాలి.

ఈ సహనం మనలో ఇతర జాతుల అభ్యుదయం చూచైనా అభివృద్ధి కావలసింది; స్వాతంత్ర్యానంతరం పొంగి పొర్ల వలసింది; పరాయి పాలనవల్ల కలిగిన అసహనం, అసంతృప్తి కూకటివేళ్ళతో కూలిపోయాయి గనుక. కాని ఎందుకో అలా జరుగలేదు. పరాయివాడు మొడుతూ వున్నప్పుడే మనలో మనం సహనంతో మెలిగేవారేమో నన్న అభిప్రాయమూ పాతుకుంటూంది కొన్ని రంగాల పరిణామ విపర్యాసం చూస్తే. స్వాతంత్ర్య సముపార్జనతో సమసిపోవల సిన కులమత తత్త్వం - విశృంఖలత కారణంగానో ఏమో మరింత సత్తువ చేకూర్చుకుని సాహిత్య రంగంలో తిష్ఠవేసింది. పదవులు, ప్రాపకాలు, ఎన్నో దాక్షిణ్యాలు - వీటిలో విలువకట్టే విచిత్ర పరిస్థితులు ఏర్పడ్డాయి. సహన సురభిళ మైన కవి హృదయమూ, చిత్తశుద్ధి చిందులాడే విమర్శకుని మనస్సూ ఈ విపరీత పరిస్థితిలో తమ స్థాయిని నిలుపుకోడం ఎలా? రాజకీయరంగంలోని కుక్కమూతి పిందెలు సాహిత్య రంగంలోను పుట్టుకువచ్చినప్పుడు, దానిలోని ముఠా మనస్సు ఇక్కడా ముందుకు వచ్చినపుడు సద్విమర్శ - విమర్శ వికాసం ఎలా సాధ్యం? వక్తలోను, స్వీకర్తలోను, సహృదయతతో పాటు సంయమం అవసరమని ఇది వరకే గుర్తించాము. ఇప్పటి విద్యా విధానం అలాటి సిసృక్షా శక్తినిగాని, సంయ మాన్నికాని, మనస్సును కాని పెంచిందా - అంటే మీన మేషాలు లెక్కపెట్ట వలసిందే. కనుకనే విమర్శకుని దృష్టి కామిలా దూషితం కావడం, రచయిత దృష్టి అహంపూరితం కావడం సంభవించాయి.

సద్విమర్శ రావడానికి, కావ్యం - చిన్నదైనా, పెద్దదైనా—విశిష్టత ఉండాలి. దానికాక ప్రతీక స్థాయి ఏర్పడాలి. దాన్ని గుర్తించడానికి కొంత కాలం పడుతుంది. ఇప్పుడు వస్తున్న రచనలలో చాలవాటిలో సాంఘిక దృష్టితో పరిశీలించినా, తాత్వికదృష్టితో తరచినా పరిణతి చాలదు. కనుక అవి పండిత విమర్శకుల దృష్టికి ఆగడంలేదు; ఆగేవి కొన్ని ఉన్నా; వాటి రచయితలు విమర్శ నను సహించరు.

కొందరు స్వాతంత్ర్యోద్యమం పుణ్యమా అని ప్రబోధకావ్యాలు వ్రాసి పెద్దవారయారు. వారిని కళాదృష్టితో గాని విషయైక దృష్టితో గాని విమర్శిం చడం సాధ్యం కావడంలేదు. అలాగే కొన్ని కవితా ప్రస్థానాలకు మూర్ధాభిషిక్తులై ముడుచుకు కూర్చున్నవారూ ఉన్నారు. వర్తమాన స్థితిగతుల్లో ఆ ప్రస్థానాలను గాని, కవిత్వాన్నిగాని, సూటిగా, సునిశితంగా విమర్శించడం ద్వేషం కోరి తెచ్చుకోవడమే: పగ పండించుకోడమే. అలాంటప్పుడు విమర్శకుడు రచయిత తోనో, రచయితల వర్గం (ముఠా) తోనో సామానాధికరణ్యంగల అంశాలే ఏరు కొని శ్వేతాంబర సంయముల లాగా చూచి చూచి తడివి తడివి అంగలు వేయ వలసి వస్తుంది; వేస్తున్నాడు: "ఇదేమిటండీ మీరు పరోక్షంలో అలా అన్నారు; ప్రత్యక్షంలో ఇలా అంటున్నారు. అంతరంగంలో అలా అన్నారు; బహిరం గంలో ఇలా అంటున్నారు" అని ప్రశ్నిస్తే, "ఎవరికి కావాలండి గిల్లి కజ్జాలు వారితో? కొరివితో తల గోక్కోమంటారా?" అని ఎదురు ప్రశ్నలు వేస్తాడు. "మరి మీ చిత్తశుద్ధి, నిష్పాక్షికబుద్ధి రససిద్ధి ఏ మయాయండీ?" అని అంటే, "అనుకూల పరిస్థితి, సహనంతో వినేవాడూ ఉన్నప్పుడు అవన్నీని. కానప్పుడు నా నాసటనే పొద్దు పొడిచిందా? నాతోపాటు సంఘం—కనీసం ఆ రచయితా— పెరగనివ్వండి. నేను నోరు తెరవకపోతే శబ్దజాలమే నశించిపోదు కదా?" అంటాడు.

ఈ వైరస్యానికి కారణ మేమిటి? మన మనస్సు—ముఖ్యంగా రచయితల మనస్సు-పెరగక పోవడమే. ప్రతివారూ, పెరవారిని విమర్శించినప్పుడు సంబర పడతారు గాని తమవరకూ వస్తే గింజుకుంటారు; రుంజుకుంటారు.

అబ్బ! నవీనుల్లో విమర్శాసహనం, స్తోత్ర ప్రియత్వం మితిమీరిపోయా యంటే అతిశయోక్తి కాదు. నేడు నేల నాలుగు చెరగులూ ఏకమౌతున్నాయి; వివిధ సంస్కృతుల సమ్మేళనం కారణాన, నవీనులలో ఆ సంస్కృతి సమ్మేళన దీధితులు ప్రసరించనే ప్రసరించాయి. ఆ వెలుగుతో తమ లోవెలుగును వారు మిళాయించడంలేదు. అనధికార చర్యలకు పూనుకుంటారు. అర్హు లెవరైనా ఆక్షేపిస్తే కస్సుమంటారు. అర్హతా, అంతరంగ పారిశుద్ధ్యం సంతరించుకొన

డానికి మీరు వ్యక్తిగత పరాభవంగా గ్రహించి కసి పెంచుకొని, మనస్సులోనే కుమిలికుమిలి మసి అవుతారు. తమ కెంతో భవితవ్య ముంది కదా? మనస్సు పాదులో సామరస్యపు నీరుతో సహనపు సారును పెంచుకోవద్దూ!

ఈ పరిస్థితులలో ఎవరు పూర్వులలాగ 'వజ్రాయుధం' ఎత్తుతారు? ఎవరు 'ఉదయిని' తో జ్ఞానం ఉదయింపజేస్తారు? ఎవరు 'పరశువు'తో ప్రత్యక్ష మౌతారు? ఎవరు 'చింతామణి'తో దోషామయాలు నివారిస్తారు? కనుకనే చిత్త శుద్ధి శూన్యమైపోతూంది రచయితల్లో.

మరి అయితే, రాబోయే విమర్శలు ఎలా ఉంటాయి? ఎలా రూపు దిద్దు కుంటాయి? వ్యంగ్యం ప్రధానంగా, ఉత్ప్రాస రచనల రూపంగా వస్తాయేమో! ఈ పద్ధతి అభి ణీయం కాదు. మనకు నేటికీ ఒరవడి పడమటి గడ్డే కదా? అక్కడి ఉత్తమ స్థాయి సాహిత్య పత్రికలు తిరగవేస్తే తెలుస్తుంది; విమర్శలు ఎంత వీరవిహారం చేస్తాయో? సాహిత్యంలో అభిప్రాయాలు వైయక్తిక స్నేహగౌర వాలకు అడ్డురావనే సత్యం ఎలా వెదజల్లుతూ ఉంటాయో?

సంఘంలో అలాంటి స్థితిని—సహృదయ సుందరమైన స్థితిని, సహన బంధురమైన స్థితిని—కల్పించడానికి, తద్వారా సాహిత్యంలో అలాటి ఉన్నతిని సృష్టించడానికి మన మందరం పాటు పడవద్దూ! మనం ప్రతి దానికీ పంచవర్ష ప్రణాళికలు సిద్ధపరచుకుంటున్నాము; విమర్శ వికాసానికీ ఒక పంచవర్ష ప్రణా ళికనో పంచదశవర్ష ప్రణాళికనో చివరకు పంచాశద్వర్ష ప్రణాళికనో సిద్ధపరచు కుందామా?

ప్రతి రంగంలోను విమర్శ అభివృద్ధికి చిహ్నం కదా!

"హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపి వా."

# దేశినామమాలలోని
# మరికొన్ని తెలుగు పదాలు

"నిన్ను చూస్తే తందా మనిపిస్తుందోయ్!" అన్నారు డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఒకనాడు మద్రాసు సెంట్రల్ స్టేషనులో బండెక్కుతూ నన్ను చూచి. "అంతటి అపరాధం ఏమి చేశానండీ!" అని ప్రశ్నించాను విధేయతతో. "అపరాధమా? మహాపరాధమే చేశావు. సంస్కృత ప్రాకృత సాహిత్యాలకే ద్రోహం తలపెట్టావు. గాథాసప్తశతిలో తెలుగుపదాలు చేరాయని వ్రాశావు. ఈ ప్రతిలోమాన్ని ఎవరు సహిస్తారు?" అన్నారు ఉద్రేకంతో.

"భాషల విషయంలో అనులోమం ఎంత సహజమో ప్రతిలోమం కూడా అంతే సహజమండీ. రాజకీయ ప్రాబల్యం, సాహిత్య ప్రాచుర్యం, మత ప్రాభవం—ఈ కారణాలతో వ్యాపించిన సంస్కృత భాష విభిన్న సంఘాలతోను, జాతులతోను సంబంధం ఏర్పడిన కొద్దీ, వాటి భావాలను, వాటి భాషల పదాలను గ్రహించుకొంది. అన్యభాషా పదాలనూ, సంప్రదాయాలనూ సంతరించుకొనకపోయివుంటే సంస్కృత సాహిత్యం ఇంత విస్తరించి ఉండేదేకాదని విమర్శకులు అంటున్నారు. సంస్కృత ప్రత్యయాలతోను, ఉపసర్గలతోను ఇతర భాషాపదాలు వేషం మార్చుకొని సంస్కృతంలో లీనమైన వనడానికి తంత్రవార్తికకారుడైన కుమారిల భట్టు వాక్యాలే మనకు నిదర్శనం. జైన బౌద్ధ మతాల ద్వారా దక్షిణభారతదేశంలో వ్యాపించిన ప్రాకృతభాషకూడ సంస్కృతం వలెనే ఆ దేశభాషల సంప్రదాయాలనూ, శబ్దసముదాయన్ని తనవిగా చేసుకొనకపోలేదు. కాని,......" అని గుక్క తిప్పుకోకుండా అంటున్నాను.

"ఉండవయ్యా, నన్నూ మాట్లాడనీ. బండి ఎక్కు. కూచోని మాట్లాడదాం. బండి కదిలేసరికి దిగుదువుకానీ." అన్నారు ఆయన.

బండి ఎక్కాను. ఆయన ద్రావిడభాషా శాస్త్రజ్ఞులపై ఒక్క ఊపుగా విరుచుకువడి "ఎవరయ్యా వాటిని అన్యభాషాపదా లన్నవారు? ఏమిటి వినిగమనం?" అన్నారు. "ఇదేమిటండీ? ప్రాకృత కావ్య వ్యాఖ్యాతలందరూ అలాంటి పదాలను 'ఇతి దేశీ' అని నిర్దేశిస్తూనే ఉన్నారు కదా? వారు దేశ్యాలను ప్రాకృత ముద్ర వేద్దామనే వ్యామోహం లేనందున 'దేశీ' అని ప్రత్యేకంగా పేర్కొన్నారు.

రోలంబ, రింఛోళి, తాలూరాది దేశిపదాలు ప్రాకృతంలో చేరిపోగా, వాటిని సంస్కృత పదభ్రాంతితో సంస్కృత మహాకవులుకూడా గతానుగతికంగా ప్రయోగించగా, 'మేదినీ' మున్నగు సంస్కృత నిఘంటువులు స్వీకరించి సంస్కృతముద్ర వేశాయి. "రోలంబశబ్దం సంస్కృతేపి కేచిద్గతానుగతికతయా ప్రయుంజంతే" అని ఆచార్య హేమచంద్రుడు దేశీ పదకోశమైన 'దేశీ నామ మాల'లో (7-2) చర్చించాడు" అన్నాను.

"పదకొండో శతాబ్దంలో పుట్టిన ఆచార్య హేమచంద్రుడా నీకు ప్రమాణం? దేశీ నామమాల అనే తన దేశినిఘంటువులో హేమచంద్రుడు తద్భవాలనదగిన అమియణిగ్గమో, పుగిల్లదేవో వంటి పదాలనూ దేశిపదా లన్నాడని దానిని రెండవసారి పరిష్కరించిన శ్రీ పరవస్తు వేంకట రామానుజస్వామిగారు పీఠికలో తెలిపారు చూచావుకదూ?" అన్నారు ఆయన వెటకారంగా.

"చూడకేమండీ? ఆచార్య హేమచంద్రుడు తన కాలంలో సంస్కృత ప్రాకృత సాహిత్యాలలో యుగపురుషుడు. 1088లో జన్మించి జీవించిన 84 సంవత్సరాలూ తర్క, వ్యాకరణ, జైనవేదాంత శాస్త్రాలలోను, అలంకార సాహిత్యాలలోను ప్రామాణికమైన ఉద్గ్రంథాలు రచించిన వాగనుశాసనుడు. అలాటివాడు ప్రమాణం కాకపోతే మరెవరు ప్రమాణమండీ? హేమచంద్రుడు ప్రాకృత సాహిత్యంలో కనిపించిన దేశిపదాలను ఎంతో వివేచన చేసి కాని తన దేశీ నామమాలలో చేర్చుకోలేదు. తన ఈ నిఘంటువులో తనకు ముందున్న దేశి పదకోశకారులు అభిమాన చిహ్న, గోపాల, దేవరాజ, ద్రోణ, ధనపాల, పాదలిప్తాచార్య, రాహులక, శీలాంకాదులను ఉదాహరించి, కొందరి మతాలు ఖండించి, మరికొందరి మతాలు సమర్థించాడు.

'దేశీ దుస్సందర్భా
ప్రాయ స్సందర్భితాపి దుర్బోధా,
ఆచార్య హేమచంద్రః
తత్తాం సంధృభతి విభజతి చ.'

(దేశీ పదాలను అన్వయించడం కష్టం. అన్వయించినా అర్థం చేసికొనడం కష్టం. అలాటివాటిని హేమచంద్రుడు అన్వయించి సుబోధం చేస్తాడు) అని గ్రంథాదిలో చేసిన ప్రతిజ్ఞను నిర్వహించుకున్నాడు. 'ఇప్పటి దేశీ నిఘంటుకారులవీ, వాటి వ్యాఖ్యాతలవీ ఎన్ని తప్పులని ఎన్నను? (అధునాతన దేశీ కారణాం, తద్వ్యాఖ్యాతౄణాం చ కియంతః సమ్మోహాః పరిగణ్యంతే. 8-12)' అని విసుక్కున్నాడు

కొన్ని చోట్ల. తను సారతర దేశీ దర్శనంతో వ్రాస్తున్నానని, తన నిఘంటువులో పొరపాట్లుండవని 'తిణిస' శబ్ద వ్యాఖ్యాన సందర్భంలో స్పష్టపరిచాడు (తిణిసం చ వృక్షవిశేష మాచక్షతే. అస్మాభిస్తు సారతర దేశీ దర్శనేన తిణిస శబ్దో మధుపటలార్థో వ్యాఖ్యాతః. తత్ర యుక్తాయుక్తస్య బహుదృశ్వానః ప్రమాణం. 3-12). అంతేకాక దేశీ నామమాలలో పదా లన్నిటినీ అకారాదిగా-మొదటివర్గంలో అజాది పదాలు, అనేకార్థ పదాలు; ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ వర్గాలలో కచటతప వర్గాది పదాలు, వాటి అనేకార్థపదాలు, సప్తమ వర్గలో రలవకారాది పదాలు వాటి, అనేకార్థాలు; అష్టమవర్గలో సహాదిపదాలు క్రమబద్ధంగా ఇచ్చాడు. ఇలాటివాడు కాక మరెవరండీ ప్రమాణం?" అన్నాను.

"సరేకాని, హేమచంద్రుడు చెప్పిన దేశీ పద నిర్వచనం అతి వ్యాప్తం కాదూ?" అన్నారు ఆయన.

"అతివ్యాప్తం ఎందు కవుతుందండీ? అతడు స్పష్టంగానే చెప్పాడు.

'దేస విసేస వసిదిఇ
భణ్ణమాణా అనంతయా హుంతి,
తమ్హా అణాఇ పాఇఅ
పయట్ట భాసావిసేస ఓ దేసీ'

అని-(దేశవిశేష ప్రసిద్ధమైనవి అనంతంగా ఉంటాయి పదాలు. వాటి నుంచి అనాది ప్రాకృత ప్రవృత్త భాషావిశేషమే దేశీ) అన్నాడు కదా. అయినా,

'వాచస్పతే రపి మతిః
న ప్రభవతి దివ్యయుగ సహస్రేణ,
దేశేషు యే ప్రసిద్ధా
తాఙ్ శబ్దాన్ సర్వతః సముచ్చేతుమ్.'

(దివ్యయుగ సహస్రం శ్రమించినా వాచస్పతి అంతవాడుగూడా ఆయా ప్రాంతాల్లో ప్రసిద్ధమై ప్రాకృతంలో చేరిపోయిన దేశిపదాలను ఏర్చికూర్చడం కష్టం) అని ఎంతో వినయంతో స్పష్టీకరించాడు. దీనిని బట్టి తెలుగు, తమిళ, కన్నడాది దేశభాషా పదాలను ఎంతో శ్రమపడి, వాటి పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకొని క్రోడీకరించా డనకం విస్పష్టం" అన్నాను.

"అక్కడేనయ్యా కలిగింది అపోహ. హేమచంద్రుడూ అపోహపడ్డాడు. దానినిబట్టి శ్రీ రామానుజ స్వామిగారూ అపోహపడ్డారు. 'దేశీ నామమాల' గ్లాసరీలో కొన్ని దేశీపదాలకు మూలమంటూ తెలుగు, తమిళ, కర్నాటకాది పదాలు ఇచ్చారు. ద్రావిడ భాషా కుటుంబం అన్నదే లేదు. అంతా సంస్కృతం

నుంచీ వచ్చిందే" అన్నారు ఆయన. "శ్రీ రామానుజస్వామిగారు తెలిసినది కాక మరికొన్ని తెలుగు తమిళ పదాలు కనుక్కున్నానండీ నేను దేశి నామమాలలో" అన్నాను. ఆయన వినీ వినిపించుకోకుండానే, "ఏవీ: చెప్పు. ఖండిస్తాను," అన్నారు. "వినండి!" అంటూ మొదలుపెట్టాను.

అణ్ణీ = దేవర భార్యా. పతిభగినీ, పితృవ్వసా అని మూడర్థాలిచ్చాడు. ఇది పూర్తిగా తమిళపదం. నేడిది అన్నభార్య—వదినె—అనే అర్థంలో తమిళ దేశంలో వ్యవహారంలో ఉంది. తర్వాత వదినెగారు (పతిభగినీ) అనే అర్థం లోను వ్యవహృతమైంది.

ఉడూ = కృణపరివారణ — తృణావరణాచ్ఛాదనం అన్నాడు. ఆవరణంలో ఆశ్రయం ప్రధానంగా ధ్వనిస్తుంది గనుక ఇది వీడు అనే తెలుగుపదం నుంచి కాని, ఉడు-ధరించు అనే ద్రావిడ ధాతువునుంచి కాని నిష్పన్నమై ఉంటుంది. ఉడుపు, ఉడుగర తెలుగు.

ఊసలం = పీనం అన్నాడు. ఇది ఉసులుకొను అనే తెలుగు క్రియనుంచే పుట్టిఉంటుంది.

ఓఆవలో = బాలాతపః—ఉదయపు ఎండ. ఇది బాలాతప శబ్దభవం కావచ్చు కాని, దేశీ పదమన్నాడు గనుక వెయ్యిల్ అనే తమిళపదభవమా అన్న అనుమానం కలుగుతుంది. ఓలఇణీ = దయితీభూతా, ఇది వలచు అనే తెనుగు ధాతువునుంచి వచ్చిందనుకుంటాను. ఓలుంకీ = ఛన్న రమణం—అంటే దాగుడు మూతలు. ఒళిందుకొ్కళ్ అనే తమిళధాతువు దీనికి ధాతువు మూలమై ఉంటుంది. ఓసిఓ = అబలః. ఇది ఓసిలోడునుంచి వచ్చిందేమో! ఓసి—తమిళపదం.

కలింజం, కిలించం (కిలించిఅం) = లఘుదారు, చిన్నకర్ర, పుడక. కిలించిఅ శబ్దానికి కిలిచ్చిఅం అనే రూపాంతరమూ ఉంది. హేమచంద్రుడు కిలింజం, కిలించం అనే పదాలకు లఘుదారువు అన్న అర్థం చెప్పాడు కాని గాథాసప్తశతిలో (1-80) కిలించఅ కంటకేణ అని ప్రయోగం కనిపిస్తుంది. కిలించిఅ కంటఅం చిన్నముల్లు. ఈ కిలించిఅం క్రమంగా కిలింజం, కిలించం అని మారి చిన్నపుడక అనే అర్థంలో రూఢమై ఉంటుంది. మనకు సన్నని, నీచమైన అనే అర్థాలలో క్రించు, కించు శబ్దాలున్నాయి. తమిళ, కన్నడ భాషలలో కిళి, కిళింజల్, కిలిచ్చల్, కీళ్ శబ్దాలకు సన్నని, సన్నగా చేయు, చించు అనే అర్థాలున్నాయి. కొంచెం, కెల, శిల పదాలు అల్పార్థకాలు. కలింజ, కిలించ పదాలకు పైన ఉదాహరించిన ద్రావిడ పదాలకూగల సామ్యాన్నిబట్టి అవి వీటికి మూలమై ఉంటాయి. వీటిని గతానుగతికంగా సంస్కృత పండితులూ ప్రయోగించగా, త్రికాండశేషకారుడు కిలింజకం కిలింజం అని సంస్కృతముద్ర వేసి

సూక్ష్మదారువు అని వ్యాఖ్య చేశాడు. కీలం = స్తోకం. ఈ పదం ముందు చెప్పిన ద్రావిడ పదవర్గంలోనిదే.

కుమ్మణం = మానః. కుములు అనే తెలుగు పదాని కిది దగ్గరగా లేదూ? కుందఓ=కృశః, దీనికీ కుందు, కందు అనే తెలుగు, కన్నడ పదాలు మూల మనుకుంటాను.

చట్టూ = దారుహస్తః. కఱ్ఱగరిటె, తెడ్డు. చటుఅం - అని గాథాసప్తశతిలో (2.62) ప్రయుక్తమైంది. చట్టువం అనేపదం గరిటె, తెడ్డు అనే అర్థాలలో తెలుగు, తమిళాలలో ఉంది. "చట్టువం బొకచేత బట్టి ఖడ్గము సంక దగిలించి" (భార. విరా. 1-211). "ప్రక్షాళితంబైన పసిడి చట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి." (కాశీ. 7-147) చిన్న మట్టి, కఱ్ఱపాత్ర లను కన్నడంలో చటుకి అంటారు. దారుహస్తం అని హేమచంద్రుడు అర్థం చెప్పాడుగనుక దీనికి చెట్టుపదంతో ఏదైనా సంబంధం ఉందేమో! మొదట కఱ్ఱ గరిటెకు వ్యవహారంలో ఉన్న ఈ పదం తర్వాత గరిటె సామాన్యానికి వ్యవ హారమై ఉంటుంది.

చారో = ప్రియాలవృక్షః. సారచెట్టు. ఇది (సార-చార) తెనుగని వేరుగా చెప్పనక్కరలేదు. చుడులీ = ఉల్కా. కొలివి. చుడు (కాల్చు) అనే ద్రవిడపదం దీనికి మూలం.

జంబువో, జంబులో = వేతసః. జంబుగడ్డి. కన్నడంలోను, కన్నడ పరిసర ప్రాంతాలలోను ఒకరకం తుంగకు వ్యవహారంలో ఉంది.

తణ్ణాయం = ఆర్ద్రం. తడిసినది, చల్లనిది. తనియు, తనువు, తంపు తెనుగులోను, తణ్ణన, తంపు కన్నడంలోను ఉన్నాయి. ఇది తన్మూలజన్యపదం.

తాలూరో = ఆవర్తః. సుడి. తలయతి తలం దర్శయతీతి తాలూరః— అని కల్పశబ్దద్రుమం ఉత్పత్తి. తాలూరశబ్దం గాథాసప్తశతిలో (1-37) ప్రయుక్తమైంది. ఈ శబ్దం దేశీ అని వ్యాఖ్యాతలందరూ అన్నారు. తిర్, త్రిప్పు, తిరుగు, తలారు అనేవి తెలుగులో భ్రమి వాచకాలు. తలారు శబ్దానికి మరల తిరుగు అనే అర్థాలున్నాయి. "క్రేపులం దలచి తలారింపక" (భాగ 10 సం) అని ప్రయోగం. తలారుకు తాలూరకూ పోలిక ఉంది. తాలు శబ్దానికి తిరుగు, తాలించు, తాఁబోయు అనే అర్థా లున్నాయి. కనుక తలార శబ్దమే తాలూర శబ్దానికి మూలమై ఉంటుంది.

తిణిసం = మధుపటలం. తేనెతెట్టు; తిణిసపదం దేశి పదమని హేమ చంద్రుడు చేసిన చర్చను ఇదివరకే తెలిపాను. తేన్, తేనె, జేన్, జున్ను ద్రావిడపదాలు; తిణిసం ఈ తేనె నుంచి వచ్చి ఉంటుంది.

పడుజుఅఈ = తరుణీ. ఇది పడుచు, యువతి అనే తెలుగు సంస్కృత పదాల కలయికతో ఏర్పడిం దనుకుంటాను. పలం, పలసం = స్వేదః. ఇది పొలసు అనే తెలుగుపదం మారురూప మనుకుంటాను. పిల్లిరీ = గండుత్సంజ్ఞం తృణం. ఇది పులు, పుల్లు, పూరి—అనే తమిళ, తెనుగు పదాలనుంచి పుట్టి ఉండదా? పేండఓ = షండః పేడి. దీనికి మూలం పెణ్ అనే పదమై ఉంటుంది. పెండి అని దక్షిణాంధ్రుల వ్యవహారం. కనుక ఇది పెణ్, పెండి నుంచే వచ్చి వుంటుంది. పాణో = శ్వపచః పాణ శబ్దం గాథాసప్తశతిలో ప్రయుక్తమైంది. "పాణసి పువ్వు బోడులము" (హరిశ్చంద్ర. ఆ-2.) పాణసిలోని అంత్య సికారం రూపుచెడి పాణ మాత్రం మిగిలి ప్రాకృతంలో చేరింది.

ఫలహీ = కార్పాసవృక్షః. ప్రత్తి, ప్రత్తి చెట్టు. ఈ పదం గాథా సప్త శతిలో నాలుగుసార్లు ప్రయుక్తమైంది. "ఫలహీ కార్పాసవృక్షే దేశీ" అని కుల బాలదేవుని వ్యాఖ్య. హేమచంద్రుడు దీనికి వలహి, పవణీ అనే పర్యాయాలు కూడా ఇచ్చాడు. తెనుగు ప్రత్తే ఫలహీగా మారిందని నా నమ్మకం. ప్రత్తికి పూర్వరూపమైన పలుత్తి పలుత్తిఅయి అంత్య ద్విత్వాక్షరం ఊదిపలకడంలో కలిగిన ప్రయత్నంలో మొదటి ప్రకారం మహాప్రాణమైఉంటుంది పంది భోందీ అయినట్టు-పలుత్థీ, ఫలహీ అని. పత్త్రికా శబ్దంనుంచి పత్తిఅయివుంటుందని, ప్రపత్రికా శబ్దం నుంచి ప్రత్తి పుట్టివుంటుందని మీరు (శ్రీ నారాయణరావుగారు) చేసిన వాదం సహేతుకంగా కనిపించదండీ! పత్రికాశబ్దంనుంచే పత్తియ-పత్తీ కావడానికి వీలున్నా అర్థంకోసం లాక్షణికంగా నానాబాధలూ పడవలసివుంటుంది. ప్రపత్రికాశబ్దంనుంచి ప్రత్తి అనేరూపం అసలే కాదు. తెనుగు సంప్రదాయానికి ఉపసర్గవిధానమే విరుద్ధం. పత్రికానుంచి పత్తిఆకావచ్చుకాని "ఫలహీ"ని ఏ విధంగానూ సాధించలేము. ఛిద్ర వాచక ఛిల్ల- ఉచ్ఛిల్ల శబ్దాలు రెండూ వేర్వేరనీ, ఉచ్ఛిల్లశబ్దం ఉత్పూర్వక ఛిల్ల శబ్దం కాదనీ; దేశీశబ్దాలకు ఉపసర్గ సంబంధం వుండదనీ హేమచంద్రుడు ఉచ్ఛిల్ల పద వ్యాఖ్యలో (1-95) చర్చించాడు (నహి దేశీశబ్దానాం ఉపసర్గ సంబంధో భవతి). ఫలంనుంచి ఫలఅయినా ఫలీఅయినా ఫలహీ అని అంత్యహీకారం ఎక్కడనుంచి సాధించగలం?

బోదరం-పృథు. పెద్దది. ఇది బోద, బొద్దు అనే పీనార్థక శబ్దాలకు దగ్గరగా లేదూ?

ఘుండీరో = సూకరః. పంది. దీనికి ఘుండో, బుందో అనేవి రూపాంతరాలు. గాథాసప్తశతిలో భోండీ (5-2) అని ప్రయోగం. ఈ మాటలు వినీ వినగానే మనకు పంది అనే తెనుగుమాట మనసుకు తట్టడం లేదూ? ప్రాకృతంలో ఇ-ఏ-లకు, ఉ-ఓలకు పరస్పర వినిమయం సహజంగనుక భోండ శబ్దాన్ని

గ్రహించినట్టే. తెలుగువ్యవహారంలో పదాది అకారం ఎకార ఒకారాలుగా మారు తుంది. గడ్డ-గెడ్డ. గరిట-గెరిట మగడు-మొగడు. "మొగదొచ్చి పిలిచెను పోయి వచ్చెద సామి". పప్పులు-పొప్పులు. కన్నడంలోను ఇలా మారడం కద్దు ఇలాగే పంది పొందిఅయి, తవర్గం టవర్గంగా మారి పొండి అని ఊదిపలకటంలో చేయ వలసిన ప్రయత్నాన్ని బట్టి అదివర్ణం మహాప్రాణంగా పరిణమించి భోండి అయిఉంటుంది. ఇది ఈకారాంతం కావడం వల్ల స్త్రీలింగమని భ్రమపడినందున భోండ, భుండ శబ్దాలు కల్పించబడ్డాయి. భుండీరో పదంలో పంది ప్రాచీన రూపం తొంగి చూస్తున్నది చూడండి. పందికి పూర్వరూపం పంఢ్రి. ప్రస్తుతం తమిళంలో పన్ఱి. రేఫసహిత నకారాన్ని ఉచ్చరించడంలో న్ద్రి ఉచ్చారణ ఏర్పడు తుంది. న్ద్రి గూడా అవుతుంది. పన్ - రెండు = పంద్రెండు మళయాళరూపం. పన్నెండు తెనుగు వ్యవహార రూపం. పన్ద్రి పంది అయింది తెనుగులో. పన్ఱి అనేరూపం వ్యవహార చ్యుతమైంది. పన్ఱి నేడు తమిళ వ్యవహారంలో ఉంది. కనుక పంఢ్రి పదం ప్రాకృతంలో బుందో, భుండో, భుండీరో, భోండి అనే పెక్కు రూపాలతో చేరిందని ఊహించడం అసమంజసం కాదు.

మండిల్లో = అపూపః. భక్ష్యవిశేషం. ఇది తెలుగు కన్నడాల మండిగలు కాదూ? మట్టో = గర్వః, ఇది మొరటు, మోటు, మోడు శబ్దాల వికృతి అను కుంటాను. మాకందో = ఆమ్రః. మామిడి. దీని పుట్టు పూర్వోత్తరాలు చాల ఉన్నాయి, మరొకమారు చర్చిద్దాము.

హల్లీసో = రాసకః. మండలేన స్త్రీణాం నృత్యం. మనకు, కన్నడం వారికి హళ్ళి అనేపదం ఉంది. ఇది సున్నకు పర్యాయం. చిన్నవర్తులానికి అల్లి అంటారు కొన్ని ప్రాంతాలలో. గోళీలనుకూడా అల్లి కాయలంటారు. అల్లికాయలంటే గుండ్రని గుళ్ళు. బొంగరాలాటలో నేల మీద గుండ్రని గీటుగీచి దాని మధ్యన ఒక బొంగారాన్ని ఉంచుతారు చూచారా? అలా గీచే గుండ్రని గిరిని అల్లి అంటారు. అలాగే పిల్లలు ఒకరిచేయి ఒకరు పట్టుకొని గుండ్రంగా పందెం కట్టి నిలవడాన్ని అల్లి కట్టడం అంటారు. కనుక ఈ అల్లే హల్లీసో అయిందేమో! హల్లీసం నుంచే అల్లీ కాకూడదూ అని ఎదురుప్రశ్న వేస్తారుకదూ? కావచ్చు. కాని హేమచంద్రుడు దీన్ని దేశిపదంగా పరిగణించాడు కనుకనే ఈ శ్రమంతా.

హుడ్డా = పణః, పందెం. ఇది ఒడ్డు అనే తెలుగు పదం వికృతే అయి ఉంటుంది.

హేరంబో = మహిషః. దున్నపోతు. ఇది ఎరుమై (ఎమ్మె-క.ఎనుము-తె,) నుంచి వచ్చి, సంస్కృతంలోచేరి అన్వర్థ వాచకమైందని కిట్టల్ తన కన్నడ నిఘంటువులో వ్రాశాడు. హేమచంద్రుడు దీనిని దేశి అంటున్నాడు గనుక ఎరుమైనుంచి ఇది ప్రాకృతంలో చేరి ఉండవచ్చు.

హోరణం = వస్త్రం. ఇది పోరువై, పోరణం-అని ద్రవిడపదాల నుంచి వచ్చి ఉంటుంది. పోరువై అంటే కప్పుకొనే వస్త్రం. ఇంకా ఎన్నో ఉన్నాయి ద్రవిడ పదాలు-ఇలా చెబుతూ పోయాను.

బండి అరకోణంలో ఆగినప్పుడు గాని తెలీలేదు, ఎంతసేపు అయిందని. మరొక సమస్య వచ్చింది; టికెట్టు లేకనే బండి ఎక్కాను.

"చూచావా? నీ కిదే శిక్ష, తెల్లవారుజాము బండి ఎక్కి మద్రాసు చేరుకో. మరొకమారు హోరాహోరిగా పోట్లాడుకుందాం. ద్రావిడ భాషావాద సన్నిపాతం ముంచుకొచ్చింది మీ కందరికీ. స్వాస్థ్యం కలుగాలంటే కొంతకాలం పడుతుంది" అన్నారు ఆవేదనతో ఆయన.

నేను బండి దిగాను. బండి కదిలింది. సాహిత్యంలో అభిప్రాయ భేదాలను వ్యక్తిగత ద్వేషంగా భావించుకొని పగపట్టే ఈ కాలం ఎక్కడ? అభిప్రాయ భేదాలు వేరు. అభిమానాదరాలకూ, మానవత్వానికి సాహిత్యంలోని మతభేదాలు అడ్డురావనే ఆ సహృదయ విమర్శక పరిశోధకాగ్రణి ఎక్కడ? అలాటి ఉదాత్త హృదయుడు మరొకడు నాకు కనిపించలేదు. ఆయన కీర్తిమూర్తికి నా నమోవాకాలు.

# నాయనివారి ప్రణయ సూక్తం

సాహిత్యం సంఘానికి కొంతవరకు ప్రతిరూపమే గనుక దేశకాలాను గుణంగా మారడం సహజం. అన్య సంస్కృతుల వెల్లువలు ముంచెత్తినప్పుడెల్లా సంఘం, తదాశ్రితమైన సాహిత్యం మారాకులు తొడుగుతూనే ఉంటాయి. తెలుగు సాహిత్యంలో ఈ విధంగా తొడిగిన మారాకే నవ్యకవిత - కాల్పనిక కవిత.

ఆధునిక పాశ్చాత్య దేశాలతో మనకుగల సన్నిహితత్వం మున్నూ రేండ్లది. బుడతకీచులు ముందుగా మనదేశానికి వచ్చినా, ఒళాందులు వారిని అనుసరించినా, పిదప పరాసులు పయనమై చనుదెంచినా, హెచ్చుగా సంబంధం మనకు కలిగింది ఆంగ్లేయులతోనే. మనదేశంలో వారి పరిపాలనకు పునాది విద్యా విధానం, మెకాలే మాటలే దీనికి నిదర్శనం. ఇంగ్లీషు విద్య దేశంలో బాగా పాదుకొని, బలిసి ఇంగ్లండు భారతదేశాల మధ్య రాకపోకలెక్కువై, సంస్కృతి సంబంధం పెరగను పెరగను మన ప్రాంతీయ భాషల్లోను, భావనాపద్ధతిలోనూ, కళల్లోనూ ఆంగ్లేయుల ప్రభావం — పాశ్చాత్య ప్రభావం — ప్రతిభాసించింది. ఇటీవల యిది తెనుగు కవితలో ప్రస్ఫుటమైందని చెప్పకతప్పదు.

ఈ ప్రభావంవల్లనే—శృంగారం కేవలం కామక్రీడగాను, స్త్రీ వలపుల అచ్చులో పోసిన కులుకు మిటారి బొమ్మగాను ఉన్న సాహిత్యంలో నుంచి స్త్రీని ఉదాత్త మహిళగాను, శృంగారాన్ని సముదాత్త ప్రేమగాను అనందించే పాశ్చాత్య శాఖ చిగిర్చింది.

వస్తు ప్రధానమైన కవిత్వంలో మెరపుల లాంటి ప్రత్యేక కవితా రమణీయ స్ఫోరక పదావళి చెదరుగా మాత్రమే కనిపించేది. పరిపూర్ణంగా కుదించిన ఒక్కొక్క అతిమాత్ర భావనకు కవితా రూపాన్నిచ్చే "లిరిసిజం" సాహిత్యాం కురం కూడా అప్పుడే ఆకులు తొడిగింది.

కవి కేవలం దాగిఉండి ఏ నాయికా నాయకులతోనో మాట్లాడించడం కాక స్వయంగా తన హృదయాన్ని విప్పి చూపడం—ఆత్మాశ్రయత—కూడా అప్పు డప్పుడే ఆరంభమైంది. అతిప్రాచీనకాలంలోను, అతిప్రాచీన కవితలోను ఇలాటి లక్షణాలున్న కావ్యాలు లేకపోలేదు. కాని ప్రబంధయుగం "రోడ్ రోలర్" వాటిని తలయెత్తనివ్వలేదు. ఉత్తమోత్తమ కళాఖండాలుగా జనంలో అతి

ప్రచురంగా కనిపించే జానపదగీతాలకు ఆనాటి సాహిత్యం చొరరాని కంచుకోట అయింది. ఇలాటి దశలో సాగిన సాహిత్య నూతన ప్రవాహంలో ఉవ్వెత్తుగా లేచిన తరగలు శ్రీ కృష్ణశాస్త్రి, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ నాయని సుబ్బారావు, శ్రీ బసవరాజు అప్పారావు, శ్రీ నండూరి సుబ్బారావుగారలు.

కృష్ణశాస్త్రిగారి కవితాధార పూర్తిగా వైయక్తికం. వేదుల వారిది సంప్రదాయానుసారి. నండూరి వారిది జానపదమార్గం. అప్పారావుగారిది గేయఫణితి. కాని అప్పారావుగారికి, నాయని వారికి భావైక్యం కనబడుతుంది. అప్పారావుగారు

"ఎద మెత్త నౌటకై
సౌదగుందరా, అంత
మదిగల అహమ్మెల్ల
వదలిపోవునురా"

అంటే, నాయనివారు-

"ఆ తరిని విన్చె వలపులజోతి వెదకి
కనుగొనక వట్టి దాత్మ వికాసమనుచు"
"ఆది మొదలీ వనాంతరము
నందు జపాప్రసవంపు రేకులన్
గదుములుగట్టు రక్తిమము
గద్గదికం గొన కూనరాగపుం
బదములనెన్ని పాడితినా
స్వాంతము పొర్లు వియోగబాష్పపుం
జిదురలు రాలు పుప్పొడుల
చిన్న హృదంతరసీమ దాచుచున్"

అంటారు. నిరహంకారిత ఇద్దరికి సమానమే.

నాయనివారి "సౌభద్రుని ప్రణయ యాత్ర" 'ప్రణయసూక్త' మన వచ్చు. దీనికి సౌభద్రుడు, వత్సల ఆలంబనం మాత్రమే. వారి పేర కవి తన సంగతే చెప్పినా, ఇది కేవలం ఆత్మాశ్రయకవితే అయినా, సర్వజనీనతను సంతరించుకొన్నది. ఈ కావ్యానికి 'ఫలశ్రుతి' ఉండడం విశిష్టత. ఆధునిక భావ కవులందరూ విప్రలంభ శృంగారాన్ని అభివర్ణించిన వారే. కాని ఆ వియోగానికి విశ్రాంతి కల్పించినవారు కాదు. "సౌభద్రుని ప్రణయయాత్ర"లో కవి యాత్రను

"నీ తొడ తలాడగా శయనింపగలిగి
దేవి! నా జన్మమున్ సమర్థించినాను
ము క్తిసీమంతినీ ప్రతపాముగ్ధవరద
హ స్తవలయితుడౌ పరమాత్మబోలి"

సఫలీకరించి, నాయకుని పరమాత్మతో ప్రతిస్పర్ధిచేసి,

"అంతులేని యీ యాత్ర నిరంతరాయ
సాంతమయ్యెను నా జన్మ సఫలమయ్యె
ననుచు మూపున పూజోపహార సమితి
నించుకొన్నాను నీ పాదదీప్తధరణి"

అని శ్రమాపనోదనం అభినయించి ఊరటపడి,

"పరవశత్వమునన్ మేను మరచియున్న
నాకు నీ యమృతాలింగనమ్ము లోని
ప్రథమ సంస్పర్శనెల్ల విశ్వములు తోచె
నెన్నడునులేని యొక దివ్యదృష్టికలిగి"

అని పరుసవేది తాకినవానిలా, సత్యసాక్షాత్కారం పొందినవానిలా ఒడలు పుల కరింపగా,

"కలసిపోయిన యాత్మలు పులకరించు
నూతన పథమ్ములందు సంగీత మురలి
స్వాంత వీణాశ్రుతులు గల్పి పాడుకొందు
ఈ ఫలశ్రుతులింక నెన్నెన్నికలవో!"

అని అనంత ఫలశ్రుతులను ఆశంసిస్తారు.

వీరి కావ్యప్రణయం భౌతికావధులు దాటినట్టిది. తపస్సులో ఆనందం అంచులువారి తాండవించినట్టు ప్రణయశిఖా మాలికలలో తన మనసునే ఆనంద కందంగా చూస్తారు. ఈ శిఖామాలికలు ప్రియురాలి గాలి సోకితేనే స్వాంతంలో మంట మండించేవి. తన శరీరం తప్తమై ప్రణయాగ్నిలో జీర్ణమైపోయినా, భౌతిక ప్రతిబంధకం లేకపోయినా, తనలోని అగ్ని ప్రేయసిని కబళిస్తుందట.

"ఎడతెరపిలేక మండెడు నీ విశుద్ధ
వహ్ని నీ చేత రగిలింపబడిన మొదలు
నవనవానందకందమై నా మనమ్ము
తచ్ఛిఖా మాలికలలోన తాండవించు.

"మారుచుండును నాకేమి నీ రచించు
గాలి యందీ శరీర రేఖలు వినీల
జలధరాచ్ఛాదితమ్ములై స్వాంతమందు
మారుతోద్ధూత మిది పేర్చి మంటమండు.
ఈ శరీరమ్ము తప్తమై ఈ యనంత
శిఖి శిఖా మాలికలలోన జీర్ణమనుము
భౌతికమ్మైన ఈ ప్రతిబంధకమ్ము
లేక ఈ వహ్ని నిన్ కబళించితీరు."

ఈ పద్యాలలోని భావోద్వేగనిర్ఝరిణి, భావనాతీవ్రత ఈ ప్రణయ యాత్రను 'ప్రణయసూక్త' మని నిర్వచించడానికి ఆలంబన మవుతున్నవి. సూక్తమని వైదిక పరిభాషను వ్యవహరించడంలో తాత్పర్యం కాముక ప్రణయానికి ప్రాధాన్యం గౌణమనడానికే. దీనికి వీరి రచనలోని ప్రణయాహ్వానం, స్వప్న ప్రణయం, చింత, గాలిపటం, సాక్షాత్కారం, అవధి మొదలయిన ఖండికలు తార్కాణం.

ఉద్వేగం ఉరకలు వారుతున్నది కనుకనే, వీరి విరహంలో వాస్తవమైన వేదన కనబడుతుంది; కవితకోసం, కాల్పనికత కోసం తెచ్చిపెట్టుకొన్న విరహకాంక్ష కాదిది.

"అతి నిరాశతో మ్రింగిన హాలహలము
హృదయమందు సుధాజీవనదులు గట్ట
నేను నమృతశీలుండనై నిలిచినపుడు
దేవతలకైన నేను పెట్టినది భిక్ష,"

అన్నంతటి ఈ వేదన అతిలోకమైనది; దివ్యమైనది; బ్రహ్మానంద బ్రహ్మచారిణి అయినది. ఈ వేదనే కథవలె చెప్పిన "కత్తిపడవ" అన్న ఖండికలో, చిన్ననాటి ఆటపాటలలో వదిలిన కాయితాల పడవలవలె విడిపోయిన ప్రేమికులకు అనంతర వియోగావస్థలో—

"కాగితమ్మది యినుమున కన్న నినుము
ఆ చిఱుతకత్తి పదనున కంతులేదు
అచట ప్రేమస్రవంతి యవ్యాహతముగ
కదలుచుండుట జేసి నా బ్రతుకు నిలుచు"

అని పూర్వస్మృతులను పిండి సమాశ్వాసింపజేస్తుంది.

మొత్తం మీద ఈ ప్రణయయాత్రలో వీరు ప్రకృతిని గవేషించినారు. ప్రణయావిష్టస్థితి మొదలు పలుదశలలో తమ హృదయాన్ని ఉద్దీర్ణం చేసినారు. భవిష్యత్తు, ప్రేమ, ప్రకృతి, నేను—నీవు, ఈ పినాకిని పుట్టిన దెచటనో, అంతులేని యాత్ర, ఏనాటి కాంక్ష, ప్రళయం, నా గూడు-వంటి ఖండికలలో ఈ హృదయోద్గారం పొంగులు వారుతుంది. నేను-నీవు లోని—

"త్రిభువనమ్ములలో రసోద్దీపనమ్ము
వెల్లివిరియించు ప్రణయ రూపిణివి నీవు
నీ దరస్మితరోచిః ప్రసాదకాంక్ష
కొనలు సాగిన ముగ్ధ భిక్షుకుడ నేను.
"జన్మజన్మాంతరముల నా స్వాంత వీధి
నీ సుధాస్వాదులజ్జా విలాసరేఖ
పరపి కికురించిపోయిన మెరపు వీవు
నేను నీ మార్గములు చూచు నీరదుడను"

అన్న పంక్తులు హిందీ మహాకవి సూర్యకాంత త్రిపాఠీ నిరాలా మనోహరంగా ఆలపించిన

"తుమ తుంగ హిమాలయశృంగ
ఔర మైఁ చంచలగతి సురసరితా
తుమ విమలహృదయ ఆకాశ
ఔర మైఁ కాంత కామినీ కవితా.
...............
తుమ రఘుకుల గౌరవ రామచంద్ర
మైఁ సీతా అచలాభక్తి."

అనే గీతికలను స్మరింపచేస్తాయి. 'అసురకృతము' అన్న ఖండికలో అహంకారం కాకపోయినా

"ఎవ్వడే నీ గళమ్మునిం దిరవుకొనగ
నేను విసరిన ప్రేమ ప్రసూనమాల
నడుమనీవు చూడగబట్టి నలిపివైచి
నీ కనులయందు నెత్తురుల్ నింపినాడు."

అని ఆక్రోశం కనబడుతుంది. నిజమే, ప్రేమ ప్రతిఘటితమైనప్పుడు ఆక్రోశ రూపంలో ఆవేదన వెలువడక తప్పదేమో! చివరకు ఈ ప్రేమ కార్తిక పూర్ణిమ వలె ప్రసన్న చాంద్రీమయంకాగా, శుక్రవారంనాడు,

"ఆ త్రిలోకైక జనని పాదాబ్జ సవిధ
భూమి మీలిత నేత్రవై మోకరిల్లి
నీవు పూజా సుమమ్మువైనావు హృదయ
కర్ణికామూలమున భక్తికందళించి
అదరు పారవశ్యమ్మున దొడిమ యూడి
నేను పూవునై పడితిని నీదుచెంత"

అని ప్రేయసితో జంటగా చేరి పూజావ్యగ్రతతో కావ్యసమాప్తి చేయడం భారత సంప్రదాయసిద్ధమైన చతుర్వర్గ సాధనను సూచిస్తూ ఉత్తమ సంస్కారాన్ని వెల్లడిస్తుంది.

తక్కిన భావకవులు ప్రణయాన్ని తదేకంగా భావించినవారు. నాయని వారు ప్రణయాన్ని దేవీ మూర్తిలోని ఒక అంశగా, ఒక కళగా దర్శించినవారు. అంటే, తల్లి ఉద్బోధతో వలపులజ్యోతిని కనుగొనడానికి బయలుదేరి, తల్లికొరకే యాత్ర సాగించి, తుదకు ప్రియురాలితో చేరి తల్లికి నమస్కరించడమే పర మార్థంగా చిత్రించడంవల్ల సమగ్ర దేవీ మూర్తిని మాతృభావంతో పరికించి, ఏకదేశంగా తన ప్రియురాలిలో ప్రణయభావాన్ని చూచారు. సాటికవులలో కని పించనిదీ, వీరిలో కనిపించేదీ విశేష మిదే.

వీరి "మాతృగీతాలు" మాతృవియోగంవల్ల వెలువడిన విషాద జీమూ తాలు. వీరి నాన్నగారు వెంకటగిరి సంస్థానంలో ఉద్యోగిగా ఉండేవారట. ఆయ నంటే అందరికీ సింహస్వప్నమట. అందుకనే కాబోలు వీరికి తల్లి అంటే మక్కువ ఎక్కువ. ఆమె కాలధర్మం చెందినపుడు కలిగిన శోకవ్రాతమే ఈ గీతం :

"ఎంత దయలేని తల్లివే ఇంత జాలి
యెట్టిదో యెన్న డెరుగనియట్టి కఠిన
కాలచక్రమ్మునకు నన్ను కట్టివైచి
ఎగిరిపోతివ శాశ్వతమ్మగు సుగతికి"

అన్న గీతంలోని దుఃఖవిలులితపాశాలు మనల్నికూడా గుండెకరగించి కాలచక్రా నికి కట్టివేసేంతటి విసరుతో ఎగురుతున్నాయి! వీరి మాత ప్రారంభంలో

సామాన్యమాతగా కన్పించినా, చివరకు విశ్వమాతగా పరిణమించి సాక్షాత్కరిస్తుంది, కబీరు రామునివలె.

"అవ్యయ దయాంబురాశి! సద్యః ప్రపన్న
మధుర కీర్తి! శ్రీమన్మహా మాతృమూర్తి
మమ్ము నీ కటాక్షమ్ముల మనిచి దీపి
తమ్మొనర్పుమా జీవయాత్రా పథమ్ము"

అనడంతో ఈమె జగదేకమాతే! సామాన్య మానవీ మాతకు మరణానంతరమూ 'జీవయాత్రాపథమ్ము దీపిత మ్మొన'ర్చే కటాక్షం ఎక్కడిది?

''రెండు పొలిమేర లొకటైన రేఖమీద
నేను నీయొడియందున మేను మరచి
నిదురపోదును జోల పాడుదువు నీవు
చిచ్చికొట్టుచు చీకటుల్ విచ్చుదనుక."

రెండు పొలిమేరలు—భూమ్యాకాశాలు, చీకటివెలుగులు, సుఖదుఃఖాలు, స్వర్గ మర్త్యాలు, జననమరణాలు-ఇవి ఒక్కటైన రేఖలో మనను తన ఒడిలో పరుండ బెట్టుకొని, చీకటులు—అజ్ఞానాంధకారాలు—విచ్చేదనుక జోలపాడే అమ్మ ఎవరు? ప్రపంచంలో ఏమూలనయినా మాతృప్రేమ పొర్లిపొరని సాహిత్యం ఉండదు. ఆ సాహిత్యంలో ఈ 'మాతృగీతాలు' మణిపూసలు; అమ్మనుంచి అమ్మలగన్న యమ్మవద్దకు, ముగురమ్మల మూలపుటమ్మవద్దకు హృదయాన్ని కొనిపోయే కరుణావాహినులు.

వీరి "సౌందర్యలహరి" నామసామాన్యంలో శంకరాచార్యుల సౌందర్య లహరిని తలపిస్తుంది. కాని స్వతంత్రరచన; ఆ దేవీ పారమ్యపర—

"ఈ వనరాశి మధ్యమున
నీగతి నన్నెదురీద బంచి దుః
ఖావిలమైన నా బ్రదు క
నంత ముఖమ్ముల క్రుంగిపోవ నీ
వావలితీర సైకత వి
హార పథమ్ముల నా రరక్షణ
శ్రీ వెలయన్ చరించు చిటు
చిర్నగవుల్ పచరింతు వంబికా!"

లాంటి పద్యాలు నిజంగా శంకరుల సౌందర్యలహరిని జ్ఞాపకం చేస్తాయి; రచనా రామణీయకంతోను; భావనోదాత్తతతోను.

వీరు ప్రణయంలో వలువిధాలను తమ కవితలో కురిపించారు. అభినవ కృష్ణలీలలలో తమ పౌత్రుని యెడగల వాత్సల్యం వెల్లివిరిసింది. వీరి మిత్ర ప్రణయం అరమరలు లేనిది; మనస్సును కుమ్మరించేది. "ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా!" అన్న చేమకూరకవి అపవాదుకు అపవాద మైనట్టిది 'విశ్వనాథ వారి షష్టిపూర్తి' అన్న ఖండిక.

"గుదులుకొనంగ సత్కృతులు
గ్రుచ్చితి వాంధ్ర కవిత్వ కన్యకా
వదన వికాస హేతువులు
వానిని మించి నిసర్గ నిత్య సౌ
హృదమతివైన నీ ప్రణయ
రీతులు సన్గరగించు నెప్పుడున్
మృదు కరుణార్ద్రగీతికలు
నీ యెదలోతు లవెంత మెత్తనో!

"కద్రూజాహిత పక్షయుగ్మ ధృత వే
గప్రౌఢ సాహిత్య సం
పద్రూపమ్ములు నీ మహార్థయుత వా
గ్భాండారముల్; సత్కళా
ముద్రాంచద్రసవత్కథా కథన నై
పుణ్యమ్ము నీ సొమ్ము శ్రీ
మద్రామాయణ కల్పవృక్ష సుఫలా
త్మా! సత్యనారాయణా!"

వీటిలో నాయనివారు తమ యెదలోని మెత్తని లోతులను గుదులుకొన చూపినారు.

మనకు నూటికిపైగా అలంకారాలున్నాయి. అంగ్ల భాషలో ముప్ఫయిదాకా 'ఫిగర్స్ ఆఫ్ స్పీచ్' అనే పేరుతో అలంకారాలు వున్నాయి. కాని, ఆంగ్ల కవితలో భావచిత్రణం (imagery) అనేది అలంకారాలకు సంబంధించిందే అయినా, వాటికంటే హెచ్చయినది. ఈ భావచిత్రణ సామగ్రి మన రూపకోపమేత్ప్రేక్షా తిశయోక్తి దృష్టాంతాల వంటివాటికి సన్నిహితంగా ఉంటుందనడం నిజం. కాని, 'ఇమేజ్' అనేది కవితలో ఉంటే, దానిలో భావోద్వేగం, వైషయికత, అభిప్రాయ ప్రకాశనం, సంవిధాన క్రమం ఉంటాయని పాశ్చాత్య కావ్యజ్ఞులనే మాట. ఈ

పాశ్చాత్య భావచిత్రణ ప్రాభవం నాయనివారి రచనలలో అంతో ఇంతో పడక పోలేదు.

"ఈ చలిగాలి వోసుకొని
హృద్గగనమ్ము ప్రతిధ్వనించు బా
ధా చకితమ్మయై ప్రళయ
దారుణ శైత్యభరమ్ము నౌదలసి
మోచిన నాదుమేన్ వణకి
పోయెడు వెచ్చదనాల వెల్లి! నీ
పై చెరగింత కప్పుకొన
బట్టుము నాకు కృపా ప్రసన్నవై."

అనే సౌందర్యలహరిలోని పద్యంలో వెచ్చదనాల వెల్లి పాశ్చాత్య సంప్రదాయ మనుకొంటాను. మనకు తల్లిఒడి, తల్లిపంచ చల్లనివి; అమె అమృతనిష్యందిని. మనకు—ఉష్ణమండలంలోని మనకు—తల్లినుండి అవసరమైంది చల్లదనమే, పాశ్చాత్యులకు వెచ్చదనం.

ఒక భావం గ్రహించి. దానిపై కల్పనాపరంపర సాగించడం కూడా పాశ్చాత్య పద్ధతే.

"ఆ ఎగిరివచ్చు పూర్వదిశాభిముఖము
లైన పురుగులు రెక్క లల్లార్చుటందు
మధుర కంఠధ్వనులయందు మాటలందు
నీ బయలుదేరు సంగతియే భరించె"

భరించు (బేర్) అనే మాటపై తెనుగులో కల్పించిన పాశ్చాత్య రూపచిత్రణం కాదా ఇది?

"ఈ చవు లెట్టివో తెలియ
నింతకు పూర్వము నవ్యభావముల్
పూచిన తేనెలన్ తడిసి
పోయిన నా హృదయాంతరమ్మునన్
నీ చిరునవ్వు వెన్నెలలు
నిండిన యీ సకల ప్రపంచ మం
బా! చిగిరించునేని చరి
తార్థుడనే గద నాడు నాటికన్."

నవ్య భావముల్ పూచిర తేనెలన్ తడిసిపోయిన - అనేది ఆంగ్లభాషా ప్రభావ మనవచ్చు.

"మధుర వాత్సల్యవాహిని మాతృమూర్తి
నయన పథగామియౌ శుభోదయము మాపి
కాల పుస్తకపుం బుటలేల వెనుక
నతుకుకొనిపోయినవి తీయ నలవిగాక!"

పుస్తకంలోని పుటలు అతుక్కునిపోవడం అత్యాధునికం.

"నీకు హారతి యీయ గాంక్షించి నాదు
స్వాంతమను పళ్ళెరమ్మున వలపు గప్పు
రమ్ము వెలిగించి చూతు మార్గముల వంక
ననునిమేషమ్ము నీరాక కమృతమూర్తి."

వలచు ధాతువు భావార్థకమైన వలపునుంచి స్ఫురించిన మనసులోని వాసనా ప్రపంచాన్ని కాల్చివేశానంటారు. సూఫీలలో, ముఖ్యంగా కబీరు ఇలాటి భావ చిత్రణలు భక్తివేదాంతాలు మిళితంచేసి చెప్పడం తరచు. ఈ గీతంలోని ఉత్తరార్ధంలోని 'మార్గ'శబ్దం అన్వేషణ అని సాధనపరంగాను అన్వయించి చెప్పవచ్చు.

"వత్సలాఫాలమున నెలవంక గురుతు
కందళించి వికాసించి కళలుదేరి
తరుణ శారద రాకాసుధాకరాచ్ఛ
బింబము లనంతములు లెక్కపెట్టుకొనెడు."

ప్రాచీన సంప్రదాయపు పునాదిపై చక్కగా సాగిన ఆధునిక భావచిత్రణ పరమావధి యిది అనడంకన్నా, దీని ఇంపు సొంపులు వివరించడం ఆనందాతీత మనుకొంటాను.

వీరి "పద్యాలు జీవితాన్ని చీల్చుకొని వస్తవి. అందుచేత అంత బాధా కరంగా ఉంటవి...కవిత్వం ఈయనను వరించింది; వలపులో, విరహంలో, వేద నలో, మాతృప్రేమలో. ఈయన కవిత్వానికి హృదయం గీటురాయి. ప్రియురాలి యెడబాటు పిచ్చివాణ్ణి చేసింది. తల్లి మరణం ఘోరు మనిపించింది. ఆనందంలో స్వర్గవీథుల్లో విహారం చేయుస్తాడు; బాధలో హృదయాన్ని బద్దలు గొడుతాడు; బ్రతుకులో కవిత్వం ఏరుకుంటాడు. ప్రతి పాదం జీవించే పలుకుతాడు. ఈయన గీతాలు ఉజ్జ్వలములు, ఉన్నతములూ" అంటారు 'వైతాళికులు' సంపాదకులు.

నిజం! నిజం! వీరిస్థానం నేటి సుప్రసిద్ధకవుల వరుసనే. కాని వీరిపేరు ప్రచారం కాకపోవడానికి కారణం ఉందా? ఉంది. వీరు మితభాషులు; మందీ మార్బలం చేర్చుకొని రాజకీయ నాయకులలా ప్రచారం చేసుకొనే "భజన ప్రియులు" కారు; నిరాడంబరులు; నివురుగప్పిన నిప్పువంటివారు; చక్కగా చిక్కగా అతివేలమైన సంయమంతో, అనంతమైన భావనతో పద్యాలు చికిలీ పెట్టడం చేతనయినవారు; గనుక బాహ్యప్రచారం కోరే చిత్తవృత్తి కలవారు కాదు. ఇటీవల షష్టిపూర్తి చేసుకుంటున్న వీరిని

"ఒక చుట్టు కాలచక్రము
నకు నీకును షష్టిపూర్తి నలి నజుకృప నిం
కొకచుట్టు తిరుగునంతకు
నకుటిలమతి! నీకు పరమ మాయుష్యమగున్"

అని వీరు శ్రీ విశ్వనాథవారి షష్టిపూర్త్యుత్సవంలో వ్రాసిన వీరి మాటలే పలుకుతూ అభినందిస్తున్నాను.

# శివతత్త్వ సారం పాఠాల పరిష్కరణ

శ్రీ నిడదవోలు వేంకటరావుగారు 1960 ఏప్రిల్ నెల భారతిలో శివతత్త్వసార పాఠాల మార్పు తగునా?" అన్న వ్యాసంలో కన్నడ శివతత్త్వ సారం గురించి ప్రస్తావించి, "...అనాటికి సుపరిష్కృతములగు బసవపురాణాది గ్రంథములు బయలువెడలలేదు. ఇది యిటుండగా, మరికొన్ని యేండ్లకు (ఇప్పటికి ఇరువదియైదేండ్ల క్రితము) కన్నడభాషలో కూడ శివతత్త్వసారము లభ్యమైనది - పై రెండింటివలన శివతత్త్వసారము నింకను నెట్లు సమీచీనముగా ప్రాచీనాంధ్రభాషాలక్షణానుసారముగా సంస్కరింపగలమో విశదము కాగలదు. కన్నడభాషాకృతి కూడా మల్లికార్జున పండిత కృతమే" అంటూ తెనుగు శివతత్త్వసారములోని లోపాలను కన్నడ శివతత్త్వసారం సహాయంతో పూరించవచ్చునని, రెండుదాహరణా లిచ్చారు. "ఇట్లే పెక్కుచోట్ల పూరణములను, పాఠభేదములను నీ కన్నడ కృతి సాహాయ్యమున కనిపెట్టవచ్చును" అనీ అన్నారు.

కన్నడ శివతత్త్వసారం గురించి కొంత చెప్పవలసి ఉన్నది. 1935 వ సంవత్సరంలో నేను చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కోసం చాటు పద్యాలు సేకరిస్తుండగా, కొన్ని కన్నడ పద్యాల తాటాకులు క్రమసంఖ్యలో కనిపించాయి. పరిశీలించి చూడగా, కంద పద్యాలలో ఉన్న శైవమత గ్రంథపు తాటాకులుగా కనిపించాయి. శైలి ప్రాచీన ప్రౌఢ రచనలలో కనిపించే సహజ గాంభీర్య విలసిత. ఇది ఏదో అపూర్వ గ్రంథమే అయి ఉంటుందన్న నమ్మకంతో శ్రీ ప్రభాకర శాస్త్రిగారి వద్దకు పరుగెత్తుకొని వెళ్ళాను. వారు నా అంత ఆసక్తితోను చూచి, పరిశీలించి, శివతత్త్వ సారంతో పరిశీలించి, అదేనని నిర్ణయించారు. దీనిని 1950 లో ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం వారు బులెటిన్‌లో ప్రచురించారు.

కన్నడ గ్రంథ సాహాయ్యంతో తెలుగు శివతత్త్వసారంలోని పెక్కు పద్యాలను సరిదిద్దుకోవచ్చు. నేను మరికొన్నింటిని ఇక్కడ జిజ్ఞాసువులకు నివేదిస్తున్నాను.

(1) పుట్టనని చచ్చి, చానని
పుట్టెడు ప్రువ్వులు విధమున బురహరు భక్తిన్
ముట్టని మనుజులు సచ్చుచు
బుట్టుచునుండుదురు ముక్తిపురి కెడదవులన్. 199

ఈ పద్యం లఘుటీకలో శ్రీ లక్ష్మణరావుగారిలా వివరించారు - "పుట్టనని చచ్చి చానని పుట్టెడు = పుట్టినవి పుట్టినట్టుగనే లెక్కలేకుండ జచ్చుచున్నట్టు వంటివి యని యర్థము స్ఫురించుచున్నది. ఈ ప్రయోగము చింత్యము. పుట్టునని చచ్చి చానని పుట్టెడు = పురుగులు చచ్చునప్పుడు మరల బుట్టునని యనుకొనును. పుట్టునప్పుడు చావనని తలంచును. అనగా బురుగులకు బ్రదికి యున్నప్పుడు తమ కొక్కప్పుడు తప్పక చావుగలదన్న జ్ఞాన ముండదు. చచ్చునపుడు పునర్జన్మ జ్ఞానముండదు. ఇట్లవి యేవిధమైన జ్ఞానములేక మరల మరల బుట్టుచు జచ్చుచు నుండును. అట్లే శివభక్తిలేని మనుజులు మరల మరుజన్మ మెత్తుచు ముక్తికి దూరముగ నుందురు.

"పుట్టగని చచ్చి, చాగని పుట్టెడు — అనికాని, పుట్టగనెచచ్చి, చాగనె పుట్టి - అనికాని దిద్దవచ్చును. పుట్టిన కొందికాలముననె చచ్చి చచ్చిన కొలది కాలముననే పుట్టునని యర్థము."

కన్నడ పద్యంతో దీనిని పోల్చితే అర్థం సుగమం ఔతుందేమో చూద్దాం. కన్నడ పద్యమిది :

పుట్టల్కె సత్తు సాయలె
పుట్టిద పుళుగళవో లభ వభక్తియ నెందుం
ముట్టద మనుజర్ సాయుత
పుట్టుత్తం ముక్తి పురకె దూరదొళిర్పర్. 208

పుట్టల్కె సత్తు = పుట్టడానికోసం చచ్చి, సాయలె పుట్టిద = చావడానికే పుట్టిన - అని మొదటి పాదం అర్థం. దీని ప్రకారం తెనుగు పద్యాన్ని -

పుట్టగను చచ్చి చాగను
పుట్టెడు ప్రువ్వులు విధమున...

అని చిన్న మార్పులు చేసుకొనడంతో అర్థం విశద మౌతుంది. ఈ విధంగా మార్చనవసరం కూడ కనిపించదు ఒక విధంగా చూస్తే. పుట్టనని = (పుట్టన్ + అని) పుట్టడాని కోసం, చానని (చాన్ + అని) చావడానికోసం - అని సంధి చేసుకున్న చాలు. ఇలాటి ప్రయోగాలు పశ్చిమాంధ్ర ప్రజల నిత్య జీవిత వ్యవహారంలో వినిపిస్తున్నాయి.

(2) శ్వపచుండైనను శివ భ
క్తి పరుండగునేని నతడ ద్విజవర్యుం డా
శ్వపచునకు గీడు శివ భ
క్తి వరాఙ్ముఖుడైన యట్టి ద్విజుడు మహేశా. 194

దీని టీకలో-"శ్వపచునకు గీడు = శ్వపచునకు క్రిందివాడు. మాలవాని కంటె తక్కువవాడు" అని వ్రాశారు. 'కీడు' అన్నపదం కీళ్‌నుంచి పరిణమించినది. క్రిందు అని కూడా మారింది. శుభానికి తక్కువది. కనుక పలువురు పండితులు ఆక్షేపించారు కూడా. కాని, "కేవలాగ్రజన్ములకంటె నేమిట గీడు?" (ఉద్యోగ 1-268) అనే తిక్కన ప్రయోగం చూచినవారికి ఇలాటి ఆక్షేపణ కలుగదు. ఈ పద్యార్థం కన్నడ పద్యం చూస్తే స్పష్టమౌతుంది.

శ్వపచను మాగల్ శివ భ
క్తవరం తానాగ లాతనే ద్విజవర్యం
శ్వపచం గథమం శివ భ
క్తి పరాఙ్ముఖనప్ప విప్ర నగజారమణా.

శ్వపచం గథమం-శ్వపచునికంటే అధముడు-అని. కీడు శబ్దానికి అధముడనే అర్థం స్పష్టం.

(3) నిన్నెఱుగుచు దన్నెఱుగని
యన్నడు శివయోగమగ్న డనబడు (మదిలో)
నిన్నును దన్ను నెఱింగెడి
యన్నడు శివయోగమగ్న డనబడును శివా. 269

పై పద్యం రెండు అర్థాలలోను అనబడును అని ఉండడంవల్ల అర్థంకాక శ్రీ రావుగారు టీకలో చర్చించి "లేదా యుత్తరార్ధమున శివయోగమగ్న డనబడడు అని సవరింపవచ్చును. ఈ సందర్భమున పాలకురికి సోమనాథుని చెన్నమల్లు సీసములోని యీ క్రింది పద్యము చూడనగును" అని అనబడడు అనే మంచి సవరణ సూచించారు. కన్నడ పద్యం చూస్తే ఈ సవరణ ఎంత సమంజసమో తెలుస్తుంది.

నిన్ననె యఱివుత మఱవం
తన్నం శివయోగమగ్న నెనిపం బుధరో
ళ్నిన్నం తన్నుమ నఱిది
ప్పన్నం శివయోగమగ్న నెనిస నుమేశా. 280

శివయోగి ప్రధాన లక్షణమేమిటంటే శివునిలో తాదాత్మ్యం పొందడం. నా అన్న భావానికి తావులేదు. ఉంటే శివయోగి కాడు. "శివయోగ మగ్న నెనిప నుమేశా" అని - ఎనిపను-అనిపించుకోడు అనే కన్నడ పాఠాన్ని బట్టి "శివ యోగమగ్న దనబడడు శివా" అని మనం లక్ష్మణరావుగారి సవరణను సమర్థించవచ్చు. రెండవ పాదం చివరి 'ముదిలో' అనడానికి మారు 'బుధులన్' అని కన్నడంలోని బుధరోళ్ను బట్టి పూరించవచ్చు.

(4) అష్టాంగయోగ భక్తిన
భీష్ట ఫల ప్రదుడవైన యీశ్వర నిన్నుం
దుష్టి సన గొలిచి ముక్తివి
శిష్ట సుఖాఢ్యులగు టరుదె శివయోగాఖ్యుల్. 271

ఈ పద్యం నాల్గవ పాదంలోని శివయోగాఖ్యుల్ అన్నది అన్వయించ నందున "శివయోగాఢ్యుల్ - అని దిద్దవలయును" అని టీకలో శ్రీ రావుగారు సూచించారు. కన్నడ పద్యం చూడండి.

అష్టాంగయోగభక్తి యి
నిష్ట ఫలప్రదను మా నుమేశనె నిన్నం
తుష్టియి నర్చిసి ముక్తవి
శిష్ట గుణాఢ్య నహు దరిదె శివయోగి శివా. 282

శివయోగి ముక్తి విశిష్ట గుణాఢ్యుడు కావడం అరుదా - అని కన్నడ పద్యం నాల్గవ పాదంలో కర్త ఏకవచనంలోనే వుంది. టీకలోని సవరణ ప్రకారం శివ యోగాఢ్యుల్ అని సవరించడం వల్ల ఆఢ్య శబ్దం పునరుక్తమౌతుంది గనుక "శిష్టసుఖాఢ్యు డగుటరుదె శివయోగి శివా" అని దిద్దుకోడం సముచిత మను కుంటాను.

(5) ఆడుదురు జతలు వెట్టుచు
బాడుదురు (న్) గతులువేసి పరమానంద
క్రీడాసంగతి బ్రమథులు
కూడి వినోదింతురిట్లు గొమరుగ రుద్రా. 346

దీని టీకలో — "జతలు — దీనిని జతులు అని దిద్దవలయును. జతి గతి యనునవి నాట్య సంగీత శాస్త్రములలోని పదములు. జతి యనగా నాట్య యోగ్యతగల శబ్ద సంతతి (శబ్ద రత్నాకరము). ఇది సంస్కృత యతి శబ్దము నుండి పుట్టినది. యతియనగా వాద్యాంగ ప్రబంధ విశేషము. గతియొక గమన

విశేషము" అని వుంది శ్రీ రావుగారి సవరణ ఎంత చక్కనిదో కన్నడ పద్యం వల్ల గ్రహించుకోవచ్చు.

ఆడువరు జతియ నిక్కత
పాడువ రాకృతిగళం వినిర్మిసి ముదదిం
క్రీడాగతియిం ప్రమథర్
కూడి వినోదిసువ రింతు చెల్వాది శివా. 358

ఈ పద్యం మొదటి పాదంలో "ఆడువరు జతియ నిక్కత' అని స్పష్టంగా జతి ఏకవచనంలోనే ప్రయోగించినందున తెలుగు పద్యంలోని జతలను జతులు అని బహువచన రూపంగా మార్చడంలో విప్రతిపత్తి ఏమీ ఉండదు.

(6) పృథువిధి నిషేధలోక
ప్రథితోభయ కర్మరాశి బ్రాపించెన్ నీ
పథవర్తిని "తేషాయమ
యథాతథా" యనుటజేసి యంబారమణా. 461

"దీనియర్థము చింత్యము" అని టీకలో ఉంది. కన్నడ పద్యం చూస్తేనన్నా కొంత అర్థమౌతుందేమో ననుకుంటే అది సగంలో గ్రంథపాతం.

.................................
.........................యగుమొభవ
త్పథవర్తిగె తేషాం మమ
యథా తథా యెంబ కతది నగజారమణా. 476

తెనుగు పద్యం నాల్గవ పాదంలోని 'పథవర్తిని' కన్నడ పద్యంలోని 'పథవర్తిగె' అనేదాన్ని బట్టి 'పథవర్తికి' అని. తేషాంయమ'ను 'తేషాంమమ' అని సవరించుకుంటే, నీ పథవర్తికి పైన పేర్కొన్న కర్మరాశి ప్రాప్తించింది. 'తేషాం మమ యథాతథా' (నాకెట్లో నా వారికి అట్లే) అనే భగద్వాక్యం ప్రకారం - అని కొంచం సమన్వయించవచ్చు.

(7) శ్రీయును గులమును శీలము
నాయువు నష్టమగు (నతి) రయంబున ముక్తి
శ్రీయుక్తుల శివభక్తుల
బాయక నిందించునట్టి పాపాత్ములకున్. 206

రెండవ పాదంలో అతిరయంబున నన్నమాటలోని అతి అనే పదం ఉన్న స్థలం ఖిలమైనందున సంపాదకులు ఆ మాట చేర్చి కుండలీకరణం చేశారు —

అది అయివుండవచ్చుననే భావంతో. కన్నడ పద్యంవల్ల నిస్సందేహంగా అదే అర్థమని తేలుతుంది.

శ్రీయుం కులముం శీలము
మాయుష్యం నష్టమక్కు నిమిషదె ముక్తి
శ్రీ యుత శివభక్తర నురె
నోయల్ నిందిసుతమిర్ప పాపాత్మర్గం. 216

రెండవ పాదంలో 'నష్టమక్కు నిమిషదె' (నిమిషంలో నష్టమౌతుంది) అని వుండడం వల్ల అతిరయంబున అన్న సవరణ సముచితమైనదే.

(8) బ్రహ్మాభివంద్య ముఖ్యులు
బ్రహ్మ కపాలావళీ విరాజితులు వర
బ్రహ్మకారులు..............
బ్రహ్మేశ్వర నీ గణాధిపతులు కపర్దీ. 356

దీనిలోని లుప్తభాగాన్ని కన్నడ పద్యంలోని 'బ్రహ్మకారరు ధీరరు' (268) అన్నదాన్నిబట్టి 'బ్రహ్మకారులు ధీరులు' అని పూరించుకోవచ్చు.

(9) వివిధాబ్ధి మహా జలధర
రవులు గణేశ్వరులు మలయరాజప్రియ...
.........కొంద(లు)
భువనత్రయ సుందరులు త్రిపురదహన శివా. 358

దీనిలోని ఖిలభాగాలను కన్నడ పద్యం పూరిస్తుందేమో చూద్దాం.

వివిధాబ్ధి మహా జలధర
రవరు గణేశ్వరరు మలయరాజ ప్రియ కే
శవరాజప్రియె కెలబర్
భువనత్రయసుందరర్ పురత్రయహరణా. 270

దీనిని బట్టి,

రవులు గణేశ్వరులు మలయరాజ ప్రియ కే
శవరాజ ప్రియ కొందరు

అని సవరించుకోవచ్చు.

(10) ధరిత శిఖండులు ముండులు
గురు లఘువులు స్థూలసూక్ష్మకుంజర దీర్ఘుల్
పరికింప గామరూపులు
హరకొంద(లు) మీగణంబు లతికాంతాత్ముల్. 379

రెండవ పాదంలోని 'స్థూల సూక్ష్మకుంజర దీర్ఘుల్' అన్నచోట కుంజర శబ్దం అతకడంలేదు. స్థూలార్థకమనుకుంటే అంతకుముందే స్థూలపదం ఉంది. కనుక కన్నడ పద్యం చూద్దాం.

దురిత శిఖండర్ ముండర్
గురులఘుగళ్ స్థూలసూక్ష్మకుబ్జర్ దీర్ఘర్
పరికిసలు కామరూపర్
హర కెలబర్ నిజగణేశ్వ రతికాంతాత్మర్. 391

దీనిలోని రెండవ పాదంలో కుబ్జర్ (పొట్టివారు) అని స్పష్టంగా ఉంది. లావుపాటివారు, సన్నటివారు, పొట్టివారు, పొడుగువారు రకరకాల కామరూపులని అర్థం సరిగా ఉంటుంది. కనుక తెలుగు పద్యం రెండవ పాదంలోని కుంజర శబ్దాన్ని "కుబ్జులు దీర్ఘుల్" అని సవరించడం సమంజసం. కుబ్జను ఏ లేఖకుడో కుంజరగా వ్రాసుకొన్న దానివల్ల ఈ పొరపాటు కలిగి వుంటుంది.

ఈ విధంగా లభించినంత మటుకు ఇంకా ఎన్నో పాఠాలను సక్రమంగా సరిదిద్దుకోవచ్చు. ఈ కన్నడ, తెలుగు శివతత్త్వ సారాలను కలిపి ప్రకటించడం కూడా అవసరం.

# కుతుబుషాహీ సుల్తానుల ఆంధ్ర సాహిత్యపోషణ

"నల్లంగొండయు, నాగరి
కల్లును ధరణీ స్థలిం బ్రగల్భస్థలముల్"

అన్నది క్రీడాభిరామంలో వల్లభరాయడన్న మాట. దీనిలో అవంతైనా అతిశ యోక్తి లేదు. ఒక్క నల్లగొండే కాదు; తెలంగాణంలో ప్రతిదీ ప్రగల్భ స్థలమే. ఒకటి "వీరకుమారకోటికి" ప్రగల్భ స్థలమైతే, మరొకటి కవి పండితకోటికి, వేరొకటి మతాచార్య కోటికి.

"ఉరుతర గద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కెదైవాఱఁ
దెలుఁగు మాట లనంగవలదు; వేదముల
కొలఁదిగా జూడుఁ డిల......"

అని తెగేసి చెప్పిన కవివరుడు సోమనాథుడు జన్మించినది తెలంగాణంలో. 'అచ్చ తెనుంగు గబ్బమున కాదిపదంబయి పొల్చు భాగ్యమున్ హెచ్చుగ గన్న దేశము' తెలంగాణమే. స్వమతాభిమానులూ, పరదేశీయులూ అయిన ముస్లిం పాలకులు పరమతాలను గౌరవించి, పరభాషను— ముఖ్యంగా తెలుగును ఆద రించినది తెలంగాణంలోనే. ఈ ముసల్మానుల ఆదరంలో అచ్చ తెనుగు కబ్బము వెలసిందంటే ఆశ్చర్యం కదూ! శతాబ్దాల రాజకీయ తమో యవనికలు వీడి మనమంతా ఏకమౌతున్న ఈనాడు, మన పలుకును ఆదరించిన, అలకించిన, లా పించిన తురుష్క ప్రభువులను సంస్మరించుకొని, పరభాషను, పర సంస్కృ తిని మన్నన చేయడం నేర్చుకుందాం.

గోలకొండ రాజ్యం ఏలిన కుతుబ్‌షాహీ ప్రభువులకు స్వమతాభిమానం గాఢమే. కాని, అది బహమనీ సుల్తానులలో ఉన్నట్టు పరమత విద్వేషంగాను,

పరమత విధ్వంసకంగాను పరిణమించలేదు. వీరికి రాజ్యకాంక్ష మెండే. కాని అది బహమనీ సుల్తానులకున్న రక్తపిపాస మాత్రం కాదు. కుతుబ్‌షాహీలు స్వభాషను బహమనీలవలె ప్రేమించారు. అప్పుడు దక్షిణాపథంలో శైశవావస్థలో ఉన్న ఉర్దూకు ఊత ఇచ్చారు. ఉర్దూ కవితలు చెప్పారు- "తెలుంగా ధీశలు" కావడంవల్ల తెలుగునూ పోషించారు. తమ రాజ్యకార్యాలను ఫార్సీలోను జరిపారు; తెలుగులోనూ జరిపారు; తెలుగులో కవిత చెప్పారు.

కుతుబుషాహీ పాలకులలో విశేషంగా కీర్తించదగినవాడు మొదటి కుతుబుషా మూడవ కుమారుడు మూడవ కుతుబుషా ఇబ్రహీం, నిజానికి ఇతడు తెనుగువారికి గర్భశత్రువు. ఇతడు, ఏడేండ్లపాటు విజయనగరంలో తలదాచు కొన్నప్పుడు తెలుగు చక్కగా నేర్చుకున్నాడు. సలక్షణంగా మాట్లాడగలిగాడు. తమ గోల కొండ పట్టానికి వచ్చినమీదట, అహమ్మద్‌నగర్ సుల్తానుతో కలిసి అళియ రామ రాజుతో కత్తికట్టి తల్లికోట పోరులో అతనిని తుదముట్టించి, విజయనగరాన్ని తుంగభద్ర పాలుచేసిన దుర్మార్గుడు. ప్రాణాలరచేత పెట్టుకొని పారివచ్చి పంచజేరి కొడుకువలె కుడిచి రక్షకునే భక్షించిన ఇబ్రహీమును మనవారు తర తరాలకూ క్షమింపకపోవలసిందే. కాని, అలా జరుగలేదు. ఇబ్రహీం రస హృదయం, పరభాషా సహనం, పరమత సహనం మన వారిని - అందులోను తెలుగువారిని - లోగొనింది. "కవుల శ్రావ్యమగు కవితాధారా సుధారసమును కుత్తుకబంటిగా" ఇబ్రహీం క్రోలి తల ఆడించగా మనవారు తన్మయులైనారు. అతడు అడ్డుదిడ్డిగా తెనుగులో కవనం అల్లగా, రమ్మ పొమ్మని కవులతో సరసాలాడగా, ముగ్ధులై, తమకు అతడు అభిరాముడు కావడంవల్ల ఇభరాముణ్ణి చేశారు.

"ఆకుంటే వృక్షంబగు
ఈకుంటే లోభియౌను హీనాత్ముండౌ
మీకుంటే మాకిమ్మా!
మాకుంటే మేము రాము మల్కిభరామా"

అని "ఆకు, నీకు, మీకు, మాకు" సమస్యాపూరణంలోను యాచించారు.

"ధాటిగ నేగి, యుద్దగిరి
దార్కొని వేంకటరాజు దోలి, ముం
గోటల లగ్గపట్టి, విను
కొండయు బెల్లముకొండ తంగెడల్

పాటి మెయిన్ హరించి మఱి
బల్మిని గైకొనె కొండవీడుఁ, గ
ర్ణాటక రాజధాని, యిభ
రాముడు బాహుబలంబు మీఱగన్"

అని తెలుగురాజుల ఓటమిని, తమ తెలుగుదేశ వినాశాన్ని గుర్తించకనే ఇబ్రహీం పరాక్రమాన్ని ప్రశంసించారు.

"శరయుగమును జరణంబులు
నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
సరి ధరణిమోపి మ్రొక్కిరి
మఱి మఱి నీ శత్రులెల్ల మల్కిభరామా"

అని ముఖస్తుతులు చేశారు.

యరలవ మదనస యనుచును
బరువడి నీయక్షరముల భయనయతతులన్
నిరతమును వ్రాయ నేర్చిరి
మఱి మఱి నీ పుత్రులెల్ల మల్కిభరామా!

అని ఇచ్చకాలు పలికారు; చతురులు.

"నవ్వెనా, సంగీత నాదభేదవిధిజ్ఞ
ధీరాత్ములకుఁ బదినూఱులిచ్చు;
రమ్మనెనా, సభాప్రౌఢ సత్కవివర
జాలములకుఁ బదివేలు నిచ్చు;
కూర్చుండు మనియెనా, గురతరశాస్త్రజ్ఞ
లక్షణవిదులకు లక్షయిచ్చు;
'శాబాసురా' యన్న, సకలాశ్రితానేక
కోవిదులకు మెచ్చి కోటి యిచ్చు'

అని అతని ముఖకవళికలకు, మాటలకు టీకలు టూకలు చేశారు. దీనికంతా కారణమేమిటి? అతని రసికత, సరసత. ఒకనాడు ఇబ్రహీం కుతుబుషా—

'సకల వేదపురాణ శాస్త్రపారగులైన
యెంటరి విద్వాంసు లొక్కవంక
అష్ట భాషలయందు నాంధ్యంబు లేకుండు
హుంతకారి కవీంద్రు లొక్కవంక'

కొలువగా, అద్దంకి గంగాధరకవిని రావించి,

"గంగాధర సుకవీంద్ర య
భంగుర భవదీయ వాక్యపదగుంభనముల్
గంగాధర మౌళినటత్
గంగాధరగాతరంగ గంభీరంబుల్"

అని పొగిడి, తనకొక కృతి ఇవ్వవలసిందని కోరాడు. ఆ కోరికలోను విశేష ముంది.

"పెక్కుకృతుల్ చమత్కృతులు
బెంపున నందితిగాని నీదు స
మ్యక్కృతికన్యపైగల మ
మత్వము వర్ణిలదందు; లెక్కకుం
బెక్కువ గాఁగ గోపికలు
మించి వసించిన నేమి రాధపై
మక్కువ యెక్కువై మిగుల
మన్నన సేయడె శౌరి వేడుకన్?-

"అట్లు గావున భారతాఖ్యానమందు
గలుగు తాపత్య చరితంబు ఘనత మెఱసి,
వివిధ శృంగార మహిమల విస్తరించి
కబ్బ మొనరింపు నా పేరఁ గవి వరేణ్య"

అని ప్రాథేయబడ్డాడనే అనవచ్చు. కవితా రసమాధురి అలాటిది!

"యథా రాజా తథా ప్రజా!" అన్నారు గదా, పెద్దలు! రాజెంతటి స్వమతాభిమానో, అద్దంకి గంగాధరకవి కూడ అంతటివాడే. కనుక "అల్లాయో, రసూలల్లాయో ఇబ్రహీం పాదుషాను రక్షించుగాక!" అనే ఆశీర్వాదంతో ప్రబంధం ప్రారంభించక—

"......శౌరిఘను

దై కరుణా రస వృష్టిచే నిరా

యాసతఁ బ్రోచుఁగావుత న్న

పాగ్రణి మల్కిభరాము శాందిపున్" —

అని పూర్తిగా స్వధర్మానుగుణమైన దీవనతోనే ప్రారంభించాడు. ఇబ్రహీం గుణ గణాలను నోరార, నోరూర, గంగాధరకవి వర్ణించినట్టుగా మరొకడు వర్ణించి ఉండడేమో!

"గురుసార సత్కళా కరుణారసంబుల

రామచంద్రులతోడ రాయడించి,

పావనగుణధామ పావకత్వంబుల

నగ్నిమిత్రుల తోడ నవఘళించి,

భూభృతి ప్రాభవస్ఫురిత వితీర్ణుల

నాగార్జున ప్రౌఢి నలువుమీఱి,

చావవిద్యా శౌర్య శాశ్వతలక్ష్మల

నరసింహ పరిపాటిఁ బరిమళించి,

నవనిధానంబు లాత్మీయ నయనసంజ్ఞ

యాచకుల యిండ్ల తాండవం బాడఁ జేసె

రాజరాజును గైకొడె! రాజువేడె

పృథివి మల్కిభరాము భూమీశ్వరుండు"

అని కూడ తృతీయతో పురాణపురుషులు అందరితో పోల్చాడు.

ఇబ్రహీం మరణించినప్పుడు ప్రజలు, ముఖ్యంగా కవిపండితులు ఎంత దురపిల్లినారో ఈ చాటువు చూస్తే తెలుస్తుంది.

'రార విధాత యోరి విన

రా తగురా తలకొట్లమారి ని

స్సారపు లోభిరాజులను

జంపక మల్కిభరామ భూవరున్

జారుయశోధనున్ సుగుణి

జంపితి వర్థుల కేమి దిక్కురా

చేరిక నింత రాజును సృ

జింపగ నీతరమా వసుంధరన్!'

'యథా రాజా తథా ప్రజాః' అని ఇంతకుముందే గదా అన్నాను. తమ పాదుషా ఆంధ్రభాషను పోషించడం చూచి అతని ఆశ్రితులు, అధికారులు, మిత్రులుకూడ తెలుగు కావ్య కన్యలను వరించడానికి తొందరపడ్డారు-ఇబ్రహీం సైన్యాధికారి అయిన అమీన్ ఖాన్ అనే ముస్లిం రసికుడు కూడ ఒక ఆంధ్ర ప్రబంధం కృతి పొందాడు. ఇదే తెనుగు సారస్వతంలో మొదటి అచ్చ తెనుగు కావ్యమైన యయాతి చరిత్ర.[1] అచ్చతెనుంగు గబ్బమేడ! అమీను ఖాను దేడ! గోకులాష్టమికి పీర్లపండుగకు సంబంధంలాగ ఉంది కదూ! నిజంగా జరిగిందేమో అదే!

యయాతి చరిత్రను రచించిన పొన్నగంటి తెలగనార్యుడు గూడ గంగాధర కవి వలె తన కృతిభర్తను రక్షించవలసిందని ముక్తకంఠంతో వెన్నుని వేడినాడు.

"సిరుల మెఱుంగుబోడి తన
చెక్కులు సిబ్బెపు గబ్బి గుబ్బలున్
బరువడి నాల్గు చేతులను
బట్టగ నల్వ దలంచి కేలుదా
మర గుడికన్ను మూయుటకు
మాటికి నవ్వెడు వెన్నుడింపుతో
దిరమున బ్రోచు గావుత మ
దిం జెలరేగి యమీనుఖానునిన్."

అమీను ఖానుకూడ మాంచి సరసుడు. తరతరాలుగా ఆయన వంశంవారిది గోలకొండ సీమ; అందులోను సమీపంలోని పొట్లచెరువు కనుక ఆయన తెలుగువాడే. తెలుగంటే అభిమానం ఎందుకు లేకపోతుంది? అతనికి ఏ కోశానా మత ద్వేషం లేదు. అతనికి హిందువులన్నా, ముస్లిములన్నా సమానమే. అతని కుటుంబము వారూ అలాటివారే. అతడు పొట్లచెర్వులోను, ఇతర ప్రదేశాలలోను ఎన్నో చెరువులు తవ్వించాడట; తోటలు వేయించాడట.

---

1. మఱింగంటివారు మొదటి అచ్చ తెనుగు కృతిని రచించినట్టు శ్రీ శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు అంటున్నారు.

"అగరు లేలకి విరవాది యాకుదీగె
మల్లియలు గొజ్జఁగులుదాక మొల్ల మొగలి
మొదలుగా నివియెప్పుడు బూచికాచి
యుండుతోట అమీనుఖానుండు నిలిపె."

అమీనుఖాను పరమత సహనానికి పరమేశ్వరుడు కూడ మెచ్చాడట; పొట్లచెర్వులో అమీనుఖాను కట్టించిన మసీదులో మకాం వేశాడట.

"తామర తంపరై సిరుల
దార్కొను కాసలనాటి సత్య చిం
తామణి పొట్లచెర్లను స
తంబగుచుండ నమీను ఖాను డిం
పావహిలంగ నిల్ప బొడ
వై బెడగైన మసీదుగాంచి యం
దే మను వెండికొండవయి
కేగ దలంపక బేసికంటియున్."

"సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అన్న విశ్వాసం పాతుకొన్న తెలగన్న–

"పొడవుల కెల్లనుం బొడువు
ప్రోడలు నెమ్మదిలోన గాంచు ని
ల్కడ నెనలేని తేజున జ
గంబున కవ్వలైయైన వెల్గు నె
య్యెడలను బొందువారలకు
నెక్కఁగ నిచ్చెనయా మసీదు నిం
పడర నమీను ఖాన యొడ
యండు తిరంబుగ నిల్పె బొల్పుగన్."

అని "జగంబున కవ్వలయైనవెల్గు నెయ్యెడలను బొందువారలకు నెక్కఁగ నిచ్చెన" అని మసీదును స్తుతించడం ఆశ్చర్యం కాదు.

అమీనుఖానుకు బీదసాదల బిడ్డలకు పెండ్లిండ్లు చేయించడం సరదా!... (తక్కిన సరదారులకు నిక్కా చేసుకోవడంలో సరదాయేమో లెండి!)

"కడక నమీనుఖానుడు జ
గంబు తనుం బొగడంగ వేడ్కతో
విడువక యెప్పుడున్ బుడమి
వేల్పుల బిడ్డల బెండ్లిచేయగా
నడరెడు బీతు లోబొడమ
నందుకతంబునగాదె దూబి బే
రడవులలోపలన్ దబిసి
యై కనుపట్టెడు గాలి చూలియున్?"

అమీను ఖానునికి ముగ్గురు భార్యలు—ఒడేబీబి, సెక్కబీబి, సెమ్మా బీబి, వీరు ముగ్గురూ మహా పతివ్రతలు. పెద్ద భార్య బడేబీబీ సాక్షాత్తు అన్నపూర్ణావతారమే, అపర క్షీరసాగర కన్యే!

"కొడుకులకోట, పాల్కడలి
కూతురితో నెనవచ్చు లేమ, యె
ప్పుడు గడు బేదలాదరువు,
ప్రోచును జుట్టల గన్నతల్లియై,
యడుగిడ దావలం బెనిమి
టాడిన మాటకు, మాటవాసి జెం
దెడు బడెబీబి సాటిగల
దే మఱియొక్క పొలతి యెయ్యెడన్!"

అలాటి ఉత్తమ యిల్లాలు చేసే పనులు మరి ఎలాంటివి?

"అత్తవారింఢ్లకు నరుగు కన్నియలకు
కట్నంబు లిచ్చుచు గారవించు,
ప్రొద్దు ప్రొద్దుననె యెప్పుడులేచి వాడల
పసిబిడ్డలకు నెల్ల పాలుబోయు,
ఆకొన్న వారల కద్దమరేయైన
ఆరగించగ బెట్టు నరసి యరసి,
పాలునీరెనసిన బాగున బెనిమిటి
తలపులో మెలుకువ మెలగ నేర్చు,

బొర తన పుట్టినింటికి నత్తవారి
యింటికిని వన్నెదెచ్చిన తుంటవిల్తు
తల్లివంటి బడెబీబి దరమె పొగడ
తమ్మిపూవింట నెలకొన్న దంటకైన?"

అప్పటి బహమనీ సుల్తానులు ఒక ముస్లిం ప్రాణానికి లక్ష హిందువులను చంపాలన్న మొండి బండతనం కలవారు. బహమనీ సుల్తానయిన మహమూద్ షా లక్షమంది హిందువులను బలిగొనే వరకు అన్నం ముట్టనని ఒట్టు పెట్టుకున్నాడు. అలాంటప్పుడు అమీనుఖాను కుటుంబము వారు యెంతటివారో మదింపువేయడమే కష్టం!

అమీనుఖాను పట్టి ధార్మికుడు మాత్రమేనా! పండితుడు, సహృదయుడూను.

''పలుతలపుల బొలువగు తన
తలవాకిట నెపుడు బలుకు తలిరుంబోడిన్
బొలుపుగ గాపురముంచిన
మెలకువగల నేరుపరి.........

"లాలసరీ గజాంకుశుండును, రాయపక్షి సాక్ష్యుండును: సతాకా సింహాసనాధీశ్వరుండును, సింగిణీ సుర్తాణుండును, దురగారోహణ రేవంతుండును, సింహతలాట రాయుండును నగు మల్కిభరాము పాదుశాహునకు హితవరియై, చదువులకుం గుదురై, మన్ననల కెన్నికయై చెన్నొందు" వాడు, కనుకనే 'దీవులేలు బలియుల్ రౌతుల్ మొదల్గా దనుగొలువన్ సంతసమంది కబ్బములు పేర్కొవించు' ఆనందించేవాడు. ఆయనకు నేస్తము, మంత్రి మరింగంటి అప్పన. అమీనుఖాను ఒకనాడు పేరోలగంలో ఉంటూ తెలగనార్యుని పిలిపించి —

'కలపము చేసిన గంధం
బలదించిన వెనుక వన్నియల పచ్చడముల్
పలు మానికములసొమ్ములు
బలు తేజీ లిచ్చి కూర్మి పైపై బర్వన్'

మరింగంటి అప్పన్నను సాభిప్రాయంగా చూచాడట. అప్పుడు అప్పన్న—

"పిలిచె పొన్నగంటి తెలగన్న నీ చేయు
నచ్చు తెనుగు గబ్బ మన్నియెడల
మించి వెలయగా నమీను ఖానున కిచ్చి
పుడమిలోన సిరుల బొగడ గనుము."

అన్నాడట. దానికి తెలుగన్న ఒప్పు పొంగింది. అమీనుఖానువంటి సత్పురుషుడు కృతి మనసారా కోరి నోరారా అడిగితే కాదనే కవి ఎవరు? కనుక—

"అనపుడు బళి నా కబ్బం
బునకున్ రేడబ్బె దాని పుత్తడికిం గ
ల్గిన తీవి, ననుచు మదిలో
నను సంతసమంది కూర్మి ననలెత్తంగన్."

కృతికి పూనుకొన్నాడట.

ఇబ్రహీం కుతుబ్‌షా తర్వాత గోలకొండనేలిన మహమ్మద్ కుతుబ్‌షా కూడ భాషా పోషకుడే. ఇతని దర్బారులోను తెలుగు కవులు ఉండేవారు. ఇతడు తన బలం పెరగడానికి, హిందువులకు కూడ కొత్త ఊళ్ళిచ్చేవాడు. జాగీర్లిచ్చి కొత్త గ్రామాలు స్థాపించేవాడు. అలా వచ్చిన వారిలో దోమకొండ సంస్థానాధిపతులునూ ఒకరు. ఈ సంస్థానం మెదకు జిల్లాలోనిది (నేడు లేదు). ఈ సంస్థానాధీశుల పూర్వుడు మల్లారెడ్డి గొప్ప కవి. ఇతడు షట్చక్రవర్తి చరిత్రము, పద్మపురాణము, శివధర్మోత్తర ఖండము — అనే గ్రంథాలు రచించాడు. ఇతని తమ్ముడు ఎల్లారెడ్డి, ఈయన వాసిష్ఠము, లైంగ్యము అనే గ్రంథాలు రచించాడు— తన పూర్వులు మహమ్మద్ కుతుబ్‌షా ఆహ్వానంపై గోలకొండ సీమకు వచ్చినట్టు శివధర్మోత్తరంలో—

"ఘనుడా కాచ నృపాల శేఖరుడు మున్
గర్ణాట రాజ్యంబునం
దున దుర్గాధిపతిత్వ వైభవము
తోడ్తోగాంచి సుల్తాను పి
ల్పున కృష్ణానది దాటి యా మెదకు బల్
దుర్గంబు క్రిందన్ జిరం
తనహూ బిక్కనవోలునుండె నది
యాత్మస్థాన రాజంబుగన్"

అని చెప్పుకున్నాడు. ఈ మహమ్మద్ కుతుబ్‌షా దోమకొండరాజులను చాల సన్మానించాడట.

"భవ్యసుల్తాను మహమదు పాదుషాహ
లబ్ధ భూషణ లలిత పల్యంకికాత
పత్రచామర సామ్రాజ్య భరిత విభవ
రమ్యగుణశాలి శ్రీ కామరడ్డి మౌళి"

అని మల్లారెడ్డి చెప్పుకున్నాడు. మల్లారెడ్డితోపాటే గణనాథుడనే మరొక గొప్ప కవి కూడ మహమ్మద్ కుతుబ్‌షా ఆస్థానంలోనే ఉండినాడు. మల్లారెడ్డి—

"ధీనిధి సాహితీయుతు ప్ర
తీతయశున్ కుతుపావనీశ్వరా
స్థాన మహాకవీంద్రు నిజ
దర్శన కౌతుక వైభవాగతున్
శ్రీనరసింహ పండిత వ
రేణ్య కుమార గణేశధీరు స
న్మానముతో నెదుర్కొని న
మస్కృతి చేసి వసింప వేడుచున్"

అని చెప్పడం తప్ప మరే వివరాలూ ఈ గణనాథకవిని గురించి తెలియవు.

ఈ కుతుబుషాహీలకు తామే అన్ని కృతులకు భర్తలౌదామనే అంగలార్పు కూడ లేదు. కవులు వారి ఆస్థానములోనో, ఆశ్రయంలోనో ఉన్నా తమ ఇలవేల్పులకు అంకితం ఇచ్చుకున్న కృతులూ ఉన్నాయి. దానికి సుల్తానులూ ఆనందించారు. దీనికి మహమ్మద్ కుతుబుషా కాలంలోనే గోలకొండ కోటలో వున్న సారంగ తమ్మయ్య అనే గొప్ప కవిని తార్కాణంగా చెప్పవచ్చు. తమ్మయ్య సుల్తాన్ ఆశ్రితుడే! కాని, రామభక్తుడు, వృత్తి కరణీకం. అంటే గోలకొండకోట కరణమన్నమాట. ఇతనికి కుతుబుషాతో ఎప్పటికప్పుడు పని పడడం సహజం. ఎప్పుడూ ఆయన కనుసన్నలలో మెలగవలసిన వాడు కూడ.

"ఇనసము తేజులౌ నృపుల
నెల్ల మహమ్మదు శాహి యేలు నీ
యెనుబది నాల్గు దుర్గముల
నేలిన యేలిక గోలకొండ త
ద్ఘన నగరస్థలిన్ కరణి
కం బొనరించెడు తమ్మ మంత్రి యా
జనపతి రమ్ము పొమ్మన బ్రి
జల్ జయవెట్ట గృహస్థు లౌననన్"

భోగభాగ్యాలు అనుభవిస్తూ ఉన్నప్పటికీ,

"శ్రీ మహిళా మూర్త్యంతర
భూమిసుతా యోగయోగ్యభువనాద్భుత రే
ఖామంగళాంగ జిత సు
త్రామమణీ సోమునకును రఘురామునకున్"

సమర్పణంగా వైజయంతీ విలాసమనే కావ్యం రచించాడు. ఇది నాలుగా శ్వాసాల మధుర శృంగార ప్రబంధం. తొండరడిప్పొడియాళ్వార్ చరిత్ర తెలియనివారుండరు. ఇతడే విప్రనారాయణుడు. వేశ్యకు మోసపోయి తర్వాత తెప్పరిల్లిన భక్తుడు. ఈయనను మాయచేసి వలలో వేసుకున్న వేశ్యలు దేవదేవి, మధురవాణి శ్రీరంగంలోని తమిళ భామలు. కాని, సారంగు తమ్మయ్య రచనలో వారు అతని కాలపు కుతుబుషాల ఉంపుడుకత్తెలయిన భాగ్యమతి, ప్రేమామతి, తారామతి అనే తెనుగు భోగపు పడుచులుగా కనిపిస్తారు. వారిద్దరినీ చూడండి, ఎలా సింగారించుకు వెళ్ళుతున్నారో!

"ముఖమజ్జన మొనర్చి, నఖరేఖ రేఖగా
గమ్మకస్తూరి నామమ్ము దీర్చి
నునుపుగా దట్టు పున్గున దువ్వి పువ్వుదం
డలతోడ గోరకొప్పులు ఘటించి,
సొమ్ముల సొమ్ములౌ నెమ్మేనులకు వింత
యందంబుగా దావిగంధ మలది,
పావడరంగు పైపై వన్నియలుగుల్క
వలిపెంపు మడుగు జల్వాలు ధరించి
కప్పురపు దావి చిలుకు బాగాలొసంగ
నడపకత్తెలు తెలనాకుమడుపు లొసగి
నందియలు మ్రోయ నాస్థాని కరుగుదెంచి
రింతు లల కంతు పట్టంపు దంతులనగ."

కుతుబుషాహీల సామంతులు కూడ తెలుగును పోషించారు. కుతుబుషాహీల తర్వాత గోలకొండ నేలిన అబుల్ హసన్ తానీషా మనకు చిరపరిచితుడు. ఈతడే భద్రాద్రి రామదాసును గోలకొండ కోటలో బందీ చేసినవాడు. ఈతని మంత్రులైన అక్కన్న, మాదన్నలు కూడ పెక్కు కృతులకు భర్తలయ్యారు.

రాజకీయంగా కుతుబుషాహీలు ఏమిచేసినా తెలుగు సాహిత్యాభివృద్ధిని చూచినప్పుడు మాత్రం స్మరణీయులు కాకతప్పదు. భాగ్యమతి పేరుతో నెలకొన్న భాగ్యనగరమైన హైదరాబాద్ ఆనాటిలాగే నేడూ తెలుగు సాహిత్య భాగ్యనగరం అవుతున్నదికదా!

# బుద్ధునికి ముందునుంచే ఉన్న ధూమపానం

గుంతకల్లు-గుంటూరుబండి. ఒంటెద్దుబండి ఒడుపులో పరుగులుతీస్తూంది. "నిప్పెట్టుందా, అయ్యగారూ?" అనే సన్నని గొంతు వినిపించింది రైలుబండి రొదలో. కిటికీలోనుంచి వెన్నెలలో విశాల ప్రకృతిని చూస్తున్న వాణ్నల్లా యథాలాపంగా తలతిప్పి చూచాను. ఎదుటిసీటులో కూచుంది ఒక కార్మిక ప్రౌఢ. మరొకసారి మరికొంత స్పష్టంగా వినిపించింది అదేప్రశ్న. మళ్ళీ తిరిగి చూచాను. నేనూ ఆమె తప్ప ఆ పెట్టెలో మరెవరూ లేరు. కనుక నన్నే ప్రశ్న వేసిందా? ఛా! నన్నెందుకు అడుగుతుంది? అప్పుడు నాది శ్రోత్రియ వేషం. బిళ్ళగోచీ పంచకట్టు, చొక్కాలేని ఉత్తరీయం, గోష్పాదమంత జుట్టూ, ఛాందసమైన ప్రవర్తన-అనుకుంటూ ఉండగానే "నిన్నే అయ్యగారూ, నిప్పెట్టె లేదూ?" అన్నది. అగ్గిపెట్టె ఎందుకూ ఈమెకు? "ఏందయ్య గారు! ఉందంటే ఉందను; లేదంటే లేదను. ముర్రుపాలు తాగిన దున్న దూడలాగ చూత్తావేం?" అంది పండ్లిగిలిస్తూ. కొట్లు తిన్నంతగా బాధ పడ్డాను. "నిప్పెట్టెందుకూ నీకూ? నాదగ్గర లేదు" అన్నాను కోపంగా. "లేదన్నావుగా, నీకెందుకూ? నే సుట్టకాల్చుకుంటా" అన్నది. "ఆఁ! చుట్ట కాలుస్తావా?" అని గద్దించాను. "నీకేం? అడ్డపొగ పెడుతా" అన్నది గట్టిగా. నిజమే. నాకేం? ఇంతలో బండి ఒకస్టేషను వద్ద ఆగింది. మరొకరు పెట్టెలోకి ఎక్కారు. అతని వద్ద అగ్గిపుల్ల పుచ్చుకొని ఆ ప్రౌఢ చుట్టవెలిగించి కసికొద్దీ నామీదికే గుప్పుగుప్పున పొగ వదలింది.

ఆ పొగ గాటులోనే నా ఆలోచనలు రెక్కలు విచ్చాయి, దాని చరిత్ర కోసం. 'ముందున్న చెవులకన్నా వెనుకవచ్చిన కొమ్ములే వాడి' అన్న సామెత అక్షరాల నిజమైంది, ఈ పొగాకు దురభ్యాసం విషయంలో—అనుకున్నాను. అయినా ఈ పొగాకు ఇటీవలనే కదా మన ఖండంలో, మనదేశంలో వ్యాపించింది నాగజముడులాగ. మన దేశానికే ఏమిటి? యూరప్ ఖండానికి మహామారిలాగ పాకిందీ మూడువందల ఏండ్ల క్రితమే. నేడు మనదేశంలో పెద్ద పంటలలో ఒకటిది. మాన రాష్ట్రిందే అగ్రస్థానం ఈ పంటలో.

అమెరికాలో పుట్టిపెరిగి విశ్వవిజయం చేసిన దీని రకాలు 50 కి పైగా ఉన్నాయి. దీనిని 'నికోటియానా' అని ఫ్రాన్సులో పూర్వం అనేవారు. దీనిని ఫ్రాన్సుకు తెచ్చిన జీన్‌నికోట్ అనే అతని గౌరవార్థం ఈ పేరు పెట్టారు. నికోటియానా రుస్తికా అనేది మెక్సికో మొక్క. నికోటియానా తబాకమ్ కాలిఫోర్నియాది. ఈ తబాకమ్ అనే మాటే టొబాకొ అని, తమాఖు అని రకరకాలుగా మారింది. తంబాక్ - అరబ్బీ. తన్‌బాకూ-ఫార్సీ. తమాకూ, తమాక్, తంబాక్, బుజ్జేర్ భంగ్-హిందీ. తంమాకూ - మరాఠీ. తమకూ-సింధీ. తమాక్ - బెంగాలీ. తంబాకూ, హొగె సొప్పు - కన్నడం. పుగై ఇలై - తమిళ్. పొగాకు, పుగాకు - తెలుగు. నికోటియానా రుస్తికా, నికోటియానా తబాకం - ఇవి రెండువందల సంవత్సరాలుగా మనదేశంలో హెచ్చుగా పండేవి. ఇటీవల వర్జీనియా పొగాకు పంట హెచ్చయిందనుకోండి.

యూరోపువారికి పొగాకు తాగడం 1492 లో కొలంబస్ అనుయాయులు వెస్టుఇండీస్ దీవులలో చూచివచ్చిన తర్వాతనే తెలిసింది. నూతన దేశాలు కనుగొనడానికి బయలుదేరిన కొలంబస్ పొగాకు తాగడం మొట్టమొదట క్యూబాలో చూచాడట. ఆయన చూడలేదు- ఆయన అనుయాయుల 'గ్వానాహనీ' (శాన్ శాలడోర్) లో స్థానికులు తాగడం చూచారని కొందరు వృక్షశాస్త్రజ్ఞు లంటున్నారు. అక్కడివారు తాటాకు చుట్టలలో పొగాకు వేసుకొని (నేడు తెలంగాణా గ్రామవాసులు లాగ) తాగేవారట. పొగాకు మొక్కను 'కోహిబా' అని, కాలుతున్న దానిని 'టబాకో' అని వ్యవహరించేవారని కొందరన్నారు. పొగాకుపేరు 'గుయిఓజా' లేక 'కోహబా', దానిని కాల్చే గొట్టం పేరు 'టొబాకో' అనే వారని మరొక రన్నారు. Y (వై) ఆకారం గల గొట్టంలో పై పంగలు రెండూ ముక్కులో పెట్టుకొనేవారని, కింది గొట్టంలో పొగాకు కాలుతూ ఉండేదని ఒకరు తెలిపారు. ఈ గొట్టానికే 'టుబాకో' అని పేరన్నారు.

పొగాకు నములడం స్పెయినువారు దక్షిణ అమెరికాలో మొదట చూచింది 1502 లో. తర్వాత అమెరికావాసులంతా దీనికి అలవాటుపడడం చూచారు. నస్యం వేసుకోడమూ ఉండేది మెక్సికోలోను, అమెరికాలోని తక్కిన ప్రాంతాలలోను.

ఉత్తర దక్షిణ అమెరికాలలోని కొన్ని సమాధులలో ఎంతో పనితనం గల పొగాకు గొట్టాలు (చిలుములు) దొరికాయట. కొన్ని గొట్టాలపై ఉత్తర అమెరికాలో లేని మృగాల బొమ్మలు కూడా చెక్కి ఉన్నాయట.

అమెరికాలో పొగాకు పేర్లుకూడా రకరకాలుగా ఉండేవి. మెక్సికోలోనే 'పేటమ్, పేటన్, ఈటిల్' అనే పేర్లు వ్యవహారంలో ఉండేవి. పెరులో 'సాయ్రీ' అనేవారు.

యూరోప్‌కు మొట్టమొదట పొగాకు మొక్క వెళ్ళింది 1560 లో స్పెయినుద్వారా. స్పెయిన్నుంచి పోర్చుగల్లుకు, అక్కడినుంచి ఇతర యూరోప్ దేశాలకు వ్యాపించింది. పోర్చుగల్ రాజాస్థానంలో ఫ్రెంచి రాయబారిగా ఉన్న జీన్ నికోట్ ఒక డచ్‌వాని నుంచి పొగాకు మొక్క ఫ్రాన్సుకు తెచ్చాడు. డ్రేక్ వెంట విశ్వయాత్రకు వెళ్ళిన కాప్టెన్ రాల్ఫ్ లామ్ వర్జీనియా నుంచీ వస్తూ మరొక మొక్కను 1586 లో ఇంగ్లండుకు తెచ్చాడట.

భారతదేశానికి పొగాకు అక్బర్ పరిపాలన కాలంలో 1605 లో బుడత గీసువారు తెచ్చారు. మొదట ఇది దక్కన్‌లోని (నేటి కర్నాటక రాష్ట్రంలోని) బిజాపూర్‌కు వచ్చి, తర్వాత ఉత్తరభారతానికి పాకింది. అక్బర్ దీనిని తాగాడట. 17 వ శతాబ్దికిముందు తూర్పు దేశాలకు ఇది తెలీదని భావించాలి. బుడతకీచుల (పోర్చుగీసువారి) పలుకుబడి ఆ కాలంలో చాలబలంగా ఉండేది గనుక పర్షియా, అరేబియా, చైనా మొదలయిన దేశాలలో దీనిని వారు అలవాటు చేశారు. జావాకు ఇది 1801 లో చేరిందట.

పొగాకు తాగడంవల్ల పలువురు యువకులు ఆరోగ్యం చెడడం చూచి దానిని ఎవరూ వాడరాదని జహాంగీర్ పాదుషా హుకుం చేశాడని 'జహాంగీర్ స్మృతుల'లో ఉన్నది. లాహోర్‌లో పొగాకు తాగిన వారిని గాడిదలపై ఊరేగించే వారని, వారి పెదవులు కోసివేసేవారని పెద్దలంటారు. శిఖ్ఖుల దశమగురువు గురుగోవింద్‌సింహ్ తన మతంవారికి చేసిన ఉపదేశాలలో పొగ తాగరాదనేది ఒక్కటి. (క్షణం ఏమారినా గడ్డం కాలిపోతుందని కాబోలు!). అయినా ఈ పొగ తాగుడు కింది తరగతి శిఖ్ఖులలో రహస్యంగా జరుగుతూనే ఉంది. పఠానులలో పచ్చి పొగాకు నలిపి నోట్లో వేసుకోడం అలవాటు.

ఇదేమిటి? పొగాకు మనదేశందే. చాలకాలం కిందనే ఉన్నది. హిందీలో ఆదికవి అనదగిన అమీరు ఖుస్రో పద్యం ఒకటి ఉంది. పొడుపు పద్యం కూడా ఉంది—అంటారు శ్రీ గ్యాన్‌చంద్ వంటి పండితులు డాక్టర్ వి. కె. గోడేగారికి సమాధానంగా (భారతీయ విద్యా; సం-16. సం-1.). అమీర్ ఖుస్రో 1324 లో మరణించాడు. అయన పద్యా లివి:

''హ్నాయ థోయ సాజ మేరీ అయో
లే చూమా ముంహ హి లగాయో
ఇతనీ బాతపై థుక్కామథుక్కా
ఐ సఖి సాజన? నా సఖి హుక్కా."

స్నానంచేసి అలంకరించుకొని నా పక్క మీదికి వచ్చాడు. ముద్దు పెట్టుకున్నాడు ముఖంలో ముఖం పెట్టి. ఇంతలోకే మాటమాటలోనే ఉమ్మివేశాడు. ఏమిటి చెలీ! ప్రియుడా? కాదు చెలీ! హుక్కా.

నయీకీ ఢీలీ పురాణీకి తంగ్
బూర్యొతో నహీ చలో మెరే సంగ్.

కనుక మనదేశంలో పొగాకు చరిత్ర 14 వ శతాబ్దికి ముందుదే అని అంటారు.

"పొగాకుకు సంస్కృతంలో 'కలంజం' అని పేరు. హిందీ విశ్వకోశంలో దీనిని కలంజమని అంటారని, భారతీయులకు చాలకాలం క్రితమే తెలుసునని స్పష్టపరిచారు. శబ్దార్థ చింతామణి కలంజం = తమాఖూ సూరతీ అని అర్థమిచ్చి, విష్ణు సిద్ధాంత సారావళిలోని–

కలంజ సంవేష్టన ధూమపానాత్
స్యా దాంత్ర శుద్ధిః ముఖరోగహానిః,
కఫఘ్న మామజ్వర హానికృచ్చ
గాంధర్వ విద్యాప్రవణైక సేవ్యం.

అనే శ్లోకం ఉదాహరించింది. వాచస్పత్యం కూడా ఈ ఉదాహరణే ఇచ్చింది. మోనియర్ విల్లియం సంస్కృత నిఘంటువులోను, బృహత్ హిందీకోశంలోను పొగాకనే అర్థమే ఉంది. విష్ణు సిద్ధాంత సారావళి ప్రాచీనమే అయిఉంటుంది" అన్నారు శ్రీ గ్యాన్‌చంద్ గారు.

కలంజమంటే పొగాకు అని వీరందరూ ఎలా భ్రాంతిపడ్డారో ఆశ్చర్యమే. కలంజమంటే గంజాయి. విషబాణవిద్ధ మృగమాంసమని కూడా అర్థం. అందు వల్లనే "న కలంజం భక్షయేత్" అనే వాక్యానికి మీమాంసకులు విషబాణవిద్ధ మృగమాంసమనే అర్థం చెప్పారు. గంజాయి నమలడం, పొగతాగడం మనకు అతి ప్రాచీన కాలంనుంచే ఉంది. దానిని ఇష్టం లేనివారు విషవల్లరి, విషపత్రం అన్నారు. ఇష్టమున్నవారు జ్ఞానపత్రం అన్నారు.

అమీర్ ఖుస్రో చెప్పింది హుక్కా సంగతేకాని పొగాకు సంగతి కాదు కదా! హుక్కా, చిలుము, మామూలు గొట్టాలు - వీటితో పొగ తాగటం అతి ప్రాచీన కాలంనుంచే ఉంది. తథాగతుని కాలానికే బల్లంగా లేకపోతే అతడు తన శిష్యులకు ఈ విషయం ఎందుకు చెబుతాడు? వినయపిటకం మహావగ్గులో శిష్యుల ప్రశ్నలకు సమాధానంగా ఇలా చెబుతాడు :

"తేన ఖోపనసమయేన ఆయుస్మతో ఫిలిందవచ్ఛస్స సీసాభితాపో హోతి- అనుజానామి భిక్ఖవే ముద్ధాసి తేలకంతి, నక్ఖమనియో హోతి- అనుజానామి భిక్ఖవే

నత్థుకమ్మంతి...................నక్ఖమనీయో హోతి- అనుజానామి భిక్ఖవే ధూమం పాతుంతి. తజ్జేన వట్టిం ఆలిం పేత్వా పిబంతి-కంశం దహతి-అనుజానామి భిక్ఖవే ధూమనేత్తంతి-తేనఖోపన సమయేన ఛబ్బగ్గియా భిక్ఖూ ఉచ్చావచాని ధూమనేత్రాని ధారేంతి-సంఖ నాభిమయాంతి-తేన ఖోపన సమయేన ధూమ నేత్రాని అపారుతాని హోంతి, పానకా వవిసంతి-అనుజానామి భిక్ఖవే అపిధానంతి-తేన ఖోపన సమయేన భిక్ఖూ ధూమనేత్రాని హత్థేన పరిహరంతి-అనుజానామి భిక్ఖవే ధూమనేత్త థావికంతి-ఏకతో ఘంసియంతి-అనుజానామి భిక్ఖవే యమక థావికంతి-అంసబంధకో నహోతి-అనుజానామి భిక్ఖవే ఆంసబంధకం బంధన సుత్తంతి" (ఓల్డెన్ బర్గ్-వినయ-సంపుటం-I, పుట 204)

ఆయుష్మంతుడైన పిలిందవత్సుడనే భిక్షువుకు శీర్షాభితాపం (తలకు వేడెక్కడం) అయితే ఏమిచేయాలనే ప్రశ్నకు సమాధానంగా తథాగతుడు, తల మీద నూనె పెట్టుకోడానికి, నస్యకర్మ చేసుకోడానికి, ధూమపానానికి అనుమతిస్తాడు. "నస్యకర్మ చేసుకున్నప్పటికీ దుస్సహమైతే ఏమిచేయాలి-ధూమపానం చేయడానికి అనుమతిస్తాను. వర్తిగా చేసుకొని ధూమపానం చేయాలి. గొంతులో మంట అయితే ఏమిచేయాలి? చిలుములో (ధూమ నేత్రంలో) తాగడానికి అనుమతిస్తాను. ఈ చిలుము గొట్టాలు అపవిత్రమైపోయి, పురుగులు దూరితే ఏమి చేయాలి? ఆ చిలుము గొట్టాలకు మూతలు పెట్టుకోడానికి అనుమతిస్తాను. ఒకప్పుడు వాటిని చేత్తో తీసుకుని పోవడం కష్టమైతే ఏమిచేయాలి! దానికి బంధన మాత్రం (తాడు) కట్టి భుజానికి వేలాడవేసుకోడానికి అనుమతిస్తాను" అన్నాడు.

సంస్కృత సాహిత్యంలో ధూమవర్తిపానం రోగనివారణ కోసమూ, విలాసంకోసమూ, ఆధారమైనట్టు ప్రమాణాలు చాలా ఉన్నాయి. తారాపీడుడు "పరిపీతధూమవర్తిః" (ధూమపానంచేసి) విశ్రాంతి తీసుకున్నట్టు కాదంబరిలో ఉంది.

వైద్యక గ్రంథాల్లో నస్యధూమపాన ప్రక్రియలు శాస్త్రోక్తంగా వర్ణించబడ్డాయి. ఈ ధూమపానం ఔషధ ద్రవ్యాల ధూమపానం. ఇది ఎలా ఎప్పుడు చేయాలనేది చరకుడు చెప్పిన విధమిది :

"స్నాత్వా భుక్త్వా సముల్లంఘ్య
క్షుత్వా దంతా న్నిఘృష్య చ,
నావనాంజన నిద్రాంతే
చాత్మవాన్ ధూమపో భవేత్."

(చ. సూత్రస్థా 5,28)

స్నానం చేసిన తర్వాత, భుజించిన తర్వాత, జిహ్వాలేఖనానంతరం, తుమ్మ తర్వాత, పళ్ళుతోముకున్న తర్వాత, వమనం తర్వాత, అంజనం వేసుకొన్న పిదప, నిద్రలేవగాను - శ్రద్ధగా ధూమపానం చేయాలి. ఎలా తాగాలి?

''ఋజ్వంగచక్షుః తచ్చేతాః
సూపవిష్టః త్రిపర్యయం.
పిబే చ్ఛిద్రం పిధాయైకం
నాసయా ధూమ మాత్మతాన్.'' (42)

సరిగా నిటారుగా కూచుని, తదేక చిత్తంతో, ఒక ముక్కుపుటం మూసుకుని మూడుమాట్లు ముక్కుతో పొగపీల్చాలి. ఇక చిలుముగొట్టం ఎలా ఉండాలి అన్న విషయమై కూడా నిర్వచనా లున్నాయి :

''చతుర్వింశతికం నేత్రం
స్వంగులీభి ర్విరేచనే,
ద్వాత్రింశదంగుళం స్నేహే
ప్రయోగే చార్ధమిష్యతే.'' (43)

ధూమనేత్రం - చిలుముగొట్టం విరేచన క్రియకైతే 24 అంగుళాల పొడవు, స్నేహకర్మకైతే 32 అంగుళాలు.

కనుక, మనకు ధూమపానం చాలకాలం నుంచే ఉందనడం స్పష్టం. పొగ తాగడంకూడా అమెరికాలోని పూర్వవాసులు చేస్తున్నట్లే మనవారూ ముక్కుతోనే పీల్చేవారని అనడాన్ని చరకాచార్యులు తెలిపారు గదా. బౌద్ధంతోపాటు మన దేశానికి విహారాలతో ఈ ధూమపానమూ శాస్త్రీయంగా వచ్చి ఉంటుందేమో! (వైద్యకంలో ఉండనే ఉందాయె.) ఈ అభ్యాసం ఎలాగూ ఉంది గనుక కొత్తగా వచ్చిన పొగాకు పాత గంజాయిని ఔషధ ధూమవర్తిని తోసి రాజనింది.

కాకా, పొగాకు మనదేశంది కాదు; కలంజం గంజాయికాని పొగాకు కాదు; పొగాకు ఇటీవలిదేనని వృక్షశాస్త్రజ్ఞులు, ఇతర పండితులు చెబుతున్నారు.

ఇది దేశంలో నాలుగుమూలలా వ్యాపించినతర్వాతనే రకరకాల చాటువులు పుట్టాయి — "పొగత్రాగనివాడు దున్నపోతై పుట్టున్" వంటివి.

# నేటి తెనుగు కవితలో కల్పనా కామనీయకం

కవితాలతకు కల్పన బీజమైతే, భావన పాదు; మఱి సాధన దోహద క్రియ వంటిది.

ప్రకారాంతరంగా చెప్పవలసివస్తే కల్పన కవిత్వానికి తనువు; భావన ప్రాణం; సాధన దానికి ప్రాణప్రతిష్ఠ చేసే మంత్ర తంత్రాంగం.

కవితా మీ మాంస ఈనాటిది కాదు. ఒక్కొక్క కాలంలో కవిత, లేదా కావ్యం అన్న కళాస్వరూపానికి ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా తను మాన ధన ప్రాణాలు ఇవీ అంటూ నిర్వచిస్తూ వచ్చారు.

"శబ్దార్థసహితౌ కావ్యం" అని ప్రాచీన అలంకారికుడైన భామహుడు అన్నాడు. "కావ్యశబ్దోయం గుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయో ర్వర్తతే" అని వామనుడు కేవలం శబ్దార్థాలు కావ్య పద వ్యవహారాలు కావు. గుణాలంకార సంస్కృతాలుగా ఉండాలి— అని వివరించాడు.

"శబ్దార్థసహితౌ వక్ర కవి వ్యాపారశాలిని బంధే వ్యవస్థితౌ కావ్యం" అని వక్రోక్తి జీవితకారుడైన కుంతకాచార్యుడు వక్రోక్తి సహితమైన శబ్దార్థాలే కావ్యమన్నాడు.

"శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ" అని దండి నిర్వచిస్తూ, ఇష్టార్థవ్యవచ్ఛిన్నమంటే రమ్యార్థ సహితమని వ్యాఖ్య చేశాడు.

"తదదోషౌ శబ్దార్థౌ సుగుణా వనలంకృతీ క్వాపి" అని కావ్య ప్రకాశ కారుడైన మమ్మటాచార్యుడు అదోషాలు సగుణాలు - అలంకారాలు లేకపోయినా సరే- అయిన శబ్దార్థాలు కావ్యమన్నాడు.

"సాధు శబ్దార్థ సంబంధం గుణాలంకార భూషితం, స్ఫుటరీ తిరసోపేతం కావం కుర్వీత" అని కావ్యానుశాసనకర్త నుడివాడు.

"గుణాలంకారసహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ కావ్యం" అని విద్యానాథుడు మమ్మటాచార్యుని లక్షణాన్నే అనువదించాడు.

"గుణవ దలంకృతంచ వాక్యమేవ కావ్యం" అన్నాడు రాజశేఖరుడు కావ్య మీమాంసలో.

"వాక్యం రసాత్మకం కావ్యం" అన్నాడు సాహిత్య దర్పణకారుడైన విశ్వనాథ భట్టారకుడు.

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" అని నిర్వచించాడు పండితరాయ జగన్నాథుడు.

ఇవన్నీ మన అలంకారికుల నిర్వచనాలు. పాశ్చాత్యులు కవిత అంటే ఏమి స్వరూప స్వభావాలు తెలిపారో చూద్దాం.

"భావోత్కర్షతా ప్రకటనమే కవిత" అన్నాడు వర్డ్స్‌వర్త్.

"గానాన్వితమైన ఆలోచనే కవిత" అన్నాడు కార్లైల్.

"మన మనో బుద్ధి శక్తులకు అందనిదేదో కవిత్వం" అని షెల్లీ అంటూనే "కల్పనకు బాహ్యరూపమే కవిత్వమనవచ్చు" అని టుప్‌టీక చెప్పాడు.

"ఉదాత్త భావావేశాలను ఉదాత్త కల్పనతో వ్యక్తం చేయడమే కవిత్వం" అన్నాడు రస్కిన్.

అమెరికా దేశపు పండితరాయ లనదగిన అలన్ పో "లయాన్వితమైన రామణీయక సృష్టే కవిత్వం" అన్నాడు.

"తూగూ ఊగూ కల పదాలతో మానవుని మనస్సును కళాత్మకంగా చిత్రించడమే కవిత్వం" అంటాడు వాట్స్ డంటన్.

ఇవన్నీ కావ్య బాహ్య స్వరూప నిరూపణాలు. దానికి ఆత్మ ఏది? ఆయువు పట్టేది? అన్న విషయంలోనూ మత వైవిధ్యం ఉంది.

"రీతిరాత్మా కావ్యస్య" అని వామనుడు రీతికి ప్రాధాన్య మిచ్చాడు.

"వక్రోక్తిః కావ్యజీవితం" అని కుంతకాచార్యుడు చమత్కారమే కావ్య జీవితమన్నాడు.

"అలంకారా స్త్వలంగార్యా గుణాఏవ గుణాస్సదాః ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం" అని క్షేమేంద్రుడు ఔచిత్యమే ప్రాణమన్నాడు.

"కావ్యస్యాత్మా ధ్వనిరీతి బుధైః య స్సమామ్నాత పూర్వః" అని ఆనంద వర్ధనాచార్యుడు ధ్వనే కావ్యజీవితమని సిద్ధాంతీకరించాడు.

దానిని అనుసరించే మమ్మటాచార్యుడు "యే రసస్యాంగినో ధర్మాః శౌర్యాదయ ఇవాత్మనః" అని రసాన్ని అంగిగాను, తదితరాలను అంగాలుగాను పరిగ్రహించాడు.

విశ్వనాథుడుగూడ ఆ విధంగానే "శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ జీవితం వ్యంగ్యవైభవం" అని ధ్వనికి ఆత్మత్వం చెప్పాడు.

ఈ ధ్వనే అలంకారికులందరూ కావ్యాత్మగా ఒప్పింది. ఈ ధ్వని లేక రసం ఎలాటిది అని నిగ్గదీసి అడిగితే మాత్రం ఇదమిత్థమని చెప్పడం కష్టం. ఇది సహృదయ హృదయైకవేద్యం. అంటే గాలిని మనం కంటికి కనిపించక పోయినా, స్పర్శేంద్రియంతో తెలుసుకుంటున్నట్టు కావ్యాత్మను హృదయతంత్రులు మీటే ఆనందోద్బోధకశక్తివలన ఊహించుకోవచ్చు. కనుకనే అభినవగుప్తాచార్యుడు—

"వాచ్యభిన్నమై మరియొక సూచ్యమైన
వస్తువుండు మహాకవి వాక్యములను
వెలిక గనిపించు నవయవమ్ములకు గట్టు
వడని వనితలజిలుగులావణ్యమట్లు"

అని ముచ్చటగా చెప్పాడు (ఆంధ్ర ధ్వన్యాలోకం).

ధనం - ధ్వని - కావ్యాత్మ అనుకున్నాముగదా! మరి ఈ రస్యమానత ఎలా సాధించాలి?

కేవలం జగద్ధితమని ఏదో నీతి చెబితే అది వచనమైతేనే కాదు. ఛందోబద్ధంగా ఉన్నా అందులో ఏదో లేనప్పుడు-కావ్యం కాదు. పద్యాలన్నవే కావ్యమని అన్నా కుదరదు. జాతక చంద్రిక, లీలావతీ గణితం, మనుస్మృతి - ఇలాంటివి కావ్యాలు కావాలి అలా అయితే.

కావ్యంలో మిగతా వచనాలు వగైరాలలో లేనిదేదో ఒకటి ఉంది. అదే కల్పన. కవి ఉన్నదున్నట్లు చెప్పడు; రూపకల్పనకు పదకల్పననూ, అందుకు భావకల్పననూ జతపరుస్తాడు. నేటి కవితలో వీని తీరు తీయములు చూదాము!

"గాఢ నైరాశ్యములు గడ్డకట్టినట్టి
పేదగుండెలో మధురాశ ప్రిదిలినట్టు
కారుమబ్బులు పేరిన గగనవార్ధి
బంగరు తటిత్తరంగాలు పొంగులెత్తె"

అంటారు నారాయణరెడ్డిగారు. "వర్షావతారణం"లో కారుమబ్బులకు ఉపమానమైనది పేదగుండె.

"ఆమె కన్నులలో ననంతాంబరంపు
నీలినీడలు కలవు; వినిర్మలాంబు
పూరగంభీర శాంత కాసార చిత్ర

హృదయములలోని గాటంపు నిదుర చాయ
లందు నెడనెడ[గమ్ము; సంధ్యావసాన
సమయమున నీవ పాదవ శాఖికా[గ
ప[త కుటిలమార్గములలోపల వసించు
ఇరుల గుసగుసల్ వానిలో నిపుడు నపుడు
వినబడుచునుండు; మరికొన్ని వేళలందు
వానకారుమబ్బులుమెయి పన్నె వెనుక
దాగు బాష్పమ్ము లామె నే[తములలోన
బొంచుచుండును; ఏదియొ అపూర్వ మధుర
రక్తి స్ఫురియించుగాని, అర్థమ్ముకాని
భావగీతమ్ములివి......"

అంటారు కృష్ణశాస్త్రిగారు. ఆమె కన్నులలోని అవస్థాంతరాలకు ఇంతకన్నా కల్పనాభాష్యం కష్టం.

"యముని మహిషపు లోహఘంటలు
మబ్బుచాటున
ఖణేల్మన్నాయి!
నరకలోకపు జాగిలమ్ములు
గొలుసు [తెంచుకు
ఉరికి పడ్డాయి;
ఉదయసూర్యుని సప్తహయములు
నురుగులెత్తీ
పరుగు పెట్టేయి!
కనకదుర్గా చండసింహం
జూలుదులిపీ
ఆవులించింది!
ఇం[దదేవుని మదపుటేనుగు
ఘీంకరిస్తూ సవాల్ చేసింది!

నందికేశుడు రంకెవేస్తూ
గంగడోలును
కదిపి గెంతేడు!
ఆదిసూకర వేదవేద్యుడు
ఘుర్ఘురిస్తూ
కోరసాచాడు!
పుడమితల్లికి పురిటి నొప్పులు
కొత్తసృష్టిని స్ఫురింపించాయి!"

అంటారు శ్రీశ్రీగారు. సంఘర్షణం సంక్షోభం నూతన సృష్టికి కారణమన్నది ప్రకృతిసూత్రం. దీనికి కవి చేసిన కల్పనా భాష్యమిది!

"ఉషస్సు కిమ్మీర కవాటం తోస్తూ
ఒక్కమాటూ చూసిం దిటు;
తమస్సు పాషాణకిరీటం తీస్తూ
ఒక్కవరుగు తీసిం దటు;
పదండి అందాల పథమ్ముల
పాడండి అందాల పదమ్ముల
ఎత్తండి కాంతి పతాకాలు
ఒత్తండి శాంతి శంఖాలు"

అంటారు దాశరథిగారు. అరుణారుణ భవిష్యత్తు అవతరిస్తున్నది; నిరాశానిశ తొలగింది. బంగారు భవితవ్యం, శాంతి మన సొమ్ము - అనే ఆశాలతకు కమనీయ కల్పన యిది.

ఇట్టి సౌందర్యమే పొంగులువారే కల్పనతో మిత్రుడు విశ్వం మానవాళికి స్వస్తి పలుకుతారు ఈ క్రింది విధంగా:

"ఆకాశం తెరచీల్చి ఉ
షః కన్యక దువాళించి
శ్రీకారం చుట్టుతోంది
చీకటి మూకల వీపులు
బాకులతో పొడుస్తోంది.

వేకువ తెంపూ సొంపూ
చేకూర్చుక కేకవేయి
స్వస్తి సమస్తాఖిల జన
సఖ్యానికి సౌఖ్యానికి
ముఖ్యం ప్రాణం శాంతికి;
స్వస్తి, శ్రీరస్తు, చిరం
జీవులైన మానవులకు."

భాషచాలక భావాల బలమెక్కువై ఒక వక్రోక్తిని కని అవలంబిస్తాడు అందుకు భాషలోనే బీజా లున్నాయంటాడు మిత్రుడు విశ్వం. మనసు బాగా లేదనడానికి కడుపులో ఆవాలు పోసినట్టున్నదనడంలోనే కల్పన ఆరంభమైంది. ఎన్నో మాటలతో తెలుపలేని తన దురవస్థను ఒళ్ళంతా జెర్రులు ప్రాకుతున్నట్టున్నది అని అనడంలో స్పష్టంగా తెలుస్తుంది. తల వేయి వ్రక్కలవుతున్నది- కళ్ళలో మెరపొప్పొడి పోసుకుంటున్నాడు - ఇలాటి మాటలతో సామాన్య ప్రజలే తమ భాషను పదును పెట్టుకుంటారు.

కాలగతిలో మార్పు జరిగిన కొద్దీ, మానవుని భాషలో నైశిత్యం కొత్త రూపం ఎత్తుతుంది. పాశ్చాత్య నాగరకతా ప్రభావంవల్ల మన సారస్వతంలో విస్తరించిన ఆత్మాశ్రయ కవితలో ఇలాటి నిశిత పదావళి - ప్రత్యేక రామణీయక స్ఫోరక పదావళి అతిమాత్రంగా కనిపిస్తుంది.

"నా సౌమ్ము నా గుండె
నమిలిమింగిన పిల్ల"
"ఎలుతురంతా మేసి
ఏరు నెమరేసింది"
"కలవరపు నాబదుకు
కలత నిదురయ్యింది"
"కళ్ళకేదో మబ్బు
కమ్మినట్టుంటాది"
"నిదురల్లె నా ఒళ్ళు
నీరసిస్తున్నాది"

"గుండె గొంతుకలోన
కొట్లాడుతాది
కూకుండా నీదురా
కూసింత సేపు"

అని భావభావానికి కవితావతార మిచ్చే పదబంధాలరు గుప్పించాను సండూరి సుబ్బారావుగారు.

అలాగే కవి అనూనమైన ఆవేశం ఉంటేగాని ఎక్కడో, ఏనాడో జరిగిన విపత్తునో, సంతోషాన్నో చెబుతూ మరొకరిలో రసం ఉద్బుద్ధం చేయలేడు. అందుకే భావన కావాలి. తను భావించుకొని తద్భావభావితుడు కావాలి.

'కైలాస శిఖరమలు గడగి ఫక్కున నవ్వి
నీలమాకాశంబు నిటలంబుపై నిల్వ
నందికేశ్వర మృదంగ ధ్వానములు బొదల
తుందిలాకూపార తోయపూరము దెరల
చదలెల్ల కనువిచ్చి సంభ్రమత దిలకింప
నదులెల్ల మదిబొంగి నాట్యములు వెలయింప
వనకన్యకలు సుమాభరణములు ధరియింప
వసుధ యెల్లను జీవవంతమై బులకింప
ఆడెనమ్మా శివుడు!
పాడెనమ్మా భవుడు!"

అని పుట్టపర్తి నారాయణాచార్యులుగారు తాము నటరాజ తాండవంలో తాదాత్మ్యం పొంది ప్రకృతి అంతటా ఆ మహానాట్యాన్నే భావించుకొని మనను తన్మయులను చేశారు.

"మరచిపోవబోకే బాల
మరచిపోవకే?
హోరుమనే వారిరాశి
మారుమ్రోగె నాపాటను
విరిగిపడే తరగలలో
నురుగులలో పరుగులలో
మరచిపోవబోకే బాల!

ఒక్షణే యిసుక బయలు
ఒక్షణే నీరుదెసలు
కదలిపోవు దూరాలూ
చెదరిపోవు మేఘాలూ
మరచి పోవబోతే బాల!''

అని అడివి బాపిరాజుగారు ఒంటరి తనాన్ని మన ఎదుట తమ భావనాకుంచికతో చిత్రించారు. 'కదలి పోవుదూరాలూ' అనే వాక్యం పాఠకుని మనస్సును ఏకాంత తకు, అతి దూరాలకు తీసుకొని వెళ్ళుతుంది.

'నిజంగానే నిఖిలలోకం
నిండు హర్షం వహిస్తుందా?
మానవాళికి నిజంగానే
మంచికాలం రహిస్తుందా?
నిజంగానే నిజశెగానే
నిఖిలలోకం హసిస్తుందా?
దారుణ ద్వేషాగ్ని పెంచే
దానవత్వం నశిస్తుందా?
బానిసల సంకెళ్ళు బిగిసే
పాడుకాలం లయిస్తుందా?
సాధుసత్వపు సోదరత్వపు
సాధుత త్త్వ జయిస్తుందా?
జడలు విచ్చిన సుడులు రేగిన
కడలి నృత్యం శమిస్తుందా?
నడుమ తడబడి సడలి, ముడుగక
పడవ తీరం క్రమిస్తుందా?''

అనే గీతంలో శ్రీశ్రీగారి ఆవేదన "జడలువిచ్చి" "సుడులురేగి" "నిజంగానే" మన హృదయాలలో గింగురుమని మనస్సులను తర్కపు సరిహద్దులకు తీసుకు వెళ్ళి విశ్వాసపు టంచులలో విడుస్తుంది.

మనం అధివసించిన ఈ విశ్వానికి ఆవల ఏమున్నదనేది నిత్యప్రశ్న, యక్షప్రశ్న. ఎందరెన్ని సమాధానాలు చెప్పినా తీరేదికాదు. ఆ ప్రశ్ననే నార్ల వెంకటేశ్వరరావుగారు మరొకమారు వేశారు.

"ముద్దుపాప నిద్దురలో తొంగిచూచి దోగాడే
చిరునవ్వుల కెరటమ్ముల కావల నేమున్నదో
విభావరీ ప్రభాతాల ప్రత్యహ పరివర్తనలే
కీలకమౌ కాలోదధి కావల నేమున్నదో!"

ఈ ప్రశ్న ప్రపంచంలో ఎంత నిత్యనూతనమో కవితా ప్రపంచంలోనూ అంతకన్నా నిత్యనూతనమై మనోహర భావధ్వనికి దారి తీసింది.

కవి ఈ కల్పనా భావాత్మకమైన కవితకు ఛందస్సనే బాహ్యరూపంలో సమన్వయం సంతరించడమే సాధన. ఇది యోగుల నాదబిందు కళా సంయోగం వంటిది. ఈ కవితా మహాధ్వరమంతా సాధనే. ఈ సాధనలోనే సతమతమయ్యే సాధకుడే కవి. ఈ సాధన ఋక్కులతో ఆరంభమై నేటిదాకా సాగుతూనే ఉంది.

ఈ బాహ్యస్వరూపరహితమైన కవిత అశరీరమైన ఆత్మవంటిదని, ఈ బాహ్యస్వరూపమే ప్రధానమైన కవిత నిర్జీవమైన కళేబరంవంటిదని డబ్ల్యు. హెచ్. హడ్సన్ అంటారు.

ఈ బాహ్యరూపం గతిరీతి లయాత్మకమైంది. గతిలయలు మానవుని అపూర్వావేశంలో ముంచివేస్తాయి. "తడితే పాప నిద్రపోతుంది. తప్పెటకొడితే పసివారి కాళ్ళు అప్రయత్నంగా చిందులు తొక్కడానికి పైకి లేస్తాయి" అంటాడు మిత్రుడు విశ్వం. గతిలయల గమ్మత్తు అలాటిది.

ఈ గతిరీతి లయాలు అనేక విధాలుగా ఉండవచ్చు. ఒక్కొక్క సందర్భానికి, భావానికి అనుగుణంగా, కాల దేశానుసారంగాను మారనూవచ్చు.

"పరప్రతారణ పరబుద్ధుల మం
పరము వదలి కంపరము పుట్ట ఫా
లాక్షుడు తా ప్రత్యక్షంగా ఎదు
రొడ్డి నిలచినా గడ్డికఱువ కే
కోద్ధతి నుఱికే ప్రబుద్ధ జన సం
బరముచూచి అంబరమ్మునందుకొని
విరామ మెరుగని వరాకు తెలియని
జరామరణముల చాయపడని ని
ర్జర వజ్రాఘాత రక్తరంజిత
పరమవీర శంఖారవ మట్టుల
గర్జిస్తుందీ! గాండ్రిస్తుంది"

అని ఈ ఛందస్సు విశ్వం "నా హృదయం"లో వలె గర్జించవచ్చు.

''తరతరాల దరిద్రాల
బరువులతో కరువులతో
క్రుంగి క్రుంగి కుమిలి కుమిలి
కష్టాలకు నష్టాలకు
ఖైదులకూ కాల్పులకూ
సహనంతో శాంతంతో
బలిపశువై తలవాల్చిన
దీనపరాధీన జాతి
శ్రమికజాతి శ్రమికజాతి
దెబ్బతిన్న బెబ్బులివలె
మేల్కొన్నది ! మేల్కొన్నది !''

అని దాశరథి కృష్ణమాచార్యులుగారి "శ్రమికజాతి" వలె మేల్కొననూవచ్చు.

''ఇదే మాట ఇదే మాట
పదే పదే అనేస్తాను.
ఖదం తొక్కి పదంపాడి
కోటిన్నర నోటివెంట
పాటలుగా మాటలుగా
దిగిపొమ్మని దిగిపొమ్మని
ఇదేమాట అనేస్తాను.
వద్దంటే గద్దెయెక్కి
పెద్దరికం చేస్తావా ?
మూడుకోట్ల చేతులు నీ
మేడను పడదోస్తాయి
మెడనే విడదీస్తాయి.
బరాయె నాం నవ్వాబా
పరాక్రమం చూపేవా
దిగి పొమ్మని జగత్తంత
నగారాలు కొడుతున్నది
దిగిపోవోయ్ తెగిపోవోయ్
తెగిపోవోయ్ ! దిగిపోవోయ్ !''

అని దాశరథి కృష్ణమాచార్యులుగారి "అగ్నిధార"వలె "ఖదం తొక్కి పదంపాడి పదే పదే" సవాలు చేయనూవచ్చు.

"కాలావధుల కావల
వేలా వనాంతరాలలో
హేలా విహారం చేసిన
వేలాది ఋక్కుల
చూలాలు-భారత మేధాగరిమ
కాలు కాలిన పిల్లిలా
కాలువలో దూకి
జాలిగా మూలిగినది''

అన్న విశ్వం "నూరేళ్ళమాట"లో వలె కాలావధులను దాటవచ్చు.

''యుగసంధిది, సామాన్యుని
శకం దీన్ని కాదనరా;
దిది రేపొచ్చే వ్యవస్థ
కివాళ నుంచి పునాది;
ఇప్పటినుంచీ నాంది;
అంతే ఇంతే స్వప్నం,
అన్నీ ఒక్కడికి బదులు
అంతమందికీ అన్నీ !
అదే స్వర్గ మంటాను
ఆ స్వర్గం వేరే కడు
దూరంలో లేదు లేదు
ఈడే నేడే ఉన్నది,
నీలో నాలో ఉన్నది.
మీ యిష్టం ఈ ధాత్రిని
చేయవచ్చు స్వర్గంగా
చీల్చవచ్చు నరకంగా
ఏం చేస్తారో సరి మరి ఇక మీ యిష్టం''

అనే శ్రీశ్రీ గారి "సామాన్యుని కామన"లో వలె కాన్పూరువద్ద గంగా నదిలా నెమ్మదిగా సాగిపోవచ్చు.

"అనగా అనగా ఆంధ్రదేశమున
అధికారానికి వచ్చారయ్యా
అకస్మాత్తుగా ముగ్గురు రాజులు
ఒకరికి ఊరూలేదు-రెండు పేరూలేదు

ఊరూ పేరూ లేని రాజులూ
పట్టంకట్టే సంకల్పంతో
ఇట్టటు దిక్కులు పరకాయిస్తే
జాగా కానారాదు—చెప్తే వినాలేదు!

కని విని ఎరుగని కందనవోలు
కాలువగట్టున డేరావేసి
సాలురాబడిని గుణించిచూస్తే
రాబడి సున్నకు సున్నా - పోబడి హళ్ళికి హళ్ళీ!

హళ్ళికి సున్నకు పెళ్ళిచేయ పం
దిళ్ళు వేసి పెద్దలను పిలవగా
వచ్చిన మూడూ రూపాయల్లో
ఒకటి చెల్లాచెల్లదు-రెండు ఒల్లా ఒల్లవు.

చెల్లని ఒల్లని రూపాయలతో
పుల్లలు కంపలు కొని తెప్పించి
ముద్దుగ మూడు మేడలువేస్తే
ఒకటికి గోడల్లేవూ - రెంటికి కప్పుల్లేవూ!

గోడలు కప్పులులేని మేడలో
నీడలువారని కొలువు కూటమున
వరసగ మూడు తకులు వేస్తే
ఒకటికి కోళ్ళులేవూ - రెంటికి కాళ్ళూలేవు!

కాళ్ళూ కోళ్ళూలేని తక్తుపై
కళ్ళూ వళ్ళూ కానని ఆనని
ముగ్గురు రాజులు కొలువున్నారు
ఒకరూ కదలా కదలరు - ఇద్దరు మెదలా మెదలరు!

కదలని మెదలని రాజుల పొగడగ
వందనాలతో బందగీలతో
వచ్చారయ్యా ముగ్గురు బట్టులూ
ఒకరికి మాటారాదు - ఇద్దరు మంతీలేదు!

మాటా మంతీలేని బట్టులూ
పోటాపోటీ పడుతూ మూడు
చాటు పద్యాల్ చదివారయ్యా
ఒకటికి ప్రాసాలేదు - రెంటికి భాషాలేదు!

భాషా ప్రాసా లేని పొగడ్తకు
ఖలేకుషీ అయిపోయిన రాజులు
ఇచ్చారయ్యా మూడు ఇనాములు
ఒకటి కానారాదు - రెండు లేనేలేవు!

హుళక్కి బహుమతి పొందిన భట్టులు
బజారులో పదిమందిముందరా
మౌనంగా బిట్టేడ్చేరయ్యా
దీని భావామేమి? దీని తత్త్వామేమి?''

అని రాంభట్ల కృష్ణమూర్తిగారి "శశ విషాణం" గీతాలలో లాగా పాతకాలపు "తత్త్వాల" తీరున ఝరీవేగంతో జాలు వారవచ్చు.

ఇంతకూ ఈ రచన అన్నిటిలోనూ ఛందస్సు-అది ఏ రూపంలో వున్నా— లయ బద్ధమై పాఠకుని మనస్సును సునిశితంగా భావోన్ముఖం కల్పనాస్వాదన పరాయణం చేయడానికి ఎంతగా సహకరిస్తుందో చెప్పడం చర్వితచర్వణం. ఛందోబద్ధమైన భావం, కల్పన మన హృదయాలలో హత్తుకున్నంతగా ఛందోబద్ధం కాని దానికి పొత్తు కుదరదనడమూ ఆమ్రేడితమే

ఏమైనా కవిత గతి రీతి లయాలతో - ఛందస్సుతో - సంగీతంతో పోటీ పడుతుందేమో ననిపిస్తుంది. కనుకనే "విజ్ఞానం ఎప్పుడూ గణితం వైపు బారలు చాపుతుంటే, కవిత్వం అనవరతమూ సంగీతం వైపు సాగిపోతూ ఉంటుంది" అన్నాడు కాడ్వెల్.

మరి పాశ్చాత్య ప్రాభవంతో వచ్చిన వచనగంధి పద్యాలలో (బ్లాంక్ వర్స్‌లో) ఈ గతిరీతిలయా లేవీ? - అనవచ్చు కాని కల్పనా కామనీయకం, భావనాబలం కల కవి చెప్పిన వచనగంధి వృత్తాలూ మనలను అపూర్వ రమణీయ సీమలను చేర్చుతాయి.

"శవం బతకడం ఎంత విచిత్రమో
మనం మేలుకొనడం అంత విచిత్రమే
ఎవడో కొత్తరకం వైద్యుడు
ఏదో కొత్తతరహా ఔషధం వాడివుండాలి
లేంది ఇన్నాళ్ళ నల్లమందు మత్తు
ఇంత త్వరగా విడిపోవడం సులభమా?
ఏమైతేనేం, వెళ్ళి చూచిరావడం మంచిది
మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్తున్నాను."

అని దాసజాతి జాగ్రదవస్థను ఎంతో ఆవేదనతో ఛందోబంధాలను అధిగమించి తెలిపారు దాశరథిగారు.

''మానవతా!
నీకు విముక్తి ఎన్నడో కాదు?
మరెన్నడు?
మనిషి మనిషిని మనస్సు మనస్సును
పరస్పరం పరిశీలించుకున్న నాడే!
నల్లవాని చర్మం కిందుగా
అరుణారుణరుధిరం ప్రవహిస్తుందని
వర్ణాహంకారులు
తొలిసారిగా తెలుసుకొన్ననాడే!
అణుజాలం నుంచే
అమృతం పిండిన్నాడే!
నీకు విముక్తి
మానవా
నీకు విముక్తి.''

అనే నారాయణరెడ్డిగారి హెచ్చరిక మరొక ఉదాహరణం.

ఒక్కమాటలో "ఊహించగల మేధ, స్పందించగల హృదయం రాటుదేరిన కలం"—ఈ మూడు సమన్వయించగల కవి మనసు రసరంజితులను చేసి ఆనందాన్ని—అలౌకికానందాన్ని—అందిస్తాడు.

ఈ మూడింటిని - అంటే ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసాలను—శక్తి అన్నారు మన అలంకారికులు. కవికి ఒక్క ప్రతిభే చాలునన్నాడు ఆనందవర్ధనుడు. తక్కినవి రెండు వాటంతట అవే వెంటబడతాయట. అలాటి కవి మనకు తన రచనలలో అతి లోకానందసంధాయకమైన స్థితిని చేకూరుస్తాడు. ముమ్మటాచార్యుని కవి భారతీ స్తుతిని ఈ సందర్భంలో అనుసంధానం చేద్దాము.

"నియతి కృత నియమ రహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం,
నవరసభరితాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి.'

# కొన్ని సమకాలిక నవలలు

"ఏమిటి చదువుతున్నావు? కాదంబరా?" అన్నారు, మైసూరు ప్రాంతం లోని నా బంధువులొకరు, ఏదో నవల చదువుతున్న నన్ను చూచి. "కాదంబరి కాదు, నవల" అన్నాను. "అదేనయ్యా! నవలనే కాదంబరి అంటాము మేము. మరాఠీలు, గుజరాతీలు అలాగే అంటారు" అన్నారు ఆయన.

కల్పనకు కల్పలత అయిన కాదంబరి నవలవంటిదే మరి! కాదంబరినే నవలకు పర్యాయపదంగా వాడుకుంటున్నారు కన్నడులు, మరి కొందరూ. ఎంత బాగుంది?—అనుకున్నాను. కాదంబరి నవలగా భావించినందునే కాబోలు శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు 92 ఏళ్ళ క్రితమే (1867) దాని నుంచి మహాశ్వేతవృత్తాంతం గ్రహించి, నవలగా వ్రాశారు. కొక్కొండ వారెందుకు? కళాపూర్ణోదయం నవల—పద్యనవల—కాదూ? సంభావ్యతా సంభావ్యతల ప్రసక్తి లేకుండా కల్పనను ఇతివృత్తంతో నడిపించడమే నవల ప్రధాన లక్షణ మనుకుంటే, దాని అనుబంధంగా కనిపించే వేంకటాచార్యుని 'భద్రరాజ పుత్ర చరిత్ర' మరొక పద్యనవల గాదూ? 19 వ శతాబ్దం పూర్వార్థంలోని మారు పెద్ది చెంగల్వ రాయకవి "చారులీలా విలాసం", శాంతిభద్రాద్రి రామశాస్త్రి "చిత్రసీమ"—ఇలాటి పద్య నవలలే కావూ?

ఇంత ఎందుకూ? ఇతివృత్తంతో కల్పనాగతి, పాత్రోన్మీలనం, రూపక రామణీయకం, మనస్తత్వ విశ్లేషణం, అన్నిటికీ పైచేయిగా సమకాలిక ప్రజా జీవిత ప్రతిబింబీకరణమూ, సందేశ నిర్వాచనమూవంటి లక్షణాలతో నవల అని నేడు మనం అంటున్న సాహిత్య ప్రక్రియ మాత్రం మనకు ఆంగ్ల సంబంధంతో వచ్చిందే ననడం నిస్సంశయం. ఆ ప్రక్రియలో మొదటిది మనకు 'మహాశ్వేతే' (ఇది తర్వాత కొంత వైజయంతిలో ప్రచురితమైనట్లు శ్రీనిడదవోలు వెంకటరావు గారు తెలుపుతున్నారు). రెండవది నరహరి గోపాల కృష్ణమశెట్టి శ్రీరంగరాజ చరిత్ర (1872). ఈయన చిన్నయసూరికి సమకాలికుడు. తన కాలంలో వైస్రాయిగా ఉన్న లార్డు మేయో ప్రోత్సాహంతో దేశభాషలలో నవల ఉదయించిందని, ఆ ప్రోత్సాహంతోనే ఈ శ్రీరంగ రాజచరిత్రను, కల్పనను సమకాలిక సాంఘిక పరిస్థితుల చిత్రణంతో మేళవించి వ్రాశానని ఈయన ఆ పుస్తకం పీఠికలో

వ్రాసుకున్నాడు. సోనాబాయి అనే విజయనగర రాజకన్యను చిన్నతనంలో లంబాడీలు ఎత్తుకొని పోవడం, ఆమె అడవిలోనే వారితో పాటు పెరుగుతుండగా, విజయనగర చక్రవర్తి శ్రీరంగరాయలు ఒకనాడు వేటకుపోయి ఆమెను చూచి మోహించడం, కాని, లంబాడీ కన్య అని సంకోచిస్తుండగా, రాజ కన్యక అని తెలిసి అద్భుతపడి పరిణయ మాడడం—యిది దీని కథాసారాంశం.

అటు తర్వాతిదే శ్రీ కందుకూరి వీరేశలింగంగారి "రాజశేఖర చరిత్ర" (1878). మరి "నేనే మొదటినవల వ్రాసితిని" అని అయనా, నేనే మొదటి నవల వ్రాశానని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారూ చెప్పుకున్నారే ముక్త కంఠంతో, ఏమిటిగతి?—అని ప్రశ్నిస్తారు కదూ. అంతకు ముందువి నవలలు కావనుకున్నారు కాబోలు వారు? కనుకనే తామే ప్రవర్తకులమని చెప్పుకున్నారు ఈ శాఖకు.

ఏమైనా పాశ్చాత్య దేశాలలో మూడుశతాబ్దాలకు పైగా పరిణామం చెందిన నవల మనదేశంలో ఒక్క శతాబ్దంలోపునే వికసించింది. కాని, ఒకతరంవరకూ దానిగతి కేవలం ఉబుసుపోకే. నిజానికి నవలకు కావ్యగౌరవం సంతరింపచేసిన వారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ అడివి బాపిరాజు. శ్రీ ఉన్నవ లక్ష్మీ నారాయణగార్లు అని అనడం అతిశయోక్తికాదు. అప్పటినుంచి నవల నానా ముఖాలుగా, నానా రూపాలుగా— ఒకవైపు జాతీయదృష్టి, మరొకవైపు సంఘ సంస్కరణ సంకల్పం, వేరొకవైపు ప్రాచీన వైభవ ప్రతిపాదన దీక్ష ఇలా— ప్రస్థానం సాగించింది. ఈలోగా స్వాతంత్ర్య సమరమూ సమాప్తి చెందింది. స్వాతంత్ర్య సంసిద్ధి అనంతరమూ వివిధేతివృత్తాలతో ఈ ప్రక్రియ సాగింది. ఆంగ్ల విద్యాప్రభావం, పట్టణ మనస్తత్వం మూలంగా బయలుదేరినవి—తెరచి రాజు, ప్రజలమనిషి, చివరకు మిగిలేది, కీలుబొమ్మలువంటివీ ఉన్నాయి వాటిలో; ఆంధ్రప్రాంతానికో, భారతదేశానికో పరిమితంకాక మానవ జీవితాన్ని, తనను ఎదుర్కొంటున్న సన్నివేశాలలో మానవుని విక్రియను, మనస్తత్వాన్ని చిత్రించే 'అల్పజీవి' వంటివి ఉన్నాయి. ఈలాటి వాటిలో రచయిత మస్తిష్కంలో మొలచుకు వచ్చిన భావాలను యథాతథంగా చిత్రించే ప్రయోగాలు చేశాడు.

నవల నానా ముఖాలుగా వెలసినా, జాతి జీవిత ప్రతిబింబం కాగలిగిందా? నవలలో దీనికి ఎంతో అవకాశం ఉందికదా! ఆ అవకాశం పూర్తిగా వినియుక్తమైందా? ఇతర సాహిత్య ప్రక్రియలు-కథ, కవిత-లాగా వేయిరేకులుగా విడిగిందా? కథలాగ, కవితలాగ ఉత్తమస్థాయిని అందుకోలేదనే చెప్పడం అసంగతం కాదనుకుంటాను.

నవల కథలాగ ఉదాత్తస్థాయిని అందుకోటం ఎలా సాధ్యం? కథకు మన దేశంలో దాదాపు మూడువేల సంవత్సరాల జాతకం స్పష్టంగా ఉంది. గౌతమ బుద్ధుని పుణ్యాన ఆయన పాత జన్మల కథలూ మనకు దక్కాయి. జాతకం కట్టడానికి సాధ్యం కాని మన విజ్ఞాన భండారమైన వేదంలోని కథలను ప్రత్యేకంగా జ్ఞాపకం చేయనక్కరలేదు. నేటి పెక్కు సాహిత్య ప్రక్రియలకు - కావ్య, నాటకాఖ్యానాదులకు - మూలకందమైన బృహత్కథకు పుట్టిల్లు మన తెలుగునాడే. కనుకనే కథాకథనం మన సొమ్ము, నాటకాలను కూడా కథలుగా పిండికొట్టిన వాళ్ళం మనం. దీనికితోడు పాశ్చాత్య పద్ధతిని కూడా పుణికి పుచ్చుకున్నాము. చిన్నకథకు వన్నె దిద్దుకున్నాము.

అంతేకాక, కథనొక చిన్న సన్నివేశంతో ముగించుకోవచ్చు. నవలకు కావలసింది సన్నివేశ బాహుళ్యం. అలాటి సన్నివేశాల బాహుళ్యం కల విధంగా మనజీవితం, సంఘం ఆత్యంతికంగా మారాయా? రాజకీయ రంగంలో వచ్చిన మార్పు చల్లగా వచ్చింది - దాని వేడిగాని, వెలుగుగాని మనకు సోకనే లేదు. భౌతికంగా పరిస్థితులు మారాయా? ఆ మార్పు రావడానికి పరిశ్రమాభివృద్ధి అవసరం. అది తగినంత జరిగిందా? భౌతిక పరిణామం కలిగినప్పుడే జీవితంలోను సంకీర్ణత, వైవిధ్యం పొడసూపుతాయి.

ఇక కవిత అందామా—అదీ మనసొత్తే. సుందర ముక్తకాలు—గాథా సప్తశతి—దొర్లింది మనగడ్డపైన. రెండు వేలేండ్లుగా కవితా సంప్రదాయం వేయిపాయలుగా పారింది ఈ గడ్డమీద. దీనికితోడు భావావేశంలో పొంగే గుండె ఉంది మనకు. మరి దీని ఉదాత్తత నవలకు రావడం ఎలా?

ఇక మనకు రచయితృ వర్గం ఎంత ఉంది గనుక? ఎంత అభివృద్ధి చెందింది గనుక? ఈ రచయితృ వర్గం తన వైయక్తిక చిత్తవృత్తినే ప్రధానంగా ప్రతిబింబింప జేస్తున్నంత వరకు నవల మన జీవితంలోని, సంఘంలోని విస్తృతిని ఆకట్టుకోగలుగుతుందా? మనకున్న నవలాకారులలో చెప్పుకోదగ్గ పెద్దలు ఐదారుగురు. వీరిలో ఒకరిద్దరు చారిత్రక నవలా రచయితలు. వారి రచనల్లో చాలాచోట్ల వారి కాలపు వాతావరణం ప్రస్ఫుటిస్తుందేకాని ఇతివృత్త కాలపుది కాదు. సాంఘిక నవలా రచయితలలో సమకాలీన వస్తువును గ్రహించేవారు ఇద్దరు ముగ్గురే. కనుక మనం వైవిధ్యం అభిలషించడం, అభ్యూహించడం కష్టం. వీరందరూ తమ నవలల్లో ఒక్కొక్క రచనా విధానాన్ని ప్రయోగాత్మకంగా చూపడానికి ప్రయత్నించినట్లు కనిపిస్తుందేకాని జాతి సమగ్ర జీవిత చిత్రణకు పూనుకున్నట్టు తోచదు.

నవల వికాసం రుద్ధం కావడానికి మరొక కారణమూ ఉంది. మన పాత జీవిత వ్యవస్థ కూలిపోయింది. సమష్టి కుటుంబ పద్ధతి సమసిస్తూ ఉంది. విశ్లథన మార్గం, వైయక్తిక జీవితం అల్లుకుంటున్నాయి. నూతన వ్యవస్థ—పారిశ్రామికీకరణం పాశ్చాత్యదేశాలలోలాగ జరుగలేదు. పరిశ్రమలున్నచోట్ల ఉన్న కొద్దిపాటి సంకీర్ణ జీవితమూ ప్రతిఫలించడంలేదు నవలల్లో.

యుగధర్మమనేది సర్వకాలీనం. నేటి నవలల్లో చాలవాటిల్లో రచయితలు తమ మనఃప్రవృత్తి మార్గంలోనే విహరించడంగాను, చారిత్రక విషయాల క్రోడీకరణంగాను ఈ యుగధర్మం భాసిస్తున్నదనవచ్చు, మన రచయితల దృష్టి సమకాలీన జీవితంపై తగినంతగా ప్రసరించక పోవడమే దీనికంతా కారణం.

అలా ప్రసరించి ఉంటే, పాశ్చాత్య నవలాకారులు పనిగట్టుకొని వ్రాశారా, చర్చించారా అన్నట్టున్న సాంఘిక సమస్యలను చర్చించేవారే. సాంప్రదాయకంగా వచ్చిన, వస్తున్న పురుషార్థాలనే చర్చించారు గాని, కులమతాల శృంఖలాలు తెంచి కింది కులంవారు పెద్దకులం వారిని పెండ్లాడి విజయం సాధించాలనే సంగతిని ఆలోచించక పోయేవారా?

ఇంతమాత్రాన ఇటీవల వచ్చిన నవల్లలో 'నాగరక' దృష్టి, మానవజాతి సాన్నిహిత్యకాంక్ష లేవనికాదు. శ్రీ అడవి బాపిరాజుగారి 'నరుడు' అలాంటి దృష్టి రాహిత్యాని కొక అపవాదం. ఒక హరిజన బాలుడు తనకు అర్థం కాని కులమత వ్యవస్థాపంజరాన్ని భేదించుకొనడానికి చేసిన మహా ప్రయత్నం ఈ చిన్న నవలలో వర్ణితమైంది. ఆ బాలుడు క్రమంగా—ఈ ఘర్షణతోనే పెరుగుతూ, పోరాడుతూ తుదకు ఒక ఆంగ్లో ఇండియన్ కన్యను పెండ్లాడుతాడు. పెకులాలతో అతనికి పరిణయం చేయించే ధైర్యం శ్రీ బాపిరాజుగారికి లేక పోయిందేమో!

ఇంతకుముందే నేను సూచించినట్టు శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి గారు "ప్రజల మనిషి" తెలంగాణాలో నిజాం, జాగీర్దార్లకింద నలిగిపోయిన సన్నకారు రైతుల జీవితాన్ని, అప్పటి దేశకాల పరిస్థితులను చాలావరకు ప్రతిబింబింప జేశారు; పరిష్కారమార్గాలు చర్చించారు.

శ్రీ శారదగారొక హోటలు సర్వరు ఈయనలో అంతర్నిహితమైన రచనాశక్తి అకస్మాత్తుగా ఉద్బుద్ధమైంది; పెక్కు కథలు, నవలలు రచించారు. అట్టడుగున ఉన్న సంఘం మానసిక పరిస్థితిని పరిపూర్ణ పాటవంతో చిత్రించే తీవ్రమైన రచన ఈయనిది. "మంచీ — చెడూ" అనే నవలలో ఒక యువతి గత్యంతరంలేక వృద్ధునికి భార్యగా అంటగట్టబడుతుంది. అతడు మరణించగానే ఆమె పతితురాలై వాడమనిషి దుస్థితికి దిగజారుతుంది. ఆమె

జీవితాన్ని రచయిత ఉన్నదున్నట్లుగా "బండగా" తెలియజేయడమే రచనలో విశిష్టత.

ఈయన మరొక నవల "అపస్వరాలు". దీనిలో దొంగనోట్లు ముద్రించడం, పండితులైనవారు కూడా బ్రాకెట్లు ఆడడం మొదలయిన విషయాలు వర్ణించబడ్డాయి వరదరాజు అనే రౌడీ క్రమంగా కరకుదనం పోయి ఆర్ద్రహృదయుడుగా పరివర్తన చెందుతాడు.

శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి 'అల్పజీవి' విశ్వజనీనమైన అపూర్వ నవల. దీనిలోని అల్పజీవి సుబ్బయ్య. భయానుమానాలు మొదలయిన అవలక్షణాలు మూర్తీభవించిన అతిదుర్బలుడైన సుబ్బయ్య, అనుభవం పొందను పొందను గడిదేరి నిలవదొక్కుకునే అంతర్యుద్ధపు చిత్రమిది. ఏ దేశ కాలాలకూ కట్టుబడని పాత్ర సుబ్బయ్య.

శ్రీ భాస్కరభట్ల కృష్ణారావుగారి "వింత ప్రణయం" 'నాగరిక' లోకానికి ప్రతిచ్ఛాయ అయిన నవల. దీనిలోని పాత్రలందరూ స్థిరదృఢభావాలు కలవారు; తమలోని దుష్టప్రవృత్తులను కూడా బహిరంగపరచుకొని చర్చించుకొనే నిబ్బరం కలవారు నాగరకు లనబడేవారి 'కుళ్ళు'ను బట్టబయలు చేయిడం రచయిత ప్రధాన లక్ష్యం.

శ్రీ జి. వి. కృష్ణారావుగారి ''కీలుబొమ్మలు'' నేటి గ్రామ జీవితానికి ఫోటో. గ్రామకక్షలు రాజకీయ పార్టీల మారుపేరుతో, మేలిముసుగుతో చేసే దురంతాల పర్యవసానం దీనిలో రూపు కడుతుంది.

మహీధర రామమోహన్‌రావుగారి ఓనమాలు. జగన్నాథ రథచక్రాలు అనే నవలలు దళితవర్గాల పోరాట చిత్రణలు.

ఏమైనా విద్యావంతమైన వర్గం, పరిశ్రమలూ, నూతన జీవిత విధానం అభివృద్ధి అవుతున్నవి గనుక ముందు ముందు "నాగరకమైన" (Sophisticated) నవలలు ననలెత్తగలవనే భావుకుల అభ్యూహ.

# వేదంలో, ఆయుర్వేదంలో గర్భనిరోధం

"దశాస్యాన్ పుత్రా నాధేహి
పతి మేకాదశం కృధి."

పదిమంది పుత్రులను కను. నీభర్తను పదకొండవ పుత్రునిగా సంభావించు-అని సీమంతినులను ఆశీర్వదించడం మనము తరచు వింటుంటాము. "ప్రజయా హి మనుష్యః పూర్ణః" సంతానం కలిగినప్పుడే మానవుడు పూర్ణుడవుతాడు, మానవత్వం పూర్ణమవుతుంది—అనేది వేదఘోషమని మన పెద్దలు ఘోష పెడుతుంటారు.

"ఏష్టద్యాబహవః పుత్రాః
య ద్యేకోపి గయాం వ్రజేత్."

చాల మంది పుత్రులను కనాలి. వారిలో ఒక్కడైనా గయకు వెళ్ళుతాడో ఏమో!-అని భారతవచనం.

కాని సరిగా పరిశీలిస్తే, కొందరు సంతతి అనవసరం అన్నవారూ మన పూర్వసాహిత్యంలో కానవస్తారు. చతుర్వేదాలలో ఒక్కటయిన అధర్వ వేదమే క్లీబత్వాపాదన, సపత్నీ నిబర్హణాదులను తెలిపింది.

"గర్భాదం కాణ్వం నాశయ
పృశ్నిపర్ణీ సహస్వ"

కాండ-2, సూక్త-25, మంత్ర-3

ఓ పృశ్నిపర్ణీ గర్భాన్ని ధ్వంసంచేసే కాణ్వుని నాశనం చేయి - అని ఉద్ఘోషించిన అధర్వ వేదమే ముష్క నాశనమంత్రం చెప్పింది. ఈ మంత్రం

"... అజశృంగీ
అనృత్యతః శిఖండినో
గంధర్వస్యాప్సరాపతే
భినద్మి ముష్కా వపియామి శేఫః"

కాం-4, సూ-37, మం-7.

అంటూ నీ సహాయంతో ముష్కాలను పగుల గొడుదాము అజశృంగీ-అంటుంది. క్లీబత్వకారకమయిన మరికొన్ని మంత్రాలూ ఉన్నాయి :

1. త్వం వీరుధాం శ్రేష్ఠ
తమభిశ్రుతా స్యోషధే
ఇమం మే అద్యపురుషం
క్లీబమోపశినం కృధి.

2. క్లీంబం కృధ్యోవశిన మధో
కురీరిణం క్వధి.

3. అథాస్యేంద్రో గ్రావభ్యాముభే
భినత్వాండ్యౌ
... ... ... ... ... ... ...
యేపతే నాడ్యౌ దేవకృతే
యయోస్తిష్ఠతి వృష్ణ్యం
తే తే భినద్మి శమ్యయా ముష్యా.

4. అధి ముష్కయోః
యథా నడం కశిపునే స్త్రియో
భిందంత్యశ్మనా
ఏవాభినద్మితే శేఫో ముష్యా అధిముష్కయోః.

కాం-6, సూ-138, మం-1-5.

సపత్నీ నాశన మంత్రాలలో కోపంలోను కవిత ఉంది. నీ గర్భాశయ ద్వారాన్ని మూయించి బండ పెడుతాము - లాంటి కటువచనాలూ ఉన్నాయి :

"ఉత్తాన పర్ణే సుభగే
దేవజూతే సహస్వతి,
సపత్నీం మే పరాణుద
పతిం మే కేవలం కృధి."

స్త్రీచికిత్సా-కాం-3, సూ-18, మం-2.

"ఇమాయాస్తే శతహిరాః
సహస్రం ధమనీ రుత
తాసాం సే సర్వాసా మహం
అశ్మనా బిలమప్యధాం.

వరం యోనే రవరం తే కృణోమి
మా త్వా ప్రజా భిభూ న్మోత సూనుః
అస్వం త్వా ప్రజసం కృణోమి
అశ్మానం తే అపిధానం కృణోమి. కాం-7, సూ-35, మం-3.

దేవరాతాపర నాముడైన శునశ్శేపుడు ఇంద్రుణ్ణి సంతోషపెట్టడానికి చేసిన స్తోత్రంలో ఒక మంత్రం ఉంది:-

"అయముతే సమతసి
కపోత ఇవ గర్భధిం
వచః తచ్చిన్న ఓహసే." కాం-20, సూ-45, మం-1.

ఈ మంత్రం వృత్రాసురునికి సంబంధించిన ఒక గాథను తెలుపుతున్నదా అన్న సందేహం కలుగుతుంది. దితి దేవతలను జయించగల ఒక మహావీరుని కందామని కశ్యప ప్రజాపతితో వరం పొంది గర్భమై, పడుకుందట-వెల్లకిలా పడుకుంది. అలాంటి మహావీరుడు పుడితే తమకు ఏమి ముప్పో అని మాయావి అయిన ఇంద్రుడు ఒక యుక్తి చేశాడట. ఆమె మంచంమీద తలవైపుకాళ్లు, కాళ్ళవైపు తలపెట్టి పడుకొని ఉండగా, ఇంద్రుడు ఆమె గర్భాశయ ద్వారం నుండి గర్భంలో ప్రవేశించి, గర్భాన్ని ఛేదించాడట. అయినా గర్భం బలమైంది గనుక మహాబలవంతుడు కాకపోయినా వృత్రునివంటివాడు పుట్టాడు. పై అథర్వ వేద మంత్రంలో ఆ వృత్రాసుర జననగాథ, గర్భచ్ఛేదన గాథ ధ్వనిస్తున్నాయని భావిస్తున్నాను.

దీనినిబట్టి వేదకాలంలోనే గర్భవిచ్ఛేదోపాయాలు, క్లీబతాపాదక యోగాలు తెలుసునని, శత్రువినాశానికి వాటిని సాధనంగా వాడేవారని మనం భావించవచ్చు.

స్మృతులుకూడా కొన్నికొన్ని విషయాలలో గర్భనిరోధాన్ని, సంతాన నిరోధాన్ని సూచించినట్టు గ్రహించవచ్చు. రాజుకు పట్టమహిషియందు సంతానం ఎక్కువగా ఉండరాదు. ఎక్కువ కలిగితే, వారు రాజ్యంకోసం పరస్పరం కలహిస్తారు. దానివల్ల రాజ్యం విచ్ఛిన్నమగుతుంది. అందుకోసం రాజు పట్టమహిషితో సంతానం ఎక్కువగా పడయరాదు. ఇతర భార్యలయందు ఎందరిని పొందినా రాజ్యవిచ్ఛేదావకాశం లేదు-అని ఒక స్మృతికారుడు రాజచర్యలో హెచ్చరించాడు. దీనివల్ల సంతాన పరిమితికి, నిరోధానికి ఈ స్మృతికారుడే ఒకవిధంగా దారి చూపినట్టు తోస్తుంది.

పుత్రకామి అయిన పురుషుడు ఋతుకాలంలో స్త్రీ సంగమం చేయాలని, తదితర కాలంలో కేవలరతి దృష్టితో చేయవచ్చని స్మృతులన్నీ చెప్పాయి.

"ఋతుకాలాభిగామీ స్యాత్
స్వదార నిరత స్సదా,
పర్వ వర్జం వ్రజే చ్చైనాం,
యద్వ్రతో రతి కామ్యయా." మను, అధ్యాయం-3, శ్లో - 45.

ఆ ఋతుకాలం గురించి మత భేదాలున్నాయి: కొందరు పదహారునాళ్లని, కొందరు పన్నెండు నాళ్లని అన్నారు.

మనువు:
"ఋతుః స్వాభావికః స్త్రీణాం
రాత్రయః షోడశ స్మృతాః
చతుర్భి రితరై స్సార్థ
మహోభిః తద్విగర్హితైః
తాసా మాద్యా శ్చతస్ర స్తు
నింది తైకాదశీ చ యా,
త్రయోదశీ చ శేషాస్తు
ప్రశస్తాః దశరాత్రయః. 3-46,47

అని చెప్పగా. యాజ్ఞవల్క్యుడు
"షోడశర్తు నిశాః స్త్రీణాం" 1-79

అన్నాడు. "స చ రజోదర్శన దివసాదా రభ్య షోడశాహోరాత్రః" అని విజ్ఞానేశ్వరుడు వ్యాఖ్యానించాడు.

కొందరు తర్వాతి వైద్యక గ్రంథకారులూ ఈ మతాన్నే అనుసరించారు.

"ఋతు కాలంతు షోడశ రాత్రం యావత్. యదుక్తం హారీతే షోడశ దివసో ఋతుకాల ఇతి." చక్రపాణిదత్త - శారీరం - 2.

"ఆర్తవస్రావ దివసా
దృతుః షోడశ రాత్రయః
గర్భ గ్రహణ యోగ్యస్తు
స ఏవ సమయః స్మృతః." —భావ ప్రకాశః

ఋతుకాలం కాక తక్కిన దినాలలో రతికోసం, రతికామ్యతో భార్యను పోవచ్చును. కాని, దానిని కూడ మానుకొన్న వాడు, ఋతుకాలంలోనే వెళ్ళేవాడు ఏ ఆశ్రమంలో ఉన్నా బ్రహ్మచారేనని మను వంటాడు.

"నింద్యా స్వష్టాసు చాన్యాసు
స్త్రియో రాత్రిషు వర్జయన్,
బ్రహ్మచార్యేవ భవతి
యత్రతత్రాశ్రమే వసన్." 3-50

కాని సుశ్రుతుడు మాత్రం ఈ ఋతుకాలం పన్నెండు నాళ్ళని చెప్పాడు. సూర్యుడున్నప్పుడు వికసించిన పద్మంవలె నారీయోని ఋతుకాలంలో విచ్చుకొని ఉండి గర్భాధానక్షమ మవుతుందని, సూర్యాస్తమయం తర్వాత కమలం ముకుళించినట్టు ఋతు కాలానంతరం యోని సంకోచిస్తుందని, కనుక గర్భాధాన క్షమం కాదని అన్నాడు.

"ఋతుస్తు ద్వాదశరాత్రం భవతి దృష్టారవః అదృష్టార్తవోప్య స్త్రిత్యేకే భాషంతే. 3-6

పీన ప్రసన్న వదనాం
ప్రక్లిన్నాత్మ ముఖద్విజాం,
నరకామాం ప్రియ కథాం
స్రస్తకుక్ష్యక్షి మూర్ధజాం. 3-7

స్ఫురద్భుజ కుచశ్రోణి
నాభ్యూరు జఘనస్ఫిచం,
హర్షౌత్సుక్య వరాంచాపి
విద్యాదృతుమతీ మితి. 3-8

నియతం దివసేఽతీతే
సంకుచత్యంబుజం యథా
ఋతౌ వ్యతీతే నార్యాస్తు
యోని స్సంవ్రియతే తథా. 3-9

యుగ్మేషు తు పుమాన్ ప్రోక్తో
దివసేష్వన్యథాఽబలా
పుష్పకాలే శుచి స్తస్మా
దపత్యార్థీ స్త్రియం వ్రజేత్. 3-12

ఈ స్మృతివాక్యాలు, సుశ్రుతుని వాక్యాలు - వైద్యులలో ప్రాచీనతము డైన సుశ్రుతుని వాక్యాలు - అపత్య నిరపేక్షమైన రతికి అనుమతించాయని, దానివల్ల అనపత్యత పాపమో, దుర్గతికరమో కాదని స్పష్టమవుతున్నది.

ఇక, ఆయుర్వేద శాఖాభేదమైన కామశాస్త్ర గ్రంథాలు క్లీబీకరణ, గర్భపాత, గర్భనిరోధాదులను కోకొల్లలుగా చెప్పాయి. రాజులు, శ్రీమంతులు భోగినులను ప్రత్యేకంగా ఉంచుకొనేవారు గనుక వారు సంతానవతులయితే తమ సుఖాలకు భంగమనే దృష్టితో ఈ పద్ధతులను ప్రవేశపెట్టారనే వాదం ఉంది. ఆ వాదాన్నే అనుసరించినా, కొందరికి "ప్రజయా హి మనుష్యః" అన్నది మరికొందరికి లేదా? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. రాజుల భోగాలకై కొందరు వంధ్యలుగానే ఉండాలి. కొందరు వారికి చాకిరీ చేయడానికి ఎక్కువగా బానిసలు కనాలి - ఇదీ పద్ధతి. ఏమైనా, కామాన్ని ఆహారంవలె శరీరధారణ హేతువుగా-శరీర స్థితి హేతుత్వా దాహార సధర్మాణో హి కామాః (వాత్స్యా. అధికరణం - 1, అధ్యాయం-2, సూత్రం-46) - అని నిర్వచించిన కామశాస్త్ర గ్రంథాలు మాత్రం నిర్భయంగా గర్భనిరోధ యోగాలు చెప్పాయి.

వాత్స్యాయన కామసూత్రాలు "ద్వివిధం రతం అపత్యఫలం, రతి ఫలం చ" (అధికరణ-7, అధ్యాయం-2, సూత్రం-1 అవతారిక) అని స్పష్ట పరిచాయి స్మృత్యుక్తినే. రతి రహస్యం గర్భ చాలనం కోసం కొన్ని యోగాలు తెలిపింది వాటిలో కొన్నిటిని ఉదాహరిస్తాను :

"అమలా మలాంజన యుతా
పీతా శీతాంబునా హరతి,
గర్భమృతౌ భగనిహితం
ఘృత మధు యుక్తం పలాశ బీజం వా.

తండుల జలేన పీతం
మూలం జ్వలనస్య వా జయంత్యా వా,
గర్భఘ్నం భగనిహితం
లవణం కటు తైల యుక్తం వా.

శైవల కేసర బీజం
మూలం వా చంపకస్య వా కణయా
గర్భం రుణద్ధి పీతం
కటు తైలం వా జరత్సుధయా."

పరిచ్ఛేద - 5, శ్లో - 60, 61, 62.

గర్భస్తంభన గురించి దత్తాత్రేయ తంత్రం కొన్ని యోగాలు చెప్పింది:

"ఏరండ బీజం బుత్వంతే
భుక్తం స్తంభన గర్భకం,
కటిబద్ధం హేమమూలం
గర్భ స్తంభనకం పరం.
సిద్ధార్థ మూలం శిరసి
బద్ధ్వా కాంతం రమేత్తు యా,
న గర్భం ధారయేత్ సా స్త్రీ
ముక్తేన లభతే పునః.
ధుత్తూర మూల చూర్ణం తు
యోనిసం స్తంభనం మతం,
తండులీ మూలతోయేన
దేయం తండుల వారిణా.
ధూమితో యోనిరంధ్రేషు
నింబకాష్ఠేన యుక్తితః
బుత్వంతే దీయతే తత్ర
గర్భ దుఃఖ వివర్జితా." చతుర్థం స్తంభన పటలం.

నచ్ఛపుట తంత్రంలోను ఎన్నో యోగాలున్నాయి.

గర్భపాతానికి వాత్స్యాయన కామ సూత్ర వ్యాఖ్య పురుషార్థ ప్రభలో వ్యాఖ్యాత మాధవాచార్యుడు మరికొన్ని యోగాలు తెలిపాడు:

"సేహుండ దుగ్ధ మాదాయ
భాలదేశే విలేపయేత్,
అపూర్ణ మథవా పూర్ణం
క్షణాద్గర్భం విముంచతి.
న క్లేశో నాపి సమ్మోహో
న రోగాది భయం క్వచిత్,
న వా ప్రసవ దుఃఖాని
న వా హాని విధాయకం.

గృహస్థానాం సుఖకరో
యోగోఽయ మతిదుర్లభః,
కుచుమారేణ మునినా
కృపయా పరికీర్తితః."

"వాస్తుకస్య తు బీజాని
కర్ష మాత్ర ప్రమాణతః,
గృహీత్వా సేటుకార్ధేన
జలేన సహ సంపచేత్.
అర్థావశేషం తు పిబేత్
గర్భపాతో భవేద్ ధ్రువం,
అయం యోగో న దేయః స్యా
ద్దుష్టానాం ప్రీతయే కదా."

"కటుతుంబీం బీజయుతాం
నీరేణ సహ పేషయేత్,
యోనౌ ప్రలేప మాత్రేణ
క్షణాద్ గర్భం విముంచతి.
వేణ్యాః స్పర్శః తాలు కంఠ
మూర్ధి స్నుక్ క్షీర లేపనం,
భూర్జ లాంగలికీ తుంబీ
సర్ప త్వక్కుష్ట సర్షపైః.
పృథక్ ద్వాభ్యాం సమస్తైర్వా
యోనిధూపన లేపనం,
ఉష్ట్రి కంటక మూలం తు
ఉదకే పరిలేపయేత్
ఘోటకస్య చ విష్టాయాః
ధూమాద్గర్భం విముంచతి."

ఎప్పుడో ఒకప్పుడు గర్భపాతం సంగతేకాదు; నిరంతరం గర్భ దుఃఖమే లేకుండా వంధ్యగానే వుండడానికి యోగాలు చెప్పాడు పంచసాయకంలో జ్యోతి రీశ్వరాచార్యుడు:

"పలాశ క్షీరద్రుమయోః ఫలాని
పుష్పాణ్యథో శాల్మలి పాదపస్య,
మద్యేన మాసార్ధ దినం నిపీయ
వంధ్యా భవేత్ నిశ్చితమేవ నారీ.
ఫలం కదంబస్య చ మాక్షికాని
తుషోదకేన త్రిదినం నిపీయ,
స్నానావసానే నియమేన చాపి
వంధ్యా మవశ్యం కురుతే హఠేన.
కరద్వయం రాక్షస వృక్ష బీజం
సప్తాహ మాత్రం సితశాలి వారా
రతా నిపీతం మృగశాబకాక్ష్యాః
వంధ్యాత్వమేత న్నియతం కరోతి."

తృతీయసాయకం.

కల్యాణమల్లుడు అనంగరంగంలో వంధ్యాత్వ యోగాలు కొన్ని చెప్పాడు:

"గుడం త్రైహాయనం ఖాదేత్
పలమాత్రం తు నిత్యశః,
మాసార్ధం సా భవేద్ వంధ్యా
యావదాయుఉర్న సంశయః.
తుషతోయేన సంక్వాథ్య
మూల మగ్నితరూద్భవం,
పుష్పావసానే త్రిదినం
పీత్వా వంధ్యా భిజాయతే.
చందనం వర్షపాశ్చైవ
శర్కరా సమభాగతః,
పీత్వా తండుల తోయేన
రామా రక్తం వినశ్యతి.
రక్షోభూరుహ బీజాని
పలార్ధం తండులాంభసా,
ఋతౌ పీతం తు సప్తాహం
వంధ్యాం కుర్యా న్మృగీదృశం."
వంధ్యాత్వా పాదనం షష్ఠస్థలం, 73-76
(గ్రంథ విస్తరణభీతిచే శ్లోకాలను అనువదించలేదు.)

పైన పేర్కొన్న ఉదాహరణలనుబట్టి, వాదాన్నిబట్టి గర్భపాత సంతాన నిరోధాలను మన పూర్వులు మహాపాపంగా భావించలేదని, స్మృతికారులు కొందరు గర్భపాతాన్ని పాపంగా చెప్పినా, జనం అంతగా భయపడలేదని స్పష్టమవుతున్నది. కామ సూత్రకారులు కొందరికి మాత్రమే చెప్పినట్టివి నేడు అందరికీ అన్వయించడంలో తప్పులేదని భావిస్తున్నాను.

ప్రాచీనకాలంలో మన దేశంలోనేకాక ఈజిప్టు మొదలయిన దేశాలలోను సంతాన నిరోధ సాధనాలు వాడుకలో ఉన్నట్టు Will Durent ఉదాహరించిన ఉద్ధరణను తెలిపి విరమిస్తాను :-

"In 1850 B.C. many controseptives were prescribed by Egyptian Doctors in Kaham pepyres" P. P. 183 Medical History of controceptives, by Norman Himes, quoted by Will Durent in his Our oriental Heritage. (Under the Story of Civiligation seec).

# ఈజిప్టు ప్రజల ఆముష్మిక చింత

ఆదిమానవుని మృత్యుభయం, అమరత్వవాంఛ వెర్రితలలు వేశాయని 'విజ్ఞానం' వెన్ను తన్నిన నేటి మేధాజీవులు కొందరు విడ్డూరాలు పలుకవచ్చు. కాని, ఈ భయం, ఈ వాంఛ నేల నాలుగుచెరగులా సంస్కృతి వైవిధ్యానికి నారులు పోయడం మరువరానిమాట. ఇవే సంప్రదాయంగా, శాస్త్రంగా, కళలుగా, సాహిత్యంగా శాఖోపశాఖలై సాక్షాత్కరించాయి. భయం, అద్భుతం మేళవించిన భావుకతతో ఈ విశ్వమంతా అవాఙ్మానస గోచరుడైన విరాణ్మూర్తి సుస్వరూపంగా భావించడం, మనఃపదార్థాన్ని మదింపు వేసిన తర్వాత దానిని ఆకసంలో తేలాడే చలువలరాజుతో పోల్చి, 'చంద్రమా మనసో జాతః' అని కవిత లల్లడం ఎంతటి భావనాపటిమ! సశరీరంగా శాశ్వత లోకావాసం సంభవం కాదని నిరాశపడినా, ఏరోరీతిగా సప్త సంతానాలలో నన్నా తను నిలచి ఉండదలచడం ఎంతటి సంకల్పసిద్ధి! అదే అమరత్వవాంఛ, జిజీవిష అత్యంత ప్రాచీనకాలం నుంచి సంస్కృతి సౌరభాలు, విజ్ఞానదీధితులు విరజిమ్మిన ఈజిప్ట్ ప్రాచీన వాస్తు శిల్పావశేషాలలోను ప్రస్ఫుటమౌతున్నవి.

ఈజిప్ట్‌లో మరణించినవారికి ఖనన సంస్కారం చేయడం, సమాధి చేయడం ప్రాచీనాచారం. శవాన్ని చర్మంలో గాని, చాపలోగాని చుట్టి గొయ్యి తవ్వి ఉంచి, మృతునికి సంబంధించిన అన్ని వస్తువులను పక్కనపెట్టి ఇసుక కప్పివేసేవారు. ఈ సమాధులలో అమూల్య వస్తువులు ఉంచేవారు. ఈజిప్ట్ వాతావరణం తడిలేక పొడిగా ఉండడంవల్ల సమాధులలోని శవాలు ఎండిన ఎడారుల ఇసుక తగిలి చెడేవి కావు. సహజంగా వస్తువులు ఉన్నరూపంతోనే ఉండేవి సమాధులను దోచుకొనే దోపిడీ దొంగలు సమాధులను తవ్వితీసి వస్తువులను దొంగిలించినప్పుడు శవాలను బైట పారవేసే వారు. దానితో శవాలను చెక్కుచెదరకుండా ఉంచడానికి వీలున్నదనే భావం తర్వాత ప్రజలకు కలిగింది. ఈ భావం "మమ్మీ"ల సంప్రదాయానికి దారి తీసింది.

ఈ సంప్రదాయం క్రీస్తుకు పూర్వం నాలుగు సహస్రాబ్దాలనాడు ఈజిప్టును పాలించిన మొదటి రాజవంశం కాలానికే పాతుకుంది. తాము అతి పవిత్రంగా భావించిన మృగాల శవాలను గూడ "మమ్మీ"లు చేసేవారు. ఇలా దేహాన్ని

రక్షించడానికి కారణం ఆ రక్షణ మరణించిన వారి పారలౌకిక యాత్రకు తోడ్పడుతుందన్న విశ్వాసమే.

మమ్మీ అనే పదం 'ముమియాయి' అనే పార్సీపదభవం. దీని మూలార్థం మైనం అని. తర్వాత దీనికి తారు, బంక అనే అర్థాలు రూఢమయాయి. శవాన్ని భద్రపరచడానికి మొదటి రోజులలో తేనె మైనం పూసేవారు. విజ్ఞానం పెరిగే కొద్దీ రసాయన ద్రవ్యాలు వాడేవారు. కాని 'మమ్మీ' అనే ప్రాచీనపదం మాత్రం ఈ ప్రక్రియకు రూఢమైపోయింది. మమ్మీ అంటే తేనె మొదలయినవి పూసి భద్ర పరచిన శవం.

ఈ మమ్మీల సమాధులు క్రమంగా 'పిరమిడ్' అనే మహోన్నతమైన, కూచిగా వుండే స్తూపాల నిర్మాణానికి కారణమయాయి. మొదట ఈ శవాల సమాధి పొడుగాటి మామూలు గొయ్యి. ఇది క్రమంగా చతురస్ర ప్రాకారమైన నేలమాళిగ అయింది. ఈ నేలమాళిగలో శవాన్ని-మమ్మీని, దానికి సంబంధించిన వస్తువులను ఉంచి, పైన కర్రలు పరచి, మట్టి, ఇసుక కప్పేవారు. కొంతకాలానికి కర్రచౌకట్లు - ద్వారబంధాలలాంటివి - గోతిలోకి దించి, వాటిపై మట్టిగుట్ట పోయడం, పిదప చుట్టూ పిట్టగోడ కట్టి దానిపైన కప్పుగా రాళ్ళతో కప్పివేయడం, ఈ పిట్టగోడలు ఎత్తయి పిరమిడ్ల రూపం దాల్చడం— ఈ సమాధుల క్రమపరిణామం. పిరమిడ్లు గుండ్రంగా ఉంటే మట్టికట్టడాలు: చతురస్రాకారంగా ఉన్నవి రాతికట్టడాలు. మొదటి పిరమిడ్ ఖా-ఫ్-రా రాజులవంశంలో నిర్మితం.

చోసర్ అనే రాజుకాలంలో ప్రారంభమైన వాస్తుశాస్త్రం ఆయన మరణానంతరం 100 సంవత్సరాలలో చాల అభివృద్ధి చెందింది. నాల్గవ వంశం రాజైన ఖుపూ (చెవోప్స్) గిజు అనేచోట పెద్ద పిరమిడ్ కట్టించాడు. దీని ఎత్తు దాదాపు 450 అడుగులు. ఇది పెద్ద పిరమిడ్లలో రెండవది. ఇది వాస్తు గణితశాస్త్ర పాండిత్యానికి పరాకాష్ఠ.

ఈ మాధులలో మరణించినవారి పరిసరాల, నిత్యజీవిత సంఘటనల చిత్రాలు గీయడం, శిల్పాలు చెక్కడం మామూలు. మరణించిన వారి విగ్రహాలూ నిర్మించేవారు. ఖా-ఫ్-రా, మెన్ కావుర్ వంశాల రాజుల విగ్రహాలు దీనికి తార్కాణ. కన్నులు సహజంగా కనిపించడం కోసం గాజు, స్ఫటికశిల, అద్దం వాడేవారు.

క్రీస్తుకు పూర్వం నాలుగువేల సంవత్సరాలనుంచి, క్రీస్తుకు పూర్వం నాలుగవ శతాబ్దిలో అలెగ్జాండర్ ఈజిప్టుపై దాడి చేసేటప్పటికి 26 రాజ వంశాలు ఈజిప్ట్‌ను పాలించాయి: వీటిలో 12 వ రాజవంశంవరకూ రాగివస్తువులు వాడకంలో ఉన్నాయి. ఇవి ఎప్పుడు వాడకంలోనికి వచ్చాయో స్పష్టంగా చెప్పడం

కష్టం—సిరియనులు తరచు దాడి చెయ్యడంవల్ల ఈ జిప్టువారు రాగి ఆయుధాలు అభివృద్ధి పరుచుకొన్నారు. వీరి మొదటి ఆయుధం ముక్కోణపు బాకు. ఇరాంటి ఆయుధాల, రకరకాల మృగాల చిత్రాలు, మనుష్యుల చిత్రాలు ఈ సమాధులలో దొరికాయి. చేతులెత్తి ఏడుస్తున్నట్లున్న స్త్రీల చిత్రాలు, గడ్డాల మనుష్యుల చిత్రాలున్న ఏనుగు దంతాలు దొరికాయి. స్త్రీల చేతులకు పచ్చబొట్లు ఉన్నాయి.

ఈజిప్టులో గాడిద, ఒంటె ఎక్కువబడితే అక్కడ కనిపించే జంతువులు. కాని, ఒంటె ప్రాచీన చిత్రాలలోను, శిల్పాలలోను కనబడడం లేదు. దున్నపోతు కూడా పాతబొమ్మలలో లేదు. ఎద్దు, మేక, గొర్రె, పంది, కుక్క, పిల్లి, బాతు, కనిపిస్తాయి. వింతగొర్రె ఒకటి కనిపిస్తుంది. దీనిని ఖనుం దేవత అంటారు. దీని తలగొర్రె పొడేలుతల. 18 వ రాజవంశ కాలంలో క్రీస్తుపూర్వం 17 వ శతాబ్దంలో గుర్రం వాడకానికి వచ్చింది. సివంగి, తోడేలు, నక్క పాతమృగాలు. తోడేలు, నక్క పవిత్ర మృగాలుగ భావించబడ్డాయి. సమాధులను నక్కలు తవ్వివేయకుండా పూజిస్తున్నట్లున్న చిత్రాలు, శిల్పాలు ఉన్నాయి.

సమాధులలో ఇతర వస్తువులతో పాటు మృణ్మయ నౌకలుకూడా—రకరకాలవి—దొరికాయి. వీటి ఆంతర్యం పురాతత్త్వవేత్తలు గ్రహించలేక పోయారు. ప్రాచీన ఈజిప్టు ప్రజల కర్మకాండలో ఈ సమాధులకు, మృణ్మయ నావలకు సంబంధం ఉంది. ఈ రెండింటికీ ఉద్దేశం ఒక్కటే.

ఈజిప్టులో నౌకాయానం రాజవంశాల పరిపాలనకు ముందే—క్రీస్తుకు పూర్వం ఐదువేల ఏండ్లనాడే—ఉంది. తెడ్లతో నడిపే నౌకలు - తెరచాపలు కలవి, లేనివి, చౌకపు తెరచాపలు గలవి - రకరకాలవి ఉండేవి. ఇవి ఫొయెకా (లెబనాన్) నుంచి ఈజిప్టుకు కలప తెచ్చేవట. ఎర్ర సముద్రంలో ఒకసారి ఓడపగిలి లెబనాన్‌కు, గెబెల్‌కు యాత్రికులు కొట్టుకొని వచ్చారట. కాని, ఈ ఓడలు బాబిలోనియాకు, భారతదేశానికి వచ్చేవో, లేవో తేలీదు. బాబిలోనియానావలు మాత్రం వాళ్ళకోసం ఎర్రసముద్రందాక వచ్చేవి. మూడవ రాజవంశ కాలంలో పెద్దనావలు మధ్యధరా సముద్రంలో ప్రయాణంచేసేవి. వాటికి 'శాంతినౌక', 'సూర్యమండల కాంతి' మొదలైన పేర్లూ ఉండేవి. 18 వ రాజవంశపు హట్‌షిప్‌సూత్ కాలంలో నౌకాయానం విశేషంగా అభివృద్ధి చెందింది.

మహాపురుషుల మరణానంతరం వారి ఆత్మ సూర్యమండలాన్ని భేదించుకొని వెళ్ళుతుందని మన ప్రాచీనులు నమ్మినట్టే ఈజిప్టు ప్రాచీనులు కూడా మరణానంతరం తాము కూడా సూర్యునితోపాటు తేజోలోకాలలో ప్రయాణం చేయగలమని నమ్మేవారు; తమ ఔర్ధ్వదైహిక యాత్రకు ఉపయోగ పడగలవనుకొనే నావలను తమసమాధులలో పెట్టుకునేవారు.

ఈజిప్టులో ఎక్కడ చూచినా ఎడారులు; రాకపోకలకు నైలునది తప్ప గత్యంతరం లేదు. కనుక ఇహజీవితంలోను, పరలోక యాత్రకూ ఓడే ఏకైక ప్రయాణ సాధనమని ప్రాచీనులు భావించడం సమంజసమే. నైలునది ఈజిప్టు ప్రజల జీవితంలో భాగం. అది వారి జీవిత సమైక్యానికీ, సంస్కృతి సమన్వయానికీ మూలకారణమైంది. ప్రాచీనులు నైలునదిబంకమట్టితోను రెల్లుతోను ఇళ్ళు కట్టుకొనేవారు. తర్వాత వచ్చిన రాతి కట్టడాలకు వాడిన రాయికూడా ఈ నైలునది మీద రవాణా అయినదే.

తుంగ, రెల్లు నీటిలో మునిగేవికావు. కనుక ప్రాచీనులు వాటిని మహాద్భుత వస్తువులుగా చూచేవారు. దాన్ని మోపులుకట్టి నావలుగా వాడేవారు. అవే తర్వాత రకరకాల నావలకు వరవడి అయాయి కనుకనే నావకు ఈజిప్టు జాతిజీవితంలో ప్రాధాన్యం.

మెనేస్ అనే రాజు ఎగువ దిగువ ఈజిప్టుల సమైక్యం సాధించిన తర్వాత రాజవంశీయుల సమాధులలో రెండుజతల నావలు కనిపించేవి. రెండు ప్రాంతాలలోను వేర్వేరు దేవతలుంటారు గనుక, ఎగువ రాజరికాని కొక జత నావలు, దిగువ రాజరికానికి మరొకటి. వీటికే పగటి నావలు, రాత్రి నావలు అని సంకేతం ఏర్పడింది. 'రా' (రవి) దేవత ఉదయం జన్మించి, రాత్రి పాతాళలోక ద్వారంలో మరణించేవరకు ప్రయాణం చేయడానికి పగటి వానలు. అమర జీవులందరూ అక్కడ రాత్రి నావలకు మారి భయంకర పాతాళప్రయాణం చేస్తారు కనుక రాత్రి నావలకు మారి భయంకర పాతాళ ప్రమాణం చేస్తారు కనుక రాత్రి నావలు. ఈ నావలు 24 గంటలకు సంకేతమైన 24 ద్వారాలు దాటాలి. ఓసిరిస్ (మృత్యుదేవత) వసించే అబిడోస్‌కు వెళ్ళడానికి ఐదవనావ. "ఖెంట్", "ఖెడి" అనేవి స్వర్గ - మర్త్యలోకాల ప్రయాణాలకు వాడే ప్రాచీన పదాలు. ఖెంట్ అంటే నైలునదిలో ఎగువ ప్రమాణం: ఖెడీ నైలునదిలో దిగువ ప్రయాణం. ఈ ఎగువ దిగువ ప్రయాణపు పదాలే స్వర్గ - మర్త్యలోక ప్రయాణాలకు వ్యవహృతమయాయి; క్రమంగా ఈ నావలను సూర్యనావలనేవారు. ఆరవ వంశం రాజుల కాలంలో విప్లవం చెలరేగి, రాజ్యవ్యవస్థ భగ్నమై, దొంగలు సమాధులను ధ్వంసం చేసి, వాటిలోని వస్తువులను దోపిడీ చేయడంవల్ల, తర్వాతివారు ఈ సూర్యనావలను పిరమిడ్లలోనే పాతిపెట్టసాగారు.

ప్రాచీన ఈజిప్టు జీవితం భారతీయ జీవితంలాగే ఆముష్మిక ప్రధానం. ప్రతిరాజు తనకు ముందు రాజు చేసిన ఏర్పాట్లు ధ్వంసం కావడం, సమాధులు కొల్లపోవడం చూచి, తన ఆముష్మిక యాత్రకు ఎంతో శ్రద్ధ తీసుకొనేవాడు.

కొంతకాలానికి మరొక విప్లవం జరిగి, పిరమిడ్లంటే ధనాగారాలనే భావం దొంగలకు ఏర్పడి, సమాధులను దొంగలు అపవిత్రం చేయడంవల్ల ప్రజలు సమాధులను కొండచరియలలో దాచేవారు. అక్కడే సూర్యనౌకశిల్పం చెక్కో, బొమ్మలు గీచో సంతృప్తిపడేవారు. అలెగ్జాండర్ దండయాత్ర తర్వాత (క్రీస్తు పూర్వం 332) సూర్య నౌకల సంప్రదాయం లుప్తప్రాయమైంది.

ఈ సంప్రదాయం ఎలావున్నా దీనివల్ల నౌకా నిర్మాణకళ నాల్గవ రాజ వంశంలోని ఖుపు (చేవోప్స్) కాలంలో (క్రీస్తు పూర్వం 2900-2750) పరాకాష్ఠ చెందింది. కనుకనే సమాధుల నుంచి వాటిని దొంగలు అపహరించేవారు.

ఖుపూరాజు కట్టించిన గిజాలోని పిరమిడ్ పరిసరాలలో దొరికిన సూర్య నౌక అనాటి నౌకానిర్మాణ కళకు ఉదాహరణ. ఖుపూరాజు విగ్రహాలు, అప్పటి రెల్లుగుజ్జు కాయితాలు (పపైరస్), అయన వాడిన వస్తువు లేవీ ఈ సమాధిలో దొరకలేదు; ఒక్క నావతప్ప. ఈ నావగూడ అత్యాశ్చర్యకరంగా దొరికింది. దీనిని కనుగొనడం ఈజిప్టు చరిత్రలోనే విప్లవం వంటిదని ఈజిప్టు పురాతత్వ వేత్త లంటున్నారు.

ఈ నావను ఏడేళ్ళ క్రితం (1953 మే 26న గిజాలోని) పురాతత్వ శాఖ డైరెక్టర్ కమాల్ ఎల్ - మలఖ్ కనిపెట్టాడు దాదాపు 450 అడుగుల ఎత్తున్న ఈ పిరమిడ్ చుట్టూ యాత్రికుల సౌకర్యం కోసం రోడ్డు వేయించడానికి ఇసుకను తీయించి వేస్తుండగా కింద ఖంగుఖంగు మన్నది. పరిశీలించగా, 150 గజాల సున్నపురాళ్ళ నడవకప్పు కనబడింది ఇక్కడ ఎక్కడో ఖుపూ సూర్యనౌక వున్నట్టు అంతకుముందు రెండు సంవత్సరాల క్రితం ఒక రాతిపై కనిపించిన జంతులిపి మూలంగా శాస్త్రజ్ఞులు ఊహించారు కాని, కచ్చితంగా ఇక్కడేనని తెలీలేదు. మలఖ్‌కు ఆ నౌక ఇక్కడే వుందని ఎందుకో స్ఫురించింది.

ఈ సున్నపురాతి నడవకప్పు ఖుపూ పిరమిడుకు దక్షిణాన 25 అడుగుల దూరాన పూర్వ పశ్చిమంగా ఉన్నది. మలఖ్ దానిపై పేరుకొని ఉన్న ఇసుక, మట్టి తీయించగా కప్పు ఉత్తరపు కొస కనిపించింది. ఈ నడవ మధ్యకు సరిగా ఒకగోడ ఉన్నట్టూ కనిపించింది. నడవకు పిరమిడ్‌కు మధ్యన దక్షిణోత్తరంగా ఒక బండరాయి పెట్టడంవల్ల నడవ వేరై పోయింది నడవ తూర్పుభాగం మధ్యకు మెట్లు రాతిలో తొలచబడి ఉన్నాయి. రాతిని తొలిచి రెండునావలు వాటిలో భద్రపరిచినట్టు స్పష్టమైంది. మలఖ్ ఈ రాతి కప్పులోని ఒకరాతిని తొలి పించి, తలమాత్రం దూరదగినంత సందుచేసి, అద్దం తెప్పించి లోపలికి వెలు తురు ప్రతిఫలింపజేసి తొంగి చూచాడు. మలఖ్ సంతోషానికి మేరలేదు "ఐదు వేల సంవత్సరాలనాటి ఖుపూరాజు పరలోకయాత్రకు భద్రపరచిన సూర్య

నౌకలలో ఒకదానిని తొలిసారిగా చూచే భాగ్యం నాకు కలిగింది" అని ఆనందిం చాడు. ఆయన మాటలలోనే ఓడ సంగతి వినండి:

"తొంగిచూడగానే గుప్పుమని సుగంధం-బహుశా ఐదువేల సంవత్సరాల నాటి ధూపధూమ సుగంధం - మా నాసాపుటాలకు సోకి ఆనందపరవశుల మయ్యాము. ఈజిప్టు ప్రాచీనులు పవిత్రంగా భావించే ఉదుంబర దేవదారు వృక్ష త్వక్కుల కమ్మనివాసన వచ్చింది. మొట్టమొదట సూర్యోదయానికి ముందున్న ఆకాశం లాగ అంతా తెల్లగా కనిపించింది. తర్వాత ఏదో గోధుమరంగు వస్తువు సరిగా అట్టడుగున కనిపించింది. కళ్ళు మరింత పెద్దవి చేసుకొని చూచాను; లోపల ఏమైనా కనిపిస్తుందా అని. కింద కనిపించిన గోధుమరంగు భాగంనుంచి కోలగా వున్న ఆకారం కనిపించింది కోలగా ఉండే ఆకారం ఓడతెడ్డని తోచింది. ఓడ! ఓడ! ఎందుకలా నిలుచుకొని ఉన్నారు. ఫ్లాష్‌లైట్ తీసుకొనిరండి, లేక పోతే అద్దమన్నా తెండి - అని కేకలు వేశాను మొదటికాంతిలో మొదట నాకు కనిపించింది మూడు గజాల దూరంలో ఎదుట ఒక ఎర్రటి గుర్తు. అది జంతులిపి కాదు; నాముందు కనిపిస్తున్న కలప పైభాగంలో డెక్కు చాందినీ. దానికి కట్టిన పగ్గాలు, మరి నాలుగు తెడ్లవంటివి కనిపించాయి. పూర్తిగా నౌక. ఎవరూ తాక లేదు-అని కేకవేశాను. మొత్తం ఆరు డెక్కులు కనిపించాయి. ఓడవున్న వసారాలో కప్పుపై నీలిరంగు క్రాసు గుర్తులున్నాయి. ఇవి నక్షత్రాలకు ప్రాచీన చిహ్నాలు."

ఈ నావ నిర్మాణానికి దేవదారు కలప లెబనాన్‌నుంచి తెప్పించబడి ఉంటుందని, మేడి (ఉదుంబర) ఈజిప్టుదేనని పరిశోధకులన్నారు. చెవోప్స్ కాలపు కలప దొరకడం ఇదే మొదలు. సూర్యనౌకలు ఆత్మ ప్రయాణానికి ఉద్దేశించబడినవి గనుక వీటిలో ఇతర వస్తువులు వుండవని, మొదటి పరిశోధ కులు భావించారు. కాని, మరణించినవారి పరలోక యాత్రకు ఇహలోక ప్రతి కృతులు సాధనాలు కాగలవనే నమ్మకం వుండడంవల్ల ఖుఫూ, ఆయన పరి వారం ప్రతిమలు, తక్కిన రూపాలు డెక్కులపైన చెక్కబడి వుంటాయని మలఖ్ విశ్వాసం.

ఆయన ఈ ఓడరూపాన్ని ఫ్లాష్‌లైట్ల ద్వారా ఫోటోతీసిన తర్వాత ఎడారి చలిగాలి లోపల ప్రవేశించి చెడిపోకుండ వసారా కప్పు రంధ్రాన్ని తిరిగి జిప్సం కలిపిన సిమెంటుతో కప్పివేశాడు.

భారత నౌకాచరిత్ర కూడా అతిప్రాచీనమైనదే. ఋగ్వేదంలో "ఓ అగ్నీ! నీవు మమ్మల్ని నావ నదిని దాటించినట్టు మహారణ్యాలు దాటిస్తున్నావు"

(స నః పర్యుషదతిదుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితా త్యగ్నిః) అనే అగ్ని సూక్తాలున్నాయి. కాని, ప్రాచీనమైన నావలు లభించలేదు. ఈజిప్టులో ఐదువేల సంవత్సరాల నాటి నావ చెక్కు చెదరక, అప్పటి రంగుతో, వాసనతో, రూపంతో కనిపించడం ప్రపంచ నాగరికత చరిత్రలోనే నూతనాధ్యాయం. ప్రతి భావుకుడు, సహృదయుడూ, విశేషించి ప్రాచ్యదేశ వాసులమైన భారతీయులం - అందులోను మున్నీరును మోకాలిబంటిగా భావించి విచ్చలవిడిగా ఓడలు నడిపిన తెలుగువారం - గర్వించదగింది.

# ఎంత వెదకినా కనిపించని ముద్రారాక్షసాలు

**పూ**ర్వం లేఖక ప్రమాదాలు మహాకావ్యాలలో సయితం పాఠాంతరాలు కల్పిస్తూ, అపార్థాలకు అవకాశమిస్తూ పాఠకులను భ్రాంతిపారావారంలో పడ దోసేవి. నేడు ఆ విధిని ముద్రణదోషాలు తు.చ. తప్పకుండా నిర్వర్తిస్తున్నాయి. ఈ ముద్రణ దోషాలలో అక్షరానికి మరొక వింతక్షరం పడడం అలా ఉండగా, ఒకప్పుడు పంక్తి మధ్యన కొన్ని అక్షరాలు లోపించి శూన్యం కనిపించడం వల్ల దారినిపోతున్నవాడు అకస్మాత్తుగా 'మాన్‌హోల్'లో పడి మరుగైపోయినట్లు, అన్నం తింటున్నవాడు హఠాత్తుగా 'కచక్'మని రాయి కొరికి రిచ్చవడిపోయినట్టు, చదువరి చదువుతూ చదువుతూ చతికిలపడి గతుక్కుమనడం, కొంతసేపటికి తెప్పరిల్లుకోవడం వార్తాహరులకు తెలిసిన విషయమే. అయినా ఈ అక్షరదోషాలు రాక్షసాలై మన బుద్ధిని పట్టుకుని వేలాడినపుడు మాత్రం వెర్రెత్తిపోతుంది. లోక సభకు తోకసభ అని పడితే ఎలా ఉంటుంది?

భారతంలో అరణ్యపర్వంలో ద్రౌపది యుధిష్ఠిరునికి నీతిబోధ చేసే ఘట్టం. "కర్మఫలంబులు దైవమానుష సిద్ధంబులయ్యునను బురుషోత్సాహ సముపార్జితంబులయిన నవి సుస్థిరంబులయి వర్తిల్లు ననీహమానుండయి దైవపరుం డయినవాడు **నీరిలోని యానపాత్రంబునుంబోలె** నవసన్నుండగు గావున గర్మ ఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుడవయి నీ యనుజుల పరాక్రమంబునం బరుల జయించి మనయందలి యర్థకృశత్వం బపనయింపుము" (అరణ్య - ప్రథమ - 236) అని యాజ్ఞసేని హితవాక్యం.

"అనీహమానుండయి దైవపరుండయిన వాడు నీరిలోని యానపాత్రమును బోలె" ఎందుకు అవసన్నుడవుతాడు? యానపాత్రమంటే ఓడ. నీరిలోని ప్రతి ఓడ పగిలి మునిగిపోతే సముద్రయానం ఎప్పుడో ఆగిపోయేది. కనుక 'యానపాత్ర'మన్నచోట ముద్రా రాక్షసమేమో తెలుసుకొనడానికి మూల సంస్కృత భారతం చూడవలసివస్తుంది.

"యోహి దిష్ట ముపాసీనో నిర్విచేష్టః సుఖం శయేత్,
అవసీదే త్స దుర్బుద్ధిః ఆమో ఘట ఇవోదకే."

వన - అధ్యా 32 - శ్లో 14

దైవాన్ని నమ్మి అకర్మణుడై సుఖంగా నిద్రపోయే దుర్బుద్ధి ఆమఘటం వలె — పచ్చికుండవలె — ద్రవిస్పిపోతాడని వ్యాసు లన్నారు. నన్నయ్యగారు "ఆమపాత్రంబునుంబోలె అవసన్నుండగు" అని మూలానుయాయిగా అనువదించారు కాని మన ముద్రారాక్షస మంత్రి సిరిలోని యామపాత్రమేమిటని ఆలోచించి 'మ'ను కేసులో వేసి 'న'ను బిగించాడు చెస్సులో. దీనిలో అర్థం పాడయిందని గ్రహించలేదు.

శృంగారనైషధంలోని భోజన వర్ణన :

"ఆకుపచ్చళ్ళు చవిచూచి రాదరమున
పొగలు నెగయగ నాసికాపుటములందు
ఎర్రదనమున............."

ఇక్కడ ఎర్రదనం అన్నప్పుడు 'వ' కు మారు 'ఎ' పడ్డది. వర్రదనమంటే తీవ్రత, కారం. ఆ అర్థాన్ని 'ఎ' ఎగురవేయలా?

ముద్రాపకులు స్వతంత్రించి ఉత్తమపాఠాలు అధస్సూచికలోను, చెత్త పాఠాలు పైనను ఇవ్వడం వల్లకూడా యథాశక్తి అపార్థాలు పుట్టించి పుణ్యం కట్టుకుంటున్నారు.

భారతంలో అరణ్యపర్వంలో భీముడు ధర్మరాజుకు హితంచెప్పే ఘట్టం:
"శూద్రాన్నంబునందలి దుగ్ధంబునుంబోలె దుర్యోధను రాజ్యంబు దూష్యంబగుట పౌరజానపద బ్రాహ్మణవరులు నీ కనురక్తులయి భవద్రాజ్యంబ వలచియుండుదురు." (అరణ్య-ప్రథమ-252) 'శూద్రాన్నంబునందలి' అనేమాటకు 'శ్వదృతి యందలి' అనేపాఠం అధస్సూచికలో ఇచ్చారు. పై వాక్యాలలోని 'శూద్రాన్నంబు నందలి దుగ్ధంబునుంబోలె' అనేది తక్కినవాటితో ఏమైనా అన్వయిస్తున్నదా? పదాలలో తప్పేమీలేదు. పిండితార్థం సంతృప్తికరంగాలేదు. సంస్కృత మూలం సందర్శించనిదే సనిపడేట్టులేదు అర్థం !

"పౌరజానపదా స్సర్వే ప్రాయశః కురునందన
సవృద్ధ బాలసహితా శ్శంసంతి త్వాం యుధిష్ఠిర.
శ్వదృతౌ క్షీరమాసక్తం బ్రహ్మవా వృషలే యథా
సత్యం స్తేనే బలం నార్యాం రాజ్యం దుర్యోధనే తథా."

(వన-అధ్యా - 33, శ్లో - 80, 81)

మూలంలో దుర్యోధనుని రాజ్యానికి ఎన్ని ఉపమానాలున్నాయో చూడండి: శ్వవృతిలోని క్షీరం, వృషలుని బ్రహ్మ, దొంగసత్యం, ఆడదాని బలం, 'శ్వదృతౌ సారమేయ చర్మకోశే, బ్రహ్మవేదః' అని నీలకంఠాచార్యుని వ్యాఖ్య. దుర్యోధనుని రాజ్యం కుక్కతోలు సంచిలో నింపిన పాలలాగ దూషిత మన్నమాట. ఇంత చక్కని పాఠం ఎలా కిందికి పోయిందో! మూలంలో లేని శూద్రాన్నం ఎలా వచ్చిందో!

ఈ ముద్రాసురులు నిఘంటువులలోను తల దూరుస్తున్నారు. మనం వీరిని ఎంత త్వరలో అంతంచేస్తే అంత శ్రేయస్సు.

# సెట్టి లక్ష్మీనరసింహంగారి మూడు రచనలు

**నా వాచీ, అహల్య, సుధానముద్భవము. కర్త: కవిభూషణ కీర్తిశేషులు శ్రీ సెట్టి లక్ష్మీనరసింహంగారు, బి.ఎ.ఎల్.టి. స్థానం: లక్ష్మీ నరసింహ ప్రచురణాలయం. అనంతపురం.**

ఇరువదవ శతాబ్దం ప్రారంభంలో భారత రాజకీయ రంగంలో, పాల్, బాల్, లాల్ (బిపినచంద్ర పాల్, బాల్‌గంగాధర తిలక్, లాలా లాజ్‌పత్‌రాయ్) గార్లవలె ఆంధ్ర సాహిత్యరంగంలో సింహాలని పేరుపొందిన నలుగురిలో వీరొకరు. తక్కిన ముగ్గురు చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీ నరసింహం, కూచి నరసింహం గార్లు సింహ చతుష్టయమని వీరు నలుగురికి ఆనాటి సంకేతం.

వీరు జన్మించినది తెలుగు భాషలోని విప్లవం వీచిన గడ్డలో - గంజాం జిల్లా గోపాలపురాన. జన్మించిన వేళ తెనుగు భాష కొత్త రెమ్మలు, కొమ్మలు వేస్తున్నవేళ తెనుగుసంఘం కొత్తజీవం కొసరుతున్న సమయాన - 1879 ఆగస్టు నెల. ఆనువంశికమైన పాండితీ ప్రతిభలను పుణికిపుచ్చుకొన్న వీరికి చెన్నపురి రాజధానీ కళాశాలలో నవసమాజ నిర్మాత శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి అంతేవాసిత్వం బంగారుకు తావివలె అయింది.

వీరు విశాఖపట్టణ కళాశాలలో ఆచార్యులుగా వుండగా వుండగా వ్యవహార భాషా ప్రవర్తకులు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు, డాక్టర్‌యేట్స్, నవయుగ ప్రవర్తకులు శ్రీ గురజాడ అప్పారావుగారు మున్నగువారి సాహచర్యం వీరి ప్రతిభకు నికషమయింది. పిదప వీరు 1920 నుంచి పదేళ్ళపాటు న్యాయ వాదిగా పనిచేసి, తర్వాత జయపుర సంస్థానాధీశులు కవిసమ్రాట్ శ్రీ విక్రమదేవ వర్మగారి ఆంతరంగిక కార్యదర్శిగా దివానుగా, ఆస్థానకవిగా వుండి 1938 జూన్ 12వ తేదీన కాలధర్మం చెందారు.

వీరు ముప్ఫయికి పైగా కథలు, నాటకాలు, ప్రబంధాలు, గద్యకావ్యాలు, నవలలు, గీతాలు రచించారు. వ్యావహారిక భాషావాదపు వెల్లువ ఈ వీర గ్రాంథిక వాదినికూడ తడపక పోలేదు. దాని ఫలితంగా వీరు కొన్ని రచనలు వ్యావహారిక భాషలో సాగించారు. అవి ఎందుకో అచ్చుకు నోచుకోలేదు!

ఇక ప్రకృత మనుసరిద్దాం. పైన పేర్కొన్న మూడు రచనలలోను మొదట నా వాచీని పరిశీలిద్దాం. ఇదొక చిన్న కథల సంపుటి. పుటలు 133. వెల 1-4-0. ఈ సంపుటిలో నా వాచీ, దొంగ, ఆకలిగొన్న రాలు, అనగా అనగా

ఒక రాజు, పేకముక్కల రాజ్యము, భక్తురాలు అనే ఆరు కథలు వున్నాయి. నా వాచీ, దొంగ అనే కథలు రచయిత స్వకపోలకల్పితాలు. తక్కినవి నాలుగు రవీంద్ర కవీంద్రుని కథలకు అనుకృతులు. కథలు మానవజాతికే కొత్తవి కావు. వాని పుట్టుక కూడా మానవుని పుట్టుకతో పాటే ననిపిస్తుంది. విశ్వానికే విజ్ఞానాన్ని తొలిసారిగా వితరణ చేసిన భారతీయులకు, మానవుని మనస్సనే గుర్రపు దౌడును వాఙ్మయ స్థాయికి తెచ్చిన గుణాఢ్యుని కన్న తెలుగువారికి కథలు ఉగ్గుబాలలోనివే. కాని వాటన్నిటినీ మనం ఆఖ్యాయిక లనవచ్చు. పంచతంత్రం వంటి చిన్నకథం తీరు వేరు. నేటి కొత్త పోకడల చిన్నకథ పుట్టుక 19 వ శతాబ్దంలోనే అంటే అతిశయోక్తి కాదు. నేటి చిన్న కథలో శాస్త్ర సూత్రాలలోని బిగి, నాటకంలోని జిగి, ఒక సంఘటన వివరణ, పాత్ర స్వభావ ఆవిష్కరణ, సందేశం, పాఠకుల మనస్సులను ముచ్చిలిగొనే మధురహాస్యం, అన్నిటినీ మించి హృదయానికి హత్తుకొనే శైలి - ఇవి విశిష్ట విషయాలు. భంగ్యంతరంగా చెప్పాలంటే, చిన్నకథ గంటకు మించరాదు. సంఘటనలు అపూర్వంగా వుండాలి. శైలి సముచితంగాను, సూత్రప్రాయంగాను వుండడం అవసరం. సంఘటనలు అపూర్వంగా వున్న, జీవితానికి సన్నిహితంగా అకృత్రిమంగా కనిపించాలి. కథనం బాగా చొచ్చుకొన్నట్టు పాఠకుని హృదయం చీల్చుకొని వెళ్ళాలి గాని, గునపంతో త్రవ్వినట్టు విసుగు, విలంబం కలిగించరాదు. ఈ లక్షణాలు శ్రీ సెట్టివారి కథలలో కొల్లలు.

'నా వాచీ' అనే చిన్నకథలో ఒక గడియారం మరమ్మత్తు గమ్మత్తు వివరించబడింది. గడియారం కొత్తలో బాగా పనిచేయడం, తర్వాత అది ఆగిపోవడం, దానిని మరమ్మత్తుకు తీసుకొనిపోగా, మరమ్మత్తుదారు అప్పటికేదో సరిదిద్దడం, అది ఇల్లు చేరగానే మరల గతుక్కుమనడం ప్రతివారి నిత్య జీవితానికీ సన్నిహితమైన సంఘటనలే. ఆ సంఘటనలనే రచయిత ఎంతో ముచ్చటగా వర్ణించి హాస్యరసం చిప్పిల జేశాడు. వీరి వాచీ ఒకసారి మరమ్మత్తుతో "బేగిరావడుగులతో పదునైదు దినములు ముందుకు నడుచుకొని పోయినది. పంచాంగమును బట్టి పండు వెన్నెలతోడి నిండు పున్నమ యుండవలసిన కాలమున నా వాచీ కన్నులు కనిపించని యమావాస్య కటిక చీకటిలోకి కాలు పెట్టుచుండె" నట. రెండవసారి మరమ్మత్తుతో అది మత్తుతో మెత్తవడి కునికిపాట్లు పెడుతూ, రెయిలు బండ్లు తప్పుతూ వీరి దావాలు పరోక్షంలో వీరికి విరుద్ధంగా తీర్పుచెప్పే పద్ధతి వచ్చిందట. మూడవ మరమ్మత్తుతో సగం 'దినం' మెయిలుబండి పరుగులాగున పెట్టి పరుగు పటుగాన్నంతసేపు ''కుక్క మొఱుగులు" తక్కిన సగం రోజు 'పెండ్లి నడకలు' సాగినవట. నాల్గో మరమ్మత్తుతో ఎప్పుడు నడచుటో,

యాగుట యెప్పుడో "దానిచిత్తం వీరి భాగ్యం" అయింది. ఐదవ మరమ్మత్తుతో 'పది గంటలకు పది నిమిషములున్నదనగా గంటల ముల్లును, నిమిషములను జగత్పితలగు పార్వతీ పరమేశ్వరులవలె విడదీయరాని యంత గట్టిగా నొకదాని కొకటి యంటుకొను'నట. ఈ హాస్యానికి పరాకాష్ఠగా వీరి కథోపసంహారచాతురి అద్భుతం. 'స్వగ్రామము విడిచి వెళ్ళిన కంచరులు, కమ్మరులు, వడ్రంగులు, రాతి పనివారు, టిన్ను రేకుపనివారు, వగైరా అందరు నేమగుచున్నారన్న సమస్యకు చిరకాలమునుండి నాకు సమాధానము దొరకక కొట్టుకొనుచుంటిని. ఇప్పుడు తెలిసినది. వీరందరూ గడియారాల పని పడుతున్నారన్నమాట'

రెండవ కథ 'దొంగ' కృష్ణుడనే చెరసాల కాపలా జవాను ఒకరాత్రి ఏమరి కునుకు తీయడం వల్ల చెరసాల నుంచి ఖైదీ తప్పించుకు పారిపోతాడు. పారా మీది ఖైదీని విడిచిపెట్టిన నేరానికి కృష్ణునికి మూడు నెలల కఠిన శిక్ష పడుతుంది. శిక్ష గడిపి వచ్చిన తర్వాత పని దొరకదు. తనకు, ముసలి తల్లికి తిండి గడవక కృష్ణుడు దొంగతనం చేయదలస్తాడు. సుబేదారు నాగన్న అనే గృహస్థు ఊరిలో లేని సమయం చూచి ఇంటికి కన్నం పెడుతాడు. కన్నం వేసి ఇంటిలోకి పోగా ఆ ఇంటి ఇల్లాలు రమణమ్మ మేల్కొని వుంది. సుబేదారు ఆరేండ్ల కుమారునికి ప్రాణాల మీదికి వచ్చింది. పనికత్తె రాధను డాక్టరు ధనం జయరావు వద్దకు పొమ్మని ఆమె బ్రతిమాలుతుంది. రాధ ఒంటిగా పోవడానికి భయపడి, యజమాని మాట వినదు. ఇంతలో మన దొంగ కృష్ణుడు తటాలున తలుపు తెరుచుకొని రివాల్వరుతో ఎదుట నిలబడి "మీ సొమ్ము, మీ నగలు, మీ ప్రాణాలు, మీ దాసి'' అని బెదరిస్తాడు. రమణమ్మ ఇసుమంతైన జంకక మగవారు లేని సమయంలో వచ్చిన దొంగను 'పిరికి పందా' అని తెగడింది. కథ అడ్డంగా తిరిగి నందుకు కృష్ణుడు నివ్వెర పోతుండగా జబ్బుతో వున్న పిల్ల వాడు ఏడ్చి ఏడ్చి మూర్ఛపోతాడు. కృష్ణుని కరకుతనం కరగిపోసాగింది. రమణమ్మ తటాలున వానిని సంబోధించి మగదిక్కెవ్వరూ లేరు, వెంటనే డాక్టరును పిలుచుకొనిరమ్మని బ్రతిమాలుతుంది. కృష్ణుడు పూర్తిగా వెన్నయి పోయి, మంత్రముగ్ధునిలా వైద్యుని అతికష్టంతో తెస్తాడు. పిల్లవాడు కోలు కుంటాడు ... 'కొద్దినెలలలో రమణమ్మయు నాగన్న దొరయు పెండ్లిపెద్దలుగా రాధామాధవ సంవాద ప్రబంధమున పంచమాశ్వాస పర్వమును సంపూర్ణము."

ఈ కథలో దొంగకృష్ణునిలో తొంగిచూచే మానవత్వాన్ని రచయిత సహజ సన్నివేశాలతో అపూర్వంగా చిత్రించాడు. ఆంధ్ర వాఙ్మయంలో ఈ 'దొంగ'కు గౌరవం లభిస్తుందనే నా విశ్వాసం.

తక్కిన నాలుగు కథలు అనుకరణాలు గనుక వాటిచర్చ అవసరం లేదు.

వీరు తమ రచనలలో నిష్పూచీగా, వాలకం, గుండలు పోసినవి, నవ్వు దలక్రిందపెట్టి, గుండ మున్నగు మాండలికాలు ప్రయోగించి విశాలాంధ్ర భాషకు వెలుగుచూపారు.

అహల్య : ఐదంకాల విషాదాంత నాటకం. పుటలు: 106. వెల 1-8-0. ప్రథమ ద్వితీయాంకాలు మూడు రంగాలు, చతుర్థ పంచమాంకాలలో చేరి నాల్గు రంగాలు వున్నాయి. ఇది అహల్య చరిత్ర అని వేరే చెప్పనక్కరలేదు

బ్రహ్మకు హల్య అనే పుత్రిక వుంది. ఆమెను సూర్యుడు, ఇంద్రుడు వల చుతారు. యుక్తవయస్క కాగానే పెండ్లాడవచ్చునని బ్రహ్మ ఇద్దరికి వేర్వేరుగా మాట యిస్తాడు.

ఇంతలో ఒకనాడు గౌతమముని బ్రహ్మకడకు వచ్చి హల్యను చూచి ముగ్ధుడౌతాడు. తన తపఃప్రభావము చేత ఆ ద్వాదశ వర్షీయసిని, అష్ట దశ వర్షగా చేసి ప్రాణిగ్రహించి వెళ్ళుతాడు ఈ సంగతి తెలియక ఇంద్ర, సూర్యు లిద్దరు వాదులాడు కొంటుండగా నారదుడు వచ్చి, గౌతమ వివాహగాధ తెలుపు తాడు. ఆ తపసిని, బూది వలెవున్న ఆ జడదారిని ఎలా ప్రేమించిందో తమవంటి సుందరులను వదలి హల్య, అని వారిద్దరూ వాపోతారు. సౌందర్య విషయంలో కూడా వారికి పేచీవస్తుంది వారిద్దరిలో ఎవరు సుందరులో హల్యతోనే నిర్ధరించు కోండని కలహభోజనుడు సలహాయిస్తాడు. వారిద్దరూ గౌతమాశ్రమానికి పయనం కడుతారు. ఇంతలో నారదుడు మదనుని కలసి హల్య ఇంద్ర భాస్క రుల సౌందర్య పరీక్షచేసేవేళ పూల తూపులు వేసి ఆమె మనసు కలచమని కోరి ఒప్పిస్తాడు. కాని మన్మథుని ప్రయత్నం ఫలించదు. ఈ పరీక్ష కారణంగా గౌత మునికి హల్యపై అనుమానం కలుగుతుంది. గౌతమునికి హల్యకు అంజన అనే గ్రుడ్డిపిల్ల పుడుతుంది.గౌతముడు హల్యను ఇంద్రుని వేషంలో, సూర్యునివేషంలో పరీక్షిస్తాడు. ఇది గ్రహించిన హల్య కలతపడదు. దీనితో అతని అనుమానం ప్రేళ్ళుసాగుతుంది. హల్య గర్భవతి అవుతుంది.ఆమెను పుట్టింటికి తెచ్చి, పుట్టబోయే మనమనికి బ్రహ్మ పేరు పెట్టాలని సరస్వతి బ్రహ్మను కోరుతుంది.హల్యతమ్ముడు ఋషవిరజుడు పార్వతి నీరాడే కొలనులో స్నానం చేయడంవల్ల స్త్రీ రూపంతో తండ్రి దగ్గరికి వస్తాడు. బ్రహ్మ ఆడ రూపంలో వున్న ఋషవిరజుని గౌత మాశ్రమానికి పంపి, హల్యను తెచ్చి ఒక ఏడు దీర్ఘమూర్ఛలో పెడుతాడు. ఆ మూర్ఛలోనే ఆమె ప్రసవిస్తుంది. గౌతమాశ్రమంలో అహల్య బ్రహ్మవరంతో హల్య జ్ఞానం పొంది అంజనతో వుండగా మోహాంధులైన ఇంద్ర సూర్యులు మరొకమారు వచ్చి అహల్యను హల్యగా భ్రమించి మోహిస్తారు. హల్యకిది అలవాటు కాబోలని అహల్య అంగీకరిస్తుంది. అహల్యకు కవలలు పుడుతారు.

ఆ కవలలతో అహల్య గౌతమాశ్రమానికి వస్తుంది. అహల్యా స్త్రీ రూపం గడువు ముగుస్తుంది.

నామకరణానికి బ్రహ్మాదులు వస్తారు. ఇక్కడ గుడ్డి అంజనను వాయువు మోహించగా గర్భం నిలుస్తుంది. ఈ సంగతిని బారసాలకు వచ్చిన దేవవేశ్యలు కనిపెట్టి, నవ్వుతారు. కలహభోజనుడు మరల కలగజేసుకొని అంజన గుట్టు రట్టు చేస్తాడు. గౌతముడు మహోగ్రుడౌతాడు. నేనే కాదు అమ్మకూడా నాలాంటిదే అని అంజన అంటుంది. దానితో గౌతముని అనుమానం అగ్నిపర్వతమై, తొట్ల లోని కవలలు నా కుమారులు కాకపోతే కోతులు కావాలని శపిస్తాడు. వారు కోతు లౌతారు. గౌతముడు నిప్పులు కక్కుతూ భార్యను శిల కమ్మని శపిస్తాడు. ఆ బాలురు అహల్యా కుమారులని, హల్యా కుమారుడు శతానందుడు జనకుని ఇంట నున్నాడని హల్య పరమ పతివ్రత అని బ్రహ్మ శాంత పరుస్తాడు.

ఇద్దరు కోతులు వాలిసుగ్రీవులు. అంజన సుతుడు ఆంజనేయుడు. హల్య తన అపరాధం లేకపోయినా హల్య-అహల్య అని పేర్లు తారుమారై కొన్నాళ్ళకు తనే జారిణి అనే అపవాదు రావచ్చుననే జంకుతో శిలగా అవుతుంది. గౌతముడు ఆక్రోశిస్తుండగా విష్ణువు ప్రత్యక్షమై, రామావతారంలో ఆమెకు శాపవిముక్తి అని ఓదార్చుతాడు ఇది నాటక కథ.

లక్ష్మీనరసింహం గారిని తెలుగు సంఘం కొత్త జీవం కొసరుతూన్న రోజులని మొదట్లోనే అన్నాను. వాల్మీకి మున్నగువారు తము తప్పని భావించిన వానిని కూడా కావ్య బద్ధం చేశారు. తమ కాలానుగుణంగా మార్చడానికి పూనుకోలేదు. తమ సమకాలిక దృష్టికి సరిపడని పాత సంగతులకు కొత్త వ్యాఖ్యానాలు, సమర్థనలు, మార్పులు, చేయడం కళగా పరిగణించిన కాలంలో శకుంతల కథ మారింది. రామాయణ కథ మారింది. అహల్య జారిణి కాదని నిరూపించదలచిన శ్రీ నరసింహంగారు రామాయణం మున్నగు వాటిలో లేని అహల్య పాత్రను సృష్టించి, ఆమెను కథ నాయికగాచేసి ఆమెకు నిందసోక నీకుండా మరొక స్త్రీకాని స్త్రీని అహల్యను-కల్పించి మిక్కిలి సమర్థతతో నిర్వ హించారు. వాలి సుగ్రీవులు ఇంద్ర, సూర్య పుత్రులనడం తప్ప వారి తల్లులెవరో, ఆంజనేయుని జన్మ వృత్తాంతమేదో మనకు అగోచరం. నరసింహంగారు వాటికి గతి కల్పించి రామాయణగాధను ఏకోన్ముఖం చేశారు.

నాటకం చదువురాని వారి సాహిత్యమని ఒక పాశ్చాత్య శాస్త్రజ్ఞుడన్నాడు. ఈ మర్మాన్ని, ప్రాచ్య ప్రాశ్చాత్య నాటక సంప్రదాయాన్ని ఆకళించుకొన్నవారు కావడంవల్ల నరసింహంగారు వస్తువులోను, పాత్రౌచితిలోను జాతీయతను పోనా డక, అంకనిర్వహణం, పాత్రపోషణ, రసనిష్పత్తి మున్నగువాటిలో పాశ్చాత్య

విధానాలను అనుసరించారు. ద్విజేంద్రలాల్‌రాయ్ 'పాషాణి' అనే నాటకం దీనికి సమకాలికం. దానిలో ఈ అపూర్వ వస్తుకల్పన లేదు. అహల్య జారిణి అని గౌతముడు తెలిసి క్షమిస్తాడు. అహల్య పశ్చాత్తప్తురాలవుతుంది. మరే నాటకంలో ఇన్ని స్త్రీ పాత్రలు లేవు

ఈ అహల్యలో మగవారి వెకిలితనానికి రవీంద్ర గౌతములు మూడు మూర్తులు. హల్య నిప్పు. అంజన కన్నవారి కనికరమెరుగని అభాగ్య. అహల్య అతివే కాదు. ఈ నాటక రచనలోని పాత్రపోషణ, సంవాద చమత్కృతి, సన్నివేశ సంవిధం, పాండితీప్రకర్ష, లోకజ్ఞత అసదృశం. వివరించడానికి ఇక్కడ సమయం చాలదు. అప్పటి తెలుగు నాటకాలలోనే కాక ఇప్పటి వాటిలోను దీనికి అత్యుత్తమ స్థానం వుంది.

సుధా సంభవము. పుటలు 83. వెల 0-6-0.

దీనిలో సుధా సంభవం, గోవర్ధనోద్ధరణం అనే రెండు చిన్న కావ్యాలున్నాయి. సుధాసంభవములో అమృత మథన కథ, గోవర్ధనోద్ధరణంలో గోవర్ధన పర్వత ధారణ కథ వర్ణించబడ్డాయి. వీరి పద్యాలు ధారాశుద్ధి కలిగి రసోచిత శబ్ద సంపదతో ముద్దులొల్కుతూ వుంటాయి. ఉదాహరణకు తే. గీ: ఎగువ గణకణమను నిప్పు దిగువ నల్లముద్దయును గల యా విషమును పయోధి నీళ్ళనుండి హుక్కా కరిణిన గుడగుడ బానమొనరించె రజతాద్రి బాదుషాహి ఇంద్రుడు వుత్తరువు చేయగానే మేఘాలు "జోహుకు మంచు బోరునను జోరున హోరున బోయి - గొల్లపల్లెపై హాళాహళి" చూపాయట.

మూడు పుస్తకాల రూపురేఖలు ముచ్చటగా వుంటే బాగుండేది. కాగితం కరువైన ఈ రోజులలో మంచి కాగితంపై అచ్చు వేయించాలనడం మహాపాపం కావచ్చు. శ్రీ శివరావుగారు తమ తండ్రిగారి వ్యవహార రచనలను ముద్రించి ఆంధ్రదేశాన్ని ధన్యం చేస్తారని ఆశిస్తున్నాను.

# రచయితలకు రాజశేఖరుని హితవు

భాష, భావం అహమహమికతో పరుగులు తీసినప్పుడే రచన సహృదయ హృదయంగమ మవుతుందని భామహుడు మొదలు పెద్దలందరూ చెబుతున్నదే. అయినా నాటినుంచి నేటివరకు పేలవమైన రచనలకు కొరతేమీ లేదు. వాటిని చూస్తే, రచయితలు భాషా భావాల ప్రాధాన్యం గుర్తించి రచనా విధానాలను సమకూర్చుకొనడంలో శ్రద్ధవహిస్తున్నట్లు కనిపించదు— నేటి రచయితలు మరీను. అలాటివారికి రాజశేఖరుడు కావ్యమీమాంసంలో చెప్పిన మాటలు కొన్ని తెలుపడం అవసరమనుకుంటాను.

రచయితలు, నేడు, వ్యుత్పత్తికి ప్రయత్నించకనే, సరాసరి రచనలకు పూనుకొనడంవల్ల అపక్వమైన భాషాభావాలు పలికించి నవ్వుల పాలవుతున్నారు. కనుక వ్యుత్పత్తి అత్యవసరం.

కావ్యకర్మలో కవికి సమాధి ముఖ్యమని శ్యామదేవు డన్నాడు. సమాధి అంటే మనస్సును ఏకాగ్రం చేయడం. చిత్తం ఏకాగ్రమైనప్పుడే నూతన విషయాలను గ్రహిస్తుంది. సారస్వత మనేది మహా రహస్యం. అది విద్వాంసులకే గోచరమౌతుంది. నిపుణతతో సేవించనిదే తెలియదు. ఆ రహస్యసిద్ధికి పరమోపాయం మనస్సమాధే అన్నారు పెద్దలు.

అభ్యాసం ముఖ్యమని మంగళాచార్యుడంటాడు. అభ్యాసమంటే ఎడతెగకుండా పరిశ్రమించడం. అభ్యాసమనేది అంతటా ఉపయోగపడి నిరతిశయమైన కౌశలం కలిగిస్తుంది. సమాధి అనేది అభ్యంతర ప్రయత్నం, అభ్యాసమనేది బాహ్యప్రయత్నం ఇవి రెండూ రచయిత శక్తిని ఉద్బోధింప జేస్తాయి! ఈ శక్తి కావ్య హేతువని నా అభిప్రాయం. ప్రతిభా వ్యుత్పత్తులతో ఈ శక్తిని విస్తరిస్తుంది. నిజానికి ఈ శక్తే ప్రతిభా వ్యుత్పత్తులను కలిగిస్తుంది. శక్తి వున్నవాడికే ప్రతిభ వుంటుంది; శక్తి వున్న వాడికే వ్యుత్పత్తి కలుగుతుంది. ప్రతిభ లేని వానికి ఎదుటవున్న పదార్థాలు కూడా పరోక్షంలోనే. ప్రతిభావంతునికి చూడకపోయినా ప్రత్యక్ష మవుతాయి. మేధావి రుద్ర కుమార దాసాదులనే కవులు పుట్టంధులట.

బహుజ్ఞత వ్యుత్పత్తి - అన్నారు ఆచార్యులు. ఉచితానుచిత వివేకం వ్యుత్పత్తి - అంటాడు రాజశేఖరుడు. ప్రతిభా వ్యుత్పత్తులలో ఏది మెరుగు అనే చర్చ జరిపి రాజశేఖరుడు ఇలా అంటాడు :

ప్రతిభా వ్యుత్పత్తులలో ప్రతిభే శ్రేయస్కరి. కవికి గల అవ్యుత్పత్తి కృతమైన దోషాన్ని ప్రతిభ కప్పిపెడుతుంది. ప్రతిభలేని దోషం కన్నులకు మిరుమిట్లు గొలిపేట్లు కనిపిస్తుంది-అని ఆనందవర్ధనాచార్యుడంటాడు. వ్యుత్పత్తే ఎక్కువ అవసరమని మంగళాచార్యు డన్నాడు. అది ప్రతిభలేని లోపాన్ని కప్పి పెడుతుందనీ ఆయన అంటాడు. కాని, ప్రతిభా వ్యుత్పత్తులు రెండూ అవసరమని రాజశేఖరుడన్నాడు. లావణ్యం లేనిదే రూపసంపద, రూపసంపద లేనిదే లావణ్యం రమణీయాలు కావంటాడు. ప్రతిభా వ్యుత్పత్తులు రెండూ కలవాడే కవి అనిపించుకొంటాడని నిష్కర్షగా చెప్పాడు. కుకవి కావడం కన్నా అకవిగా వుండడమే మేలు. కుకవిత సజీవమరణం. కనుక నడమంత్రపు కవులకు సంస్కారం అవసరం. ద్వాదశవర్ణమైన సువర్ణం కూడా నిప్పులో కాలితేనేగాని మెరుగురాదు.

కవిచర్యలో అతడు చెప్పినవి నేటి రచయితలందరూ శిరసావహించవలసినవి. వాటిని సంక్షిప్తంగా తెలుపుతాను :

విద్యోపవిద్యలు గ్రహించిన తర్వాత కావ్యరచనకు యత్నించాలి. పదాల స్వరూపం చక్కగా తెలియాలి. కోశాలన్నీ వాచోవిధేయంగా వుండాలి. ఛందస్సు లన్నిటిని సంగ్రహించాలి. అలంకార తంత్రం పూర్తిగా ఆకళించుకోవాలి—ఇవే కావ్యవిద్యలు. కావ్యరచనకు చతుష్షష్టి కళలు ఉపవిద్యలు. సుజనోపజీవుడయిన కవి సన్నిధిలో వుండడం, వివిధ దేశ సమాచారాలను తెలుసుకొనడం, విదగ్ధులతో వాద ప్రతివాదాలు, లోక వ్యవహారజ్ఞానం, విద్వద్గోష్ఠులు, ప్రాచీనకవుల రచనలు —కావ్యానికి కన్నతల్లులు. స్వాస్థ్యం, ప్రతిభ, అభ్యాసం, శ్రద్ధ, విద్వద్గోష్ఠి, బహుశ్రుతత్వం, మంచి జ్ఞాపకశక్తి, అనిర్వేదం—ఇవి ఎనిమిది కవిత్వానికి తల్లులని కొందరు పెద్దలన్నారు. ఇంతేకాక సదా శుచిగా వుండాలి. ఆ శౌచమనేది మూడు విధాలు : వాక్శౌచం, మనశ్శౌచం, కాయశౌచం అని. మొదటి రెండూ శాస్త్ర పఠనంవల్ల పొందదగినవి. మూడవది శ్రద్ధతో మనమే చేసుకోవలసినది. చేతులు, కాళ్ళ గోళ్ళు తీసివేసుకోవాలి. ముఖాన్ని తాంబూలంతో శుద్ధం చేసుకోవాలి. దేహానికి చందనం అలదుకోవాలి పరిశుద్ధమైన మంచి వస్త్రాలు ధరించాలి. శిరోజాలు సంస్కరించుకోవాలి. శుచిశీలనం సరస్వతికి వశీకరణమని అంటారు. కవి ఎలాటి స్వభావం కలవాడయితే అలాటి కావ్యం పుడుతుంది. చిత్రకారుడు ఏ ఆకారంలో వుంటే ఆ ఆకారంలో అతని చిత్రా లుంటాయని అభిజ్ఞు లనేమాట.

ఇక ప్రవర్తన ముచ్చటగా వుండాలి. నవ్వుతూ పలకరించాలి. చమత్కారంగా—ఉక్తిగర్భంగా—మాట్లాడాలి. అంతటా రహస్యాన్వేషణకు—ఏమిటి దీని ఆంతర్యం అనే దృష్టితో—పూనుకోవాలి. అడగకపోతే ఇతరుల కావ్యాలలోని దోషాలను తెలుపకపోవడం, అడిగితే ఉన్నదివున్నట్లు తెలుపడం.

ఇక నివాసాదులు : అతని భవనం పరిశుద్ధమైనది, ఋతు షట్కోచిత మైన వివిధ స్థానాలు గలది, వృక్ష వాటికలు కలది, క్రీడా పర్వతం కలది, సరోవరాలు కలది, కాలువలు పారేది, నదుల, సముద్రపు నీటితెరలు పడేది, నెమళ్ళు, జింకలు వుండేది, ఎండ వడను అపహరించేది, జలయంత్రాలు, ధారా గృహాలు, లతామండపాలు కలది, ఉయ్యాలలు వుండేదిగాను వుండాలి. కావ్యాభి నివేశభిన్నుడైనప్పుడు మనస్సును ఉల్లాసింపజేయడానికి మాట మాట్లాడకుండా ఆజ్ఞను పాలించే పరిజనమన్నా వుండాలి. విజనమైన స్థానమన్నా వుండాలి. వివిధభాషలు, ఏసలు, మాండలికాలు తెలిసిన పరిజనం, సర్వభాషావేత్తలైన మిత్రులు వుండాలి.

లేఖకుడు సదస్సును సంతోషపెట్టేటట్టు సకల భాషాకుశలుడు, త్వరగా మాట్లాడేవాడు, చక్కని దస్తూరి కలవాడు, పరేంగితాకారాలు తెలిసినవాడు, నానాలిపిజ్ఞుడు, కవి, లాక్షణికుడు అయి వుండాలి. రాత్రి పొద్దుపోయిన తర్వాత ఇలాటి లేఖకుడు దగ్గర వుండడం కష్టం కనుక, అతడు లేనప్పుడు పైన చెప్పిన పరిజనంతోనో, మిత్రునితోనో పని గడుపుకోవాలి. తను తన ఇంట్లో ఏ భాష ఉండాలనుకుంటాడో పరిజనులూ ఆ భాషే అనుసరిస్తారు.

పలక, బలపం, సంపుటాలు, లేఖిని, మసి, తాడి అనే వాటి ఆకులో, భూర్జపత్రాలో, తాటాకులు, గంటం, సున్నంపూసిన గోడలు దగ్గర వుండాలి (ఇప్పుడు ఇవి అవసరం లేదనుకోండి) ఇవన్నీ కావ్యవిద్యకు పరికరమన్నారు ఆచార్యులు. ప్రతిభే పరికరమని నేను (రాజశేఖరుడు) అంటున్నాను.

కవి మొదట ఆత్మ పరిశీలన చేసుకోవాలి. నా సంస్కారమెంత? ఏ భాషావిషయంలో శక్తుణ్ని? జనుల అభిరుచి ఏమిటి? ఎలాటి విషయాలు జనానికి ఇష్టం? జనం మనస్సు దేనిలో లగ్నమైంది? అని గ్రహించి ఆయాభాషలను అనుసరించాలని పెద్దలన్నారు. ఏకదేశి అయిన సామాన్యకవికి ఈ నియమాలు, స్వతంత్రునికి ఒక భాషవలెనే అన్నిభాషలూ లొంగుతాయని నేనంటున్నాను.

కవి లోకస్వభావాన్ని తెలుసుకొని, తనకు లోకానికిగల సామ్యాన్ని గ్రహించి, లోకసమ్మతం కానిదానిని పరిహరించి, నమ్మకమైన దానికే పూనుకోవాలి. జనాపవాదానికి జుగుస్స పడకూడదు. లోకం నిరంకుశం గనుక తన్ను తాను తెలుసుకోవాలి. దేశాంతరంలో వున్న కవిని జనం పొగడుతుంది. మహాకవి ఎదుటవున్నా ఉపేక్షిస్తుంది. ప్రత్యక్షకవి కావ్యం, కులస్త్రీరూపం, గృహవైద్యుని గొప్పతనం ఎవరికి నచ్చుతాయి? కావ్యం ఏమాత్రం మధురంగా వున్నా అనోట అనోట బాల స్త్రీ హీనజాతులవరకు వ్యాపిస్తుంది. అవసరాన్నిబట్టి సమసామయికంగా రచించిన కావ్యాలు, ఒక్కరోజులోనే దశదిక్కులు వ్యాపిస్తాయి. రాజుల కావ్యాలు, సన్యాసుల కావ్యాలు అలాగే, తండ్రి కావ్యాన్ని

పుత్రులు, గురువు కావ్యాన్ని శిష్యులు, రాజుల కావ్యాన్ని అనుచరులు వివేచన చేయకనే ప్రశంసిస్తారు; చదువుతారు.

అరకొరగా చేసిన రచనను ఎవరికీ వినిపించరాదు. ఇది కవి రహస్యం. అది అరకొరగానే మిగిలిపోతుంది. కొత్త రచనను ఏకాకివద్ద వినిపించరాదు. అతడు తనదేనంటే సాక్ష్యం తేవడం కష్టం. తన రచనను ప్రశంసించుకోరాదు పక్షపాతం వల్ల గుణాన్ని దోషం అనుకోడం, దోషాన్ని గుణమనుకోడం సంభవిస్తుంది. బాగా రచించానని గర్వపడరాదు. గర్వలేశం కూడా సర్వసంస్కారాలనూ ధ్వంసం చేస్తుంది. ఇతరులతో తన రచనను పరీక్షింప జేసుకోవాలి. తటస్థునికి కనిపించే దోషం రచయితకు కనిపించదని అంటారు. తాను కవిననుకొనేవాడిని అతని యిష్టం ప్రకారమే రంజింపచేయాలి అలా చేయకపోతే వాని ఎదుట ఏ కావ్యం చదివినా అరణ్యరోదన మౌతుంది; వైపరీత్యంకూడా ఏర్పడవచ్చు. అలాటివాడు దురహంకారం కొద్దీ విన్నదానిని అపహరిస్తూ తన కావ్యంలో పొందుపరచుకోవచ్చు.

రచయిత కవిసమయాలు తెలుసుకోవాలి. కవిసమయమంటే అశాస్త్రీయము, అలౌకికము, పరంపరాగతము అయిన అర్థ కల్పన. "అశాస్త్రీయమైనది, లోకవిరుద్ధమైనది దోషం కదా. మరి కవులు ఎలా తమ కావ్యాలలో ప్రయోగించవచ్చు?" అని కొందరు ఆచార్యులు ప్రశ్నించారు. "ఇది కవిమార్గానుగ్రాహి. కనుక దోషం ఎలా అవుతుంది?" అని నేనంటాను. "అయితే అశాస్త్రీయమైనది, లోకవిరుద్ధమైనది చెప్పేటప్పుడు చమత్కారావహమైన నిమిత్తం వుండాలి" అంటారు ఆచార్యులు. ఇదిగో నిమిత్తం చెబుతున్నాను. పూర్వం విద్వాంసులు సహస్రశాఖము సాంగము అయిన వేదాన్ని కూలంకషంగా అధ్యయనం చేసి, శాస్త్రాలు అభ్యసించి, దేశాంతరాలు, ద్వీపాంతరాలు పర్యటించి రచించిన విషయాలను కాలదేశ వర్తమానాలను బట్టి మారినా, అదే విధంగా గ్రథించడం కవిసమయ మంటాను కవిసమయమనే మాట దాని మూలకారణం తెలియనివారు ప్రయోగించడంవల్ల రూఢమైపోయింది.

సమయవ్యవస్థ లేకపోతే ప్రవృత్తిలోను విప్లవం ఏర్పడుతుంది. కనుక పగలును, రాత్రిని యామక్రమంతో నాలుగుగా విభజించుకోవాలి. రచయిత ఉదయమే లేచి కాలకృత్యాలు తీర్చుకొని, పఠనాలయంలో యథాసుఖం కూర్చుని, ప్రథమ ప్రహరంలో కావ్యరచనకు అవసరమైన విద్యోప విద్యలను అనుసంధానం చేయాలి. ఇంతటి ప్రతిభాహేతువు మరొకటి లేదు. రెండవ ప్రహరంలో కావ్యరచన. మధ్యాహ్ననికి ముందు అవిరుద్ధాహారం సేవించాలి. భోజనానంతరం కావ్య గోష్ఠి. ఒకొకప్పుడు ప్రశ్నోత్తరాలు కావ్య సమస్యాధారణ, దస్తూరి సరిచేయడం మొదలయినవి మూడో ప్రహరంలో. నాలుగవ ప్రహరంలో

ఒంటిగాగాని ఒకరిద్దరితోగాని ఉదయం రచించిన కావ్యాన్ని పరీక్షించాలి. రసావేశంలో కావ్యం రచించేటప్పుడు వివేచనదృష్టి వుండదు గనుక వెంట వెంటనే పరీక్షించుకోడం అవసరం. ఎక్కువైనదాన్ని వదలిపెట్టాలి; న్యూనంగా వుంటే పూరించాలి. అనుకొన్నట్టుగా లేకపోతే మార్పులు చేయాలి. మరచిపోయినదానిని జ్ఞాపక పరచుకోవాలి.

ఉదయం పరీక్షించిన రచనను ప్రదోషానంతరం వ్రాసుకోవాలి. రెండు, మూడు ప్రహరాలు నిద్రపోవాలి. బాగా నిద్రపోవడం దేహానికి ఆరోగ్యం. చతుర్థ ప్రహరంలో మేల్కొవాలి బ్రాహ్మ ముహూర్తంలో మనస్సు ప్రసన్నమై లోకాతీతమైన పెక్కువిషయాలను గ్రహిస్తుందని అంటారు.

పురుషులలాగే స్త్రీలుకూడా కవులు కావచ్చు. సంస్కారమనేది ఆత్మనిష్ఠం. స్త్రీ పురుష విభాగమనే దేదీ దానికి లేదు. రాజపుత్రికలు, మహామాత్యదుహితలు, గణికలు, నటుల భార్యలు క్షుణ్ణంగా శాస్త్రం చదువుకున్నవారుగాను వుండేవారని వింటున్నాము.

ఇలా రచితమై సిద్ధమైన ప్రబంధాన్ని (కావ్యాన్ని - రాజశేఖరుడు కావ్యాన్ని ప్రబంధమన్నాడు.) అనేకవిధాల ప్రచారం చేయాలి. కుదువ పెట్టడం, అమ్మివేయడం, దానం చేయడం, దేశత్యాగం, అల్పాయుష్యం, అసమాప్తంగా వుండిపోవడం, అగ్నిప్రమాదం, జలప్రమాదం ప్రబంధ వినాశానికి కారణాలు. దారిద్ర్యం, వ్యసనాసక్తి, అవజ్ఞ, మంద భాగ్యత, దుష్టుని, శత్రుని నమ్మడం-ఈ ఐదూ కావ్యానికి మహా విపత్తులు. మరొకప్పుడు పూర్తి చేద్దాంలే, మరొకప్పుడు ముగిద్దాంలే అని అనుకోవడం, మిత్రులతో మరల చర్చించుకొందామనుకోవడం, దేశోపద్రవాలు ప్రబంధ వినాశ కారణాలు.

రాత్రింబగళ్ళు ఈ విధంగా కాలం విభజించుకొని, ఎవడు రచనసాగిస్తాడో, అతని రచన విద్వాంసుల కంఠంలో ముత్తెలదండలా వెలుగుతుంది. కవి సంస్కారాన్ని, అభినివేశాన్ని బట్టి రచనలు రమణీయంగా ఉంటాయి. ముక్తకాలు రచించే కవులు అనంతంగా ఉంటారు. లఘు కావ్యాలు చెప్పేవారు వందలు. మహాప్రబంధాలు రచించేవారు ఒకరిద్దరే; మూడోవాడు కనిపించడు. ప్రకీర్ణ పద్యాలు పెక్కు చెప్పవచ్చు.వాటిలో ఒకదానికొకటి సంబంధం వుండదు. ప్రబంధంలోఒకదానికొకటి అర్థ సంబంధంతో రచన కొనసాగవలసి వుంటుంది గనుక చాల కష్టం. ఇంతటి సాధన సంపదతో, అనన్య మనోవృత్తితో రచనకు పూనుకున్నవానికి సరస్వతే ఏకపత్నీ వ్రతం నిర్వహిస్తుంది. అలాటివాని సూక్తితో లోకోత్తరమైన సిద్ధీ కలుగుతుంది. ఆ సూక్తి మూలచ్ఛాయను గీష్పతి కూడా అందుకోలేడు.

రాజశేఖరుని సూక్తి వెయ్యేళ్ళ తర్వాతకూడా నిత్య నూతనంగానే కనిపిస్తున్నది. కనుక నేటి రచయితలకు కనువిప్పు కాగలదనే నమ్ముతున్నాను.

# పదకవితా పితామహుడు

**మా**నవుడు పుట్టుకతోనే సగుణోపాసి. తను భావించుకున్న దైవానికి తన మనసుకందిన రూపాలు తీర్చుకొని ఆరాధించాడు. తన కట్టెదుట కనిపించే సుందర సృష్టి చూచి తన్మయుడయ్యాడు; తనివితీర ప్రశంసించాడు; దానికి వివిధ రూపాలు కల్పించుకున్నాడు. దీనితో సంఘం, మతం, సాహిత్యం రూపొందాయి.

సంఘ స్థిరీకరణకు మత ప్రచారానికి సాహిత్యం ప్రధాన సాధనమయింది. ఈ సాధన విధానమే కల్పసూత్రాలు, గృహ్య సూత్రాలు, ధర్మసూత్రాలూను. ఈ కట్టుబాట్లు, పరిస్థితులు మారినకొద్దీ సడలి, సంఘం వెనకచూపు హెచ్చడం వల్ల పతనోన్ముఖం కాజొచ్చింది. సాహిత్యం కొందరి ప్రీతియమైంది. దీనితో సామాన్యప్రజలో సంచలనం, సాహిత్యంలో సంక్షోభం పుట్టాయి. సంఘానికి వెలిగా పైనకూర్చున్నవారు ఎంతకాదన్నా ఈ సంక్షోభం నూతన సాహిత్యాన్ని అవతరింపజేసింది; దానిని ప్రజలు తమదిగా చేసుకున్నారు; భారత చరిత్రలో కొన్ని శతాబ్దాలను తిరగవేస్తే ఈ సత్యం గోచరం కాకపోదు.

వర్ణాశ్రమ ధర్మాలపై తథాగతునితో ప్రారంభమైన తిరుగుబాటు సాతవాహనేక్ష్వాకు గుప్తరాజుల కాలంలోను, కొందరు ఆచార్యుల ప్రయత్నం వల్లను, కొంత ఆగగలిగినా, భక్తియుగంలో కట్టలు తెంచుకొని, ఉరకలు వేసింది. పదవశతాబ్దంనుంచే భారతదేశమంతటా, అన్నింటా విప్లవం చెలరేగింది. బౌద్ధ మతచ్ఛాయలు నేటికీ మాసిపోని భారతదేశంలో, ముఖ్యంగా దక్షిణాపథంలో, శంకరులవాదం కూడా ఈ తిరుగుబాటునకు తల ఒగ్గక తప్పలేదు. శంకరుల అద్వైతం జ్ఞానమూలకం; ప్రజాసామాన్యానికి అందుబాటులో లేనిది. సోహం భావన సామాన్యబుద్ధులకు సాధ్యమయ్యేదా? కనుక దాసోహం భావనలో భక్తి వైపు ప్రజలు పరిక్రమించక తప్పలేదు. మహాయాన బౌద్ధంతో సుగుణోపాసన, భక్తి నాటుకున్న ఆంధ్రదేశంలో భక్తి ప్రధానమైన శైవ, వైష్ణవ మతాలు విస్తరించడంలో ఆశ్చర్యమేముంది! బసవేశ్వర రామానుజుల అవతారంతో దేశమంతటా సాంఘిక విప్లవం వేయి పాయలుగా విస్తరించింది.

దీనికి రాజకీయ పరిస్థితికూడా ప్రోది అయినది కాబోలు! ఉత్తరాన పృథ్వీరాజు పతనంతో, దక్షిణాన ఓరుగల్లు ఒరిగిపోవడంతో ప్రజల బింకం, బిగువూ బీటలు వారాయి విజేతలకు జోతులు పెట్టడం, వారిని శరణు వేడడం అనివార్యం కావడమూ మతంలో చోటు చేసుకొని, శరణు ప్రపత్తి భరన్యాస సిద్ధాంతాలకు బలం చేకూర్చాయేమో! ఇతర దేశాలవారూ, ఇతర మతాల వారూ మన దేశాన్ని ఆక్రమించుకోవడంతో వర్ణాశ్రమ ధర్మాలూ మరింత సళలాయి. అన్నివర్గాలవారూ ఒక్కటేనన్న భావం ఉపనిషత్కాలంలో ఉన్నా, బౌద్ధయుగంలో ప్రబలినా దానికన్నా హెచ్చుగా ప్రబలింది; ఈ విప్లవానికి వెన్నెముక్క భక్తియోగం. ఇది—రాజకీయరంగంలో ఎలావున్నా—సంఘం లోను, సాహిత్యంలోను అనిదంపూర్వమైన మార్పును తెచ్చింది.

ప్రాకృతాపభ్రంశ సాహిత్యాల ఎదుగు బొదుగులు దిగగానే దేశమంతటా ఒకేమారు దేశిసాహిత్యం చిగిర్చిందనవచ్చు. దీనికి ఒకటీ అరా అపవాదులు ఉంటే ఉండవచ్చు. పదకొండవ శతాబ్దంనుంచి ఐదు శతాబ్దాల కాలం దేశికవితా యుగమన్నా అసంగతం కాదు. అప్పటికే దేశం నాలుగంచులా భక్తిభావం వ్యాపించింది. ప్రజలను తమతమ మతానుయాయులుగా చేసుకొనే తలపుతో మతాచార్యులు అతిగహనమైన తత్త్వరహస్యాలను సామాన్య భాషలో వివరించ డానికి ఉద్యమించారు. ఈ ఉద్యమ పర్యవసానంగా దేశి కవితారీతులు ప్రచారం లోకి వచ్చాయి; హిందీలో దోహా, ఛప్పయ్ మున్నగునవి; పంజాబీలో హీర్ పాటివి; కన్నడంలో షట్పది, రగడె మొదలైనవి; తెలుగులో ద్విపద, మంజరి, జాజర, చందమామలు, కోయిల చిలుక తుమ్మెద పదాలు, లాలి, సువ్వి, గొబ్బి, ఉయ్యాల, లాల, జోల, జోజో, చందమామ గుటికలు, తదనాలు, చాంగుబళాలు, స్నానముఖాలు—ఒకటేమిటి, దేశికవితా కమలం వేయిరేకులతో విరిసింది. భక్తికీ సంగీతానికి అవినాభావ సంబంధం కలదు గనుక పదసాహిత్యం పరవళ్ళు తొక్కింది. ఉత్తర భారతంలో కబీరు, సూరదాసు; గుజరాత్‌లో నరసింహదాస్; కర్నాటకంలో కనకదాసు, పురందరదాస్ వంటి మహనీయులు ఉద్భవించారు. తమిళదేశంలో అంతకుముందే శైవ, వైష్ణవ దేశికవిత విస్తరించి ఉంది. దేశ మంతటా ఉన్న స్థితిగతులకు అనుగుణంగానే, ఆంధ్రదేశంలోను దేశికవిత అన్నమాచార్యుల అవతారంతో పొంగులు వారింది.

అన్నమాచార్యులు 15 వ శతాబ్ది ప్రారంభంలో — 1424లో కడప మండలంలోని తాళ్ళపాకలో జన్మించి, సహస్రమాసజీవులై 1503 లో తిరుపతిలో పరమపదించారని చరిత్రకారుల నిర్ణయం. ఈయనకు ముందే ప్రబంధయుగానికి మూలబంధం పడింది. తిక్కన విరాటపర్వం, ఎఱ్ఱన హరివంశం, నాచన సోముని ఉత్తర హరివంశం, శ్రీనాథుని రచనలు ఈయనకు ముందువే. ప్రజా

సామాన్య ప్రబోధమే ఈయన ఈప్సితం కనుక ప్రబంధరచనకు, ప్రభువుల మన్ననలకు మనసు చేయక పాల్కురికి సోమునిమార్గాన దేశిరచనతో — పదాలతో, కీర్తనలతో — దివ్య వేదాంత రహస్యాలను గానంచేసి, రామానుజ సిద్ధాంతం ప్రచారం చేశారు; యోగ వైరాగ్య శృంగార రీతులతో ముప్ఫయివేల సంకీర్తనలు ఏడుకొండలవానికి — దినమొకటిగా రచించి — వినిపించారు; అతనికి కళ్యాణోత్సవాలు మున్నగునవి చేయించి మాముగారయారు; ఆ కీర్తనలను రాగి రేకులపై చెక్కించి, తిరుమలలో శ్రీనివాసుని సన్నిధిని ఒక భాండాగారం ఏర్పాటు చేశారు. దానికి 'సంకీర్తన భాండాగారం' 'అన్నమాచార్యులవారి అర' అని నేటికీ వ్యవహారం.

దేశి కవితా రీతులకు ఆనాడు మన్నన లేదు. మత విద్వేషంతో, పాండిత్య గర్వంతో నిండిన ఆనాటి పండితులు మార్గకవితనే మెచ్చేవారు గాని దేశికవితను సరకు చేసేవారుకాదు. దేశిరచనలో ఆదికవి అయిన పాల్కురికి సోమనాథుని వంటివాని కావ్యాన్ని అప్పటి పండితులు గుర్తించలేదంటే, అతడు తొక్కిన తోవలో నడచి, అతని నానుడులను నుడికారాలను సంగ్రహించుకొన్న తిక్కనాదులు కూడా కవి స్తుతిలో అతని పేరే ఎత్తలేదంటే, దేశికవితలపై ఈసడింపు ఎంత పేరుకొని ఉండేదో స్పష్టమౌతుంది.

దేశి ఛ్ఛందస్సు మాత్రాప్రధానం కనుక గానయోగ్యమైనది. అప్పటికి ఏ సంగీత శాస్త్ర పద్ధతిని నడవని పదాలు తెలుగునాట వ్యాప్తిలో ఉండేవి. వాటిని శాస్త్రీయమయిన పద్ధతికి మళ్ళించినవాడు అన్నమార్యుడు. తమిళ కన్నడ తెలుగు భాషలు మూడింటిలోను ప్రాచీనమైన సంకీర్తనలు ఈయనవే. సంకీర్తన శాస్త్ర కర్తకూడా ఈయనే. అందువలననే ఈయనను "పదకవితా పితామహుడు" అనీ, "సంకీర్తనాచార్యుడు" అనీ, "హరికీర్తనాచార్యుడు" అనీ సమకాలికులు, తర్వాతివారూ గౌరవించారు.

అన్నమాచార్యుడు పదకవితకే కాక వ్యావహారికభాషా ప్రచారానికి కూడా ఆచార్యుడే అనాలి. వ్యవహార భాషావాదానికి 15 వ శతాబ్దిలోనే వజ్రపు రాళ్ళతో పునాది వేశారు. దేశికవిత వ్యవహారభాషాశ్రయ కనుక ప్రజాస్వామ్యానికి సన్నిహిత. మరి వారి పలుకుబళ్ళు, పోకడలు దానిలో ప్రతిబింబించక మానవు. అందువల్ల పండితైకవేద్యమైన సంస్కృత భూయిష్ఠ రచనకు భిన్నమైనభాష పదసాహిత్యంలో స్థానమేర్పరచుకుంది. దేశికవితా ప్రస్థానాచార్యుడైన పాల్కురికి సోముడు ఎన్నో వ్యవహార రీతులను తన రచనలో గుప్పించినాడు. తర్వాత పండితులు ఎంత కాదన్నా అవి సాహిత్యంలో మార్గకవితలోను చొరకపోలేదు. వైష్ణవ మతం వ్యాపించిన కొద్దీ సరళ హృదయులయిన సామాన్య ప్రజలను

ఆకర్షించింది. వారికి విశిష్టాద్వైత సిద్ధాంతాలు వారు వాడుకొనే భాషలో మనసుకు నాటేట్టు చెప్పాలి. అందువల్ల అన్నమాచార్యుని సంకీర్తనలన్నీ పశ్చిమాంధ్ర దేశపు వాడుక భాషలోనే సాగాయి. ఉండవయ్యా, పోవయ్యా, మరసయ్యీనా, ఇందవయ్యా, పెట్టుకో, వచ్చేనీ, పోయీని, ఆడుతా, చేయరంటా, చల్లుతానే (చల్లగానే), వస్తానేపోతానే, మున్నగు తిజంతాలు, అవ్యయాలు; లోకవాడుక, దినదిన కొత్తలువంటి సమాసాలు, జోవచ్యుతానంద (జో + అచ్యుతానంద), ఏ వూరువంటి వడాగమ సంధులు, ఈయన కీర్తనలో కోకొల్లలుగా ఉండడం అప్పటి వ్యావహారిక భాషారూపాన్నీ, జిగినీ, బిగినీ స్పష్టం చేస్తున్నాయి.

భాషలోని ఈ విశృంఖలతే భావంలోను, ఆలోచనలోను కనిపిస్తుంది. అనవసరమైన సంఘపు కట్టుబాట్లను నిరసించినవాడు వర్ణాశ్రమ వ్యవస్థను ఎందుకు విమర్శించడు?

"ఏ కులజుడైననేమి? ఎవ్వడైననేమి?
ఆకడ నాతడే హరి నెరిగినవాడు"

అనేది ఈయన నిర్ణయం.

"విజాతులన్నియు వృథావృథా
అజామిళాదుల కది యే జాతి?"

అని ఈయన తీరని ప్రశ్న. గుజరాత్ ప్రజాకవి నరసింహదాస్ "వైష్ణవ జన తో తేనే కహియే, జో పీడ పరాయీ జాణే రే" (ఇతరుల బాధనుగుర్తించే వాడే వైష్ణవుడు) లాగే ఈయనా వైష్ణవు లిట్టివారని నిర్వచించారు. దీనికి కారణం మహాత్ముల మనఃపరిపాకమంతా ఒక్కస్థాయిదే గనుక. అన్నమాచార్యుల పదాలు తిరగవేస్తే నిఘంటువుల కెక్కని కొన్నివేల పదాలు మనకు లభిస్తాయి. వీటిని సేకరించడానికి సాహిత్యాభిమానులు పూనుకోవాలి. కేవలం కవితా దృష్టితోను ఆనందించదగింది అనంతం ఈపదాలలో.

సంగీత నాటకశాస్త్రాలలో వెయ్యేళ్ళుగా మనం లక్ష్య లక్షణకారులమే అయినా ఇటీవల సంగీతరంగంలో వెనకబడివున్నాము ఎందుచేతనో! ఏటేటా తెలుగు నాడంతటా మహాభక్తితో, మహోత్సాహంతో జరుగుతున్న అన్నమాచార్యోత్సవాలు మనకు పూర్వస్మృతి కలిగించి మన మనసులను గానాభిముఖాలు చేయగలవని ఆశించవచ్చునా?

# ఆఫ్రికా సాహిత్యంలో కల్పనలు

ఆఫ్రికాఖండం నీగ్రోల మాతృదేశం అవునా కాదా అన్నవాదం ఉంది. కాని దానిజోలి మనకిప్పుడు అవసరం లేదు. అతి ప్రాచీన సంస్కృతిని ప్రపంచానికి ప్రసాదించిన జాతులలో ఒకటైన ఈజిప్టు కూడా నీగ్రో వంశమే నంటున్నారు. నేటి దక్షిణ యూరపులోని కొన్ని శ్వేత జాతుల రక్తంకూడా నీగ్రోలదే నని మరికొంద రన్నారు. ఏమైనా నేడు నీగ్రోల దేశం ఆఫ్రికా. దీనిలోని 20 కోట్ల ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు నీగ్రోలే.

భాషాదృష్టితో నీగ్రోలు రెండు తెగలని చెప్పవచ్చు. సూడానీ భాష మాట్లాడే పశ్చిమ ఆఫ్రికా నీగ్రోలు; బంటూ భాష మాట్లాడే కాంగో, తూర్పు దక్షిణ ఆఫ్రికావాసులు. పశ్చిమ ఆఫ్రికా భాష ఉపశాఖలు, ఇబో, ఇబోయి, యోరుబ, హసా, ఫులాని మొదలయినవి ఎన్నో.

పశ్చిమాఫ్రికా వారి ఆంగ్లోచ్చారణ కఠినంగా ఉంటుంది. డాక్టర్ న్క్రుమా తన ఆంగ్లోచ్చారణ అమెరికాలో అందరికీ సులభంగా తెలియడానికి తన రెండు ముందు పళ్ళు పీకించి వేసుకొన్నానని ఒకచోట తమాషాగా చెప్పాడు. ఏమైనా జాగరితమైన ఆఫ్రికా జాతి ఊహలు, జానపద గాథలు, అపూర్వ కల్పనలు తెలుసుకోనేముందు రెండు మాటలలో దాని చరిత్ర తెలుసుకొందాము. క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దంలో రోమనులు, క్రీస్తుతర్వాత ఎనిమిదవ శతాబ్దంలో ముస్లిములు, ఎన్ని దండయాత్రలు జరిపినా, మధ్యయుగంలో ఆధునిక పాశ్చాత్య దేశాలు ఎంత బలం ప్రయోగించినా నీగ్రో సహజ స్వాతంత్ర్య వాంఛ చావలేదు. వారి సంస్కృతి నశించలేదు. దానికి కారణం క్రీస్తుకు పూర్వం దాదాపు ఆరువేల సంవత్సరాలనుంచి అలెగ్జాండర్ దండయాత్రవరకు 25 వంశాల వారు ఈజిప్టును పాలించి దేశ సంస్కృతిని భద్రపరచడమే అప్పటి సంప్రదాయాల ప్రకారం మరణించిన రాజులతోపాటు సమాధులలో పాతి పెట్టబడిన వస్తువుల లోని తుంగ కాగితాల మూలంగా ఈజిప్టు సాహిత్యం మనకు కొంత దక్కింది. వారికి మనవంటి ఇతిహాసాలు లేకపోయినా, సూక్తాలూ, ఫరోవారాజుల విజయ గీతాలు లభించాయి.

"అతడు ప్రవాహధారలు విరజిమ్మే ప్రవాహ ద్వారం. దొంగల నుంచి ఆర్తులను రక్షించే మహాధానుష్కుడు. శత్రుభీతులైన దుర్బలులకు శరణాలయం. అతడు ఎండకాలంలో తాపం హరించి చలువకలిగించే నైలు నదీచ్ఛాయ. అతడు చలికాలంలో వెచ్చని యిల్లు. అతడు ఇసుక తుఫానునాడు ఆదుకొనే కొండ ఆసరా" అని 12 వ వంశం రాజైన మూడవ యుసెర్టెసెన్ ప్రశంసించబడ్డాడు. ఈ గీతం కహంలో దొరికిన తుంగ కాయితాల చుట్టలో కనిపించింది. ఇది క్రీస్తు పూర్వం 2640 సంవత్సరాలదని పరిశోధకుల నిర్ణయం. ఈ వ్రాతంతా చిత్ర లిపిలో ఉంది.

ఈజిప్టు ప్రాచీనులకు మనకులాగే దేవతాగణం ఎక్కువ. దేవతల్లో అందరికన్నా 'రా' గొప్పవాడు. ఇతనిని ఒకొక్కప్పుడు సూర్యునిలో ఐక్యం చేయడంకూడ కద్దు. ఒక సమాధిలో లభించిన రవిసూక్తమిది: "ఓ రా! (రవీ) నీకు జయం! నీవు సత్యమయ ప్రభువువి. ప్రేమ స్వరూపివి. నీ రాకవల్ల మానవులు జీవిస్తారు. అందరికి కన్ను తెరిపిస్తావు. అంతరాళంలో ఉదయించి శాంతి కాంతులు కలిగిస్తావు. నీ ఉదయంవల్ల దేవతలంతా సంతోషిస్తారు. నిన్ను చూడగానే వారి హృదయాలు పులకిస్తాయి.

"ఓః ప్రభూ! నీ ఆగారం అప్రత్యక్షం. నీవు దేవతలకు ప్రభువువి. ఖెపేరా నావలో పయనిస్తావు. నీ ఆజ్ఞతోనే దేవతలు జన్మిస్తారు.

"నీవు సర్వదాతవు. నీకు జయం. నీవు ఒక్కడివి; చేతులు అనేకం."

ఈ ప్రార్థన మన సహస్రకరుని స్తోత్రంవంటిదే. 'ఆ సత్యేన రాజసా వర్తమానో నివేశయన్ అమృతం. మర్త్యం చ హిరణ్యయేన సవితా రథేన ఆదేవో యాతి భువనాని పశ్యన్' వంటిదే.

ఈజిప్టు ప్రాచీనులు ఆలపించిన రాత్రిసూక్తం ఋగ్వేదరుల రాత్రివర్ణన కేమీ తీసిపోదు.

"నీవు పశ్చిమ దిగంతంపై ఉదయించగానే, భూమి మరణించిన దానివలె చీకటిలో మునిగిపోతుంది.

"అందరూ వారివారి యిండ్లలో సుఖనిద్రలో వుంటారు. వారు తలకు ముసుగు కప్పుకుంటారు. వారి ముక్కుపుటాలు ఆగిపోతాయి. ఎవరూ ఎవరినీ చూడరు. తలకిందవున్నవి ఎవరైనా దొంగిలించినా కనుక్కోలేరు. ప్రతి సింహమూ తన గుహనుంచి వెలుపలికి వస్తుంది; ప్రతి పామూ పడగవిప్పి వెలికివచ్చి కరుస్తుంది.

"అంధకారం...

"ప్రపంచమంతా మూగవోయింది. అతడే (అంధకారమే) వారిని తన క్షితిజంలో విశ్రమించేటట్టు చేస్తాడు."

మనం రాత్రిని స్త్రీగా భావించాము. వారు పురుషుడుగా సూర్యునికి ప్రత్యర్థిగా భావించారు.

మనకులాగే వారికీ నదులు పరమ పూజనీయాలు. నైలునదిని ఎవరో అజ్ఞాతకవి ఏవిధంగా స్తుతించాడో చూడండి :

"ఆ మంచిదేవుడు సుఖంగా వుండనీ, స్వర్గం ప్రేమించే నైలు నదీ, పూజ్య నైలునదిపై వసించే దేవతల తండ్రీ సుఖంగా ఉండు. నైలునది ఈజిప్టుకు సర్వస్వం - భాగ్యం - ఆహారం. నైలు తండ్రి మన మందరం తమకు తామే జీవించేట్టు చేస్తున్నాడు. సంపదలు ఆయన మార్గంలోవి. సమృద్ధి ఆయన కరాంగుళుల లోనిది. ఆయనరాక పెద్దలకు సంతోషరేఖ.

"ఓ నైలుతండ్రీ! నీవొకడవే స్వయంభువు. నీవు ఎప్పుడు ప్రభవించిందీ ఎవరికీ తెలియదు. నీవు అవతరించి ప్రత్యక్షం అయిన నాటినుంచీ అందరూ సంతోషిస్తున్నారు. నీవు మత్స్యసంతతికీ, తక్కిన అమూల్య పదార్థాలకూ ప్రభువవి, నీవు ఈజిప్టుకు సమృద్ధి సంతరిస్తావు. పవిత్రమైన నవచక్రం కూడా నీవు ఎప్పటివాడో చెప్పదు. నీవు దానికి కూడా జీవమే. నీవు వచ్చినపుడు వారు (నవచక్రంవారు) పూజలు ఇనుమడింపజేస్తారు; నీవు రాగానే ఘోషిస్తారు.

"అతడు (నైలుతండ్రి) చీకటి చీల్చుకుని వచ్చి, పచ్చిక దుబ్బులు చీల్చుకునివచ్చి, వెలుగు ఇస్తాడు. అతడు అన్నీ ఉత్పత్తి చేస్తాడు. అతని తడి దేనికి ప్రాణం పోయదు? అతని తోటలను నింపడానికే జనం ఉడుపులు ధరిస్తారు. అతడు తన కార్మికులను దయదలుస్తాడు, అతడు అనంతమైన పటా; అప్రమేయమైన కబస్. అతడే అక్కడ పని కల్పిస్తాడు. అన్ని పవిత్రకావ్యాలూ, అన్ని సాధనాలు, ఉత్తరాన ఉన్నవి."

వెలుతురూ, గాలీ, నీరూ ఇవి మూడూ ప్రతిజీవికి ప్రాణం వంటివి కదా! మరి వాటిని దేవత లనడంలో ఆశ్చర్యమేముంది? నైలునదం ఆఫ్రికాకే జీవనాడి. దానిని అనంతునిగా భావించడంలో ఏమీ అతిశయోక్తి లేదు.

తూర్పు ఆఫ్రికాలోని ఒక జాతికి పెద్దసంఖ్య గుణకారం తెలియదట. ఎంతటి పెద్దసంఖ్యను గుణించవలసి వచ్చినా రెండు సంఖ్యలను రెండుతో హెచ్చించి రెండుతో భాగిస్తుందట. ఉదాహరణకు 30 ని తొమ్మిదితో గుణించాలను కోండి. ఇదే పద్ధతి.

| | |
|---|---|
| 30 ÷ 2 | 9 × 2 |
| 15 | 18 |
| 7 | 36 |
| 3 | 72 |
| 1 | 144 |
| | ——— |
| | 270 |

వారి జానపదగాథలూ వింతగానే ఉంటాయి. మృత్యువు ఉత్పత్తిని గురించి ఒక చిన్న కథ ఉంది. దానిని వింటే మన చందురుని 'కుందేలు' కథ మారు రూపమా అన్నట్టు వుంటుంది.

చంద్రుడు ఒకమారు ఒక పురుగును పిలిచి "నీవు మానవ లోకానికి వెళ్ళి ఇలా చెప్పు : 'నేను చస్తాను; చస్తూ బ్రతుకుతాను. నేను చస్తే మీరూ చస్తారు; చస్తూ బ్రతుకుతారు' అని అన్నాడు. పురుగు బయలుదేరి పోతూ ఉంది.

అంతలోనే దానికి దారిలో ఒక కుందేలు తటస్థపడింది. "పురుగా, పురుగా ఎక్కడికి పయనం?" అంది. "ఏం పనిమీద వెళ్ళుతున్నావు?" అని మళ్ళీ అడిగింది. "నన్ను చంద్రమహారాజు పంపారు. మానవుల దగ్గరికి పోతున్నాను. ఆయన మాట ఒకటి వారికి అందజేయాలి" అని విషయం వివరంగా చెప్పింది పురుగు "నీవు ఏ కాలానికి మానవలోకం చేరడం? నేను త్వరగా పరుగు తీస్తాను. నే నాసంగతి అందజేస్తాలే. నీవు తిరిగి వెళ్ళు" అని కుందేలు దానితో చెప్పి, అది సమాధానం చెప్పేలోపుగానే పరుగుతీసిందట.

కుందేలు దారిలో తను చెప్పవలసింది సగం మరిచింది. మానవలోకం చేరినమీదట వారిని కలుసుకుని, "చంద్రమహారాజు నన్ను పంపాడు 'నేను చస్తే చచ్చి నశిస్తాను. మీరు కూడా చచ్చి పూర్తిగా నశిస్తారు,' అని చెప్పమన్నాడు" అని అన్నదట. తర్వాత చంద్రలోకానికి తిరిగి వెళ్ళి తను మానవులతో చెప్పిన అన్ని విషయాలు మనవి చేసిందట.

చంద్రుడు మహోగ్రుడయ్యాడు. "నేను క్రిమికి అలా చెప్పలేదే! నేను చెప్పని విషయం ఎలా చెప్పావు? ఎంత సాహసం?" అని ఒక కర్ర తీసుకుని కుందేలు మోరమీదికి విసిరివేశాడు. దాని దెబ్బకు కుందేలు ముక్కు నడుమకు తెగింది. అప్పటినుంచే కుందేళ్ళ ముక్కులన్నీ తెగివున్నాయి కాని మనుష్యులు మాత్రం కుందేలు చెప్పింది నేటికీ నమ్ముతున్నారు.

జలప్రళయం సంగతి ప్రతిజాతిలోనూ యేదో రూపంలో కనిపిస్తుంది. 'సూర్యచంద్రాదులు ఆకాశములో ఎందుకున్నారు?" అనే ఆఫ్రికా జానపద గాథ

లోనూ యీ సంగతి మరొక విధంగా ప్రతిబింబించింది. ఆ కథను క్లుప్తంగా చెబుతాను:

చాలాకాలం క్రితం సూర్యుడు, నీళ్ళు పరమమిత్రులు. ఇద్దరు భూమిమీదే ఇరుగు పొరుగునా ఉండేవారు. సూర్యుడు నీటివద్దకు తరచు వచ్చేవాడు గాని, నీరు మాత్రం సూర్యుని వద్దకు ఎప్పుడూ వెళ్ళేది కాదు

ఇలా ఉండగా ఒకనాడు సూర్యుడు నీటిని అడిగాడు: "మా యింటికి ఎందుకు రావు?" అని. "నీ యిల్లు పెద్దదికాదు, నా పరివారమంతా వస్తే చోటు ఉండదు. మేమంతా రావాలంటే. నీవు పెద్ద ఆవరణగల భవనం కట్టు మా వారందరికీ దానిలో చోటు ఏర్పాటుచేయి" అని నీరు సమాధానమిచ్చింది.

ఆమాట విని సూర్యుడు ఇంటికి తిరిగి వచ్చాడు. భార్య చంద్రమ్మ నవ్వుతూ తలుపు తీసింది. సూర్యుడు ఆమెతో తన మిత్రుడు నీళ్ళు చేసిన వాగ్దానం సంగతి చెప్పాడు. ఆమె సరేనన్నది. మర్నాటి నుంచి యిల్లు కట్టడం ప్రారంభించారు ఇద్దరూ. ఇల్లు ముగియగానే నీటిని ఆహ్వానించారు.

నీరు పరివారంతో వచ్చి - "నేను నీ యింట్లోకి రావచ్చా? ఇల్లు భద్రంగా ఉంటుందా?" అని ప్రశ్నించింది సూర్యచంద్రుల్ని. "రావచ్చు మిత్రమా! భయమేమీ లేదు" అన్నారు ఇద్దరూ అప్పుడు నీరు సకల జలచరాలతోపాటూ లోపలికి ప్రవహించింది. త్వరలో భవనమంతా మోకాటిబంటి నీరయింది. "ఇంకా యిల్లు భద్రమేనా? మరి కొంతమంది మావారు రావచ్చా?" అని అడిగింది నీరు. "ఓ! అలాగే!" అన్నారు సూర్యచంద్రులు నీరు మరికొంత ప్రవహించింది. ఇల్లంతా తలబంటి నీరు నిలిచింది. "ఇంకా నావారు రావాలంటారా?" అని అడిగింది నీరు. "సరే!" అన్నారు సూర్యచంద్రులు, మరేమీ తోచక. నీరు మరింత జోరుగా ప్రవహించింది. సూర్యచంద్రులిద్దరూ ఇంటికప్పుపై తేలాడేటంత నీరు నిండింది. మరల నీరు అడుగగా, సూర్యచంద్రు లిద్దరూ అదే సమాధాన మిచ్చారు.

నీరు ప్రచండ వేగంతో పారింది. సూర్యచంద్రు లిద్దరూ గత్యంతరం లేక ఆకాశంలో ఉండిపోయారు.

నేడు పశ్చిమాఫ్రికావారు ప్రధానంగా ఆంగ్లమే నేరుస్తున్నారు. దానినే రాజకీయ భాషగానూ గుర్తించారు ఘనాలో 'డైనమిక్' పార్టీ స్థాపకుడు చిల్-ఓచి ఇంగ్లీషు మంచి పనిముట్టు అన్నారు. విమానం ఎక్కడానికి నిరాకరించనప్పుడు ఇంగ్లీషు వాడడం ఎందుకు కాదనాలని ఆయన వాదం. "డ్రం" అనే ఆంగ్ల మాసపత్రిక అఖిలాఫ్రికా సంస్కృతికి ప్రతిబింబంగా వెలిసింది. తెల్ల వారిపై ద్వేషం వున్నా, ఆంగ్ల భాషను వారు ద్వేషించడం లేదు.

తెల్లవారు కూడా ఆఫ్రికావాసుల మనస్తత్వం, సంప్రదాయం తెలియకనే పరిపాలన సాగించి ద్వేషం కొనుక్కున్నారనవచ్చు. దీనికొక ఉదాహరణ చెబుతారు. ఒక తెల్లవారి అధీనంలోవున్న ఆఫ్రికా భాగంలో ఒక తెల్లజిల్లా అధికారి, ఒక ఆఫ్రికావాసి చేసిన తప్పుకు అతని పశువుల మందలోని మేలి కోడెదూడను చెల్లించవలసిందిగా జరిమానా విధించాడట. విచారణలో పాల్గొన్న ఆఫ్రికా పెద్దలందరూ "అది వాడు ఇవ్వడు. దానికిమారు మరొకటి తీసుకోండి. లేకపోతే రెండు కోడె దూడలను తీసుకోండి" అని బ్రతిమాలారట. ఆ అధికారి ససేమిరా అంగీకరించలేదు. అతడు తీర్పుచెప్పి వెనుదిరగగానే జరిమానా పొందినవాని బల్లెం అతని (ఆ అధికారి) డొక్కల్లో నాటింది. అతడు మరణించాడు. "పాపం! మంచివాడు, అయితే మానవ మనస్తత్వం కొంచెమైనా తెలీదు. తన సోదరుని వంటి ఎద్దును, తన గుండెకాయవంటి ఎద్దును ఇమ్మంటున్నా ననేది గ్రహించలేకపోయాడు" అని అన్నాడు ఒక ఆఫ్రికాపెద్ద. వారి సంప్రదాయాలు గౌరవించనందునే విద్వేషం పెచ్చుపెరిగింది.

నేటి ఆఫ్రికావాసులూ మనలాగానే దేశాన్ని మాతగానే భావిస్తారు. దీనికి కారణం ఇస్లాం, క్రైస్తవమత ప్రభావం ఎంతపడ్డా చెక్కుచెదరని మాతృలీన వ్యవస్థా ప్రభావమే. పూర్వం ఒకప్పుడు మాతృలీన వ్యవస్థ మహామాయా సంస్కృతిగా ఆసియా ఆఫ్రికా యూరప్ ఖండాలలో వ్యాపించివుండేది. ఆ సంస్కృతి ప్రభావమే మనకు పలువురు దేవతలను భావింపజేసింది. ఆఫ్రికావారి నేటి కళలలోను, సాహిత్యంలోను మత ప్రభావం అపారం.

వారి కవితలో ప్రకృతి ప్రతిధ్వనిస్తుంది. వారి సంగీతం వింటూంటే తుపాను ఘోష, వజ్రనిర్ఘోషం వినిపిస్తాయి.

నేటి ఆఫ్రికావాసుల స్వాతంత్ర్యవాంఛ ఎంత తీవ్రమో ఎంత ఆరని అమరజ్యోతో తెలుసుకోడానికి జులూ పద్యం "ఘ్నుంగ్ ఉంగ్ జిఖో హ్లిసి" (తెల్లవాడా, నిన్ను నీవు మోసపుచ్చుకోవద్దు!) అన్నదానిలో రూపు కట్టింది.

"ఓ తెల్ల రేడా! నేను నిన్ను అనుకరిస్తూ నీవే నేనని కపటనాటక మాడుతా ననుకో! నేను ఏమి చేస్తున్నానో నాకు తెలుసు. నేను నావెంట ఏమి తెచ్చుకున్నానో నాకు తెలుసు. నా పానపాత్ర మేమిటో నాకు బాగా తెలుసు ఇది నేను ఎలా మారుస్తాను? ఇది నా జన్మహక్కు తెల్లవాడా! నిన్ను నీవు మోసం చేసుకోవద్దు."

ఈ వాక్యాలు ఎంత సరళంగా ఉన్నాయో, అంత గంభీరంగా ఉన్నాయి. అమెరికా నీగ్రోకవి 'కౌంటీ కల్లెన్' తనదేశం గురించి ఎలా ఊహిస్తాడో చూడండి :

Wwat is Africa to me?
Copper Sun or scarlet sea
Jungle star or jungle Track
Strong bronge men, or regal black
Women from whose loins I Sprang
When the birds of Eden say !

ఇటీవలే చిత్రవధకు గురి అయిన కాంగో నాయకుడు పాట్రిస్ లుముంబా అంతిమగీతితో నా మాటలు ముగిస్తాను :

''నిగళాలు త్రెంపుకొని
నీవు నిలిచిననాడె
కటిక కాలము పీడ
కలవోలె కరుగురా
తమ్ముడూ!
నీగ్రో తమ్ముడూ!''

# డాక్టరు చిలుకూరి నారాయణరావు

"ఆంధ్రరాష్ట్రం రావాలి; వస్తుంది. విశాలాంధ్ర భాషకు వ్యాకరణం వ్రాయాలి. విశాలాంధ్ర భాషకు నిఘంటువు సిద్ధపరచాలి." ఇవి డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు (1952 జూన్ 22 వ తేదీన) మద్రాసు జనరల్ ఆస్పత్రిలో మరణశయ్యపై సన్నిపాతంతో కలవరించిన మాటలు.

మానవుని మనస్సులోని అంతరాంతరాలలో దాగిన సహజ వికారాలు, భావాలు, ఆశయాలు, ఆదర్శాలు స్వప్నసుషుప్త్యవస్థలలో తమంతటవే వెలికుబుకుతాయనే మనస్తత్వవేత్తల నిర్వచనానికిది తార్కాణం. విశాలాంధ్ర సాహిత్యంకోసం, విశాలాంధ్ర భాషకోసం మనుగడ సాగించిన రావుగారు జ్వరోద్రేకంలో మైమరచినప్పుడు కూడా ఇలా కలవరించడం అబ్బురమేమీకాదు.

ఒక్కొక్కయుగంలో ఒక్కొక్కసీమ ఆంధ్రభాషకు వన్నెలు వెలార్చింది. సంస్కృత సాహిత్యపు మీగడతరకలను చాళుక్య సీమ తరచి అందిస్తే, నల్లగొండసీమ మౌలికమైన సాహిత్యం సృష్టించింది రాయలసీమ తెలుగు సాహిత్యాన్ని దీనారటంకాల తీర్థమాడించి మదకరీంద్ర మెక్కిస్తే, చోళసీమ కొబ్బరాకుల పందిళ్ళు వేసి బంగారు గెలలతో ఒరిగిన అరటి స్తంభాల మంటపాలలో పూవుల నగలతో అలంకరించింది. ఈ పూవుల నగలు వాడుచూపగానే విదేశ సాహిత్య సౌరభాలు వంగసీమ నుంచి తొలిసారిగా వీచిన కళింగసీమ అంతలో మేల్కొని పులకరించి పరవడిపెట్టి కొత్త తెన్నులు తీర్చింది భాషలో, భావంలో, పరిశోధనలో, పరమానందానుభూతితో - ఒకటేమిటి కళింగసీమ కులపతులు వేసిన పోకడలన్నీ నవ్యాతినవ్యాలు, నవయుగ ప్రవర్తకాలు. ఒకరు "దేశమంటే మట్టికాదోయ్" అని ఎలుగెత్తిచాటితే, మరొకరు "నేను సైతం భువనభవనపు బావుటానై పైకిలేస్తాను" అనే ఆత్మవిశ్వాసం ప్రకటించి వంగిక్రుంగిన తెలుగువాని తల హంపీతేరు చూడవలసినంతగా ఎత్తారు. మనం పుట్టింది మొదలు పలికే పలుకు తప్ప తక్కిన కృతక భాషయెందుకని ఒకరు మహోద్యమాన్ని ప్రారంభిస్తే, దానిని విద్యాపీఠాలవరకు, కళాపరిషత్తులవరకు అందలాలపై తీసుకొని వెళ్ళారు మరొకరు.

డాక్టర్ నారాయణరావుగారు పుట్టింది ఈ కళింగసీమ; జీవిక ప్రారంభించింది చాళుక్యసీమ; మనుగడ చెల్లించింది రాయలసీమ; అమరత్వము పొందింది అరవసీమ.

రావుగారు జన్మించినది శ్రీకాకుళం జిల్లా ఆనందపురంలో, 1880 లో. వ్యవహార భాషా ప్రవర్తకులైన గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారి వద్ద పర్లాకిమిడి కళాశాలలో విద్యాభ్యాసం చేయడంవల్ల గురువుగారి కార్యనిష్ఠ, పట్టుదల, అప్రమత్తత, సకాలానికి కర్తవ్య పూర్తి మున్నగు గుణాలు పుణికిపుచ్చుకున్నారు; గురువుగారు తనపై పెట్టుకున్న ఆశలన్నింటినీ పూరించిన సాహిత్య చరితార్థులు.

వీరు రాజమహేంద్రవరం కళాశాలలో జీవికకు ఉపక్రమించిన నాళ్ళలో— దాదాపు 50 ఏళ్ళకిందట—తెలుగు చరిత్ర కారులందరూ మహారాష్ట్రిలో, వంగీయులో, తమిళులో! విన్సన్న చెప్పిందే వేదమన్నట్లు వారి పలుకే ఆనాటికి ప్రమాణం. "మీది ఆంధ్రదేశము. శాతవాహనులు మీవారు కారు తెనుగు భాష పదకొండవ శతాబ్దానికి గాని కన్నులు తెరవలేదు." ఇలాటి అధిక్షేపాలు అశనిఘాతాలుగా తెలుగువారిపై పడేవి. ఈ పిడుగుపాట్లకు తెలుగు విద్వల్లోకం మోడయిపోవడానికి మారు "ఆంధ్రేతిహాస పరిశోధక మండలి" రూపంలో చిగిర్చింది. దీనికి ప్రోదిచేసినారు రావుగారు. వీరు ఈ పరిశోధక మండలికి తమ కష్టార్జితమైన 2000 అమూల్య తాళపత్ర గ్రంథాల భండారం బహూకరించారు. ఈ మండలి ఆంధ్రేతిహాసానికే కాదు, భారతేతిహాసానికే చేసిన సేవ నిరుపమానమైంది.

రాజమహేంద్రవరం కళాశాలనుండి అనంతపురం కళాశాలకు బదిలీ అయింది వీరికి. దీనితో వీరి సాహిత్య సేవారంగం చాళుక్య సీమనుంచి రాయలసీమకు తరలింది. రాయలసీమ ప్రజలతో వీరు తాదాత్మ్యం పొందారు. అక్కడి ప్రజల నిత్యవ్యవహారంలో చెక్కు చెదరని తొలి తెలుగు పదాలు, భాషా సంప్రదాయం, పాత తీరుతీయాలు వీరి మనస్సును ముచ్చిలిగొన్నాయి. రాయలసీమలోని రతనాలను ఏర్చి కూర్చి విశాలాంధ్రావనికి ఉపహారంగా సమర్పించడం, ప్రజలలో అణగి మణగి వున్న రాయలనాటి రసికతను రేకెత్తించి భావుకులను సాహితీప్రియంభావుకులను చేసి విశాలాంధ్రావతరణకు ప్రోదిచేయడం తమ ఆదర్శంగా భావించారు; కృషి చేశారు; కృతార్థులయారు.

ఈ పవిత్ర భావన కృష్ణదేవరాయాంధ్ర పరిషత్తుగా మూర్తీభవించింది. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, శ్రీ వప్పూరు రామాచార్యులు, శ్రీ కల్లూరి సుబ్బారావు మున్నగువారు రావుగారితోపాటు పరిషత్తుకు మూలస్తంభాలై నిలిచారు. ఈ పరిషత్తు నివురుగప్పిన నిప్పులాంటి పరిశోధకులను, భావుకులను, పండితులను నివురు నెట్టివేసి దివ్వెటీలుగా ధగధగలాడించింది. రాయలసీమలోని తాత్కాలికమైన స్తబ్దత తొలగి శివభారతం, రాణాప్రతాపసింహ చరిత్ర, విజయ

నగర రాజ్యపతనము వంటి మహాకావ్యాలు, తదితర విమర్శక గ్రంథాలు అవత రించగలిగాయి.

తెలుగువారు ఆర్యజాతివారనే విశ్వాసం కలవారు నారాయణరావుగారు. కనుక పైశాచీ ప్రాకృతమే తెలుగుకు మాతృక అని వీరివిశ్వాసం. ఈ విశ్వాసమే "ఆంధ్రాభాషా చరిత్ర" రచనకు ఆలంబనం. భాషావేత్తలు భాషలను మూడు పెద్ద వర్గాలుగా విభజించారు (1) సంశ్లిష్ట భాషలు: ఈ భాషల్లో ప్రత్యయం ప్రకృతిలో కలిసిపోతుంది. సంస్కృతం మున్నగునవి వీటికి ఉదాహరణలు. (2) శృంఖాలా భాషలు: వీనిలో ప్రకృతి ప్రత్యయం గొలుసులాగ కలిసివుంటూ విడివిడిగా కనిపిస్తాయి. తెలుగు మున్నగునవి వీటికుదాహరణం. (3) విశ్లిష్ట ప్రకృతి ప్రత్యయాలు ఒకదాని కొకటి అంటక విడిగా వుండేవి. ఇంగ్లీషు, చైనా భాష వంటివి వీటి కుదాహరణం.

తెనుగు ప్రకృతి ప్రత్యయాలు గొలుసైన శృంఖలాభాషేకాని సంశ్లిష్ట భాషకాదు. రావుగారు తమ "ఆంధ్రభాషా చరిత్ర"లో తెనుగుకు ప్రాకృత జన్యత్వం స్థాపించడానికి ఎన్నో పోలికలు చాలికలు ప్రదర్శించారు. (కృష్ అనే సంస్కృత ధాతువునుంచే గీకు పుట్టింది మున్నగునవి.) కాని భాషా పరి ణామ పరిశోధనకు జీవగర్ర అయిన తెనుగు సంధులు విభక్తులు ప్రాకృత విభ క్తులతో సమన్వయించ లేకపోయారు. ఈ రెండూ సమన్వయించివుంటే, వీరి సిద్ధాంతం శిరోధార్య మయివుండేది. స్వసిద్ధాంత స్థాపనకు వీరు చేసిన కృషి ఫలితంగా తెలుగుకు ప్రాకృతానికిగల పరస్పర సంబంధం, సామ్యం పలువురికి వెల్లడైంది.

పాల్కురికి సోమనాథుడు మైసూరు సరిహద్దు ప్రాంతంవాడని వీరు సూచిం చిన వాదమూ పండితామోదం పొందలేదు. అతడు నల్లగొండ జిల్లా పాలకుర్తి వాడనే సిద్ధాంతమే ఇంతవరకు నిలిచింది.

వ్యావహారికభాష—ప్రజల నిత్యజీవభాష—ఆదరణీయమని ఉగ్గుబాలతో నేర్చిన వీరికి చిన్నయ వ్యాకరణం వరవడిగా నన్నయ భారతాన్ని కొందరు దిద్దదలచడం కంటక మనిపించింది. తెలుగు సంస్కృతంలాగ నిలువ నీరుకాదు; ప్రవాహిని. 'కరోతి' అనే సంస్కృత క్రియరూపం ఎన్నివేల సంవత్సరాలు గడచినా మారకపోవచ్చు. కాని తెలుగుదారి వేరు. మనం నేడు వ్యవహరిస్తున్న "చేస్తున్నాడు" అనే రూపం మూలాన్ని అన్వేషిస్తూ వెళ్ళితే, ఎన్నో మార్పులు పొందినట్టు స్పష్టం. చెయ్—తున్న—చేయుచున్న—వాడు— అనేది వేయేండ్ల ముందు రూపం అది చేయుచున్నాడు అని. చేస్తున్నాడు అని మారింది. భాష మార్పులను గుర్తింపని గీర్వాణభాషైక దృష్టులు సమకాలిక రూపాలను గ్రంథస్థం

చేయలేదు. అంతమాత్రాన ఆ రూపాలు నశించాయా? కనుక, చారిత్రక దృష్టితో ఆంధ్రభాషకు వ్యాకరణం అవసరమని నిశ్చయించిన వీరు నన్నయభట్టు నాటి భాషను వ్యాకరించారు. ఇది ఆంధ్రభాషా పరిణామ పరిశోధనలో ప్రశంసనీయ మైన అభ్యుదయ మార్గం. ఈ పరిశోధనకే వీరిని పిహెచ్.డి. పట్టం లభించింది.

నాటి భాషను వ్యాకరించినంత మాత్రాన వీరు తనియలేదు ఆనాటి కావ్యాలను సంపాదించి పరిష్కరించి, ముద్రించడం ఆ నాటి సంప్రదాయాలకు అనుగుణంగా వున్నప్పుడే ఆనందానుభూతి అని వీరు నమ్మారు. కనుకనే నన్నయ భారతంలోని సౌపర్ణోపాఖ్యానాన్ని ఆనాటి లిపి సంప్రదాయంతో ప్రచురించారు; పరిశోధకుల సత్యనిష్ఠకు వన్నె తెచ్చారు.

వీరి ఆశయం కొమ్ములు తిరిగిన పండితులను తల లూపేట్టు చేయడమే కాదు; ప్రజా సామాన్యాన్ని విజ్ఞాన విలసితం చేయడంకూడా. అందువల్ల వీరు వివిధ సాహిత్యాల వెలుగులను తెలుగువారికి సాక్షాత్కరింపజేశారు. "ఏకత్వం, సామరస్యం కల్పించేది సంస్కృతి. సరియైన సంస్కృతి సరియైన వాఙ్మయం మూలంగా వ్యక్తమౌతుంది. ఒక్కొక్క భారతీయ భాషలో ఒక్కొక్కరీతి వాఙ్మయం ఉదయించింది. వివిధ భాషా ప్రాంతీయులకు పరస్పర వాఙ్మయముల గూర్చిన పరిచయ మావశ్యమే కదా!... ఇట్టి అభ్యుదయ వాఙ్మయమును పోషిస్తే, ఇష్ట సిద్ధికి కొదువ వుండదు" అని గుజరాతి వాఙ్మయ చరిత్ర పీఠికలో వక్కాణించారు. (వీరి అస్తమయానికి సంవత్సరం ముందు ప్రకటించిన పుస్తక మిది). మరి వీరి చేయి సాహిత్యరంగంలోని మారుమూల లన్నిటినీ పుణికి పుణికి ప్రజల ముచ్చటలు తీర్చడం సహజాతి సహజం.

అథర్వవేదం మొదలు "అచ్చి" వరకు వీరిచేయి సాగింది. అథర్వవేదం అనువదించారు. కొత్త రచనలు కొనసాగించే కల్పనా ధురంధరులు గనుక ఎన్నో మౌలిక కావ్యాలు, నాటకాలు రచించారు. "మొండి శిఖండి"లో అంబను సమర్థించారు. "అశ్వత్థామ"లో ద్రోణ పుత్రుని చరిత్రను కనుల గట్టేటు చేశారు. "అచ్చి"లో పల్లె పడుచుల ప్రేమ పండువుగా చేశారు. "ఒకటి ఒకటి రెండు-తాత బోడిగుండు" వంటి బాలభాషలో కూడా ఎలుగెత్తి పాడారు సంస్కృత లోకోక్తులు సంతరించారు. సామెతలు సేకరించారు. శాసనాలు శాసించారు. కూనలమ్మ పదాలను కూనిరాగాలతో పాడించారు.

వీరు అన్యప్రాంత వాసులకు, అన్యదేశీయులకు తెలుగు తియ్యందనాలను తెల్లంచేయడానికి పూనుకున్నారు. జయపురం కాంగ్రెసు మహాసభలో పి.ఇ.ఎన్. (పొయట్స్, ఎస్సేయిస్ట్స్ నావలిస్ట్స్) క్లబ్బువారు జరిపిన సాహిత్య గోష్ఠిలో జనాభా దృష్టితో తెలుగుకు దేశంలో ద్వితీయ స్థానం వున్నందున రెండవనాటి

సమావేశానికి అధ్యక్షత వహించి, భావుకతలో తెలుగువారి పైచేయిని విశద పరిచారు. ఆ క్లబ్బువారు ఆంగ్లంలో ప్రకటించిన 18 భారతీయ సాహిత్యాల చరిత్రలో తెలుగు సాహిత్యం మెరుగులు తెలియజెప్పారు. అమెరికా విద్వత్పరిషత్తు సిద్ధపరచిన సర్వ ప్రపంచ వాఙ్మయ చరిత్రలో ఆంధ్రభాషా సాహిత్యాలను గురించి వివరించి తెలుగన్న మన్నన కలిగేట్టు చేశారు. త్యాగరాజ కృతులను ఆంగ్లంలో అనువదించారు. వీరి రచన మొత్తం లక్ష 25 వేల పుటలకు పైగా.

సమకాలిక విద్వాంసులను మెచ్చుకొనడం వీరిసొమ్ము. "ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరెగదా!" అని చేమకూర వేంకటపతివంటి మహాకవి నొచ్చుకున్నప్పుడు సమకాలిక పండితుల ఎడ మన విద్యావంతులు ఏ వైఖరి అవలంబిస్తారో సుగ్రాహ్యం. కాని రావుగారి కన్నులు మిన్నతనం మీదనేగాని, కాలపు చిన్నతనానికి లొంగేవి కాదు. శ్రీ అనంత కృష్ణశర్మగారిని గురించి ముక్తకంఠంతో చెప్పిన ముక్తకాలలో ఇదొకటి :

"రాళ్ళపల్లెలోన రాళ్ళెన్ని పుట్టెనో!
రాళ్ళలోన వజ్జరాలు పుట్టె;
వజ్జరాలలోన వలపెట్టు పుట్టెరా:
కీర్తనీయ చరిత కృష్ణశర్మ!"

మనసులోని మారుమూలలలోను కులమతభేదం లేని మహనీయులు రావుగారు. ఎన్ని సంవత్సరాలు వీరితో పరిచయమున్నా ఎదుటివారి పేరు, ఊరు తప్ప తక్కినవాటి జోలి వీరి కక్కరలేదు. "పేరేమిటి? ఏవూరు? ఏంచేశారు? ఏంవ్రాశారు? మీ ప్రాంతం సామెతలు సేకరించి ప్రకటించండి. లేకపోతే నాకు పంపండి" అని వీరు తమ దగ్గరికి వచ్చిన అపరిచిత సాహిత్య బంధువులను ఎప్పుడూ అడిగే ప్రశ్నలు.

"భోజనానికి ఇంటికి వెళ్ళాలా?" అని తరచు వీరు అనే మాటలు చెవుల్లో నేటికీ గింగురుమంటూ వుంటాయి. సాయంకాలం వీరి ఇంటికి వెళ్ళితే కవితాగోష్ఠితో, పదచర్చతో, చరిత్ర చర్వణంతో రాత్రి పదకొండు కావచ్చేది. "పొద్దుపోయిందండీ! ఇక వెళతాను" అనేవారు సాహిత్య బంధువులు "ఎందుకు?" అనేది వీరి మరుప్రశ్న. "భోజనానికి" అంటారు వచ్చినవారు. వీరు "ప్చ్" అని యథాలాపంగా చప్పరించి "భోజనానికి యింటికి వెళ్ళాలా?" అని సమాధానంగా ప్రశ్నించేవారు. సరే. అతిథులకు యజమానులకు భోజనం అవుతుంది. తెల్ల తెల్లవార్లూ మరల సాహిత్య కాలక్షేపం. ఒక గంటసేపు కునికీ కునకకుండానే మరల గడియారంలాగ నాల్గుగంటలకే లేచి స్వయంగా పరిశోధన,

పరిశీలన! ఇలా ఎన్నిసార్లు వీరు కాలేజీకి భోజనం కూడా మాని ఆలస్యంగా వెళ్ళేవారో!

వీరు శతాధిక గ్రంథకర్తలు. కొన్ని పుస్తకాలను మాత్రమే పేర్కొంటాను. మతగ్రంథాలు: అథర్వవేదము, ఋగ్వేదసాయనము, భగవద్గీత, ఆపస్తంబ ధర్మసూత్రములు, గౌతమ ధర్మసూత్రములు, త్రిపిటకములు, ధర్మశాసనములు, గౌతమబుద్ధుని జీవితము, జైనమతము, శైవసిద్ధాంతము, బసవేశ్వరుని చరిత్రము, అద్వైత సిద్ధాంతము, కురాను షరీఫు, బైబిలు సర్వమత సామరస్యము.

శాస్త్రగ్రంథాలు: తర్కసంగ్రహము, శిశుమనశ్శాస్త్రము, ప్రసవశాస్త్రము మరికొన్ని.

చరిత్ర గ్రంథాలు: రోమన్‌చరిత్ర, గ్రీసుచరిత్ర, రష్యాచరిత్ర, చీనా చరిత్ర, జపాన్‌చరిత్ర, బర్మాచరిత్ర, ఆంధ్రచరిత్ర, గాంధీచరిత్ర, టాల్‌స్టాయి చరిత్ర, ఆంధ్ర భాషా చరిత్ర, సంస్కృత ప్రాకృతాది వాఙ్మయ చరిత్రలు, వివిధ భాషల స్వయంబోధినులు, ఆంధ్ర వాఙ్మయ చరిత్రలు-పది సంపుటాలు.

నాటకాలు: అంబ (మొండిశిఖండి), అశ్వత్థామ, అచ్చి (కాపువలపు), పెండ్లినాడే, నాటక నాటకము, తిమ్మరుసు, బొమ్మపొత్తికలు, మధురాంతకి మొదలయినవి 20.

వ్యావహారిక భాష గ్రంథరచనకు అనువైనదే అని, "సజీవ భాష" అనేది ఎలాంటిదో ఆయన ఒకమారు ఇలా అన్నారు: "సజీవ భాష అనగా... జీవముతో కూడిన భాష. ప్రాకృతజన భాషితమైన భాష. ఆ ప్రాకృతజను డిప్పటివాడే కానక్కరలేదు. ఏనాటివాడయినా కావచ్చును. ప్రాకృతానుభవములు ఆ భాషలో ఎన్నడయినా వ్యక్తపరచి ఉంటే అది సజీవభాషే అవుతుంది. కాబట్టే ఈ లక్షణము కలిగి ఉన్నంతసేపున్నూ కావ్యభాష సజీవభాష కాదనడానికి వీలులేదు. కావ్యములలో ఉపయోగింప బడకపోయినంత మాత్రముచేత అది సజీవభాష కాకపోదు. భాషా ప్రయోజనము సిద్ధిస్తున్నంతసేపున్నూ అది సజీవ భాషే..."

వీరి శిష్యప్రీతి ఆదర్శప్రాయం. తమ దగ్గిర చదివిన ప్రతి కాలేజీ విద్యార్థి తమలాగా అనవరత కార్యవ్యగ్రుడు కావాలని, బహుగ్రంథ కర్త కావాలని ఆశించేవారు. వారిని ఒడ్డుకు వేయాలని తహతహలాడేవారు; ఆశలను పండింపు కొనేవారు కూడా. వీరి ప్రోత్సాహంవల్ల పలువురు కవి పండిత పరిశోధకు లయారు.

వ్యవహార భాషావాదులైన వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వ్యవహార భాషను అధికార భాషగా, బోధన పాఠ్యభాషగా పరిగణింప జేయడానికి ఎంతో ప్రయత్నించారు. కాని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు వీరి "ఆంధ్రభాషా చరిత్ర" వ్యవహార భాషలోనే ప్రచురణ పొందాలని చేసిన మహాయత్నాన్ని కూడా ఫలింపనివ్వలేదు. వారి నియమ నిబంధనలకు కట్టుబడి ఆ గ్రంథశైలిని వ్యావహారికానుగుణమైన గ్రాంథికంలో వీరు సిద్ధపలసి వచ్చింది.

పండితారాధ్య చరిత్ర మున్నగు ప్రాచీన గ్రంథా లెన్నిటినో వీరు సంస్కరించి విపుల పీఠికలు వ్రాసి ప్రచురించారు. వీరిచేతబడిన పుస్తకం అకారాదిగా అనుక్రమణిక క్రింద జాబితా కావలసిందే. అనుక్రమణికను తప్పని సరిగా సిద్ధపరచడమనే పద్ధతిని కచ్చితముగా పాటించినవారిలో వీరు ప్రముఖులు. ప్రచురణను, తక్కిన పనులను సకాలానికి నిర్వహించడం వీరి వ్యవహార దక్షతకు మెరుగులు పెట్టింది.

వీరి పాండిత్య ప్రతిభలను గుర్తించి ఆంధ్ర విశ్వవిద్యాలయం "కళా ప్రపూర్ణ" బిరుదంతో గౌరవించింది. 1947 లో కాశీ సంస్కృత విద్యాపీఠం వారు వీరిని "మహోపాధ్యాయ" బిరుదంతో సత్కరించారు.

వీరు వైయక్తికక జీవితంలోను స్వాతంత్ర్యవాదులు అని పేర్కొనడం చర్వితచర్వణం. వీరు అనంతపురం ప్రభుత్వ కళాశాలలో ఆచార్యులుగా వుండగా, వీరి సతీమణి శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు కాంగ్రెస్ పక్షాన జిల్లాబోర్డు సభ్యురాలుగా వుండేవారు.

ఇట్టి ప్రజాజీవులు, పరిశోధకులు, పండితులు అయిన నారాయణరావుగారు మిగిల్చిన పనిని కొనసాగించడం ఆంధ్రావని కర్తవ్యం. వీరు ప్రారంభించిన విశాలాంధ్ర నిఘంటువు, విశాలాంధ్ర వ్యాకరణం పూర్తిచేయడం విద్వల్లోకం విధ్యుక్తధర్మం.

# కంకంటి విష్ణు మాయా నాటకం

మనదేశంలో శైవ వైష్ణవ మతాలు ప్రబలం కానుకాను ఆయా మతాభిమానులు "మా దేవుడు గొప్పంటే మా దేవుడు గొప్ప; మా మతం ఉత్తమమంటే, మా మతం ఉత్తమం" అని పోటీలు పడసాగినారు. వీర శైవుల గణాధిపతిని నరసింహావతార మెత్తిన విష్ణువు సంహరించాడని వైష్ణవులు తమ పుస్తకాలలో వ్రాసుకుంటే, నరసింహుని శివుడు వీరభద్రావతారమెత్తి పీచమడచినాడని, శరభావతార మెత్తి కాలరాచాడని శైవులు వ్రాసుకున్నారు. మా దేవునికి నంది వాహనమని ఒకరంటే, మా దేవునికి ఆకసంలో అవలీలగా ఎగిరే గరుడి వాహనమని మరొకరన్నారు. మా దేవుడు హాలహలం క్రోలి, నాగులను పగ్గాలుగా పేని హారాలుగా మెడకు, మణికట్టుకు చుట్టుకున్నాడని ఒకరంటే, మా దేవుడు ఆ నాగేంద్రుని తలత్రొక్కి గరళం కక్కించి పీఠీచేసి పక్కగా పరచుకున్నాడని మరొకరన్నారు. మా దేవుడు, భార్యను రొమ్ముమీద పెట్టుకున్నాడని ఒకరంటే, అదేమి గొప్ప, మా దేవుడు భార్యను తలమీద పెట్టుకున్నాడని, ఇంకా వాదుకువస్తే సగం దేహం భార్యగా చేసుకున్నాడు - అని మరొకరన్నారు. ఈ వాదుకు అంతు వుంటుందా ?

ఈ వాదువల్ల మనకు కొంత లాభమే చేకూరింది. మతం ఏమైతేనేం ? బసవ పురాణం, హరవిలాసం, ఆముక్తమాల్యద, విష్ణుమాయా విలాస నాటకాలు వంటి ప్రబంధరత్నాలు ఈ వాదులో పుట్టాయి. విష్ణు విశిష్టత నిరూపించే రచనలలో విష్ణుమాయావిలాస నాటకాలను మించినవి లేవు. ఈ ప్రపంచాన్ని బ్రహ్మ రుద్ర మహేంద్రాదులను అతిక్రమించిన అనిర్వచనీయమైన ప్రభావం కల ఒక మహాశక్తి మాయ నడిపిస్తున్నదని, దానిని ఏకాంత విష్ణుభక్తిచే కొలచినవారు గాని ముక్తి పడయలేరని ప్రతిపాదించడమే ఈ రచనల ముఖోద్దేశ్యం. విష్ణు మాయా నాటకాలంటే అన్నీ దృశ్యప్రబంధాలని భ్రమపడేరు! వీటిలో ఒకటి మాత్రం దృశ్యకావ్య మనదగిన యక్షగానం. రెండు చంపూ కావ్యాలు, ఒకటి ద్విపద. విష్ణుని మాయా ప్రభావ ప్రదర్శన రీతులను వర్ణించేవి కనుక విష్ణు మాయా నాటకాలైనాయి.

వాటిలో ఒకటి చింతలపూడి ఎల్లనార్య రచితం. ఇతడు కృష్ణరాయల సమకాలికుడు. ఇతనికి రాధామాధవకవి అనే బిరుదు కూడా వున్నది. రెండవది

రోసనూరి వెంకటపతి అనే కవి రచించినది. ఇది 17వ శతాబ్దిలో వెంకటగిరి రాజ్యం పాలించిన బంగారు యాచమనేనికి అంకితం. మూడవది ఉత్తర రామాయణకర్త కంకంటి నరసింహరాజు ద్విపద. మన ప్రస్తుత విషయం ఈ ద్విపదే.

కంకంటి నరసింహరాజు కంకంటి పాపరాజు తమ్ముడు. కంకంటి పాపరాజు ప్రళయ కావేరిలో (పులికాట్ లో) అమీనుగా వుండేవాడట.

"ఆర్వేల వంశాబ్ధి హరిణలాంఛనుడు
గర్వితరిపు మంత్రి గర్వభంజనుడు
గురుతర శ్రీవత్స గోత్రపావనుడు
ప్రపితామహుని వల్లభ ప్రభుబోలి
ఎపుడు బంధుల బ్రోచు హితకీర్తిశాలి
యగణితమతి దాతయై తమ తాత
యగు నయ్యఘనుబోలు నఖిలైకదాత
కంకంటి యప్పయాగ్రణి కుమారుండు
పంకజాప్త సమప్రభా విహారుండు
మా యన్న నరసమాంబా గర్భశుక్తి
జాయతమౌక్తికం బగు శుభవ్యక్తి
నరవర్య వేంకట నరసింహు గన్న
సరసుండు పాపరాజు ప్రధానుండు"

అని ఇతడు తన అన్నను పొగిడినాడు.

నరసింహ కవి 1649 ప్రాంతమున ఉన్నవాడు. ఇతనికి సమకాలికులు సమీర కుమార విజయకర్త పుష్పగిరి తిమ్మన్న, వేలూరు రాజధానిగ నేలిన వీర వెంకట రాయల ఆస్థానకవి మగదల తిమ్మన్న. కర్ణాటక రాజ్యంపై దండెత్తి వచ్చి యొలందావారిని ఓడించి, 1649 లో పులికాట్‌ను స్వాధీనపరచుకొన్న మహమ్మదు మీర్‌జుమ్లాతో సన్మానం పొందిన ధరణిదేవుల రామయ మంత్రి - ముఖ్యులు. వీరిలో పుష్పగిరి తిమ్మన్న ఇతనికి, పాపరాజుకు కూడా గ్రంథ రచనలో తోడ్పడినాడు.

"అనఘుని పుష్పగిర్యప్పన్నతనయు
ఘను సంస్కృతాంధ్రైక కవనాతిదక్షు
మాయన్న సఖుని తిమ్మన్ననుగ్రుతి స
హాయుని బిలిపించి యమ్మేటితోడ"

అని నరసింహకవి తిమ్మన్న తోడ్పడినట్లు స్వయంగా వ్రాసినాడు. "అని గిరీటికి శౌరి తోడైనయటుల" ఇతడు పాపరాజుకు తోడ్పడ్డాడట. పుష్పగిరి తిమ్మన్నే కంకంటి పాపరాజు పేర, నరసింహరాజు పేర గ్రంథాలు వ్రాసెనని ఐతిహ్యముందని శబ్దరత్నాకరకారుడు అంటున్నాడు.

అది ఎలావున్నా నరసింహకవి సరస విద్వత్కవి విజనశరణ్యుడు. తన ద్విపదను తన అన్న పాపరాజు కలలో కన్పించి చెప్పినట్టు రామచంద్రునికి అంకిత మిచ్చాడు.

శ్రీనాథుడు హరుని విలాసాలు చేర్చి ఒకచోట కూర్చినట్టు ఇతడు విష్ణుపు మహిమాతిశయాలను ఇందులో కూర్చాడు. హరవిలాసంలోవలె విడివిడిగా ఇతి వృత్తాలను వదలివేయక, విష్ణువిలాసకథల కన్నిటికీ ఒక చక్కని సన్నివేశం, ప్రణాళిక సమకూర్చారు. పురాణ ప్రసిద్ధాలైన విష్ణుకథలను గుదిగ్రుచ్చి స్వతం త్రంగా రచన సాగించాడు. ముక్కు తిమ్మన పారిజాతాపహరణ రచన ఇతని భావనాశక్తిని ప్రచోదన చేసివుంటుంది. పారిజాతాపహరణకథ కావలి కథగా ఎత్తుకొనిన విష్ణువిలాసకథలను గుదిగ్రుచ్చవచ్చునని తలచి వుంటాడు. సత్యా గర్వోపశమనం ఆధారంగా ఈ కథలను దానితో ఐక్యానుసంధానంచేశాడు. ఈ రెండింటికి నడుమ కొలికిపూస కృష్ణుని నర్మసఖుడు గోవింద శర్మ. విష్ణుమాయాకేళీవర్ణనానికి తొలిరంగం సత్యాదేవీ సమక్షం. ఆమెకు గోవిందశర్మ ఈ కథలు చెప్పి పారిజాతమాలిక బహుమానం పొందాడు. రెండవసారి ధర్మరాజు సభలో వర్ణించాడు.

ఎల్లనార్యుని విష్ణుమాయావిలాస నాటక పద్యకావ్యంవలె ఇదికూడా ఐదాశ్వాసాల గ్రంథం, శుకయోగి వాగ్ఝరినుంచే కథానుక్రమణిక, ఒక్కటే కథలు, కథకుడు గోవిందశర్మయే. నరసింహకవి ఎల్లనార్యుని మాటలను వర్ణనలను లోకోక్తులను తన ద్విపదలలో ఇమిడ్చినాడు. మరింత రసవంతంగా చేసినాడు.

లక్ష్మి, బ్రహ్మ, రుద్రాదులే విష్ణుమాయను అతిక్రమించలేకపోవడం గదా కథాలక్ష్యం? వారి గర్వభంగోదంతాలలోని కొన్ని రసకందాయపు పట్టులు రెండు మూడు ఆశ్వాసాల్లోని బ్రహ్మ, లక్ష్మి గర్వభంగ కథలు. లక్ష్మి విష్ణు మాయ కల్పించిన ఒక కొలను చూచి ఎలా నివ్వెరపోతుందో చూడండి:

"వనజాకరముజూచె వాడు కల్హార
వనరుహ కైరవావళి గలదాని
నిండార జిగిరెంచి నిగనిగలనక
దండి మానిన వాడు తలిరులతోడ

గలయబూచి మరందగానము ల్లేక
తెలివి గైకొనక గందిన పూలతోడ
పరిపాకమున బండి వదనింకి తీపు
నెరయక స్రుక్కియుండెడు పండ్లతోడ
మలయుటల్మాని కొమ్మల విన్ననైన
యలికుల శుకకోకిలాదులతోడ
జిన్నపోయిన వని జెంత నీక్షించి
యన్ననబోడి లో నాశ్చర్యమంది
ననబోడులార! యెన్నడు నిట్టి హేమ
వనము గన్గొన మింత వన్నె జెందియును
నేల వాడినదొకో యీతోట యనుచు
నాళీజనాళితో ననుచు దద్దివ్య
కమనీయవనమెల్ల గలయ దర్శించి''

మూడో ఆశ్వాసంలో పుండరీకుని కథ. ఎంతో సంయమంకల శ్రోత్రియు డైన ఆ విప్రుడు విష్ణుమాయా సృష్ట అయిన బోయపడుచును వలచి ఎల్లా వెర్రివాడయ్యాడో చూడండి:

''కరము మీటగు పచ్చగాజుల నొప్పు
కరముల సకుటుంగరమ్ములు మెరయ
గురువింద సరములు కులుకు సిబ్బెంపు
మెరుగు చన్గుబ్బలమీద రాణింప
ధవళ తాళ పలాశ తాటంకరుచుల
దవులు చెక్కుల నవ్వు తళతళ లీన
గొనబుకుర్గులొప్ప గూడక కప్పు
కొనిన నెన్నుదుట జేగురు బొట్టు వెలయ
నన్నంపు టొల్లియు సగ మొప్ప గట్టి
యున్నది ముసుగుడి యొయ్యారముగను
గంచు మెట్టెలు మెరయగా వచ్చుదాని
గాంచిన...

చెనసి యన్నది గాళ్ళు సేతులు గడిగి
కొని యొక్క కెందమ్మి గొబ్బున దిగిచి
యందలి పుప్పొడి యందంద జింద
నందంబుగా గేల నలరి త్రిప్పుచును
అధిగత మధుర మోహ రథాంగ మిథున
నిథువన క్రీడలు నెమ్మిగన్గొనుచు
జలకరీంద్రములు హస్తములెత్తి చాచ
బలుసుళ్ళు జొరబారు భావంబు చూచి
ముసిముసి నగవుతో మోము వంచుచును
మసలుచు నాస గ్రమ్మర పెడమరలి
తిలకించుచున్న న త్తెలిగంటి మనసు
దెలిసి మనోజుండు దివిరి ప్రేరింప
జపము సాలించి యాచమనంబు సేయు
నెపమున లేచి యెన్నెలతుక డాసి"

"బలవా నింద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి" అనే వ్యాస వచన రహస్యమిదే కాబోలు!

మూడో ఆశ్వాసంలో బ్రహ్మ గర్వభంగ కథలో మాయాసరస్వతి పోయే వగలు వికారాలు చూడండి :

"వెండియు నొక కొన్ని వెడమాయ లూని
నిండు వేడుకల నన్నీ రేజగంధి
కన్నీరునించు తొంగలి రెప్పలార్చి
మన్నించు పతి రాక మసలె నేడనుచు
గంపించు నొకమాట కౌదీగె చెమ్మ
రింప గౌగిటను జేరిచె నాథుడనుచు
నవ్వులుదేల్చు నానన మొక్కమాట
మువ్వంపు ముచ్చట ల్మగడాడె ననుచు
బులకించు నొకమాట భూరిమోహమున
జెలువుని చెలువంబు చింతించుకొనుచు

గళలూర ధైర్యవైఖరి కడతేర
గలుగు నొక్కొకమాటు కాయజుండేచ
నీ రీతి వీణ వాయించుచు బ్రహ్మ
బ్రేచుకొరకు నిబ్బిత్తరియున్న"

మూడో హస్తంకల ఆ వెర్రిబాగుల బ్రహ్మ ఈ బిత్తరిని చూచి బిత్తర పోడా మరీ!...

శివ గర్వభంగ కథ నాల్గో ఆశ్వాసం, మోహినీ వేషంలో వున్న హరిని చూచిన హరుని హృదయం ఎలా హరించుకు పోతుందో చూస్తారూ !

"మరుడను బగవాడు, మటుమాయలాడు
హరి... ...యాడు రూపంబు
చవ్వచేయకగన్న జగములలోన
నవ్వగు దవ్వగు... ... ... ...
జగములన్నియు దద్వశమున వర్తిలెడు
జగతి బ్రధానులౌ సంయము ల్సురలు
కమలాసనాదు లా ఘనుని మాయలను
భ్రమ గొనియున్నారు ప్రాజ్ఞత లుడిగి."

వారే ప్రాజ్ఞత లుడిగినప్పుడు మన భోలాశంకరుని మాట ఏ లెక్క లోనిది ?

ఇది ఇంతటి రసం చిప్పిలే రచన కనుకనే, పాలపర్తి నాగేశ్వరశాస్త్రి గారు 1881లో చెన్నపురిలో విద్వన్మనోరంజనీ ముద్రాశాలలో తొలుత ముద్రించినారు. అముద్రిత గ్రంథ చింతామణిలో దీనిపై పండితప్రకాండులు విమర్శలు కురిపించారు. ముద్రితప్రతి కూడా నేడు లభించడంలేదు. కనుక ఇది పునర్ముద్రణ పొందవలసివుంది. దీనితోపాటు పాపరాజు యక్షగానం కూడా ముద్రణ కావలసివుంది.

# కళలు శాస్త్రాలు ఏవి ముఖ్యం?

**మా**నవుని మనో వికాసానికి, జ్ఞానాభివృద్ధికి శాస్త్రాలెంతో, తదితర విషయాలూ అంతే. అయినా, శాస్త్రాలంటే హెచ్చుగాను, తదితరాలు లొచ్చుగాను పరిగణించడం అయింది ఎందుకో?

ఈ భేద బుద్ధి ఈ నాటిదే కాదు; ఏనాటినుంచో వస్తున్నది మనలో. శాస్త్రజ్ఞులు తాము గొప్పవారమని విర్రవీగడం, పెరవారిని చిన్నచూపు చూడడం గురించి ఎన్నో గాథలు వింటున్నాము. అలాగే తక్కినవారూ తాము లోకజ్ఞుల మంటూ శాస్త్రజ్ఞులను పరిహసించడమూ కద్దు. "శాస్త్రేషు హీనాః కవయో భవంతి", "పాండిత్య దూరాః కవయో భవంతి" శాస్త్రాలు చదువుకోలేనివారు కవులవుతారు, పాండిత్యం లేనివారు కవులవుతారు. అని శాస్త్రజ్ఞులంటే "వైయాకరణాః ఖసూచయః" (వ్యాకరణ శాస్త్రజ్ఞులు ఆకాశం చూచేవారు.) అని శాబ్దిలను దెప్పేవారు ఇతరులు. తర్క కర్కశబుద్ధులని" (శుష్కమైన హేతువాదం వల్ల కరుకు బుద్ధిగలవారు) నైయాయికులను మరొకరు దూరేవారు. హేతువాదమంటే మీకేమి తెలుసునని తార్కికులంటే, మీకు శబ్దవిభక్తి జ్ఞానమే లేదని "అస్మాకూణాం తార్కికేషాం అర్థరి నతు శబ్దరి" (తార్కికులైన మాకు అర్థమే ప్రధానం గాని శబ్దం ప్రధానం కాదు? అని దీని అర్థం. కాని, అస్మాకం అని వుండాలి, అస్మాకూణాం తప్పు. తార్కికాణాం ఉండాలి. తార్కికేషాం తప్పు. అర్థే, శబ్దే అని వుండాలి. అర్థరి, శబ్దరితప్పు.) అంటూ వారి భాషా జ్ఞానాన్ని ఈసడించేవారు. ఇక ఆయుర్వేత్తలు తామే ప్రాణాచార్యులం ప్రపంచానికని బిర్రబిగిస్తే, జ్యోతిర్విదులు తామే ద్రష్టలమని, భవితవ్య స్రష్టలమని విజృంభిస్తే, వారిని "మీరు భాషను పాడుచేసి పండబారిస్తున్నారయ్యా" అని నిరసించేవారు భాషాకోవిదులు. ఈ పరస్పర దూషణ తిరస్కారాలతో మన ప్రాచీన సాహిత్యంలో చాటువులు, ఖండికలు ఎన్నో పుట్టుకొచ్చాయి.

సరే; ఇప్పటి పరిస్థితి మరీ అధ్వాన్నం. 'సైన్సు' చదువుకొన్నవారిని పలుకరించలేము; కన్నెత్తి చూడలేము. నేడు ప్రపంచమంతటా సైన్సుదే సామ్రాజ్యమన్నా తప్పులేదు. మధ్యయుగాలలో పాశ్చాత్య దేశాలలో సైన్సుకూ,

మతానికి సంఘర్షణ వచ్చింది. సైన్సుతో జనానికి విపరీత జ్ఞానం కలిగి తమ అధికారాలకు చ్యుతి ఎక్కడ సంభవిస్తుందో అని మతాధీశ్వరులు జాగ్రత్తపడి సైన్సును ఒక మొట్టికాయ వేశారు.

కాని, పరిశ్రమలు అభివృద్ధి చెందడంతో సాంకేతిక విజ్ఞానానికీ, సైన్సుకూ ప్రాబల్యం హెచ్చి. సైన్సు చదువుకున్న వారికి సంఘంలో గౌరవం ఇనుమడించి. నిజమే. లోకందంతా వ్యాపారసరళి. దేనివల్ల, ఎవరివల్ల ద్వితీయ పురుషార్థానికి దోహదమో, దానికి, వారికి పెద్దపీట.

ఇక సాంకేతికాభ్యుదయం లేని భారతంవంటి బడుగుదేశాలలో సైన్సుది నియంతృత్వమే. అది చెప్పింది వేదవాక్యం. అది గీచిందే గీత; తక్కినది వాత, రోత. ఈ చిత్తవృత్తికి కారణం వేరే చెప్పనక్కరలేదు; వెనుక చెప్పిన ద్వితీయ పురుషార్థ ప్రభావమే. దేశం నాల్గుమూలలా అనకట్టలు. జలాశయాలు, జల విద్యుత్కేంద్రాలు—ఒక్కటేమిటి, ఇవన్నీ సైన్సు అనుగ్రహిస్తుండగా, మరీ తల ఒగ్గకపోవడం ఎలాగ? దానితో జాతి సంపద మన కట్టెదుటే ఇనుమడిస్తుండగా జోహార్లు చేయకపోవడం ఎలాగ?

వాణిజ్యరంగంలో సైన్సుకు ఉన్న పలుకుబడి ప్రతిధ్వనే కళాశాలలో సైన్సు శాఖల 'సీట్లకు' రద్దీ. సైన్సు సీట్లకు ఏడుకొండల వాని ధర్మ దర్శనానికి లాగ తెగబాటెడు 'క్యూ'లు, తక్కిన శాఖల సీట్లకు అందులోను చరిత్ర,భూగోళం శాఖలవైపు గాలైనా వీచదు. "బతకలేక బడిపంతు" లన్నట్టు ఏదీ గతిలేక పోతే హిస్టరీ సీటు! ఒకప్పుడు ఇంగ్లీషు 'లిటరేచర్ సీటుకు' సైన్సుకున్న వైభవమే ఉండేది. అప్పుడది సంపూర్ణంగా అధికారభాష. దానిలో నిష్ణాతుడే కళాశాలల ప్రిన్సిపాలు; సైన్సు చదువుకున్నవారు ఇంగ్లీషు బోధించడానికి వీలులేదు; అతనికి భాష ఏమి వచ్చు?—ఇదీ ధోరణి కాని, నేడూ, నాడూ కూడా విజ్ఞాన శాస్త్రజ్ఞులలో కేవలం భాషా వేత్తలేనని భ్రాంతి గొల్పే వక్తలూ, మహా రచయితలూ ఉన్నారు. వారి శైలి ఏ మహాకవి శైలికైనా దీటు కాగలదు. అలాగే కేవలం రచయితలుగా పేరు పొందిన వారిలో విజ్ఞాన శాస్త్రమే వీరి ప్రధాన విషయమా!—అని పఠితలను వెరగుపడజేసే వారూ ఉన్నారు తమ రచనలతో.

ఆర్థిక ప్రయోజన దృష్టితో ఒకొక్కప్పుడు ఒక్కొకదానికి ప్రాధాన్యం కలుగడం సహజమే. అంతమాత్రాన ఉచ్చనీచా లేపీ లేవు. బుద్ధి వికాసానికీ, జ్ఞాన విస్తృతికి సైన్సు ఎంత అవసరమో, కళా భాషా చరిత్రాదులూ అంతే అవసరం.

# దండి దశకుమార చరిత్ర

సంస్కృత వాఙ్మయంలో గద్యం తీరే వేరు; అదొక అనుపమ విశిష్టత. కవుల రచనా పారమ్యానికి అది గీటురాయి వంటిది గనుక "గద్యం కవీనాం నికషం వదంతి" అనే నానుడి ఏర్పడింది.

ఛందోబద్ధమైనవాక్యం పద్యం : ఛందోబద్ధం కాని వాక్యం గద్యం. ఈ గద్యం మనకు వేద సంహితలలోనే తొట్టతొలుత దర్శనమిస్తుంది. పాదబద్ధ మయినది ఋక్కు. పాదబద్ధంకానిది యజుస్సు. గద్యమిశ్రితం కావడంవల్లనే యజుర్వేదానికి కృష్ణత్వ సంకేతం అని లాక్షణికు లంటారు. అత్యంత ప్రాచీన గద్యం తైత్తిరీయ సంహితలోనిది యజుర్వేదాంతర్గతమయిన కాఠక మైత్రా యణీ సంహితలలోను గద్యం ప్రచురమే. అథర్వవేదంలో షష్టభాగం గద్యాత్మకం. ఇక బ్రాహ్మణాలన్నీ గద్యే. ఆరణ్యకాలంలో గద్యం హెచ్చు. ఉపనిషత్తులలో ప్రాచీనమైనది గద్యే.

కాని, లౌకిక సంస్కృత సాహిత్యంలో గద్యం అవసరమయినంతగా వికసించలేదనే అనాలి. వైద్యం జ్యోతిషంవంటి శాస్త్రవిషయాలు కూడా పద్యాన్ని ఆశ్రయించడానికి కారణం పద్యానికి గల ధారణోపయోగితే. అయినా చరక సంహితాది వైద్యక గ్రంథాలలో ప్రాచీన గద్య మాధుర్యం చవిచూడవచ్చు. కాని, దర్శనాది శాస్త్రచర్చంతా సుందర గద్యంలోనే సాగింది. దీనికి కారణం శాస్త్రప్రవర్తకుల ఉద్దేశం విషయ విపులీకరణం కావడమే.

వేదకాలంనుంచి సంస్కృత గద్యవికాసం పరిశీలిస్తే రెండు రీతుల గద్య కానవస్తుంది. మొదటిది: సరళం, సంభాషణరూపం, విషయ ప్రధానం అయిన గద్య: రెండవది: ప్రౌఢం, సమాసబహుళం ప్రగాఢశైలీ బంధురం అయిన గద్య. వైదికకాలపు గద్యకు ఒకటి రెండు ఉదాహరణలు చూపడం సమంజస మనుకుంటాను:

"వ్రాత్య ఆసీ దీయమాన ఏవ స ప్రజాపతిం స మైరయత్. స ప్రజా పతిః సువర్ణ మాత్మన్నపశ్యత్ తత్ ప్రాజనయత్, తదేక మభవత్, తల్లలామ మభవత్, తన్మహ దభవత్, తజ్జ్యేష్ఠ మభవత్, తద్ బ్రహ్మాభవత్, తత్తపో భవత్, తత్సత్య మభవత్, తేన ప్రాజాయత." (అథర్వ 15 కాండ-1 సూత్రం)

ఉపనిషత్తుల గద్యం మరింత సరళంగా సుందరంగా ఉంటుంది. ఛాందోగ్యంలోని ఈ వాక్యాలు చూడండి : "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజనాతి తద్ భూమా అథ యత్రాన్యత్ పశ్యతి అన్యచ్ఛృణోతి అన్యద్విజానాతి తదల్పం. యో వై భూమా తదమృతమథ యదల్పం తన్మర్త్యం." (7-24)

ఇతిహాస కాలానికి భారతంలోను గద్యం చోటు చేసుకొన్నది. "శంతనుః ఖలు గంగాం భాగీరథీ ముపయేమే తస్యా మస్య జజ్ఞే దేవవ్రతో నామ, య మాహు ర్భీష్మ ఇతి" అని సంభవపర్వంలో కథ రెండు పుటల గద్యంలోనే పరుగులు తీస్తుంది.

పురాణకాలపు గద్యకు విష్ణుపురాణంలోని గద్యను ఉదాహరిస్తాను:

"యథైవ వ్యోమ్ని వహ్నిపిండోపమం త్వా మహ మపశ్యం తథైవాద్యాగ్రతో గత మత్ర భగవతా కించి న్న ప్రసాదీకృతం విశేష ముపలక్షయామీ త్యుక్తే భగవతా సూర్యేణ నిజకంఠా దున్ముచ్య స్యమంతకంనామ మహామణివర మవతార్య ఏ కాంతే న్యస్తం." (4-13-14)

ఇక లౌకిక గద్యం దార్శనికుల భాష్యవ్యాఖ్యాటీకాదులతో తలయెత్తింది. ఇలాటివాటిలోని ప్రత్యేకత సంభాషణ విధానం, కథనోపకథన రీతి, వారు మన ఎదుటే కూర్చుని మనకు తమ సిద్ధాంతం వివరిస్తున్నారా అన్నంత సరళత దానిది. ఈ రీతి గద్యానికి మహాభాష్యకారు లయిన పతంజలి మొదలయిన వారి రచన లుదాహృతులు. అప్పటికే ఎన్నో ఆఖ్యానాఖ్యాయికలు — యవక్రీత, ప్రియంగవ, యయాత్యాఖ్యానాలు; వాసవదత్తా. సుమనోత్తరాద్యాఖ్యాయికలు— ఉన్నట్లు పతంజలి పేర్కొన్నారు. అవి మనకు మృగ్య మయినవి గనుక తథాగతుని తొలి చరిత మయిన లలిత విస్తరమే అత్యంత ప్రాచీన గాధ్యాఖ్యాయిక అని నా నమ్మకం.

ఇది అశోకుని కాలంలో రచితమని విమర్శకు లంటారు. ఇది ఆ కాలపు గద్యరామణీయకానికి మణి మకుటంవంటి దంటే అతిశయోక్తి కాదు. ఇది లలిత విస్తర పురాణమని బౌద్ధులు ఉల్లేఖించినా తొలి గద్యకునే నా పరిగణన; ఇది కథాకథనావసరాన్ని బట్టి సరళ, ప్రౌఢ, నితాంత ప్రౌఢ శైలులలో అతి సుందరంగా కొనసాగుతుంది.

"ఇతి హ భిక్షవో దశదారక సహస్రాణి బోధిసత్త్వేన సార్ధం లిపిం శిక్ష్యంతే స్మ. తత్ర బోధిసత్వాధిష్ఠానేన తేషాం దారకాణాం మాతృకాః వాచయతాం. యదా అకారం పరికీర్తయంతి స్మ. తదా అనిత్యః సర్వసంసార శబ్దో నిశ్చరతి స్మ."

అయినా దీనిని మత దృష్టితో పురాణ మన్నారు గనుక మనం కూడా కావ్యదృష్టితో చూడవద్దు.

అశోకుని కాలంలోను, తర్వాతను వికసించిన గద్యప్రాభవం శిలా శాసనాలలోను ప్రసరింపక పోలేదు దీనికి ప్రతిబింబం రుద్రదాముని గిర్‌నార్ శిలా శాసనం (క్రీస్తుపూర్వం 150 సం॥). దీనిలోని శైలిని చదివి ఆనందించండి:

"ప్రమాణ మానోన్మన స్వర గతి వర్ణ సార సత్త్వాదిభిః పరమ లక్షణ వ్యంజనై రుపేత కాంతమూర్తినా, స్వయ మధిగత మహాక్షత్రపనామ్నా, నరేంద్రకన్యా స్వయంవరానేక మాల్యప్రాప్తదామ్నా, మహాక్షత్రపేణ రుద్రదామ్నా సేతుచి సుదర్శనతరం కారితం..."

పతంజలి ప్రస్తావించిన అఖ్యానాఖ్యాయికలు లుప్తప్రాయాలైనవి లలిత విస్తరం పురాణ మనుకున్నాము; గనుక లౌకిక సంస్కృత గద్య వాఙ్మయంలో దండి దశకుమార చరిత్రమే ప్రప్రథమ గద్య ప్రబంధమని మనం భావించవచ్చు. దండికి కొంచెం తర్వాతివారు సుబంధు బాణభట్టులు.

"ఉపమా కాళిదాసస్య భారవేరర్థ గౌరవం,
దండినః పద లాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః"

అనే అభియుక్తోక్తి పరమలక్ష్యంగా పదలాలిత్యానికి పరాకాష్ఠ పొందిన దండి మహాకవి కాలం తక్కిన కవుల చరిత్రలాగ సందిగ్ధ మేమీ కాదు. ఈయన అవంతి సుందరీ కథాసారంలో తన పూర్వుడయిన భారవిని పేర్కొని, చరిత్ర కారుల చిక్కును తొలగించినాడు. ఆ కథా సారంలో—

"స మేధావీ కవి ర్విద్వాన్ భారవిః ప్రభవో గిరామ్,
అనురు ధ్యాకరోత్ మైత్రీం నరేంద్రే విష్ణువర్ధనే."

అని స్పష్టంగా ఉదాహరించిన దానినిబట్టి గంగ రాజయిన దుర్వినీతుని ఆస్థానంలో ఉన్న దామోదర పరనామధేయుడైన భారవి పల్లవరాజయిన విష్ణువర్ధనుని (నరసింహ విష్ణువు) పిలుపుపై పల్లవ రాజధాని కాంచీపురానికి తరలి వచ్చినట్లు తెలుస్తున్నది. ఈ పల్లవరాజు క్రీస్తు శకం ఆరవ శతాబ్ది ప్రథమ పాదంలో ఉన్నవాడు. అప్పటికే భారవి కిరాతార్జునీయం రచించాడు ఈ భారవి పుత్రుడు మనోరథుడు. ఆతని పుత్రుడే దండి.

దండి బాల్యంలోనే తలిదండ్రులను కోల్పోయి, కాంచీనగరంలో నిరాశ్రయుడుగా ఉన్నాడు అంతలో కాంచీ నగరంలో విప్లవం చెలరేగింది; దండి ప్రజలందరితో పాటు అడవికి వెళ్ళి కొంతకాలం గడిపి, విప్లవం శాంతించిన మీదట మరల పురం ప్రవేశించి, కొంతకాలానికి పల్లవరాజాస్థాన విద్వాంసు డయాడు.

దండి రచనలలో స్పష్టంగా తెలిసినవి మూడు: అవంతి సుందరీ కథ, కావ్యాదర్శం, దశకుమార చరితం. ఛందోవిచ్ఛిత్తి కర్తృత్వం విషయమై అభిప్రాయ భేదాలున్నాయి.

ఇతడు పల్లవరాజు కుమారుని కోసమే కావ్యాదర్శం రచించినట్టు కింవదంతి ఉన్నదని శ్రీ ఎం. రంగాచార్యులనే ఒక విద్వాంసులు వ్రాశారు. కావ్యాదర్శ టీకాకారులలో ప్రాచీనుడయిన తరుణ వాచస్పతి

"నాసిక మధ్యా పరితః చతుర్వర్గ విభూషితా.
అస్తి కాచి త్పురీ యస్యా అష్టవర్ణాహ్వయా నృపాః"
(కావ్యాదర్శ - పు. 30 - 114)

అనే ప్రహేళికలో కాంచీనగర పల్లవ నరపతుల సూచన కలదని వ్యాఖ్యానించాడు. ఈ జనశ్రుతినిబట్టికూడ దండి కాంచీవాసి కావడం నిశ్చయం

మనకు 'కథ కంచికి పోయింది, మనం ఇంటికి వచ్చాము' అనే నానుడి ఉంది. ఇది దండి దశకుమార చరిత్ర రచనతో, దాని వ్యాప్తితో ఏర్పడిందే. ఈ దశకుమార చరిత్ర ఒళ్ళు జలదరించే ఆఖ్యానాలతో, కుతూహలం కలిగించే కథనంతో అపూర్వమైంది. ఇది పదిమంది కుమారుల చరిత్ర సంగ్రహం. దీనిలో మొదట పూర్వ పీఠిక, తుదను ఉత్తర పీఠిక ఉన్నాయి. ఈ రెండు పీఠికలూ దండి రచనలు కావని, లుప్తప్రాయమైన అవంతి సుందరీ కథ అనే గద్య కావ్యం లభించిన మీదట దానిలోని కథనే పూర్వ పీఠికలో ఎవరో చేర్చారని విమర్శకులు అంటారు. దీనికి కారణం అష్టోచ్ఛ్వాసాల మూలగ్రంథంలోని కథలకు, ఈ పీఠికలోని కథలకు అక్కడక్కడ కానవచ్చే విరోధమే. మూల కథల నుంచి ఎనిమిది మంది కుమారుల కథలకు పూర్వ పీఠికలో మరిరెండు కథలు పొందుపరచి దశకుమార చరితమనే పేరును సార్థకం చేసినట్టూ, కథా సమాప్తి నిమిత్తం ఉత్తర పీఠిక చేర్చినట్టూ, విమర్శకుల అనుమానం ఈవిధంగా ఇది పూర్వోత్తర పీఠికలతో సంపుటీకృతం.

మగధ రాజయిన రాజహంసుడు మాళవ రాజయిన మానసారునితో పరాస్తుడై అడవులు పట్టడంతో కథ ఆరంభ మవుతుంది. అడవిలోనే రాజహంసునికి రాజవాహనుడనే కుమారుడు ఉదయిస్తాడు. రాజు మంత్రులకూ అపహార వర్మాదులు ఏడుగురు జన్మిస్తారు. వీరంతా పెరిగి పెద్దవారయి, విద్యాబుద్ధులు నేర్చిన తర్వాత దేశయాత్రకు బయలుదేరుతారు. దురైవవశాత్తు విడిపోయి, వివిధ దేశాలలో పడికష్టాలు ఎదుర్కొంటూ, విచిత్ర జీవితం గడుపుతారు. తర్వాత దైవికంగా అందరూ రాజవాహనుని కలుసుకొని, తమ తమ సాహస

గాథలు చెప్పుకుంటారు. వారి సహాయంతో రాజహంసుడు మరల మగధ రాజ్యం సంపాదించి రాజవాహనునికి పట్టం కట్టి తను వానప్రస్థుడు కావటంతో కావ్యం సమాప్త మవుతుంది.

పూర్వపీఠికలో కుమారోత్పత్తి, ద్విజోపకృతి, సోమదత్తచరిత్ర, పుష్పోద్భవ చరిత్ర, అవంతి సుందరీ పరిణయం—అనే అయిదు విషయాలున్నాయి. రాజవాహనాది కుమారుల ప్రధాన కథ ఎనిమిది ఉచ్ఛ్వాసాలు, రాజ్యప్రాప్తి ఉత్తర పీఠిక.

దశకుమార చరితం ఘటనా ప్రధానమైన కథానకం. దీనిలో నానావిధాశ్చర్యఘటనలు పాఠకుల హృదయాన్ని ఆవర్జిస్తాయి. ఈ కథలు భూమి మీదే కాదు, సముద్రాలమీద, రోదసిలోను జరుగుతాయి. మిత్రగుప్తుని సముద్రయాత్రా వృత్తాంతంలో యుద్ధాలు, మోసాలు, జాతరలు, దొంగతనాలు, ప్రేయసీ ప్రియుల సమావేశాలు మొదలైనవి చదువుతున్నప్పుడు మనం ఏవో అద్భుత లోకాలలో విహరిస్తాము. దండి ప్రతిభ ఈ సహజతతో, వాస్తవికతతో, సజీవ పాత్రలతో మరొక ప్రపంచాన్నే మన యెదుట దించుతుంది.

అప్పటి సమాజాన్ని దండి వదలి పెట్టలేదు. నిజానికి సమకాలిక సమాజాన్ని రూపు కట్టించిన ప్రాచీన రచన దీనిని మించినది మరొకటి లేదు. దండి సమాజపు వెలుగు నీడలను ప్రస్ఫుటంగా చిత్రించాడు. దీనితో రచనకు పంచ ప్రాణాలూ సమకూరాయి. దొంగ సన్యాసులు, కపట బ్రాహ్మణులు, మోసకారులైన వేశ్యలు, కపట కులటలు, గజదొంగలు దండి దృష్టినుండి తప్పిపోలేదు.

దండి ప్రజాకవి, ప్రజాజీవితం ఆకళించుకొన్న కవి కనుకనే ప్రజాసామాన్య సుఖ దుఃఖాలు, ఉత్సాహోద్వేగాలు, రాగద్వేషాలు కావ్య మంతటా కుమ్మరించాడు. అప్పటికే దేశంలో శిథిలమైన జైన బౌద్ధ విహార స్థితి, శాక్య భిక్షుకుల దూతీ కర్మ, కామోత్సవాది జనపదోత్సవాలు, నారికేళ బక జాతీయాలయిన కోళ్ళ పోరితం, కప్పురపు విడెంతో అతిథి సత్కారం, వివిధ కృషికర్మ, వెదురు గొట్టాలతో నీరు తోడడం మొదలయిన నిత్య జీవిత విషయాలు ఎక్కడ బడితే అక్కడ పలు చెక్కడపు రతనాలలాగ మిరుమిట్లు గొలుపుతాయి.

ఇక రచనారామణీయం దృష్టితోను దండి లేఖిని అగ్ర శ్లాఘ్య, ఆఖ్యానక కావ్యాల కిది మొదటి బంతి, మేలుబంతి. జీవం తొణికిసలాడే పాత్రలు, హాస్య వ్యంగ్య సంభరితమైన సంభాషణ చాతురి కథా ప్రవాహాన్ని అడ్డని వర్ణనలు, ముఖ్యాఖ్యాయికను మరుగు చేయని అవాంతర గాథలు, శేషక్లిష్టం. సమాసభార భుగ్నం కాని సరసశైలి, మనోహర రసాభివ్యక్తి, నిత్యవ్యవహారసిద్ధ లలిత పద ప్రయోగ పాటవం, అన్నిటిని మించి అర్థ స్పష్టత—ఇవన్నీ పండిత

పాఠకుల మనస్సులను చూరగొన్నవంటే ఆశ్చర్య మేముంది? ఈ గుణరత్న గణం వల్లనే ప్రాచీనాలంకారికులు

"జాతే జగతి వాల్మీకౌ కవిరి త్యభిధా భవత్.
కవీ ఇతి తతో వ్యాసే కవయః త్వయి దండిని"

అని ప్రశంసించడం సహజాతిసహజం. "కవిర్దండీ కవిర్దండీ" అని సరస్వతే అన్నదట.

దశకుమార చరితం పూర్తిగా దండి స్వోపజ్ఞం. స్వకపోల కల్పితం. అయితే, ఇది చాలవరకు కథాసరిత్సాగరంలోని మృగాంక దత్త చరిత్రను పోలి ఉన్నది గనుక, కథా సరిత్సాగరం బృహత్కథా మూలకం గనుక, దండి బృహత్కథను అనుసరించి ఉండగూడదా అని, "భూత భాషా మయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథాం" అని పేర్కొన్న దండికి బృహత్కథ తెలియుదా అని ఆక్షేపించవచ్చు.

బృహత్కథ ఉన్నట్టు మొట్టమొదట మనకు లభించే శాసన ప్రమాణం 6 వ శతాబ్దంలో. ఆ శాసనం వేయించినవాడు దుర్వినీతుడు. ఇతడు పశ్చిమ గంగరాజ్యం ఏలిక. ఇతడు తాను పైశాచిలోని బృహత్కథను సంస్కృతీక రించినట్లు శాసనంలో తెలుపుకొన్నాడు. ఇతడు సంస్కృత ప్రాకృత కర్నాట భాషలలో విద్వాంసుడని తర్వాతివారు ప్రశంసించారు. ఈ పైశాచీ మూలం కానీ, దీని సంస్కృతికరణంగాని మనకు లభించలేదు. మనకేకాదు దుర్వినీతుని ఆస్థాన కవి అయిన భారవికి పౌత్రుడయిన దండికే దొరకలేదు. అతడు "భూత భాషా మయీం ప్రాహుః" (అంటారు) - అని మాత్రమే అన్నాడు.

క్రీస్తు పూర్వం నాలుగైదు శతాబ్దాలకు ముందే జనశ్రుతిలో ఉన్న ఉదయన కథే జైనులతో దక్షిణాపథానికి వ్యాపించి "మాక్కదై", "పెరుంగదై" అని ప్రఖ్యాతి పొంది, సంస్కృతీకరణంతో బృహత్కథ అయినది. ఇది ఎప్పుడూ గ్రంథరూపంలో లేదని, కథాసరిత్సాగర కర్త అయిన సోమదేవుడు శైవమతాభినివేశంతో తన రచనకు పవిత్రత, ప్రఖ్యాతి కలిగించడానికి పుష్ప దంతవృత్తాంతం కల్పించాడని, కథాసరిత్సాగరంలో పదకొండవ శతాబ్ది తర్వాతి దక్షిణదేశ రాజవృత్తాంతాలూ చేరడం వల్లనూ, దాని మూల విషయంలో అను మానించవలసి వస్తున్నదని, జనశ్రుతిలోని బృహత్కథను తక్కినవారు పేర్కొ న్నట్టే సోమదేవుడూ చూపి, తనది కథలనే ఏరుల కడలి అనే భావంతో కథా సరిత్సాగర మన్నాడని శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (ఎం. ఎ.) గారు సోప పత్తికంగా నిరూపించారు. (చూడండి - కథాసరిత్సాగరానికి మూల మేది- భారతి, 1960, జూన్).

దశకుమార చరిత పూర్వ పీఠికకు పదదీపిక అనే వ్యాఖ్య, తక్కిన భాగానికి పదచంద్రిక, భూషణ, లఘుదీపిక అనే వ్యాఖ్యానాలు, మొత్తం గ్రంథానికి సంజీవనం అనే వ్యాఖ్యా ఉన్నాయి. సంస్కృతంలో దీని సంగ్రహాలు, పుత్రికలూ పెక్కు ఉన్నాయి.

దశకుమార చరిత్రను కేతన అనువదించడానినిబట్టే దీని ప్రాబల్యప్రాశస్త్యాలు గ్రహించవచ్చు. అయితే కేతన దీనిని పద్యకావ్యంగా రచించాడు. ఆయన కాలం సుప్రసిద్ధ సంస్కృత నాటకాలనే పద్యంగా పిండికొట్టిన కాలం. కనుక దశకుమారచరితం గద్యకు ఎక్కలేకపోయింది. తర్వాత కొందరు దీనిలోని కథలు కొన్నిటికి విడివిడిగా పద్యానువాదాలు చేశారు. ఈ శతాబ్దంలో శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు తెలుగు వచనంలోకి అనువదించారు. వీరి అనువాదం ప్రౌఢ ప్రాబంధిక గ్రాంథికం. మిత్రుడు, విద్వత్కవి శ్రీ విశ్వం తెనుగుసేత సరళసుందర వ్యావహారికం.

# చేతబళ్ళు, తలనీలాలు

నలభై యేళ్ళనాటి మాట. మాతోపాటు ఒక విద్యార్థి వుండేవాడు. మాకంటే రెండు మూడేళ్ళు పెద్ద. చాల బుద్ధిమంతుడు. అతనికి ఏమయిందో, ఏమో! ఒకనాడు హటాత్తుగా వెర్రివెర్రి చేష్టలు చేయడం ప్రారంభించాడు. పుస్తకాలు, గుడ్డలు చింపేసేవాడు. జుట్టు పీక్కునేవాడు. నామాలు తుడిచేసుకొనేవాడు. (వైష్ణవ విద్యార్థి. పేరు సీతారామాచార్యుడు.) ఈ అవలక్షణాలు చూచి మాకందరికీ ఏదో భయంభయంగా వుండేవి. మాకన్నా పెద్దపిల్లవాళ్ళు అతనికి ఎవరో ఏమో చేశారని, శాతబడో, శూన్యమో అయివుంటుందని నిశ్చయించారు. మేమంతా ఒకరాత్రి ఆ విద్యార్థిని వెంటబెట్టుకుని గుట్టుగా ఒక భూతవైద్యుని ఇంటికి వెళ్ళాం. ఆయన పేరు వెంకటయ్య. బుర్రమీసాలు, నొసలంతా నిండిన కుంకుమబొట్టు — చూస్తేనే దయ్యం పట్టేట్టు, పట్టిన దయ్యం పారిపోయేట్టు వున్నాడు. పెద్ద పిల్లలను ముందుకు తోసి, మేమంతా వెనక్కు నక్కాము. వెంకటయ్య వెంటనే సంగతి గ్రహించాడు. "మీ స్నేహితునికి ఎవరో శాతబడి చేశారు. నేను తిప్పేస్తా, కాని మేకపిల్లను బలి యివ్వాలి" అన్నాడు. మా నాయకులు జంకారు. "సంస్కృత విద్యార్థులం. బలీ గిలీ మాకు తెలీదు" అన్నారు. "మీరేమీ చేయనక్కరలా. నేను రేపు రాత్రి కపిలతీర్థం కొండపైన ఒకచోట ఇది తిప్పికొడతాను. మీరంతా రాండి. ఏమీ భయంలేదు. నేనున్నాను" అన్నాడు వెంకటయ్య మీసాలు మెలివేస్తూ. మేము ఆయన మీసాలు నమ్మి, మరుసటి రాత్రి వెళ్ళాము.

అర్ధరాత్రి అయింది. వెంకటయ్య అప్పుడు మరీ భయంకరంగా వున్నాడు. పసుపుతో, కుంకుమతో, పేడతో ఏవేవో మండలాలు చేసి, వాటిలో రంగవల్లికలు తీర్చాడు. ఒక మండలంలో మా మిత్రుని కూర్చోబెట్టాడు. ఎదుట మరొక మండలంలో మేకపిల్లను కట్టాడు. అది ప్రాణభయంతో విలవిలలాడుతూ, అరుస్తూంది. వెంకటయ్య పెద్ద గొంతుతో దిక్కులు పిక్కటిల్లేట్టు ఉచ్చరించే మంత్రాలు, ప్రాణభయంతో తనకలాడే మేకపిల్ల చావు అరుపులు, కపిలతీర్థ నిర్ఝర నినాదం ఆ నిశ్శబ్దరాత్రిలో కొండచరియలకు తాకి ప్రతిధ్వనిస్తూ వాతావరణాన్ని అతి భయానకంగా చేశాయి. మేమంతా కిక్కురుమనకుండా కూర్చున్నాము.

వెంకటయ్య అసలే అజానుబాహువు. అప్పుడు ఆ వేషంలో మరీ పొడగరిగా కనిపించాడు. ఏవేవో మంత్రాలు పఠిస్తూ కత్తి చేత్తో పట్టుకున్నాడు. మాకంతా ఒళ్ళు జల్లుమంది. "ఓం విరుద్దేరూపిణిచండికే వైరిమముకం దేహి దేహి స్వాహా" అంటూ ఖడ్గాన్ని అభిమంత్రించాడు. మరేదో, ఖడ్గమంత్రం పఠించి ఖడ్గాన్ని పూజించాడు. మేకపిల్లను ముందుకు లాక్కున్నాడు. నివ్వే శత్రువు సుమా అంటూ అభిమంత్రించాడు ఎర్రదారం తీసుకుని, ఆ కత్తితో చటుక్కున తెంపి, ఆ మేకపిల్ల మూతికి బిగించి కట్టాడు. అనామకుడైన వైరి పేరుతో దానికి ప్రాణప్రతిష్ఠ చేశాడు.

"ఓం అయంసవైరీ యోద్వేషి
తమిమం పశురూపణం,
వినాశయ మహాదేవి
స్ప్రేంస్ప్రేం ఖాదయ ఖాదయ"

అంటూ బలి పశువు నెత్తిమీద పూవులు వేసి, బలిమంత్రం పఠించాడు. "దుర్గాయై భగవత్యై తుభ్యమహం సంప్రదదే ఆం క్రూం ఫట్" అంటూ మేకపిల్ల తల నరికి, "ఏతద్రుధిరం దుర్గాయై నమః" అని రక్తాన్ని, శిరస్సును నివేదించాడు. తర్వాత రక్తంతో హోమం చేశాడు. ఆ దుర్వాసనను భరించలేకపోయాము. కాని, ఏమన్నా, ఏమనుకున్నా అపచారం. ఈ తంతు అంతా ముగిసేవేళకు తెల్లవారింది.

తర్వాత మా మిత్రుడు సెలవుల్లో ఊరికి పోయినవాడు తిరిగి రాలేదు. ఏమయ్యాడో, ఏమో జ్ఞాపకం లేదు.

* * *

ఇటీవల ఎన్నికల ప్రచారంలో వెలువడిన కరపత్రాలు, ప్రకటనలు చూస్తే ఆనాటి భయాలూ, నమ్మకాలూ, ఇంత విజ్ఞానశాస్త్రం అభివృద్ధి అయినా, ఇంత సంస్కార ప్రచారం జరిగినా, గాంధీ అంతటివాడు పుట్టినా, పోయినట్టు గాని, మారినట్టుగాని కనిపించదు. ఎన్నికలలో తమ ప్రత్యర్థులను మంత్ర శక్తితో, అభిచారాది హోమాలతో జయించాలనే ప్రయత్నాలు కూడా కొందరు చేసినట్లు ఈ కరపత్రాలు తెలుపుతున్నాయి. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి గారిని వోడగొట్టడానికి ఆయన ప్రత్యర్థులు మేడపినుంచి మాంత్రికులను పిలిపించారని, వారు తమ పనిలో కృతార్థులు కానందున పిలిపించినవారు మాంత్రికులను కొట్టారని నరసరావుపేటనుంచి ఒక అనామక ప్రకటన వెలువడింది.

ఒక పెద్దమనిషి తిరుమల మీద తలనీలాలు సమర్పించాడు. "ఎందుకండీ? ఏమిటి మ్రొక్కు?" అని ప్రశ్నించగా, "నా ప్రత్యర్థి వోడిపోతే తలనీలాలు

ఇస్తానని ఏడుకొండల వాడిని వేడుకున్నాను" అన్నారు. "మీకు ప్రత్యర్థి ఏమిటి? మీరు నిలబడలేదుగా ఎన్నికలకు?" అని అడిగితే, "నాకు ప్రత్యర్థి అంటే నాకేనా? నా స్నేహితునికి ప్రత్యర్థి. అతని కోసం నేను మొక్కుకున్నాను" అని సమాధాన మిచ్చాడు. ఈ ముండనం మొక్కుబడి రాజకీయ నాయకులకు, ప్రజా ప్రతినిధులకూ లేకపోలేదు. మొన్న ఆంధ్ర శాసన సభ్యుల ప్రమాణస్వీకరణోత్సవం నాడు ముప్పై మందికి పైగా శాసనసభలో ముండిత మస్తకులు కనిపించారనే వార్త అందరూ పత్రికల్లో చదివిందే.

కోరికలు లేని మానవుడంటూ వుండడు. వాటిని తీర్చుకోడానికి రకరకాల ప్రయత్నాలు, ప్రార్థనలు, జ్యోస్యాలు, శకునాలు, ప్రశ్నలు అడగడాలు మొదలయినవి అనాదిగా ప్రపంచమంతటా ప్రతి దేశంలోను, ప్రతి మతంలోను, ప్రతి తెగలోను వున్నవే. దురాచారాలు, మూఢవిశ్వాసాలు వద్దని సంస్కార మహోద్యమంగా బయలుదేరిన బవుద్ధంలోను, బుద్ధి అనే మాహాత్మ్యాలకు, పూజా పురస్కారాలకు ప్రాధాన్యమిచ్చే మహాయానం, మూలసిద్ధాంతాలు మరుగై, తంత్ర యంత్ర మంత్రాలకు పుట్ట అయిన వజ్రయానం బయలుదేరి, అసలు మతం దిగజారిపోవడం చరిత్ర. తనకు హితం కోరడం ఎలా సహజమో, శత్రువుకు అనిష్టం కోరడం కూడా సహజమే కాని, ఈ అనిష్టాకాంక్ష అంతటితో ఆగక క్రౌర్యంగా పరిణమించి మానవత్వాన్ని అధఃపాతాళానికి తొక్కి వేస్తుంది. ఈ నీచమన స్తత్వమే చేతబడి, చిల్లంగి, చెడుపు, అభిచారం, శూన్యం, ప్రయోగం మొదలయిన దుష్కృత్యాల మూలం.

ఈ దురాచారం వివిధ రూపాల్లో, వివిధ సిద్ధాంతాల పేరుతో ప్రపంచ మంతటా అనాదిగా వుంది. పూర్వం సైబీరియాలో షామానోస్, కొరియాలో షామన్స్ - ముటంగ్, చైనాలో వూ-పో, సెర్బియాలో లైకంత్రపీ, వూడోయిజం మొదలయినవన్నీ ఇలాంటివే. అనాగరక ప్రజలలో దీని ప్రభావం చెప్పనక్కర లేదు. యూరోపియన్ దేశాలలో ఇది 1474 నుంచే సాహిత్యంలో కనిపిస్తుంది. షేక్స్పియర్ నాటకాలలో పిశాచాల, దయ్యాల ప్రసక్తి వుండడం అందరూ ఎరిగినదే. ఫ్రాన్సు, జర్మనీలలో 18వ శతాబ్ది నుంచే భూతప్రేత పిశాచావాహన విసర్జనాదులు జరిపే సంఘాలు వుండేవట. మధ్యయుగాలలో, విజ్ఞానశాస్త్ర రహస్యాలు కొన్ని మతగురువులకే తెలుస్తున్న రోజులలో, వారు కొన్ని రసాయన వస్తువుల ద్వారాను, శారీరక సాధనాల ద్వారాను సాధించిన పనులను అద్భుతాలుగా చూపుతూ, సామాన్య ప్రజలను భ్రమింపజేస్తూ, వారిని తమ వశవర్తులుగా చేసుకునేవారట. దీనికి తోడు ప్రజలలో గల పిశాచ భీతి, తక్కిన భయాలు మతాచార్యులకు బాగా వినియోగపడేవి. కొన్ని శక్తుల వల్ల కామరూప

ప్రాప్తి, కామగమనం మొదలయినవి సాధ్యమనే "లైకంత్రపీ"లో కూడా జనానికి చాల నమ్మకం వుండేది. లైకంత్రపీ అంటే తోడేలు కావడం. మానవులు కొన్ని శక్తులువల్ల తోడేలు, పెద్దపులి రూపాలు పొంది, పనులు సాధించగలరని జరిపే మోసాలు, మాయలు ప్రబలిపోవడం వల్ల ఒక దశలో రోమన్ చర్చిలు వాటినే కాక, ఇంద్రజాలం, గారడీ మొదలయిన వినోద విద్యలను కూడా నిషేధించాయని చరిత్ర చెబుతున్నది.

ఇక భారతదేశంలో ఇలాటి నమ్మకాలు ప్రతి రాష్ట్రంలోను వ్యాపించి వున్నట్టు పురాణేతిహాస కావ్యచరిత్రలలో ఎన్నో కథలున్నాయి. ఈ నమ్మకాలకు మూలం అధర్వణ వేదంలోను, తదంగాలయిన ఉపవేదాలలోను కనిపిస్తుంది. అధర్వణవేదతలో దీనిని అభిచారమని అన్నారు. అభిచార మంటే (అభిము ఖ్యేన శత్రువధార్థం చారః హింసాకర్మ) శత్రువధకోసం ఎదురుగా చేసే పని, హింసా కర్మ. ఈ అభిచారం ఆరు విధాలు - మారణం, మోహనం, స్తంభనం, విద్వేషణం, ఉచ్చాటన, వశీకరణం అని. శత్రువును ఈ విధంగా ఆరు రకాలుగా హింస చేయడానికి శ్యేనయాగం — డేగను చంపి తద్రక్తమాంసాలతో హోమాదులు చేయడం— మొదలయిన సవాలు, కృత్య, పిశాచ ప్రయోగం, యాతుధానులు, అసురులు మొదలయిన వారిని ప్రయోగించడం మొదలయిన హింసాకర్మలను అధర్వణవేదం నిర్వచించింది. రాజపురోహితులకు రాజ శ్రేయస్సుకోసం ఐహిక ఫలాలయిన శాంతిక పౌష్టిక కర్మలు, శత్రు హనన సమర్థాలయిన అభిచారాలు తెలిసి వుండాలని గోపథబ్రాహ్మణం తెలుపుతున్నది. గోపథబ్రాహ్మణంలో మరొక తమాషా కథ వుంది. బ్రహ్మ అధర్వణవేదం చెప్పిన తర్వాత పూర్వ దక్షిణ, పశ్చిమోత్తరాలను క్రమంగా చూచాడట. పైకి కూడా చూచాడట. దానితో పంచ ఉపవేదాలు-సర్ప వేదం, పిశాచ వేదం, అసుర వేదం, ఇతిహాస వేదం, పురాణ వేదం పుట్టాయట (1-10). అధర్వణ వేదానికి సంబంధించిన అంగీరస దూర్వాస కౌశితక్యాది నవకల్పాలలో ఈ సవాల, యాగాల వివరాలున్నాయి.

వేదం ఇలాటి అభిచారాదులను ప్రోత్సహిస్తుందా అన్నది సంశయమే. కాని ఇలాంటి హింసాధర్మాలు, ఆచరణలు, నమ్మకాలు, మంత్రతంత్రాలు అనాదిగా వున్నాయని, వాటిని అధర్వ వేదం సంస్కరించి క్రోడీకరించి బ్రాహ్మణీకరించిందని విమర్శకులు అంటున్నారు.

శాంతిక పౌష్టిక ప్రక్రియలకు, అభిచారానికి సంబంధించి అధర్వణవేదం- అవిసవం (గొర్రె), అజౌదన సవం, కర్కిసవం (తెల్లని ఆవుదూడ), అనడుహ్ సవం (ఎద్దుబలి), ఋషభసవం, వసాసవం (వట్టిపోయిన ఆవు మొదలయిన బలు

లిచ్చే యజ్ఞాలు, ఓదన సవం, పవిత్ర సవం (నువ్వులు బియ్యం వండి), ఉర్వరా సవం(పంటచేలు దానం)మొదలయిన అహింసాత్మక యజ్ఞాలు, విషహరణమయిన "ఉరుగుల" వంటి పాము మంత్రాలు, అర్బుది, వ్యర్బుది, త్రిసంధి, వజ్ర వంటి దివ్యాస్త్రాలు, తక్మ (జ్వర) కుష్టాది రోగహరణమైన కుష్ఠ (సోమం వంటిది), శర, పృశ్నిపర్ణి, అపామార్గ, పాట, రోహిణీ, అర్క, పిప్పల, గుగ్గులు, జంగిడ (తంగేడు) మొదలయిన ఓషధులు, కేశవర్ధని వంటి కేశవర్ధన మూలికల తెలుపడమే కాక, నేటి చేతబడులకు మూలమనదగిన 'కృత్య' అనే చిత్ర హింసాత్మకమైన ప్రక్రియను మహాయుధంగా వర్ణించింది.

కర్రతోగాని, గుడ్డలతోగాని, పిండితోగాని బొమ్మలు చేసి, దానిని అభి మంత్రించి, శత్రువును ఆవాహన చేసి, చేసే చిత్రహింస కృత్య. ఈ బొమ్మ రెండు మొదలు నాలుగడుగుల ఎత్తు వరకు వుండవచ్చు. దీనిని పెళ్ళికుమార్తె లాగ తీర్చవచ్చు. అపామార్గను రక్షగా కట్టుకుంటే, దీని దోషం పోతుంది. జంగిడ గూడా దీనికి విరుగుడు.

ఈ కృత్య వర్ణనం, స్తోత్రం, ప్రయోగం, ప్రేషణం, ప్రత్యావర్తనం మొదలయినవి దశమకాండం, ప్రథమానువాకం, ప్రథమసూక్తమంతటా, తక్కిన అనువాకాలలో సకృత్తుగాను వున్నాయి. ఒక ఋక్కు ఇలా చెబుతుంది కృత్యను :

"అపక్రామ నానదతీ
నినద్ధా గర్దభీవ,
కర్తౄన్ అక్షస్వ ఇతో
బ్రాహ్మణావీర్యవతా" (10-1-1-14)

ఇక్కడి నుంచి గాడిదలాగ ఒండ్రపెడుతూ వెళ్ళిపో. కర్తను, నిన్ను తయారు చేసినవానిని వదులు. వీర్యవంతుడయిన బ్రహ్మ నిన్ను సృష్టించాడు సుమా!

"సరేహి కృత్యే మా తిష్ఠో
విద్ధ స్యేవ పదంనయ'
మృగస్స మృగయు స్త్వం
సత్వా నికర్తు మర్హతి" (10-1-1-16)

ఓ కృత్యా, వెళ్ళిపో. ఎవర్ని గురి చూచి విడువబడ్డానో అతడున్న చోటికి వెళ్ళు. వాడిని నీవు వేటాడు. నీవు వేటగాడివంటి దానివి, అతడేమో వేట మృగం. కనుక నిన్ను చంపలేడు.

"వాతం ఇవ వృక్షాన్ నిమృణీహి
పాదయమా గా మశ్వం పురుషదిహ్నఏషాం
కర్త్రూన్ని వృత్యేతః కృత్వే
అప్రజాత్వాయుబోధాయ'' (10-1-1-17)

పెనుగాలి చెట్లను కూల్చివేసేట్టు ఎవరికోసముయితే నీవు ప్రేషితురాలివో ఆ పురుషుని పడగొట్టు. అతని ఆలమందలు, గుర్రాలు మొదలయిన వాటిని నశింపచేయి. కర్త నుంచి బయలుదేరి వారిని ప్రజారహితులుగాను చేయి.

ఈ కృత్యాకర్మను అంగిరసుడు మొదలుపెట్టాడు. అందువల్ల దానికి అతడు అధ్యక్షుడు, ఋషి, పురోహితుడు. అతడు దానిని విడువగలడు, మళ్ళించ గలడు. విడువడం ఆంగీరసం (పద్ధతి). మళ్ళించడం ప్రత్యంగిరసం. (ప్రత్యక్). ఈ తిరిగివచ్చిన కృత్య క్రమంగా ప్రత్యంగిరాదేవతగా మారిందట. ఈ కృత్యను మళ్ళిపొమ్మనే ఋక్కులు ఇలా అంటున్నాయి:

"యస్త్వోవాచ పరేహీతి
ప్రతికూల ముదాయ్యం,
తం కృత్యే భినివర్తస్వ
మాస్మాన్ ఇచ్ఛ్వో నాగసః'' (10-1-1-7)

నిన్ను మామీదకి వెళ్ళమన్నవాడు చెప్పింది ప్రతికూలమైన మాట. మేము తప్పు చేయని వాళ్ళం. కృత్యా, మమ్మల్ను కోరకు, వెళ్ళిపో.

''యస్తే పరూంషి సందధౌ
రథాస్యే ఋభుః ధియా
తం గచ్ఛ తత్ర తే అయనం
అజ్ఞాతః తే అయంజనః'' (10-1-1-8)

రథాన్ని చక్రాలు, మొదలయిన వాటితో తయారు చేసినట్లు నిన్ను సంధానం చేసిన వాడి వద్దకు తిరిగి వెళ్ళు. అదే నీ స్థానం. అదే నీ దారి. వీడు నీకు తెలిసినవాడు కాడు.

"అఘమ స్త్వఘకృతే
శపథః శపధియతే,
ప్రత్యక్ ప్రతిప్రహిణ్మో
యధా కృత్యాకృతం హనత్'' (10-1-1-5)

కృత్యను పంపి పాపం చేసినవాడికి పాపం తగులనీ. శపథం చేసినవాడికి ఇది ప్రతి శపథం. ఈ కృత్యను (ప్రత్యక్‌గా) మళ్ళించి పంపుతున్నాము. కృత్యం తనను చేసిన వానిని తనే కొట్టివేయనీ.

కృత్య తిరిగిపోయింది. మళ్ళించినవాడు ఎంతో సంతోషిస్తాడు. ఎంతో తృప్తిపడుతాడు.

"యథా సూర్యోముచ్యతే తమ సస్పరి
రాత్రింజహాత్యుషసశ్చ కేతూన్
ఏవాహం సర్వం దుర్భూతం కర్త్రీం
కృతా కృతాం కృతం హస్తీర జో దురితం జిహామి."
(10-1-1-22)

"అబ్బ! కృత్య నన్ను ఏమీ చేయక వదలిపెట్టి వెళ్ళింది. అన్ని పాపాలు (పీడలు) పోయాయి సూర్యుడు చీకటి పొరల నుంచి బయటపడినట్టు, ఉషస్సు రాత్రి నుంచి వెలికివచ్చినట్టు అన్ని దుష్క్రియల నుంచి విడివడ్డాను. అందు వల్ల ఏనుగు మదాన్ని వదలినట్టు దుతం వదలిపెడుతున్నాను."

అథర్వణ వేదం తక్కిన మూడు వేదాలలాగ కాక, విలక్షణంగా, కేవలం ఐహిక విషయాలను, ముఖ్యంగా అభిచారాది హింసా కర్మలను ప్రవచించడం వల్లనే ఆముష్మిక పారలౌకికవాదులు దానిని అంతగా పరిగణించక ఋగ్యజుస్సామాలనే త్రయికే ప్రాధాన్యమిస్తారు.

ఇలా అథర్వణవేదానికి ఎక్కిన కృత్య—చేతబడి మొదలయినవి నేటికీ మూఢవిశ్వాసాలున్న వారికి హింసోపకరణాలుగానే వున్నాయి. నేడు గూడ ఈ నమ్మకం గల వారు పిండి బొమ్మనో, కఱ్ఱ బొమ్మనో చేసి, 21, 42, 63 మొదలయిన నియత దినాల పర్యంతం ఈ బొమ్మలను అర్చించి, వాటి అంగాలలో ముళ్ళుగాని, మేకులుగాని చెక్కుతారు. ఆఖరుకు కంఠంలో చెక్కినప్పుడు, శత్రువు ప్రాణం పోతుందని నమ్మకం. ఈ అభిచారులు తమ శత్రువుల తల వెంట్రుకలు, గోళ్ళు, మలాలు సంపాదించి ఈ బొమ్మలో వేస్తారు జాగిలాలకు దొంగకు సంబంధించిన గుడ్డనో, మరే వస్తువునో మూజూపిస్తే అది ఆ దొంగను పసికట్టి పట్టుకొని కరిచేట్టు, అతని వస్తువుల వాసనతో అభిచార పిశాచమో, దైవతమో అతనిని పసిగడుతుందనే నమ్మకమే ఈ మురికి వస్తువులు సేకరణకు కారణమయి వుంటుంది.

ఈ సంస్కృత అభిచార పదానికి, కృత్యకు తెలుగు సమానార్థక పదాలు చెఱుగు, చేతబడి, చిల్లంగి, చేడ్పడు, చేడ్పాటు అనేవి బాధపడు, బాధ అనే

అర్థాలలో వున్నాయి. కీడు అని కూడా అర్థం. వీటి అపభ్రష్ట రూపమే చేతబడి, శాతబడి అనుకుంటాను. చిల్లంగి అంటే మూలికాదులతో చేసే ఉచ్చాటన క్రియ. దీని వ్యుత్పత్తి తెలుసుకోవాలి. శూన్యం పెట్టడం, ప్రయోగం చేయడం అని కూడా వాడుతారు. శూన్యమంటే అవయవాలను, బుద్ధిని కర్మశూన్యంగా, అకర్మణ్యంగా చేయడం. ప్రయోగం అంటే మరొక దుష్టశక్తిని వదలడం.

ఈ క్రియలోని ఉద్దేశం దుష్టమని ఈ మాటలే చెబుతాయి. శుభకామన, తత్సిద్ధికి మొక్కుకోడం, భగవత్సేవ చేయడం మంచివే. దుర్హృదయంతో పెరవారికి చెడుగు కోరడం న్యాయంకాదు. హత్యకు, హత్యోద్దేశానికి శిక్ష విధించడం రాజదండనీతి లక్షణం. మనువు దీనిని ఉపపాతక మన్నాడు. దీనికి కృచ్ఛ్ర వ్రతాలు చేయడం ప్రాయశ్చిత్తంగా విధించాడు.

''అభిచార మహీనంచ
త్రిభి కృచ్ఛ్రైః వ్యపోహతి''
''సర్వాకరేష్వధీకారో
మహాయంత్ర ప్రవర్తనం
హింసా వోషధీనాం స్త్ర్యాజీవః
అభిచారో మూల కర్మచ.'' (11-63)

గనులపై అధికారం, కీళ్ళుగల పెద్ద యంత్రాలను నడపడం, వోషధులతో హింస, ఆడవారిని బ్రతుకుతెరువుగా వినియోగించుకోడం, అభిచారం, వశీకరణం—ఉపపాతకాలని ప్రాయశ్చిత్తారావాలని క్రోడీకరించాడు.

ఈలాటి కర్మల లక్ష్యం పరహింస. వాటిని ఇతరులను భయపెట్టడానికి దుర్వినియోగపరచే ప్రమాదం ఎప్పుడూ వుంది. మంచి చెబితే జరగకపోయినా, చెడు చెపితే జరుగుతుందేమోననే భయం, కాకతాళీయంగా ప్రమాదం జరిగితే ఫలానాదానివల్లే జరిగిందనే నమ్మకం, అపరిణత మనస్కులకు కలుగుతుంది. భయం ఆవహించిన చోట వికాసానికి అవకాశం వుండదు. విజ్ఞాన శాస్త్రం బాగా అధ్యయనం చేసినవారికి కూడా ఇలాటి మూఢాచారాలు (పరస్పర సమన్వయం లేక, వేటికవే అరలు అరలుగా) వుండడం చూస్తున్నాము. ఒక ప్రపంచ విఖ్యాత వైజ్ఞానికుని గురించి ఒక కథ చెబుతారు. పన్నెండేళ్ళ క్రితం మద్రాసులో సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చినప్పుడు, సముద్రంలో స్నానం చేసి సూర్యోపరాగ పితృ తర్పణం చేస్తున్నారట ఆ విజ్ఞానవేత్త పక్కన పరిశీలనార్థం వచ్చిన పాశ్చాత్య వైజ్ఞానికులు అడిగారట - "డాక్టరు గారూ, ఏమిటది? సూర్యునికి ఏదో అడ్డం వస్తేకదా గ్రహణం. ఏమిటి మీరు చేసేది?" అని. "దట్ ఈజ్ సైన్స్,

డిసీజు సెంటిమెంట్" అని ఆయన సమాధానం చెప్పారట. బాగా చదువుకున్న వారి సంగతే ఇలా వున్నప్పుడు, సామాన్యప్రజ సంగతి చెప్పనక్కరలేదు. ఏ ప్రకృతి వైపరీత్యాన్ని చూచినా అది మానవ జాతిలా భయపడుతుంది.

పూర్వం రాజులు దేశ రక్షణ దృష్టితో, ప్రజాహిత దృష్టితో శత్రు నిబర్హణానికి అభిచారాదులు జరపడమంటే, కాలదేశాలను బట్టి సబబే కావచ్చు. కాని ఆ సాకుతో నేడు ప్రతివాడూ తనకు గిట్టనివాడిని ఇలాటి దుష్క్రియలతో బెదరించడం ప్రారంభిస్తే సంఘంలో అవినీతి, దుష్టచింతన వ్యాపిస్తాయి. కనుక ప్రభుత్వం ఇలాటి వాటిని నిషేధించడం అవసరం.

తలనీలాల సంగతి—పూర్వం ఎప్పుడో ఏ అనాది అనాగరక స్థితిలోనో నవయవ్వన ప్రాదుర్భావ కాలంలో అందరూ దేవాలయానికి వెళ్ళి సేవ చేయ వలసి వచ్చేదని, ఆ సేవలో పెద్దలకు స్వీయాంగ సమర్పణం కూడా భాగమని, సంఘం వివేకవంతం, నాగరకం అయిన తర్వాత ఈ సేవకు చిహ్నంగా తమను పోలిన విగ్రహాలను సమర్పించడం లేక తమ అంగంలో భాగం సమర్పించడం ఆచారమయిందని, దాని అవశేషమే నేటి తలనీలాల సమర్పణ మని కొందరు సంఘ విజ్ఞాన శాస్త్రవేత్తలు అంటున్నారు దీనిని మరికొందరు అన్యథా వ్యాఖ్యానిస్తున్నారు.

శిరోముండనం పరాజితునికో, శత్రుదూతకో చేసే పరాభవాలలో ఒకటి. జితుడు విజేతకు దాసోహమనడానికి ఇది చిహ్నం ఇది రామాయణ భారతాలలో వుంది. పూర్వపు రాజులు తమ రాజ్యాన్ని భగవత్కైంకర్య రూపంగా పాలించే వారు గనుక తమ శత్రువులకు అవమానాన్ని భగవత్సన్నిధిలోనే చేయడం ఆచారమయింది. తర్వాత అది అభీష్టదాయకుడయిన భగవంతునికి వినయ ప్రకటనగా రూఢమయింది. దీని మూల కారణం ఏమైనా నేడు తలనీలాల సమర్పణం భక్తికి బాహ్య చిహ్నంగా, త్యాగానికి ప్రతిరూపంగా (నిజంగా త్యాగమే కురూపినయినా కురులే అందమన్నట్లు మహిళలు తమ మోములకు ఎంతో అందచందాలను కూర్చే శిరోజాలను ఇవ్వడం, కొనలను కత్తిరించడం కాదు, కూటివేణితో పాటు క్షురకు బలిచేసి, వికార స్వరూపాన్ని వరించడ మనేది నిజంగా త్యాగమే) నేడు దక్షిణ భారతంలోని పెక్కు క్షేత్రాలలో - ముఖ్యంగా, వేంకటేశ్వర, నరసింహ, అంజనేయ, షడానన క్షేత్రాలలో ప్రచుర మైన ఆచారం. దీనిని గూడ అభిచార హోమాదుల లాగ శత్రు నిషూదన కాంక్షకు పరతంత్రం చేయడం ఉచితం కాదు. అలా చేస్తే ఇది నిషేధార్హం కాకపోదు.

# మాటల మాటులోని సంగీతం

"నేను మరణించినా, నా గీతాలు జనం నాలుకపై కలకాలం నిలిచి ఉంటాయి" అన్నాడు రవీంద్ర కవీంద్రుడు. గానం, గీతం, అవినాభావ సంబంధం గలవి గనుక గానాన్ని, సంగీతాన్ని ఆశ్రయించిన గీతం, మాటల సముదాయం జనం మనస్సును అట్టే చూరగొని ఇట్టే వారి నాలుకపై నాట్య మాడుతుంది.

మాట ముందు పుట్టిందా, సంగీతం ముందు పుట్టిందా అంటే, స్పష్టంగా చెప్పలేము! ఒక దశలో మాట ముందుగా మానవజాతినుంచి ముత్యాలలాగ, మల్లెరేకులాగ రాలినట్టు కనిపిస్తుంది; మరొకదశలో సంగీతం సరస సుందరంగా జాలువారినట్లు తోస్తుంది; ఇంకొక దశలో మాట మూలంగాను, సంగీతం తత్పరి ణామంగాను భాసిస్తుంది. ఏమైనా మాటలూ, సంగీతమూ ఎంతో సన్నిహిత మయినవి; ఒక కొమ్మ రెండు రెమ్మలూ-ఒక పూవు రెండు రేకులూ, ఒక రేకు ఇరువైపులూ అన్నా తక్కువే. అయితే ప్రతిమాట సంగీతమయం కాదు. మనం కొయ్య ముక్కను కోసినట్టుగా మాట్లాడవచ్చు; రబ్బరును సాగదీసినట్టుగా మాట్లాడవచ్చు.

మాట అంటే, ఒక ధ్వనికి - వర్ణరూపమైన స్వరానికి - అనాదిగా కలిగిన సంకేతం. మహాభాష్యకారుడు పతంజలిముని "ప్రతీతి ప్రతిపాదకో లోకే ధ్వనిః శబ్ద ఇత్యుచ్యతే" అన్నాడు. అంటే, పదార్థ ప్రతీతి కలిగించే ధ్వనే మాట అన్నమాట. ఈ మాట - శబ్దం - సార్థకమని, నిరర్థకమని, అనుకూల మని, రకరకాలుగా మన శాబ్దికులు వింగడించినారు.

ఈ మాట - శబ్దార్థాల సంకేతం - స్థూల విషయాన్నే తప్ప సూక్ష్మ విషయం స్పృశించజాలదు. ఇల్లు అని అంటా మనుకోండి. ఈ మాటవల్ల మన తెలివికి తగిలే అర్థం మనుష్యులు వసించడానికి అనువైన ఒకానొక కట్టడమని మాత్రమే. రూపం, వైశాల్యం, ఎత్తు మొదలయిన వాటివల్ల దానిలో కలిగే వైవిధ్యం అనంతం. వాటిని కంటితో చూచినప్పుడు తెలుసుకున్నంత స్పష్టంగా ఏ సాహాయ్యం చేతనూ గ్రహించలేము. అలా చూడడానికి వీలులేనప్పుడు మన స్మృతి, అనుభవం, ప్రతిభ ఇత్యాదుల సహాయంతో ఊహించి తృప్తిపడతాము.

అలాగే కోపం, కరుణ మొదలైన మనోధర్మాలు ఇంకా సూక్ష్మమైనవి. మాట భౌతిక పదార్థాలను తెలిపినంత స్పష్టంగా ఈ మనోధర్మాలను, భావాలను తెలుపజాలదు. మాటకు చేతకాని ఆ పనిని పరస్పర హృదయసంవాదంతో నిర్వహించేదే సంగీత కళ. అప్పుడే మాటలలో సంగీతశక్తి పెల్లుబుకుతుంది. కనుక సంగీతం మాటల ఎల్లలను దాటి విశాలంగా విశ్వంలో వ్యాపించగలిగినది. కనుకనే మన పెద్దలు "పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ" అన్నారు.

సంగీతం అంటే "ఆనందాపిర్భావం" అన్నాడు ఒక తత్త్వవేత్త. ఆనందమంటే ఏ మనోధర్మానుభూతి కయినా ప్రతీకం అనవచ్చు. సంగీతంలో ఆనంద తత్త్వం ఉన్నది. ఈ సృష్టి సంగీతం ద్వారానే జరిగిందంటారు. మన వేదరూపమయిన జ్ఞానభండారమంతా గానం చేయబడిందే గదా! సంగీత ప్రభావం అపూర్వమైంది. కవులు ఈ సంగీతదేవి శరణుజొచ్చారు. దీనివల్లనే గీతికావ్యాలు జనించాయి. గీతికావ్యాలలో కవి తన వ్యక్తిత్వం నుంచి విడివడి, అత్యున్నతికి ఎగిసిపోతాడు. నాలుగు వేదాలూ ఛందోబద్ధమైన సంగీతమేనని ఇప్పుడే అన్నాను. క్రౌంచపక్షి దుఃఖం చూడలేని భావావేశావిష్టుడైన ఆదికవి వాల్మీకి నోటి నుంచి "మా నిషాద ప్రతిష్ఠాం త్వం అగమః శాశ్వతీ సమాః" అని ఛందస్సును ముందుకు తోసినది ఈ సంగీతమే.

కాని, ఈ సంగీతం ప్రతి మాటలోను కలుగదు; ప్రతి శబ్దంలోను కలుగదు గుడ్డను చించుతామనుకోండి, కొబ్బరికాయను పగులగొడతామనుకోండి, వాటివల్ల సంగీతం పుట్టదు. ఎందుకంటే ఆ శబ్దాలలో అనురణనం లేదు. సంగీతానికి మూలద్రవ్యమైన ధ్వనికి అనురణనం ఉండాలి అనురణనం అంటే పుట్టినశబ్దం ఆ క్షణంలోనే నిలిచిపోక కొంతకాలం సాగడం. గంటలను, తంబూరా తంతిని మెనకినప్పుడు మనం అట్టి అనురణన ధ్వనిని వింటాము. దీనినే స్వర మంటారు; నాదమని అంటారు

సంగీతానికి కావలసిన రెండవ మూలద్రవ్యం కాలం. ఇది నాదంవలె చెవికి తెలియనిది. పగలు రాత్రులు, గుర్రపుడెక్కల చప్పుడు మొదలయిన వానిని చూచి, కాలపు కృత్రిమ ఖండాలను అనుభవానికి తెచ్చుకుంటాము. ఈ నాదకాలాలు ఆధారంగా సంగీతం లయను సాధిస్తుంది. లయమంటే సామ్యం. విభిన్నవస్తువుల పరస్పరసామ్యం. సౌహార్దం లయ. సర్వవిషయమయితే దీనిని సంవాదం అంటారు. కాలవిషయమయితే లయ అంటారు.

ఈ కాల లయద్వారా అనుభవానికి వచ్చిన కాలఖండాలను లెక్కించి గణాలుగా విడదీసి, ఆ గణాలను గుంపులుగా కూర్చి, వాటిలో వైవిధ్యం పట్టియిచ్చేది తాళం. ఈ నాద లయ తాళాల పరిస్పందమే సంగీతం.

ఈ సంగీతం భావావేశంలో మాటలకు అబ్బుతుందని మొదట్లోనే అనుకు న్నాము. అప్పుడే ఆ మాట కావ్యం అనిపించుకుంటుంది. ప్రతి వారికి హృదయంలో ఆవేశం ఉంటుంది. కాని, కవి అయినవాడే మాటలను ఎన్నుకుని కుశలతతో వ్యక్తీకరిస్తాడు. "భావోత్కర్షతా ప్రకటనమే కవిత" అని ఒక భావుక విమర్శకుడన్నాడు. "గానాన్వితమైన భావనే కవిత" అన్నాడు మరొక సౌందర్యవేత్త. "లయాన్వితమైన రామణీయక సృష్టే కవిత్వం" అన్నాడు మరొక సంగీతవేత్త.

మరి ఈ సంగీతం మాటలలో ఎలా ఉత్పన్నమౌతుంది? మొదటిది: ధ్వనులవల్ల—అంటే, అనుప్రాస శబ్దార్థాలంకారాలవల్ల. రెండవది: ఛందస్సు వల్ల అంటే, గతిలయలవల్ల. సంగీతానికి అనురణనం, లయ తాళాలు అవసర మన్నాముగదా! కవితలో అనురణనం కేవలం నాదం మాత్రమే కాదు; అర్థం, తద్ద్వారా అనిర్వచనీయమైన భావం అనురణిస్తాయి. శ్రుతిమాధుర్యం కలిగిస్తాయి. "అలంకారా లనేవి భావావేశావస్థలో స్వతహాగానే ఉద్భవిస్తాయి" అని ఒక విమర్శకుడన్నాడు. "కల్పనతో, లేక భావావేశంతో భాష అలంకృత మవు తుంది" అని అంబ్లేర్ అనే సాహిత్య విమర్శకు డన్నాడు.

ఈ రామణీయకం దిఙ్మాత్రంగా చూపటానికే మన అలంకార శాస్త్రం అవతరించింది. ఈ శాస్త్రం రస భావ ధ్వని వృత్తి రీతి శయ్యాపాక గుణదోషా లంకార చ్ఛందస్సులను విస్తరించి చెబుతుంది. ఈ అక్షర సంగీతాన్నే నన్నయ అక్షర రమ్యత అన్నారు.

"మదమాతంగ తురంగ కాంచన లస
న్మాణిక్య గాణిక్య సం
పదలోలిం గోనివచ్చి యిచ్చి ముద
మొప్పంగాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతు శీతనగ మ
ధ్యోర్వీ పతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజు దత్సభాస్థితు జగ
త్పూర్ణ ప్రతాపోదయున్''.

అన్న పద్యం ఒక్కటిచాలు నన్నయ "సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప" అని ప్రతిజ్ఞతో చెప్పుకొన్న అక్షర రమ్యత ఎలా సాధించిందీ తెలుపడానికి.

తిక్కన్న సోమయాజి వనవాస ఖిన్నుడైన అర్జునుని క్రోధాగ్నిని మాట లలో ఎలా మండిస్తాడో, సింహాల నటా జూటంలో జంజూటిని ఎలా వినిపిస్తాడో ఈ పద్యం చదవండి :

"సింగం బాకటితో గుహాంతరమునం
జేడ్పాటుమై నుండి మా
తంగ స్ఫూర్జిత యూథ దర్శన సము
ద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాసఖిన్నమతి న
స్మత్సేనపై వీడె వ
చ్చెం గుంతీ సుత మధ్యముండు సమర
స్థేమాభిరామా కృతిన్."

శ్రీనాథుడు తను "ఎంత అలవోకగా కవనం అల్లినదీ" చెప్పుకొనే మాట లలో ఎంత సంగీతం పలికించాడో చూడండి :

"చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి."

ఇక బమ్మెరవారి మందారాలు సంగీత మకరంద మాధుర్య సుందరాలు. వాటిని తాళంలోను గానం చేయవచ్చు.

ఆంధ్ర కవితా పితామహుని అలతి మాటల సంగీతపు సొంపు అంతింతన రానిది :

"కలశ పాథోరాశి గర్భవీచిమతల్లి
కడుపార నెవ్వాని గన్నతల్లి?
అనలాక్షు ఘనజటా వనవాటి కెవ్వాడు
వన్నె వెట్టు ననార్తవంపుపూవు?"

అన్నప్పుడు మొదటి పాదంలో సముద్రం తరగలు ఉయ్యాలలూగుతున్నట్లే అని పిస్తుంది. రెండవ పాదంలో అడవి అకాలంలో పూచినట్టే కనుల గడుతుంది.

"అట జని కాంచె భూమిసురు
డంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహు ర్లుఠ
దభంగ తరంగ మృదంగ నిస్స్వన

స్ఫుట నటనానుకూల పరి
ఫుల్ల కలాప కలాపి జాలమున్
కటక చర త్కరేణు కర
కంపిత సాలము శీతశైలమున్.''

అంటూ పెద్దన మాటలతో నిజంగా మద్దెల వాయించి మనలను గంతులు వేయించాడు.

సంగీత సాహిత్య చక్రవర్తి అయిన రామరాజ భూషణుడు ఉద్యాన వనంలో ఉయ్యేల లూగుతున్న రాచకన్నెలను తన మాటల టెలివిజన్‌తో మన ఎదుట చిత్రిస్తాడు :

"లలనా జనాపాంగ వలనా వస దనంగ
తులనాభికాభంగ దోః ప్రసంగ
మలసానిలాలోల దళ సాసవ రసాల
ఫలసాదర శుకాలపన విశాల''

మంటాడు. ఈ ఊపును అసవమత్తులు ఎలా తట్టుకున్నారో!

కవితకు ఈ బాహ్యరూపం గతి రీతి లయాత్మకమైనది. గతిలయలు మానవుని అపూర్వావేశంలో ముంచివేస్తాయి. తడితే, పాప నిద్ర పోతుంది. తప్పెట కొడితే కాళ్ళు అప్రయత్నంగా చిందులు తొక్కడానికి పైకి లేస్తాయి. గతిలయల గమ్మత్తు అలాటిది. ఈ గతిలయలు అనేక విధాలుగా ఉంటాయి, ఆయా భావ కాల దేశానుగుణంగా.

"తరతరాల దరిద్రాల
బరువులతో కరువులతో
క్రుంగి క్రుంగి
కుమిలి కుమిలి
కష్టాలకు నష్టాలకు
ఖైదులకూ కాల్పులకూ
సహనంతో
శాంతంతో

బలిపశువై తలవాల్చిన
దీన పరాధీనజాతి
శ్రమికజాతి శ్రమికజాతి
దెబ్బతిన్న బెబ్బులివలె
మేల్కొన్నది మేల్కొన్నది''

అని దాశరథి తనగీతి గతిలయలతో కదం తొక్కుతూ లేచే శ్రమిక జాతిని మనకు సాక్షాత్కరింపచేయగా;

"కైలాస శిఖరములు గడగడ వక్కన నవ్వ
నీల మాకాశంబు నిటలంబుపై నిల్వ
నందికేశ్వర మృదంగ ధ్వానములు బొదల
తుందిలాకూపార తోయపూరము తెరల
ఆడెనమ్మా శివుడు
పాడెనమ్మా భవుడు!"

అని పుట్టపర్తి ఏనాడో ఎన్ని మన్వంతరాల వెనకో జరిగిన, జరిగినదని మన మందరమూ నమ్మిన శివతాండవాన్ని లయతాళాలతో, ఆవేశంతో కనులగట్టేట్టు చేశాడు.

అందువల్లనే కవిత గతిరీతి లయలతో ఛందస్సుతో - సంగీతంతో పోటీ పడుతున్నదేమో ననిపిస్తుంది. కనుకనే "విజ్ఞానం ఎప్పుడూ గణితంవైపు బార్లు చాచుతుంటే, కవిత అనవరతమూ సంగీతం వైపు సాగిపోతూ ఉంటుంది" అన్నాడు కాడ్ వెల్.

అంటే, కవిత గతిరీతిలయల పాలు హెచ్చు కానుకాను రాగాత్మకమై పాటగా మారుతుంది. ఆ పాటలో సంగీతానికి, ఆవేశానికి ప్రాధాన్యం కాని, మాటకు కాదు. దానిలో పదకావ్యాలకు సాక్షాత్సంబంధం లేదు. సంగీతం శుద్ధంగా అనుభవించగలిగిన సంస్కార వ్యుత్పత్తులు చాలు. వారి ఆకర్షణకోసం కొంత సార్థకమైన భాష ఉంటుంది.

"నను పాలింప నడిచి వచ్చితివో నా ప్రాణనాథ" అనే మోహనరాగ కృతిలో రాముని స్తుతి కేవలం ఆనుషంగికం. రాగమే ప్రధానం. ఆ మాటలకు మారు మరే మాటలనన్నా వాడవచ్చు. "అలకలల్లలాడగ గని ఆరాణ్ముని ఎటు పొంగెనో!" అన్నప్పుడు రాణ్ముని పొంగడం ప్రధానం కాదు. మధ్యమావతీరాగ విస్తారం ప్రధానం. అంటే, సంగీతం మాటల పరిధిని విస్తరించేదన్నమాట.

ఈ సంగీతం లేంది మనం మామూలుగా, నిత్య వ్యవహారంలో వాడే భాష. దీనిని వచనం అంటాము. మామూలు వచనంలోను భావావేశం తెలుప డానికి పదావృత్తి, అక్షరావృత్తి వచ్చి నానుడులు. సామెతలు పుట్టాయి:- పాడిందే పాడరా పాచిపళ్ళ దాసరి, ఇల్లు ఇరకటం ఇల్లాలు మరకటం మొద లయిన నానుడులలో ఈ అనురణనం అతిసహజంగా జనం వ్యవహారంలో వచ్చి చేరింది. దీనిని కొంత ప్రయత్నంతోను చూపవచ్చు :

"శ్రీ పాకల వేంకట రాజమన్నారు ఆంధ్ర ద్రవిడ కర్నాటక సంస్కృతి పరిపాకాల మున్నేరు, తర్కజటిల న్యాయశాస్త్ర దృష్టితో లలితకళల అమృష్టితో నారికేళ కదలీ పాకాల మిన్నేరు..."

"హైదరాబాద్ రాష్ట్రంలో ఖద్దరంటేనే అధికారులకు నిద్దుర పట్టని కాలమది."

"పట్టరాని ఆవేశం, పట్టి చూద్దామనే కావేషం, ఏ పిల్లగాలి వీచినా కదలి పోయే మనసూ, ఏ చల్లగాలి సోకినా వడలిపోయే దినుసూ."

ఈ మాటలే భౌగోళిక పరిస్థితులనుబట్టి మొదట ఒక గుంపు మాటలై, తర్వాత రకరకాల రూపాలు తీర్చుకుని, మరొకరి మాటలనే భ్రాంతి కలగిస్తాయి. వాటి సంగతి మరొకమాట.

# ఆంధ్ర నాటక పితామహుడు

ఇంగ్లండులో పదిహేడో శతాబ్దిని ఒక విచిత్రం జరిగింది. నాటకాలను చూచి ప్రజలు పతితులైపోతారనే సచ్చింతతో ప్యూరిటనులు నాటకాలపై కత్తి కట్టారు. నాటక ప్రదర్శనాలకు అవకాశమిస్తే కదా ఈ చిక్కు అనే దూరాలోచనతో రంగస్థలాలను మూసివేశారు.

భారతవర్ష స్మృతికారులూ ఆ ప్యూరిటనులకన్నా రెండాకులు ఎక్కువ చదివినవారే. 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' (కావ్యాలను విసర్జించాలి) అని శాసించారు, నటులను పంక్తి బాహ్యులను చేశారు. అయినా, "కింతు ప్రథమ నాట్యావసర క్రమ ప్రవృత్త విరించి వచన ప్రవర్తక భరతముని శాసనాను వర్తి శిష్య పరంపరా పరిచయాతాద్యతన కాలావధి మహానట జనస్వక ప్రవృత్తి విశేషోపదేశపరం" అని అభినవగుప్తాచార్యుడన్నట్లు నాటక కళ భరతముని కాలంనుంచి నేటిదాకా నిరంతరాయంగా సాగుతూనే ఉంది. ఒక్క నాటక కళే కాదు; ఏ కళయినా మానవ జీవితంలో రంగరించుకొని పోవడమే దీనికి కారణం.

సంస్కృత నాటకాల, నటుల దుస్థితే అలా ఉండగా, తెలుగు సంగతి వేరే చెప్పాలా? దేశినాటకాలు వెయ్యేండ్లకు పైగా మనకు ఉన్నా, వాటిని మన పండితులు ఆదరించలేదు. యక్షగానం మొదలయినవి శ్రీగదితంవంటి ఉపరూపక భేదాలయినా పండితుల కృపాదృష్టి పడలేదు తంజావూరు రాజుల కాలం వరకును. సర్వజ్ఞ సింగభూపతి, పెదకోమటి వేమారెడ్డి తమ లక్షణ గ్రంథాలలో, వాటి వ్యాఖ్యానాలలో దేశి నాట్యగతులు నిర్వచించినా, నాటక విషయం ఎందుకో తడవలేదు. దేశి నాటకాలు వివిధ రీతులలో ఉన్నా పైవారు మెచ్చలేదు.

మరొక వింతేమిటంటే, విద్ధసాలభంజిక వంటి రమణీయ నాటికను, కాళిదాసు శాకుంతలంవంటి నాటకాన్ని ప్రబంధాలుగా పిండికొట్టిన రోజులవి. దేశి నాటకాలను నేటిలాగ చదువు సందెలు, సంస్కారం లేనివారే ప్రచారం చేసేవారు. కనుకనే ఆయా కులాల పేరుతో అవి వ్యాప్తిచెందాయి—గొల్లసుద్దులు, యానాది భాగవతాలు, జంగంకథలు అనేవిధంగా. ఆ దేశినాటకాల పరిపాటిని తాము నాటకాలు రచిస్తే, వాటికి సాహిత్య గౌరవం వుండదనే అనుమానం

అప్పటి కవులకు కలిగి ఉంటుంది కనుక. సంస్కృత నాటకాలనూ కావ్యాలుగా కల్పం చేశారు. కేయూర బాహుచరిత్ర పీఠికలో కృతిపతి "సేయుము నీవాంధ్ర కావ్యశిల్పము మెఱయన్" అని విద్ధసాలభంజికను కావ్యంగా వ్రాయమనినట్లు తెలిపే వాక్యమే అప్పటివారి చిత్తవృత్తికి తార్కాణ.

ఈ ముసురు 19 వ శతాబ్దంవరకు ఉండనే ఉంది. ఈ వాతావరణంలో 1858 లో అవతరించారు శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులువారు. "ఆంధ్రభాష నాటకమున కెత్తినదికాదు," అన్న ప్రవాదం అప్పుడుండేది. ఆ ప్రవాదం ఆయన గుండెల్లో బల్లెమై నాటింది. అంతకుముందు సంస్కృత నాటకాలకు కొన్ని ఆంధ్రీకరణాలో, 'తేట గీతమందె దీనిని వ్రాయంగ మంచిదంచు దోచె మదిని నాకు' అని శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు గీతములలోనే వ్రాసిన నందక రాజ్యము, అంతకు ముందు శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు వ్రాసిన 'మంజరీ మధుకర' మనే మురారి అనర్ఘ రాఘవం తలపించే ప్రబంధ ధోరణి నాటకము లేకపోలేదు. కాని పాశ్చాత్య ప్రభావంలో నూతన పద్ధతిని నాటకాలు లేవు. "ఒక భాషనుండి మరియొక భాషను వ్రాయుచో గల పారతంత్ర్యములకు బహుపదార్థ నిర్బంధములకు నెల్ల నోర్చిన యా నాటకములే యానందజనకములై యుండ నూతన పథమున గల్పించిన స్వతంత్ర నాటకము లానందజనకము లేల కావు?" అని ఆయన మనస్సులో చెలరేగిన ప్రశ్న. ఆయన మేధా హృదయాల మూసల్లో పడి విచిత్ర రూపాలలో 'చిత్రనళీయం'గా అవతరించింది. అది ఆయనకే కాక ఆంధ్రజాతికే తొలినాటకంగా తలయెత్తింది. నాటినుంచి ఆయన జీవితమంతా ప్రాచ్య ప్రాశ్చాత్య నాటకరీతుల పరిమళాలు, కొత్త పాతల మేలి కలయికలు గుబాళించే నాటకాలు గుస్తరించి, తెలుగు తల్లి ఒడి నింపారు.

చిత్రనళీయం రచితమైంది ఆయన 20 వ ఏట 1886 లో. అంతకు ముందున్న నాటకాలు సమగ్రమైనవి కావనే నమ్మకం ఉన్నందునే "సరస వినోదినీ సభ యుద్భవించి చిత్రనళీయము రచించు వరకు నీ భాషయందు స్వతంత్రనాటకము లుండలేదు" అని ఆయన అన్నారు.

ఈ సరస వినోదినీ సభ నాటక సంఘం చరిత్ర కూడ విశిష్టమైందే. ఆచార్యులవారు ప్రాచ్య పాశ్చాత్య నాటక పద్ధతులను సమ్మేళనం చేసే అభిప్రాయం ఉన్నవారు కావడంవల్ల, తాము రచించిన నాటకాలను తామే అభినయించవలసిన భారం పూనినవారు కావడంవల్ల నాటక సమాజం స్వయంగా స్థాపించవలసివచ్చింది. నిజానికి నాటక రచన ఒకయెత్తు, నాటక ప్రదర్శనం మరొకయెత్తు. "నూతనముగా జరుపబూనిన యే కార్యమును గాని దూషించువారు పెక్కండ్రు. అట్టి దూషణమునకు భయపడిన నొక్క కార్యమును కాజాలదు.

"అన్న వజ్రసంకల్పంతో 'చిత్రనటీయం'తో సరసవినోదినీ సభను అవతరింప జేశారు. రంగులు పూసుకొని, నాటక రంగానికి రంగులు దిద్దారు. ఈ సభస్థాపన నాడు మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు ఆశువుగా ప్రశంసాపద్యాలు చదివారట.

ఆచార్యుల వారి జీవితం సంగ్రహంగా తెలుపుతాను. ఆయన అనంత పురం జిల్లా తాడిపత్రి తాలూకాలో జన్మించారు. వీరి తండ్రి బళ్ళారిలో వార్డ్లా కాలేజిలో ఆంధ్ర పండితులు. ఆచార్యులవారు తండ్రి కడనే ఆంధ్ర, సంస్కృత, కర్ణాట భాషలు నేర్చారు. ఇంగ్లీషులో ఎఫ్.ఏ. అయ్యారు. చిన్నతనంలోనే అష్టావ ధానాలు జరిపి కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి మన్ననలు పొందారు.

చదువు తర్వాత ఆదవాని తాలూక కచేరిలో కొన్నాళ్ళు గుమాస్తా పని చేశారు. అది సరిగా గడవక బళ్ళారి కంటోన్మెంటు మేజిస్ట్రేటు కోర్టులో ప్రైవేటు వకీలుగా పనిచేసి, ఫస్టుగ్రేడు ప్లీడరు పరీక్షలో ఉత్తీర్ణులై ప్రభుత్వ న్యాయవాదిగా వాసి కెక్కారు. దానితో వారి దరిద్రం వదిలింది.

1910 లో గద్వాల సంస్థానాధిపతి గద్వాలలో గొప్ప పండిత పరిషత్తు జరిపి, ఆయనను 'ఆంధ్రనాటక పితామహ' బిరుదంతో గౌరవించాడు. పుర ప్రముఖులు రత్నఖచిత కిరీటం బహూకరించారు.

1912 నవంబరులో ఆయన అకాలమృత్యువు వాతపడ్డారు. ఆ విషయాన్ని బాగా తెలిసిన శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిగారు ఇలా తెలిపారు :

"అది 1912వ సంవత్సరము నవంబరు 30 వ తేదీ. ఆనాడు తోటి సరసవినోదినీ సభవారు ఒక నాటకమును ప్రదర్శించుచుండిరి. ప్రదర్శన మతి విజృంభణముగా సాగిపోవుచుండెను. నాటకశాల ప్రేక్షక జన సమూహముచే క్రిక్కిరియుచుండెను. కాని నాటక మధ్యమున నున్నటులుండి యొక పిడుగువంటి వార్త నాటకశాల కందెను. ప్రదర్శనము నిలిపివేయబడెను. ఆ సభాధ్యక్షుడు 'ప్రేక్షక జనసమూహమునకు 'ఒక అభియోగము నిమిత్తము ఆలూరున కరిగి యుండిన ఆచార్యులువారు ఆనాటి సాయంకాలము సబ్ మేజిస్ట్రేటు కోర్టు ఆవరణములో పడి అకస్మాత్తుగా పరమపదించిరి.' అని తెలిపెను. అప్పుడా ప్రేక్షకుల మనోభావ మెట్లుండెనో, యేమే మనుకొనుచు వారు నాటకశాలను వీడిరో వ్రాయ యత్నించుటకంటే ఊహింప విడుచుటయే సమంజసము. మరునాడు ఆచార్యులవారి భౌతిక శరీరము బళ్ళారికి తేబడెను. ఆ సాయంకాల మతి వైభవ ముతో నొక ప్రక్కను, దుఃఖాశ్రువుల దోగుచు నొక్క ప్రక్కను పౌరులు దానికి అంత్యక్రియా కలాపముల జరిపిరి." (పరిశోధన-ఆంధ్రనాటక పితామహ స్మారక సంచిక.)

అచార్యులవారు మొదట రచన సాగించింది కన్నడ భాషలో. ఉపేంద్ర విజయం, స్వప్నావిరుద్ధం మొదటి కన్నడ నాటకాలు. తెనుగులో మొదటిది చిత్రనళీయం. పిదప అచ్చయిన నాటకాలు; పాదుకాపట్టాభిషేకం, ప్రహ్లాద నాటకం, సావిత్రీ చిత్రాశ్వం, మోహినీ రుక్మాంగద, విషాద సారంగధర, బృహన్నల, ప్రమీలార్జునీయం, పాంచాలీ స్వయంవరం, చిరకారి, ముక్తావళి, రోషనారా-శివాజి, వరూధిని, అభిజ్ఞాన మణిమంతం (మొత్తం పద్నాలుగు). అచ్చుకానివి: ఉషా పరిణయం, సుశీలా జయపాలీయం, అజామిళీయం, యుధిష్ఠిర యౌవ రాజ్యం, సీతా స్వయంవరం, ఘోషయాత్ర, మదన విలాసం, ఉన్మాద రాఘవ ప్రేక్షణికం, రాజ్యాభిషేకం, సుగ్రీవ పట్టాభిషేకం, విభీషణ పట్టాభిషేకం, హరిశ్చంద్ర, గిరిజా కళ్యాణం, ఉదాన కళ్యాణం, ఇంగ్లీషు హరిశ్చంద్ర.

ఆయన నాటకాలు సహృదయుల, ప్రేక్షకుల మనస్సును చూరగొనడానికి కారణాలు సంగ్రహంగా ఇవి :

1. ప్రఖ్యాతమైన ఇతివృత్తి. కొద్ది మార్పులు మాత్రమే చేసేవారు.
2. సమకాలిక విషయాలు చొప్పించడం.
3. రసపోషణ.
4. సుస్పష్టరేఖలతో పాత్రలు తీర్చడం.
5. అసదృశంగా మానవ చిత్తవృత్తిని నిరూపించడం.
6. సన్నివేశాల కల్పన. ఆచార్యులవారి సన్నివేశ కల్పన, పానుగంటి వారి సంవాదం, తిరుపతి కవుల తీరైన పద్యాలు పేరు పొందాయని ఒక విమర్శకు డన్నాడు.
7. నిపుణంగా నాటకారంభం.
8. సరళమైన శైలి.
9. పాత్రల స్వభావోన్మీలనంలో వివిధ రీతులు.
10. అన్నిటికన్నా మించి ఆయన నటుడు కావటం.

కొందరు చెపుతున్న లోపాలివి :

1. బీజం మొదలు ఫలాగమం వరకు క్రమ పరిణామం లేదు.
2. పద్యగేయాలలో భావపౌనరుక్త్యం.
3. ప్రధాన పాత్రలలో క్రియాశూన్యత.
4. స్త్రీ పాత్రల ప్రాధాన్యం.
5. రాజకుటుంబాల ఇతివృత్తం. సామాన్య మానవులది లేదు.
6. ప్రబంధ ధోరణి.
7. భావ గాంభీర్యం లేని పదాలు.

8. విపరీతమైన ఉపన్యాస ధోరణి.

9. ప్రాచ్య సంప్రదాయాల పరిహరణ.

ఆయన నాటకాలపై పాశ్చాత్య ప్రభావం ఉన్నదన్నాను కదా! దానిని కొద్దిగా వివరిస్తాను. ప్రస్తావన, భరతవాక్యం, విష్కంభం మొదలయిన ప్రాచ్య నాటక రీతులను వదలిపెట్టారు విషాదాంత కథలను నిర్మించారు.

మొదట్లో వ్రాసిన నాటకాలలో పాత పద్ధతిలో ప్రస్తావన సాగించినా, బృహన్నల, ప్రమీలార్జునీయ నాటకాలలో మొదట ఒక పద్యం వ్రాసి ప్రస్తావన అన్నారు. ముక్తావళి నాటకంలోను ఇలాగే చేశారు.

పూర్వరంగమనే నూతన ప్రక్రియను అవలంబించారు. ఇది సంస్కృతాలంకారికులు చెప్పిన పూర్వరంగం కాదు. ఈ పూర్వరంగంలో నాటకంలోని ప్రధాన పాత్ర చర్యను సమర్థించడం ముఖ్యం. సారంగధర నాటకంలో చిత్రాంగిచర్యను, పాదుకాపట్టాభిషేకంలో కైకేయి చర్యను సమర్థించారు. ఇది ప్రోలోగ్ అనే పాశ్చాత్య నాటక ప్రక్రియకు అనుసరణమే.

ఉత్తర రంగం : ఇదికూడా ఆంగ్లపద్ధతే. ఇది ఎపిలోగ్ అని షేక్స్పియర్ తన నాటకాలు కొన్నింటిలో అవలంబించిన పద్ధతికి అనుసరణ కావచ్చు. ఇది నాటకంలోని నీతిని ప్రేక్షకులకు తెలుపడానికి ఉద్దేశించినది.

రంగ విభజన : సంస్కృత నాటకకర్తలవలె అంకాలుగా గాక ఈయన తన నాటకేతివృత్తాన్ని రంగాలుగా విభజించారు.

విషాదాంతం : విషాదాంతానికి శ్రీకారం చుట్టినదీ ఆచార్యులవారే. ''మంగళాదీని, మంగళమధ్యాని. మంగళాంతాని ప్రథంతే కావ్యాని" అని మన సంప్రదాయం. అంతటా మంగళమయం. భారత రామాయణాలు కరుణరస ప్రధానమైనవైనా పట్టాభిషేకాంతాలు. కాని పాశ్చాత్యధోరణి ప్రాభవంతో ఆచార్యులవారు విషాదాంతానికి పూనుకున్నారు. వీరి విషాద సారంగధర నాటకాలన్నిటికి మకుటాయమానం.

ఈ సారంగధర కథవంటివి ప్రతి దేశభాశభాషలలోను ఉన్నాయి. మానవ స్వభావానికి ఎక్కడనైనా సామ్యం వుంటుంది. ఈ కథ మాళవ దేశంలోని మాంధాత పురంలో జరిగినట్లు గౌరవ నవనాథ చరిత్రలోను, రాజమహేంద్రవరంలో జరిగినట్టు ద్విపద బాలభాగవతకర్త (1560) వ్రాశారు. చేమకూర వేంకటకవి, కూచిమంచి తిమ్మకవి బాలభారతాన్నే అనుసరించారు.

నేటి హంపి సమీపములోని కంపిలి-కాంపిల్య నగరంలో ఇది జరిగిందని, కాకతీయులకు సమకాలికులైన కంపిలి రాయుడనే రాజుకు కుమారుడైన కుమార రాముడే కాలు సేతులు నరుకబడిన సారంగధరుడని కీర్తిశేషులు శ్రీ ప్రతాపరెడ్డిగారన్నారు. హంపిలో చిత్రాంగి, రత్నాంగి మేడలు నేటికీ నిలిచి వున్నాయి.

పంజాబులో పూరణ్ భగత్ చరిత్ర అచ్చం ఇలాటిదే. ఇది జలంధర్‌లో జరిగినట్టు జానపదగాథలు హీర్ అనే వృత్తంలో ఉన్నాయి. కాని, కాళ్ళుచేతులు నరకబడినట్టు లేదు.

విషాద సారంగధర నాటకోద్దేశం 'ఈడుగాని వివాహమిది కారణంబు, జోడుచాలని పెండ్లి శుద్ధాపరాధము' అని చెప్పడమే.

సాహిత్యంలో ఇంతటి ఉదాత్తదృష్టి కలవారు, నిత్యజీవితంలోను ఉదార దృష్టి కలవారు కాకపోతారా! అయనకు కొంచెము ముందుగానే పుట్టి ఆయనతో పెరిగిన జాతీయోద్యమ ప్రభావం ఆయనపై ప్రసరించింది. కాంగ్రెస్ మహా సభలలో పాల్గొన్నారు. సూరత్ కాంగ్రెస్ మహాసభకు వెళ్ళివచ్చిన పిదప "పీపుల్సు అసోసియేషన్" (ప్రజాసంఘం) స్థాపించారు. మహిళల దుర్దశకు దురపిల్లినారు. పేదల పాట్లకు వేదన పడినారు. ఆయన నాటకాలలో అభ్యుదయ భావాల అణిముత్యాలు వేనకు వేలు. గాంధీజీకి తర్వాత తోచిన "ఉప్పు సత్యాగ్రహం" ఆయన మనస్సులో అభిజ్ఞాన మణిమంతనాటక రచనా కాలానికే మెరిసింది. దానిలో ఉప్పుపై పన్ను ఖండించారు. పాంచాలీ స్వయంవర నాటకంలో విదేశ వస్త్రాల దిగుమతి వలదన్నారు. ఆయన క్రాంత దర్శిత్వం.

ఆయన స్వభావం ఎటువంటిదో ఆయన మూడవ కుమారుడు, శ్రీ బళ్ళారి రాఘవ అల్లుడు, సుప్రసిద్ధ న్యాయవాది శ్రీ ధర్మవరం వేణుగోపాలాచార్యుల మాటలలోనే వినండి!

"మా తండ్రిగారి జీవితంలోని కొన్ని ఘట్టాలు ఇప్పటికిని నా మనస్సు నుంచి మరుగై పోవడం లేదు. వారు పరమపదించే టప్పటికి నా వయస్సు పన్నెండేండ్లు అయినప్పటికీ, వారి సంగతులు కొన్ని నా స్మృతిపథంలో శాశ్వతంగా ఉండిపోయాయి.

"పిల్లలంటే వారికి ప్రాణం. పిల్లలతో వారు ఎప్పుడూ సంతోషంతో వుత్సాహంతో ముచ్చట్లాడేవారు. నాకు ఇంకా తొమ్మిదేళ్ళు నిండలేదేమో! వారు నన్ను, నా తోటిపిల్లలను తెల్లవారుజామున నాలుగున్నరగంటలకే లేపి, అమరం సంత చెప్పేవారు. అంత తెల్లవారే లేవడం మాకు కష్టంగానే వుండేది. కాని, అరగంట ముప్పావుగంట గడిచిన తర్వాత అమరం సంత చెప్పుతూ దేవతల పేర్లు వచ్చినప్పుడల్లా ఆ కథలు చెప్పుతూ వుంటే, నిద్రమత్తు మంచు తెరలవలె విడిపోయి సంతోషంతో చెవులు అప్పగించి వింటూ, అమర శ్లోకాలు వల్లిస్తూ వుండేవారం.

"డబ్బంటే వారికి లెక్కేలేదు. వారు నాటకాల కోసం డబ్బు మంచినీళ్ళ వలె వెచ్చించినప్పుడు ఒకసారి మా అమ్మ ఏడవడం, సాపాటు మానివేయడం నాకు బాగా జ్ఞాపకం. మా యిల్లు ఎప్పుడూ పెండ్లి యింటివలె వుండేది. పెట్టు

పోతలంటే మా తండ్రిగారికి పండుగ; వచ్చేవారు, పోయేవారు. ఇద్దరు వంట వాళ్ళున్నట్లు నాకు గుర్తు. ఒకడేమో అతిథుల వంటవార్పులకు; మరొకడేమో తండ్రిగారు పొరుగూళ్ళకు పోయినప్పుడు వెంట వుండడానికి.........అప్పట్లో ఒక్కసారి మా నాయనగారు ఆంధ్రసాహిత్య పరిషత్తు జరిపారు. ఆంధ్రదేశం లోని కవులందరూ ఆ పరిషత్తుకు విచ్చేశారు......మా నాయనగారి సంఘ సంస్కార సౌరభం నాటకాలలో అక్కడక్కడ గుమగుమలాడుతూనే వున్నది. 'ప్రమీల నాటకంలో వారు స్త్రీల హక్కులకోసం గట్టిగా వాదించారు. "సుతుల గాంచుటకంటె సతులకు నింకొక్క, పనిలేదనెడు మహా ప్రభువులార." అని వారు పురుషులపై విసుర్లు విసిరారు. పాంచాలి నాటకంలో రజస్వలానంతర వివాహాలు అత్యవసరమని ఒక పాత్రతో అనిపించారు.

"ఆయన మహానటుడు. ఆయన ఖ్యాతికి అదికూడా ఒక ఉపాదాన కారణం. ఆయన తన నాటకాల ప్రదర్శనకు తనే ఒక నటబృందం సిద్ధపరచేవారు. దాని కొక సంఘం నెలకొల్పారు. అదే సరస వినోదినీ సభ. ఆయన దశరథ, బాహుక, రాజరాజ నరేంద్రాది పాత్రలు నిర్వహించేవారు. వారి నటనను చూచిన డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగారు చెప్పిన విషయాలిచ్చట పొందుపరుస్తు న్నాము :

"1904 లోనో 1905 లోనో ధర్మవరము కృష్ణమాచార్యులుగారు దశ రథుని పాత్ర నటిస్తూండగా చూచినాను. అతని నటన ఎంత సహజముగాను, ఆకర్షణీయముగాను వుండెనో ఒక ముచ్చటవలన గ్రహింపవచ్చును. ప్రేక్షకు లలో వారి మిత్రుడొకడు కూర్చుండి యుండెను. అది నాటకము అన్ననీ, అందు కృష్ణమాచార్యులు నటుడుగా దశరథుని మరణావస్థ నటిస్తున్నాడనిన్ని ఎరిగి యుండిన్నీ అతని నటనవల్ల ముగ్ధుడై 'అయ్యో కృష్ణమాచారీ!!' అని బిగ్గరగా విలపించినాడు వాస్తవముగా అతడు చనిపోతూ వున్నట్టుగానే భావించుకున్నాడు." (పరిశోధన ఆం.నా. పి. సంస్మరణ సంచిక).

వారు నటనలో శిష్యులకిచ్చే శిక్షణ అపూర్వం. శిక్షణలేని నటులు నేడు చేస్తున్న వికార చేష్టలకు లెక్క లేదు. గయోపాఖ్యానంలో కృష్ణ వేషధారి అయిన ఒక నటుడు "గయుడా భయము లేదు!" అనటోయి "భయుడా, గయము లేదు" అని సభాకంపం చూపగా అందరూ విరగబడి నవ్వారట. మరొక నటుడు "ఓరి పాకశాసనా!" అనడానికి చేతితో పాకను చూపాడట. ఇలాటి అవక తవకలు ఆచార్యులవారి నటసమాజంలో సుగ్రీవాజ్ఞ. అందరికీ వారే శిక్షణ ఇచ్చే వారట. రిహార్సల్స్‌లో క్రమశిక్షణ తప్పేవారు కారు. తాము చెప్పినదాని కన్నా మించి వంకర టింకరగా స్వంత కవిత్వం పెడితే వారు సహించేవారు కాదట. మందర వేషం వేసిన నాగేశశాస్త్రి అనే కుర్రవాడు తన వాచికంలో కొంత

భాగం మరచిపోయి స్వంత కవిత్వం కట్టాడట. దానితో ఆచార్యులుగారు మండి పడి ఆ రంగం ముగియగానే, ఆ కుర్రవాణ్ని పిలిచి, చెంపలు వాయించారట. ఇలాంటిపని ఇక ముందు చేస్తే తరిమివేస్తానని బెదిరించారట.

ఆయన ఉదార హృదయానికి మరొక నిదర్శనం చూపుతాను. తమిళ నాటక పితామహుడనదగిన పద్మశ్రీ సంబంధ ముదలియార్‌గారు చెప్పిన అంశాలిట వుదహరిస్తాను. ఈయన ఆచార్యులవారిని గురువులుగా భావించేవారు.

"ఆచార్యులవారి గుణాతిశయం గురించి ఎంతైనా వ్రాయవచ్చు. అసూయ అనేది మానవ స్వభావం. ఇది పండితులలో అధికం. ఒక పండితుడు మరొక పండితుని ఓర్వడు. ఆచార్యులవారితో నేను పదారు పదేడు సంవత్సరాలు కలసి వున్నాను. ఈర్ష్య కొంచెమన్నా నా కంట బడలేదు. నేను సారంగధర నాటకంలో చేసిన మార్పును ఒప్పినారు. మీ మార్పు ఒప్పినాను. మార్చిన తరువాత మీరు చేసిన ముగింపు చాల శ్లాఘనీయమైనది. ఒప్పినాను' అన్నారు సంతోషంతో. ఇటువంటి ఉదారగుణం లోకంలో అరుదు. ఇంత వ్రాసినా నాకు అసూయ బొత్తిగాలేదని అనలేను....ఈ సందర్భంలో మరొక సంగతి చెప్పవలసివుంది. సరస వినోదినీ సభలో చీలికలు కలిగినప్పుడు, బళ్ళారి తెలుగు, నెల్లూరి తెలుగు అనే వాదం బయలు దేరినప్పుడు ఆచార్యులుగారు నోరు విప్పలేదు. ఇంతటి సహనం, నిర్మలత్వం పొగడవలసిన గుణాలు.

"వారు సహృదయ సులభులు. నాటకాల విషయంలో ఎవరు ఏ సంగతి ఎప్పుడు అడిగినా వెంటనే సలహా ఇచ్చేవారు. వారి సరసత, సులభత ఎంతటి వంటే, 'స్వామీ! ఆనాడు నాటకంలో జంజూటిలో ఇప్పుడు పాడండి' అనగానే క్షణంలో గొంతు సవరించుకొని ఎంతో ఉత్సాహంతో పాటకు పూనుకునేటంతటివి. వయసులో, యోగ్యతలో, సంపాదనలో అంత పెద్దవాడు అంత సులభుడుగా ఉండటం నేను నా జీవితంలో మరెక్కడా చూడలేదు. వారిని నేను గురువుగా భావించడం వ్యర్థంగా పోలేదు." (పరిశోధన - ఆంధ్ర నాటక పితామహ సంచిక).

ఆయన పవిత్ర స్మృతికి గౌరవంగా బళ్ళారి మునిసిపాలిటీవారు ఒక వీథికి 'కృష్ణమాచారి వీథి' అని పేరు పెట్టారు. ప్రభుత్వంవారు ఒక పోస్టాఫీసు పెట్టారు.

ఆయన మహా కవి కూడా. ఆయన నాటకాలలో చూడడానికే కాదు: చదివి ఆనందించడానికి చాలినంత సామగ్రి వుంది. సమయ స్ఫూర్తితో నిసర్గ మధురమైన సంభాషణలు, ప్రబంధ ధోరణిలో పరవళ్ళు తొక్కే పద్యాలు, కర్నాటక సంగీత ఫక్కీలో సాగిపోయే గేయాలు ఆయన నాటకాలకు అమూల్యా లంకారాలు.

# అమరావతి ఆదర్శంగా అందాలు దిద్దుకున్న ఆగ్నేయ ఆసియా

ఆచార్య నీలకంఠశాస్త్రిగారు అన్నట్లు భారతవర్షంలోనే కాక ఆసియా అంతటా తత్త్వజిజ్ఞాస, మతతృష్ణ ముమ్మరంగా ఉన్న సమయంలో సిద్ధార్థుడు అవతరించాడు. అనంతకాలాలకు అపూర్వమైన వ్యక్తిత్వం, సరళం, సర్వజనీనం అయిన నైతిక జీవనసిద్ధాంతం తథాగతుడు ప్రపంచానికి ప్రసాదించిన రెండు వరాలు.

మారుని జయించిన మహాబలుని జీవితం, సామ్రాజ్యాన్ని కాలదన్నిన సర్వార్థసిద్ధుని త్యాగం, సత్యాహింసలచే అమృతం బలికించిన సమంతభద్రుని సుచరితం ఎవరిని ముగ్ధులను చేయవు? అయినప్పుడు, ఆసియా అతనిని ఆరాధించినదన్నా, అతని దివ్యచరిత్రతో ఆసియావరకు రాళ్ళు కరిగి కళగా పారినవన్నా ఆశ్చర్యమేముంది? ముఖ్యంగా ఆగ్నేయాసియాలోని బర్మా, మలయా, జావా, సుమాత్రాది దేశాలు భారతదేశ ప్రతిరూపులై, మూడు మూర్తులా మూస పోతలై తద్రూపం పొంది తన్మయం కావడంలో ఆశ్చర్యమేముంది?

భారతీయులు స్వీయధర్మ సంస్కృతి విస్తరణకు యత్నించినంతగా సామ్రాజ్య విస్తరణకు యత్నించలేదు. ఈ ధర్మ సంస్కృతి విస్తరణ కూడ కళలతో తత్త్వబోధతో జరిగిందిగాని కరకు కత్తులతో కపటంతో జరుగలేదు. రెండు సహస్రాబ్దాల నాడు పొంగులు వారిన భారతీయ సంస్కృతి త్రివిక్రముని లాగ మూడు అంగలు వేసి ఆసియా అంతా ఆక్రమించి, నవనవోత్తేజం కలిగించి, భ్రమరకీటక న్యాయంగా మార్చివేసింది. ఈ సంస్కృతి త్రివిక్రముని మొదటి పరిక్రమం కృష్ణవేణినుంచి ప్రారంభంకాగా. నాగార్జునాచార్యుడు నామరూపాలు తీర్చగా; అమరావతి అందాలు దిద్దింది.

ఈ విధంగా భారతీయ ధర్మ సామ్రాజ్యం ఇటు తూర్పున బర్మా, సయాం, మలయా, ఇండో-చైనా, ఇండోనీషియా, టిబెట్, మంగోలియా, మంచూరియా, చీనా, కొరియా, జపానులకు; అటు ఆఫ్ఘనిస్థాన్, పశ్చిమాసియా. మధ్య ఆసియాలకు బుద్ధునికి ముందు, తర్వాత కూడా విస్తరించింది. సముద్రయానం పై

నిషేధమన్నది లేని ఆకారంలో బేహారులు సప్త సముద్రాలూ దాటి వెళ్ళగా, సన్న్యాసులు, భిక్షువులు కొండలు గుట్టలు ఎడారులుదాటి వెళ్ళారు. బేహారులు మన సరకులను విదేశాల సరకులతో వినిమయం చేసుకోగా, సన్న్యాసులు, భిక్షువులు ప్రజలు తరించి పుణ్యలోకాలు చేరడంకోసం తమ ధర్మాన్ని విదేశీయులకు ఉపదేశించారు. భారత గృహపతులు (శ్రేష్ఠులు) విదేశాలలో నిగమాలు (వర్తక సంఘాలు) స్థాపించుకొన్నచోట స్వధర్మానుసారం మందిరాలు, విహారాలు నెలకొల్పుకున్నారు. ఈ నిగమాలద్వారా, సంఘాలద్వారా, విదేశాలలో భారత సంస్కృతి అల్లిబిల్లిగా అల్లుకుంది. నైగములు (వర్తకులు) రాజానుగ్రహ పాత్రులయేవారు. ధర్మ ప్రచారకులు ప్రజానుగ్రహం సంపాదించారు. ఈ విధంగా వాణిజ్య సంస్కృతులు ఒకదాని సరసన మరొకటి అల్లుకొంటూ పోయాయి దీంతో భారతీయులు అడుగుపెట్టిన చోటెల్లా భారతీయ జీవితవిధానం వేళ్ళు తన్నింది.

## లంకకు లావణ్యం తెచ్చిన సంస్కృతి

ఆగ్నేయాసియా దేశాలలో భారత సంస్కృతిని, ముఖ్యంగా బౌద్ధ సంస్కృతిని ఆకళించుకొనడం లంకతో ప్రారంభిద్దాం.

లంకాద్వీపాన్ని సరిత్పతి తన తరంగ హస్తాలతో వేరుచేసినా నిజానికది భారతదేశంలోని చెక్కే. ప్రాగైతిహాసిక కాలంనుంచి, రామాయణ కాలంనుంచి-మనకూ దానికీ అవినాభావ సంబంధం ఉంది. ఈ సంబంధాన్ని దేవానాం ప్రియుడు - అశోకచక్రవర్తి - పునర్నవం చేశాడు. తథాగతుని తథ్యమార్గాన్ని, సందేశాన్ని బోధిద్రుమ శాఖతోపాటు తన సోదరుడు మహేంద్రునితోను, సోదరి సంఘమిత్రతోను లంకకు పంపాడు. అప్పటి లంకాధిపతి తిస్సుడు ఆ అర్హంతులకు స్వాగతమిచ్చి బౌద్ధ ధర్మ దీక్షితుడయాడు. అతని రాజధాని అయిన అనూరాధపురం తథాగతుని దివ్య లీలలు చెక్కిన సుందర శిల్పాలతో నేటికీ రమణీయంగా కనిపిస్తుంది. ఇప్పటికి రెండువేల యేండ్లక్రిందే లంకాధిపతి కట్టగామణి అభయగిరిలో మహా విహారం నిర్మించాడు బుద్ధుడు ఉపదేశించిన హీనయానం పాతుకున్నది లంకలోనే. అది అక్కడనుంచి బర్మా సయాములకు ప్రాకింది.

## బర్మాను ముంచెత్తిన బౌద్ధం

ఆగ్నేయాసియాలోని పెక్కుదేశాల ప్రజా జీవితాన్ని ఇటునుంచి భారతదేశం, అటునుంచి చీనా ప్రభావితం చేశాయి. బర్మా తూర్పు దేశాలకు సింహద్వారం. తూర్పు ఆసియాకు స్థలమార్గం అస్సాం బర్మాల మీదుగానే. బర్మాతో భారతీయ సంబంధం రెండు సహస్రాబ్దాలకు ముందునుంచే ఉంది. బౌద్ధంకూడా అట్టి

ప్రాచీనకాలంలోనే బర్మాలో ప్రవేశించింది. క్రీస్తుశకం 5 వ శతాబ్దంలో బుద్ధఘోషుడు లంకనుంచి హీనయాన బౌద్ధాన్ని బర్మాకు తెచ్చాడంటారు. కాని, చీనా చరిత్ర మాత్రం అంతకుముందే బార్మాలో బౌద్ధం ఉందని ఘోషిస్తున్నది. బుద్ధఘోషునికి ముందే మహాయాన బ్రహ్మయాన సంప్రదాయాలు వ్యాపించాయట. తర్వాత క్రమంగా వజ్రయానం, వైదికమతం. దానితోపాటు ధర్మశాస్త్రం మున్నగునవి భారతదేశం నుంచి వ్యాపించాయి. తుదకు సంస్కృత ప్రాకృతాల ప్రభావం బర్మాభాషపై పడి పెక్కుపదాలు దానిలో చేరిపోయాయి.

కాని 11వ శతాబ్ది ఆరంభంలో బర్మా ప్రజలలో జాతీయత తలయెత్తింది. అనవ్రతుడనే రాజు పాలనలో హీనయానం మరల విజృంభించి, మహాయానాన్ని త్రోసిరాజన్నది. పాలీ మాతభాష అయింది. అనవ్రతుడు గొప్పవిజేత — సంస్కర్త. భారతీయ లిపికి మారు బర్మా లిపిని ప్రవేశపెట్టాడు. బౌద్ధ గ్రంథాలను బర్మాభాషలోకి అనువదింపజేశాడు. దీనితోపాటు కళా పునరుజ్జీవనం కూడా ప్రారంభమై పెక్కు సుందరమందిరాలు వెలశాయి. అతడు తన రాజధాని పగాన్‌లో (పెగూలో) ఆనందమందిరమనే విహారం అతి సుందరంగా నిర్మించాడు. పగాన్ ఆనాడు బౌద్ధుల కేంద్రం. ముస్లిములకు భయపడి భారతదేశంలోని నలందా మున్నగు కేంద్రాలనుంచి పలువురు బౌద్ధ భిక్షువులు, విద్వాంసులు పగాన్‌కు వచ్చి తలదాచుకున్నారట. పగాన్ రాజ్యకాలం బౌద్ధానికి బర్మాలో స్వర్ణయుగం. పగాన్ ఇరావదీనది ముఖద్వారంలో ఉన్నందున గుప్తుల కాలం నుండే భారతదేశానికీ, బర్మాకూ సముద్రమార్గంగా రాకపోక లుండేవి. 12వ శతాబ్ది ఆఖరులో హిలోమినో అనే రాజు బుద్ధగయలోని మందిరం నమూనాలో ఒక స్తూపం నిర్మించాడు. 13వ శతాబ్ది ఆఖరున కుబ్లైఖాన్ మనుమడు బర్మాను జయించగా, ఎగువ బర్మా చీనా సామ్రాజ్యంలో చేరిపోయింది. మరల 16వ శతాబ్దంలో బుయిన్‌నవుంగ్ అనే రాజుకాలంలో బర్మా ఏకీకృతమైంది. అప్పటి నుంచి నేటిదాక అక్కడ బౌద్ధమే ప్రధానమతం.

## సయాంపై బౌద్ధసంస్కృతి ప్రభావం

శ్యామదేశీయులు (సయాం దేశీయులు) తమ సోదరులైన కాంభోజులు (కాంబోడియావారి) నుంచి నాగరిక జీవితం నేర్చారు. సయాంలో బౌద్ధం ఎప్పుడు ప్రవేశించిందో చెప్పలేము. కాని 6వ శతాబ్దానికి సయాం అంతటా వైదిక సంస్కృతి గుబాళించింది. తర్వాత హీనయాన బౌద్ధం బర్మా, లంక, కాంభోజాలనుంచి సయాం చేరింది. 8వ శతాబ్దిలో హరి పుంజయ రాజ్యం బౌద్ధ రాజ్యం. మధ్య, దిగువ సయాంలో లవపురి రాజధానిగా ద్వారావతి రాజ్యం వెలిసింది. ఈ రాజ్యం 10వ శతాబ్దిదాక ఉంది. తర్వాత దీనిని కాంభోజులు

జయించారు. 13 వ శతాబ్ది తర్వాత చైనాలోని యూనాన్ రాష్ట్ర వాసులైన థాయ్ తెగవారు సయాంను ఆక్రమించుకొని పెక్కు చిన్న చిన్న రాజ్యాలు స్థాపించారు. ఇవి వైదిక బౌద్ధ రాజ్యాలయాయి. పాలకులకు వైదిక మత తత్త్వం పూర్తిగాపట్టింది. వారు చీనాలోని తమ మాతృభూమిని గాంధార మన్నారు; ఆ గాంధారంలోని ఒక భాగాన్ని విదేహమన్నారు. దాని రాజధానిని మిథిల అన్నారు. ఈ థాయ్ గాంధార రాజ్యం 13వ శతాబ్ది మధ్యదాక నిలిచింది తర్వాత కుబ్లైఖాన్ దీనిని జయించి చీనా సామ్రాజ్యంలో కలిపాడు. కాని థాయ్ తెగవారు యూనాన్ నుంచి దక్షిణంగా తరలి సయాం ఉత్తర భాగంలో 'సుఖో థాయి' అనే స్వతంత్ర్యరాజ్యం స్థాపించారు. ఈ రాజవంశంలో గొప్పరాజు ఖంబెంగ్, 14 వ శతాబ్దివాడు. ఇతని రాజ్యం దిగువ బర్మాలో కొంతవరకు వ్యాపించి ఉండేది. ఇతని నగరు ముందు ఒక పెద్దగంట వ్రేలాడేదట. కడుపులోపుండు, హృదయంలో బాధ కలిగించే తమ కష్టాలను చెప్పుకోగోరే వారు ఏ వేళయినా ఈ గంటను వాయించి రాజును దర్శించవచ్చు. రాజు ఫిర్యాదు విని వెంటనే తీర్పు చెబుతాడు. ఇతని మరణానంతరం మేనంనదీ తీరంలో అయుధ్య (అయోధ్య) అనే మరొక రాజ్యం స్థాపితమైంది. దీని రాజు రామ థిబోడి. దీనిని బర్మావారు ధ్వంసంచేయగా, 1767 నుంచి బాంగ్‌కాక్ రాజధాని అయింది. సయాం రాజులు నేటికీ తమ వైదిక సంస్కృతికీ, బౌద్ధ మతానికీ గర్వపడుతారు. భాషలో ప్రజాధిపక, రామేశ్వర, అయోధ్య, ఇంద్ర పురి, స్వర్గాలిక, విష్ణులోక, ధర్మరాజ, మహేంద్ర మున్నగు సంస్కృత పదాలు అవే అర్థాలలో చేరి నేటికీ నిలిచిఉన్నాయి. సయాం వర్ణమాలను రామ ఖంబెంగ్ అనే విద్వాంసుడు కనిపెట్టాడట. సయాం ప్రథమ నిఘంటువు పేరు "పథానుక్రమ."

బాంగ్‌కాక్ నిండా నేటికీ బౌద్ధ వైదిక విగ్రహాలు సుందర రూపంతో సాక్షాత్కారమిస్తాయి. ఈ శిల్పంలో అమరావతిచ్ఛాయలు, తర్వాత గుప్త పల్లవ సంప్రదాయం కనిపిస్తున్నవి.

## ఇండో - చైనాలో బౌద్ధ వైదికాలు

ఇండో-చైనా అంటే, కాంభోజం, లావోస్, చంపాల (కాంబోడియా లావోస్ అన్నాంల) సమామ్నాయం. ఇండో-చైనా భారత చీనా నాగరికతల సంగమస్థలి. భారతదేశం ఇండో-చైనాకు వైదిక బౌద్ధ మతాలను, కళలను ప్రసాదించింది. చీనా పరిపాలన పద్ధతిని, చట్టాలను కన్ఫ్యూషియస్ తత్త్వాన్ని ఇచ్చింది.

క్రీస్తు పూర్వం మొదటి శతాబ్ది నుంచి క్రీస్తుశకం రెండవ శతాబ్ది మధ్య వరకు ఆగ్నేయాసియాలో ఆరు భారతీయ సంస్కృతి కేంద్రాలు నెలకొన్నాయి. 1. దక్షిణ అన్నాంలో (కాంభోజ-చంపాలో) 2. మలయా దక్షిణ ప్రాంతాన 3. సుమాత్రాలోని పలంబాగ్‌లోయలో 4. మధ్య జావాలో, 5. తూర్పుబోర్నియోలో, 6. ఎగువ మలయాలోని ఖేడా నగరంలో. ఇవన్నీ వైదిక మతం వలసలే.

ప్రాచీన చంపారాజ్యం రెండవ శతాబ్దిలో స్థాపితమైంది. దీనినే కొచ్చిన్ చైనా అని అంటారు. దీని ఆదివాసులు పోలినీసియా తెగశాఖ వారయిన చెమ్ తెగవారు. వీరు వైదిక మతాన్ని స్వీకరించారు. భారతీయులు ఈ రాజ్యానికి "చంపా" అని నామకరణం చేశారు. మగధలో మరొక చంపారాజ్యం ఉంది గనుక హుఎన్‌త్సాంగ్ (చీనాయాత్రికుడు) దీనిని మహా చంపా అన్నాడు. శ్రీమారుడనేవాడు ఈ చంపారాజ్యం స్థాపించాడు. భారతీయుల ఆధిపత్యంలో చెమ్‌తెగవారు భారతీయ సంస్కృతిని స్వీకరించారు. ఈ భారతీయ రాజ్యం మొదట పాండురంగ, విజయ, కౌథార, అమరావతి అని నాలుగు భాగాలుగా విభక్తమయింది. వీటిని శ్రీమారుడు సమైక్యం చేశాడు. ఈ కాలంలో సంస్కృత భాషా సాహిత్యాలపట్ల ఆదరం హెచ్చింది. రజతం, సువర్ణం, స్థావరం, జంగమం వంటి సంస్కృత పదాలు పాతుకుపోయాయి. బౌద్ధం ఏడవ శతాబ్దికినిగాని చంపారాజ్యంలో వ్యాపించలేదు. చంపారాజులు భారతీయ రాజులవలె పండిత గోష్ఠులు జరిపేవారు. పట్టాభిషేకం కూడా వైదిక సంప్రదాయంగా నడిచేది.

ఉత్తర అన్నాంలో మాత్రం 3 వ శతాబ్దినే బౌద్ధం వ్యాపించింది. వేయి సంవత్సరాల వరకు బౌద్ధ ప్రభావం ఉంది. జన సంఖ్యలో 80% బౌద్ధులు. ప్రతి గ్రామంలోను విహారం, స్తూపం నిర్మించబడ్డాయి. పర్వతంపై కట్టిన హోంగ్ బిచ్ స్తూపం యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తున్నది.

## కాంభోజంలో

కాంభోజం మొదట దక్షిణ అన్నాంతోపాటు (చంపాతోపాటు) ప్యూనాన్ రాష్ట్రంలో భాగం. క్రీస్తుశకం తొలి శతాబ్దిలో భారతీయులు ఇక్కడ వలస ఏర్పరచారు. 5 వ శతాబ్దివరకు ఇది ప్యూనాన్‌లో భాగంగా ఉంది. 6 వ శతాబ్దంలో భారతీయ రాజవంశం రాజ్యం స్థాపించింది. మొదటి భారతీయరాజు కౌండిన్యుడు. ఇతడు అంతర్వాణి ప్రేరణతో రాజ్యం స్థాపించాడట. ఇతడు భారతీయ సంప్రదాయం ప్రకారం అంతా మార్చివేశాడట. ఇక్కడి ఖ్మేర్ జాతి వారికి తమ మూల పురుషుడు "కంబు స్వయంభువ" అనే రాజని విశ్వాసం. కంబు స్వయంభువ ఆర్యదేశం రాజని, కాంభోజానికి వచ్చి నాగరాజు కుమార్తెను

పెండ్లాడాడని, తాము కంబు సంతానమని, తమ దేశం కాంబుజమని వారి విశ్వాసం. ఈ రాజు కాలంలో కాంభోజమంతా దేవాలయాలతో, విహారాలతో, స్తూపాలతో, నిండిపోయింది. రామాయణ భారతాలు వారి ఆస్తి అయాయి.

9 వ శతాబ్దిలో కాంభోజాన్ని పాలించిన శ్రీ యశోవర్మ కాలంలోనే విశ్వవిఖ్యాతమైన అంగకోర్ థోం (దేవాలయం) నిర్మించబడినది. ఇది ఒక దేవాలయంకాదు. పెక్కు దేవాలయాల సమూహం. ఇది ఒక మహా నగరంగా కనిపిస్తుంది. గోడలపై శిల్పాలు, గోపురాలు, మున్నగువాటి రామణీయకం చెప్పనలవికాదు.

10 వ శతాబ్దిలో, రాజేంద్రవర్మ కాలంలో మహాయాన బౌద్ధం కాంభోజంలో వ్యాపించింది. బుద్ధ భగవానుడు జనలోకేశ్వర, ప్రజ్ఞా పారమిత, వజ్ర పాణి అనే పేర్లతో ఆరాధింపబడేవాడు. తర్వాత వైదికమతం ప్రబలి, సూర్య వర్మ అనేరాజు అంగకోర్‌వట్ నగరంలో గొప్ప విష్ణు మందిరం నిర్మించాడు. కాంభోజ కళాకారుల కైవాడానికి, వైదిక మత ప్రచారానికి ఈ మందిరం పరమసీమ. ఇది మొదటి అంగకోర్ థోం స్తూపానికి దక్షిణంగా నిర్మింప బడింది. దీని ఐదు ఉన్నతశిఖరాల కైవారం అరమైలు. దీని గోడలపై భారత రామాయణ గాథలు చెక్కబడ్డాయి.

ఈజిప్టు పిరమిడ్లుగాని, గోథిక్ వాస్తు శిల్పాలుగాని, బోరో బొదూర్ స్తూపంకాని అంగకోర్‌వట్ దేవాలయం గాంభీర్యానికీ, కళానైపుణ్యానికీ సాటి రావని విమర్శకు లంటారు.

అంగకోర్ థోమ్‌కు కంబుపురి అనికూడ నామాంతరం. ఇది తొమ్మిదవ శతాబ్దివరకు కంబోడియా రాజధానిగా ఉంది తర్వాత సయాంవారు దాడిచేసి ధ్వంసం చేశారు. ఈ నగర ద్వారాలపై ఐదు బుద్ధుని శిరస్సు శిల్పాలు పెద్దవి ఉండేవి. నగర మధ్యంలో స్వర్ణశిఖరం గల మందిరం. దాని ప్రధాన శిఖరం గల మందిరం, పిరమిడ్ ఆకారంలో ఉండేది.

కాంభోజ వాస్తుకళ మహోన్నతమైంది. ఇది గంభీరమైంది. అంగ కోర్ వట్ మందిరంలో పరాకాష్ఠ చెందింది. దీనికి సాటి ప్రపంచంలో మరొకటి లేదనే అనవచ్చు. దీనిముందు నిలుచుంటే చిత్తం చలిస్తుంది.

## మలయాలో మన మతాలు

మలయాకు రెండువేల సంవత్సరాల క్రితమే భారతీయులు వలస వచ్చారు. మలయా బంగారు, సుగంధ ద్రవ్యాలు, చందనం, కర్పూరం, సాంబ్రాణి మున్నగు అమూల్య పదార్థాలు భారతీయులను బాగా ఆకర్షించాయి. మలయాద్వీప సమామ్నాయ మంతటినీ మనవారు, సువర్ణ దీప మన్నారు.

తుమసిక్ అనే పేరును సింగపూర్ అని మార్చారు. లిపిని, సంఖ్యలను ఇచ్చి నాగరికులను చేశారు. వ్యాపారంతోపాటు మన మతాలు - శైవం, వైదికం, బౌద్ధం అక్కడికి వెళ్ళాయి. 4 వ శతాబ్దిలోనే కేడా అనే పట్టణంలో దేవాలయాలు స్థాపించి సంస్కృతంలో శాసనాలు వేయించారు. మధ్య ఆసియాలో శకులు, హూణులు, సైబీరియా బంగారు మనకు రాకుండా దారులు అడ్డగించి వేయడం వల్ల భారతీయులు, బంగారు కోసం మలయావైపే మొగ్గవలసి వచ్చింది. వేయి సంవత్సరాలపాటు మలయాలో వైదిక సంస్కృతి వర్ధిల్లింది. వైదిక మతాను యాయుల కాలంలో రాజధాని ఇంద్రపూర్ అని వ్యవహృతమయింది.

మలయాలో హీనయాన మహాయాన బౌద్ధాలు రెండూ 4 వ శతాబ్దంలో వ్యాపించాయి. పెరక్ నగరంలో రెండు గుప్త సంప్రదాయపు హీనయాన కాంస్య బౌద్ధ విగ్రహాలు దొరికాయి. ఫ్యూనాన్ సామ్రాజ్య పతనానంతరం శ్రీవిజయ సామ్రాజ్యం వ్యాపించింది. శ్రీవిజయరాజ్యం ఏలిన శైలేంద్రవంశ రాజుల సముద్రాధిపత్యం అసమానమైనదని అప్పటి అరబ్ చరిత్రకారులు అంటున్నారు. 15 వ శతాబ్ది నుంచి ముస్లింల ప్రాబల్యం హెచ్చింది. అయినా ముస్లింలలోనూ అలనాటి వైదికాచారాలు పోలేదు.

## సుమాత్రా - స్వర్ణద్వీపం - లో

సుమాత్రాను రామాయణం స్వర్ణద్వీపం అని వర్ణించింది సుమాత్రాలోవి పలెంబాగ్ లోయలో క్రీస్తుశకం మొదటి శతాబ్దానికే భారతీయుల వలన ఏర్ప డింది. 5-7 శతాబ్దాల మధ్య సుమాత్రాలో బౌద్ధం వ్యాపించింది. సుమాత్రాలో రెండు రాజ్యాలు - ఉత్తరాన ఇప్పటి కంబీనగరం రాజధానిగా మలయా, దక్షి ణాన పలెంబాగు రాజధానిగా శ్రీవిజయరాజ్యం - ఉండేవి - శ్రీవిజయరాజ్యం 5 వ శతాబ్ది నుంచి 10 వ శతాబ్ది వరకు వర్ధిల్లింది. తర్వాత జావావారు, దక్షిణా పథపు చోళులు జయించినా, మరల స్వతంత్రమైంది. శ్రీవిజయరాజ్యం శైలేంద్ర వంశపాలనలో ఉన్నప్పుడు గొప్ప బౌద్ధ కేంద్రమైంది. వీరు మహాయాన బౌద్ధానుయాయులు. వీరే బొరోబదూర్‌లో (జావాలో) గొప్ప విహారం నిర్మించిన వారు. వీరి నౌకలు భారతదేశానికి తరచువెళ్ళి వచ్చేవి. ఇత్సింగ్ అనే చీనా బౌద్ధపండితుడు 7 వ శతాబ్దిలో శ్రీవిజయకు వచ్చి పెక్కు భారతీయ గ్రంథాలు పఠించి చీనా భాషలోకి అనువదించుకొన్నాడు. 1000 మందికి పైగా భిక్షువులు, విద్యార్థులు శ్రీవిజయ రాజధానిలో వివిధ శాస్త్రాధ్యయనం చేసేవారట. 8 వ శతాబ్దిలో ఒక శైలేంద్ర వంశరాజు అవలోకితేశ్వర, ఆర్య, తారాశక్తి మంది రాలను, విగ్రహాలను నెలకొల్పాడు. చీనా బౌద్ధసన్యాసులు భారతదేశానికి వచ్చేముందు శ్రీవిజయకు వచ్చి కొంతకాలం సంస్కృత శిక్షణ పొంది వచ్చే

వారు. సుమాత్రా మహాయానంపై తంత్రయాన ప్రభావం ఉంది. నలందా విశ్వ విద్యాలయాచార్యుడు ధర్మపాలుడు తన వార్థక్యంలో శ్రీవిజయకు వచ్చి విశ్రాంతి తీసుకున్నాడట. 14 వ శతాబ్దివరకు బౌద్ధం సుమాత్రాలో ఉంది. అప్పటిరాజు ఆదిత్యవర్మ అవలోకితేశ్వరుని అవతారమైన జిన అమోఘపాన విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. అప్పటికప్పుడే ఇస్లాం ఉత్తర సుమాత్రాలో వ్యాపించింది. త్వరలో ద్వీపాన్నంతా ముంచెత్తింది.

## జావా - యవద్వీపం - లో

జావా యవద్వీపంగా రామాయణంలో పేర్కొనబడింది. ఇండోనీషియాలో ఇదే పెద్ద ద్వీపం. జావాలో 5 వ శతాబ్దికిగాని బౌద్ధం వ్యాపించలేదు. మధ్య జావాలో ఒకటవ శతాబ్దానికే వైదిక మతానుయాయులు వలసలుండేవి. కనుకనే సుప్రసిద్ధ చీనాయాత్రికుడు ఫాహియాన్ జావాలో బ్రాహ్మణులున్నారని, వారి మతం బ్రాహ్మణ మతమని అన్నాడు ఫాహియాన్ క్రీస్తుశకం 413 లో ఒక వైదిక మతానుయాయి ఓడలో కాంటన్ నగరానికి వెళ్ళాడు.

జావాలో మొదట బౌద్ధాన్ని ప్రచారం చేసినవాడు గుణవర్మ అనే కాశ్మీర రాజకుమారుడు. ఇతడు రాజ్యం వదలి, బౌద్ధమత ప్రచారం నిమిత్తం భిక్షు వయాడు. ఇతడు మొదట లంకకు వెళ్ళి, అక్కడనుంచి జావాకు వచ్చి, మొదట జావా రాజమాతకు బౌద్ధదీక్ష యిచ్చి, తర్వాత రాజును బౌద్ధ దీక్షితుని చేశాడు. పిదప కాంటన్ వెళ్ళి కొంతకాలానికి మరణించాడు.

జావా 8 వ శతాబ్దిలో శైలేంద్ర వంశ చక్రవర్తుల శ్రీవిజయ రాజ్యంలో భాగమైన తర్వాత మహాయాన బౌద్ధానికి కేంద్రమయింది. దేవేంద్రుడనే రాజు మధ్య జావాలో తారాదేవి మందిరాన్ని నిర్మించాడు. శైలేంద్రుల పాలన మధ్య జావాలో 10వ శతాబ్ది వరకు వుంది. ఇది జావా వాస్తుశిల్పానికి స్వర్ణయుగం. బోరోబదూర్ స్తూపం - శిలామయమైన ఇతిహాసం వంటిది - ఈ కాలంలోనే నిర్మితమయింది. చండీమండుట్ వాస్తుశిల్ప నైపుణ్యానికి మచ్చుతునక. బోరో బదూర్ మహామందిరం కృష్ణాతీరంలోని అమరావతి ఛాయలను పుణికి పుచ్చుకుంది. రెండవ, మూడవ శతాబ్దాలనుంచి అమరావతి బౌద్ధమత వ్యాప్తికి, కళా వ్యాప్తికి ప్రధాన కేంద్రమయింది.

బోరో బదూర్‌లోని సుందర మందిర సముదాయం రామాయణ భారత గాథలకు సంపూర్ణంగా శిల్పానువాదం. ఇది మొత్తం ఇరవై దేవాలయాల సముదాయం. కాని, ఒకప్పుడు అగ్నిపర్వతం బ్రద్దలై ఈ దేవాలయ సముదాయం ఉన్న పీఠభూమిని లావాతో ముంచివేసింది. దానితో 12 దేవాలయాలు శిథిలమై

యెనిమిది మాత్రమే మిగిలాయి. వీటిలో ఐదు అర్జున దేవాలయాల సముదాయం. పీఠభూమి ఉత్తరం చివర ఉన్నది కాని, అత్యంత సుందరమైన చండీభీమ (భీమ మందిరం) ఒంటిగా పీఠభూమి దక్షిణాగ్రంపై ఉన్నది పూర్వం డచ్చివారు ఈ మందిరం పట్ల చాలా అశ్రద్ధ చూపారు కాని, నేడు స్వతంత్ర ప్రభుత్వం ఈ కళాఖండాలపై శ్రద్ధ వహిస్తున్నది.

మధ్య జావాలో శైవం, మహాయానం ఒకదాని సరసన మరొకటి అభి వృద్ధి చెందాయి కనుకనే బోరో బదూర్ లోని గొప్పస్తూపం నెలకొన్నది. ఇది శైలేంద్రుల కాలపు గొప్ప కళాఖండం. ఇది జోగ్జకార్తాకు సమీపంలోనే ఉంది. బోరో బదూర్ స్తూపం జీవకళా పరిపాక పరాంశం. దానిమీద బుద్ధజీవిత ఘట్టాల సుందరశిల్ప వర్ణనకు ముగ్ధుడు కానివా డెవడు?

బోరో బదూర్ స్తూపం చతురస్రాకారం; మట్లుమట్లుగా కట్టిన ఆరువేదిక లపై నిర్మించబడింది. అట్టడుగు వేదిక వెడల్పు 479 చదరపు టడుగులు. ఈ వేదికలకు నాలుగువైపులా సోపాన పంక్తి ఉంది. ఆరవ వేదిక మధ్యన వర్తులా కారంగా చిన్నచిన్న స్తూపాల మూడు వరసలున్నాయి. ఈ చిన్న స్తూపాలు మొత్తం 12. మూడవ స్తూప వలయం మధ్యన పెద్ద స్తూపం ఉంది. ఈ చిన్న స్తూపాలు బోలువి, మధ్యనఉన్న పెద్దస్తూపం వ్యాసం 52 అడుగులు. స్తూపం క్రింది భాగంలోనే శిల్పాలన్నీ, పెద్ద పైభాగంలో లేవు. ఇది ఐహిక ప్రపంచా నికి, ఆముష్మిక ప్రపంచానికి సంకేతం.

ప్రతీ అరుగుమీద ధ్యానబుద్ధ విగ్రహాల వరుసలున్నాయి. ఇవన్నీ మహా యాన సంప్రదాయ ప్రకారం నిర్మించబడినవి. ఇవి ప్రతి పార్శ్వంలోను 92 ఉన్నాయి. తూర్పున అక్షోభ్య మూర్తులు, దక్షిణాన రత్నసంభవమూర్తులు, పశ్చిమాన అమితాభమూర్తులు, ఉత్తరాన అమోఘ సిద్ధమూర్తులు ఉన్నాయి. అన్నిటికన్న పై వరసలో 64 మూర్తులున్నాయి. అరుగు తొలచి గూళ్ళలో చెక్కిన వైరోచన మూర్తులు 72. మొత్తం 504 విగ్రహాలు.

పూర్వ సింహద్వారం సోపాన పంక్తినుంచి ఎక్కి ఎడమవైపు తిరగ గానే మృగదావంలో బుద్ధుని తొలి ఉపదేశం చిత్రించే 120 శిల్పాలు కనిపిస్తాయి. తర్వాత లలిత విస్తరంలో చెప్పిన బుద్ధ చరిత్రానుసారం శిల్పాలు చెక్కారు.

బోరో బదూర్ శిల్పులు కేవల భారతీయ శిల్పానుకర్తలు కారు. జావా జాతీయతను మేళవించారు.

14 వ శతాబ్దంనుంచి జావాలో ఇస్లాం వ్యాపించింది. అయినా భారతీయ సంప్రదాయం జావా ముస్లింల జీవితంనుంచి మరుగు కాలేదు.

బలి ద్వీపంలో మహాయాన బౌద్ధం జావాశైలేంద్ర రాజుల కాలంలో వ్యాపించింది. జావా, స్థానిక ప్రజలు తమదే అనాది భారతదేశమన్నంతగా మారింది. భారతదేశానికి తద్రూపమైంది. ఇది 14 వ శతాబ్దంవరకు చాల స్వతంత్రంగా ఉంది. తర్వాత మజపహిత్ వంశం రాజులు ఏలుబడిలోకి వచ్చింది.

బోర్నియో, పిలిప్పీన్సుల లోను వైదిక బౌద్ధ ధర్మ ప్రభావం పడింది.

ఈ విధంగా బౌద్ధం— బుద్ధుడు, శైవం — శివుడు, వైష్ణవం— విష్ణువు ఆగ్నేయాసియా ప్రజల జీవితాన్ని మధురం చేసి, దేశాలను కళావిలసితాలు చేశారు.

ఆగ్నేయాసియా కళావిలసనం వివరాలకు శ్రీ ఎస్. వి. పుణ తాంబేకర్, రెజినాల్టు లీడ్సు, డాక్టర్ మజుందార్ మున్నగు పండితుల గ్రంథాలు చదవడం ప్రయోజనకారి. ఈ వ్యాసం దిగ్దర్శకం మాత్రమే.

# సమాజశ్రేయస్సు—తృతీయ పురుషార్థం

స్త్రీ పురుషులను ఆకర్షించి పరస్పరం సన్నిహితులను చేసే అంతఃప్రవృత్తి కామం. పంచజ్ఞానేంద్రియాలు ఆత్మసంయుక్తమైన మనస్సుతో కలిసి తమతమ పనులలో అనుకూల్యాన్ని బట్టి ప్రవర్తించడం సామాన్య కామమని, ఇది స్పర్శ విశేష విషయం కావడంవల్ల కలిగే సుఖప్రతీతి విశేష కామమని వాత్స్యాయనుడు నిర్వచించాడు. ఈ కామ ప్రవృత్తి ప్రాణి సామాన్యం!

నిజానికి దీని మూలం సంతానోత్పత్తే. మానవేతర ప్రాణులలో ఋతు కాలానుగుణంగా కామవాంఛ కలగడం, గర్భాదానం, ప్రసవం మొదలయినవి వాటంతట అవే జరిగిపోతాయి. మానవజాతి వికసించనంతవరకు కామ ప్రవృత్తి ప్రకృతి గతమైన సృష్టి కార్య కలాప మాత్రంగానే పర్యవసితమైంది. నేటికీ తక్కిన జీవరాసులలో ఇది అంతఃప్రవృత్తిగానే ఉంది. మానవుడు జీవజాతం నుంచి ఉద్బుద్ధం కాగానే, మనస్సనే పదార్థం ఆకాశంలోని చంద్రునిలాగా, వెన్నముద్దలాగ తేలగానే కామ ప్రవృత్తి క్లిష్టంగా పరిణమించింది.

దీనిని నేటి పరిభాషలో 'సెక్స్' అనే వ్యవహరిద్దాం సౌలభ్యం కోసం.

ఈ సెక్స్ మొదటినుంచీ వ్యష్టి సమస్యగాను, సమష్టి సమస్యగాను చిక్కులు పెడుతూ ఉంది. మానవుడు "ఎమీబా" వంటివాడు కాడు. సంఘజీవి. సంఘమంటే నైకమానవమనే అనుకుందాం. రెండవ వ్యక్తి అనగానే సంఘమన్నమాట. మానవుడు తన వ్యష్టి వాంఛలను సమష్టి వాంఛలకు, నియమ నిబంధనలకూ లోనవుతూనే తీర్చుకోక తప్పదు. వ్యక్తి క్షేమానికీ, సంఘ క్షేమానికీ, వైరుధ్యం కలుగకుండా ప్రవర్తించడం అవసరం. కనుక సంతానోత్పత్తే లక్ష్యమైన జీవరాశికీ, మనిషికీ ఈ విషయంలో చాల భేదం వుంది. కనుకనే ఆహార విహారాలలో జాగ్రత్త అవసరమన్నారు పూర్వులు. తదనుగుణంగానే కామానికి పురుషార్థస్థాయి యిచ్చి జీవితంలోని ప్రధాన సిద్ధులలో ఒక్కటిగా చేసుకున్నారు.

ప్రాచ్యుల లక్ష్యం దాంపత్య జీవితం. దాంపత్యజీవితం పరమార్థం సంఘ శ్రేయస్సే. ఎవరికివారు విశృంఖలత అవలంబిస్తే సంఘం విచ్ఛిన్నం, దుఃఖ భాజనం అవుతుంది. ఆహార నిద్రా భయ మైథునాలు పశువులకు మనుష్యులకు

సమానం కదా! వాటినుంచి వేరుచేసేది వివేకమే కనుక లక్ష్యం ధర్మ ప్రజ అని, కామసుఖం అనుషంగికమని నిర్ణయించుకున్నారు. ప్రజకోసమే గృహస్థాశ్రమ మన్నారు. చతుర్వర్గ సాధనకు కామమే ప్రధానం. "కామి గాక మోక్షకామి గాడు." కాని ఈ సెక్స్— కామం— అదుపులో వుండాలి. దీనికి కుమార సంభవగాథ చక్కని ఉదాహరణగా చూపుతారు. పరమేశ్వరుడు మన్మథుణ్ణి దహించి అనంగుడుగా అవతరింపజేశాడు. అంటే సెక్స్‌ను నిగ్రహించడ మన్న మాట. నిజమైన నిగ్రహం తపస్సుతోగాని రాదు. పార్వతి తన సహజ సౌందర్యం తోనే శంకరుణ్ణి వశపింపవచ్చు ననుకుంది. కాని, సాధ్యం కాలేదు... తపస్సు చేసేవరకూ. దేనికైనా పరిష్కారం కావాలంటే తపస్సు అవసరం. తపస్సంటే నిగ్రహం - అదుపు. శకుంతల ముందు రాజునుచూచి మోహంలో మనసు అప్ప గించింది. తపస్సుతో గాక తుది కలయిక సిద్ధించలేదు. నిగ్రహంలేక ఉదర పరాయణు లైనవారిని ధర్మదూరులని భావించి దేవతలు పరిత్యజిస్తారని శాంతి పర్వంలో భీష్ముడంటాడు. నిగ్రహంవల్ల కలిగే ఫలాలను భారతం అను శాసన పర్వం "ఇంద్రియ నిరోధంవల్ల, దానంవల్ల, దమంవల్ల మానవుడు కోరినదంతా సంపాదించగలడు" అని తెలిపింది. కామమన్నది ఎంత అనుభ వించినా తీరదు. అగ్ని హవిస్సు వేసిన కొద్దీ మండుతూనే ఉంటుంది కదా... అంటాడు మనువు.

ఈ నిగ్రహంకోసమే వివాహ వ్యవస్థ ఏర్పడింది. సంఘశ్రేయో దృష్టితో మన పూర్వులు వివాహ వ్యవస్థను కట్టుదిట్టం చేశారు. ఉత్తమ సంస్కారం గల స్త్రీ అధమ సంస్కారంగల పురుషుని పొరపాటుతోనన్నా పొందితే, వాడితో ఆమెకు వివాహం కావడం శ్రేయస్కరమన్నారు ధర్మశాస్త్రకారులు. ఇది కొంత విడ్డూరంగానే ఉన్నా విజ్ఞాన శాస్త్ర దృష్టితో సరైందేనని తోస్తుంది.

పాశ్చాత్యులలోను దాంపత్య జీవనానికి ప్రాధాన్యం కనిపిస్తున్నా, విశృంఖ లత ఉందని చెప్పాలి. దానికి కారణం దేశకాల పరిస్థితులు; ఆచార వ్యవహా రాలు; సంస్కృతి సంప్రదాయాలు కావచ్చు. ప్రాచ్యదేశాలలో లాగ స్త్రీ పురుషులు అక్కడ దూరదూరంగా ఉండడానికి వీలులేదు. పారిశ్రామిక నాగరికత మరీ పెరిగిన ప్రాంత మది. ఉభయులకూ సన్నిహితత్వం, కొంత వైశృంఖల్యం తప్పవేమో! అయినా పెద్దవారు, సంస్కృతి కలవారూ దాంపత్య జీవనాకాంక్షులే. హెన్రీ ఫోర్డును "మీ దాంపత్య జీవితం ఇంత సుందరంగాను, సుఫలంగాను ఉండ డానికి కారణ మేమిటి?" అని ఎవరో అడిగారట. "మరేమీ లేదు. వాణిజ్య రంగంలో అనుసరించిన ఫార్ములాలనే గార్హస్థ్య జీవితంలోను అనుసరిస్తున్నాను. అదేమిటంటే, ఒకే మోడల్‌ను నమ్ముకోడం" అని సమాధానమిచ్చాడట ఆయన.

కట్టుబాట్లున్న కొద్దీ కుతూహలం పెల్లుబుకడం సామాన్య మానవులకు సహజం. అప్పుడు అతిచారం, వ్యభిచారం చెలరేగుతాయి. అపత్య లోభంలో ఆతిచరించడం కూడా తగదన్నాడు మనువు. సెక్స్ విజృంభించి, ఉపభోగార్థ అయిన స్త్రీని స్వంత ఆస్తిగా చూచుకొనే తలపు రావడంతో స్త్రీని అదుపులో పెట్టుకోడానికి 'స్త్రీ అన్ని వికారాలకు పుట్టినిల్లు; కామం క్రోధం కపటం ద్రోహ భావం పుట్టుకతోనే స్త్రీకి అబ్బే గుణాలు. పిల్లలు కనడం, కన్నవారిని పెంచడం ఇవే స్త్రీ పనులు. గర్భధారణకు స్త్రీలు పుట్టారు. గర్భం చేయడానికి పురుషులు పుట్టారు. కనక, స్త్రీ ఇతరుల వద్ద సంతానం పొంది తన కులాన్ని సంకరం చేయకుండా, ఎన్ని ఉచ్చులు బిగించాలో... పాపభీతితో, అనునయంతో, మర్యాదతో - అన్నీ' చెప్పాడు మనువు.

సత్సంతానం, ధర్మకార్యాలు, శుశ్రూష ఉత్తమమైన పద్ధతి, స్వర్గం దారాధీనాలు కనుక స్త్రీని భద్రపరచుకోవాలి. నీ భార్య పరుల దగ్గరకు పోకుండా చూడడానికి నీవు పరస్త్రీలతో పోవద్దు. పరక్షేత్రంలో విత్తితే పంట క్షేత్రస్వామికిగాని నీకు కాదు కదా! ఆకాశంలో బాణం వదలితే ఏమిటి ప్రయోజనం? అట్లాగే పరదారను పొందితే నీకు సంతానం దక్కుతుందా? భర్తతో భార్య, భార్యతో భర్త సంతృప్తి పడిన కులంలో కల్యాణం అవిచ్ఛిన్నంగా ఉంటుంది - ఇదీ మనువు ధోరణి.

ఇంత కట్టుదిట్టాలు, అష్ట దిగ్బంధాలు చేయడం స్త్రీసుఖంకోసమే. నాకేమి సుఖం. సంప్రయోగంలో (మిథున కర్మలో) ఎక్కువ సుఖం కలిగేది ఎవరికి? స్త్రీకే. అనుభూతి కలిగేది ఆమెకే ఎక్కువ-అని తమ నిర్బంధాలను సరిపెట్టుకున్నారు మన పూర్వులు.

ఈ భావానికి కామ శాస్త్రకారులు చిలవలు పలవలు అల్లారు-

"సంయోగే యోషితః పుంనాం
కండూతి రపనుద్యతే,
తచ్చాభిమాన సంస్పృష్టం
సుఖ మి త్యభిధీయతే" అని.

ఈ పరిశీలన మరొక పాయవేసి, స్త్రీకి భావప్రాప్తి (క్లైమాక్స్) మొదట కలగడం అవసరమనే కొత్త విషయం కనుగొన్నది. ప్రపంచంలో పలువురు స్త్రీలకు భావప్రాప్తి అంటే ఏమో తెలీదని పెక్కుమంది ఆధునిక కామ శాస్త్రజ్ఞులూ తెలిపారు. గర్భధారణకు క్లైమాక్సుకు సంబంధం లేదు. కనుక, పురుషుడు తన ఆత్రంలో తన సహ సంప్రయోగిని మనస్థితి తెలుసుకొనే ఓపికతో

ఉండడు. అందువల్ల తన వేగం మందమై పోగా స్త్రీ చెక్కు చెదరకుండా వుండడం చూచి విస్తుపోతాడు. దంపతులిద్దరికీ సమానమైన సుఖం కావాలి. కనుక స్త్రీకి మొదట భావప్రాప్తి కలిగేట్టు ఉపచరించాలి అంటాడు వాత్స్యాయనుడు.

ఈ వైషమ్యం తొలగించడానికి సెక్స్ విజ్ఞానం నేర్వాలి. సంప్రయోగం జీవి సహజం. ప్రత్యేకంగా విడమరచి చెప్పనక్కరలేదు. జంతువులకు ఎవరు నేర్పుతున్నారు? అంబోతుకు నీవే నేర్పావా? అని వాదించేవారున్నారు. వాటికి నేర్పనక్కరలేదు. అంతః ప్రవృత్తితోనే ప్రజనకర్మ సాగిపోతుంది. మానవునికి మనస్సు అనేది ఒక కొత్త పదార్థం. అది కోతి వంటిది. దానిని కట్టివేసి నేర్పితేనే గాని నిలకడగా ఉండదు. నేడు అనాది కాలపు పరిస్థితులు ఉన్నాయా? మనదేశంలోనూ పారిశ్రామిక నాగరిక ప్రబలుతున్నది. కార్ఖానాలు, కళాశాలలు స్త్రీ పురుషులతో కిటకిటలాడుతున్నాయి. జీవిత విధానం మారడంతో కొత్త సమస్యలు ఉత్పన్నం కావడం సహజం. తదనుగుణంగా సులభంగా సెక్స్ విజ్ఞానం, సంఘనీతి బోధించడం ఆవశ్యకం. అప్పుడే గుడిలో మెల్లగా వ్యవస్థ ఏర్పడుతుంది - అనేదే పైవారికి సమాధానం.

ఈ సెక్స్ విజ్ఞానం ప్రాయం పొటమరిస్తున్నప్పుడే అవసర మనడం నిర్వివాదం. ఆ విజ్ఞానం మన ప్రాచీన కామశాస్త్ర గ్రంథాలవల్ల అంతగా కలగడం లేదంటే అసత్యం ఆవంతైనా లేదు. అవి పెడదారి పట్టాయన్నా తప్పులేదు. స్త్రీ విషయైక సాధనం, మగవాని సొంత ఆస్తి అనే భావం మన సంఘంలో ప్రబలంగా పాతుకున్న రోజులలో తియ్యని గార్హస్థ్య జీవనం అందని మానిపండైన కాలంలో మన కామశాస్త్ర గ్రంథాలు పుట్టాయి. పవిత్రమైన పరిణయానందాన్ని గురించి, "ప్రజయా హి మనుష్యః పూర్ణః" అని సత్సంతానాన్ని గురించి, వేదాలు చేసిన ఘోష "కాలానికే కారణమైన" రాజుల కొలువు కూటాలకు వినబడలేదు.

రాజరికం స్థిరపడిననాటి దురాచారాలను, రాజుల దుష్కామాన్ని సమర్థించడానికి పూనుకున్న మేధావులలో వాత్స్యాయను డొకడు. తనకు ముందు కామశాస్త్రాన్ని సూత్రించినవారు తొమ్మండుగురు ఆచార్యులు ఉన్నారని వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. ఆ మహనీయులలో దత్తకుడనే ఆచార్యుడు పాటలీపుత్రంలోని వేశ్యలకోసం ప్రత్యేకంగా వైశికాధికరణం వ్రాసి లోకసేవ చేశాడట. కూచిమారుడనే మరొక ఆచార్యుడు అసహజంగా కామాన్ని విజృంభింపజేయడానికి కావలసిన మందులు, మాకులు చెప్పి ఔపనిషదాధికరణాన్ని నిర్వచించాడు. కనుక వాత్స్యాయనుడు ఈ రెండు విషయాల జోలికి ఎక్కువగా

పోక కొంచెంగా స్పృశించి, సామాన్య కన్యా, భార్యా, పారదారికాధికరణాలను మాత్రం సూత్రించాడు.

పారదారిక మనగానే, మన కామశాస్త్ర గ్రంథాలలో తియ్యని ఆలుమగలు నెయ్యంకన్నా విటవిటీ, చేటచేటీ విషయం హెచ్చుగా ఉండడం సహజమే. ప్రేమ, రాగాతిరేకం చచ్చి, కేవలం కళేబర ప్రాయమైన విషయం సుఖం మసలుతూండడంలో వింతలేదు. మొట్ట మొదటి మన కామ శాస్త్రజ్ఞులు కొందరు సమీచీన కామ విజ్ఞానం అవసరమని గుర్తించినా తర్వాతివారు దానిని శారీర శాస్త్రాన్ని సారంగా వివరించక కామతృష్ణను ఉద్దీప్తం చేయడానికే వినియోగించారు. వాత్స్యాయనుడు గార్హస్థ్య జీవితాన్ని కొంతవరకు చక్కగానే వివరించినా, వ్యభిచారానికి గల కారణాలను పారదారికాధికరణంలో చర్చించినా, వేశ్యలను అప్పటి పరిస్థితుల్నిబట్టి పెద్దగా సమర్థించడం, అసహ్య పద్ధతులను తప్పు లేదనడంవల్ల అతని వాదం మొగ్గు రాజుల దుశ్చరితాలను బలపరచడం పైనే కాని, ఖిలపరచడంపైన కాదనడం స్పష్టం.

ఆయన పారదారికాధికారణాన్ని నేడు ఆచరణలో పెడితే ఎలాటి ప్రతిఫలం లభిస్తుందో మన మనస్సుకే తెలుసు. వాత్స్యాయనుడు అన్నీ చెప్పి, "వైద్యుడు కుక్క మాంసం రసవీర్య విపాకాలనుకూడా శాస్త్రదృష్టిలో చెబుతాడు. అంతమాత్రాన అది భోజ్యమని కాదు. అలాగే నేను చెడ్డవిషయాలు చెప్పాను. అన్నిటినీ పతితలు ఆచరించాలని కాదు" అని తెలివితో తప్పుకున్నాడు.

అయినా, ఇవన్నీ చాలవరకు పురుష దృష్టితో వ్రాసినవే. స్త్రీ దృక్పథమేమిటో పూర్తిగా చర్చించి కామశాస్త్ర గ్రంథాలు వ్రాయడం 19వ శతాబ్దిలో ప్రారంభమైనదనవచ్చు; అదీని పడమటిగడ్డన. పాశ్చాత్య కామశాస్త్ర విజ్ఞానానికి 'బూ అలిపినా' అనే అరబ్బు వైజ్ఞానికుడే - వాత్స్యాయన కామ సూత్రాలను క్షుణ్ణంగా పరిశీలించినవాడు - ప్రథముడు అయినా, జీవితంలో కామ ప్రవృత్తికి గల ప్రాధాన్యం సిద్ధాంతంగా ప్రతిపాదించిన వాడు ఫ్రాయిడ్. అతడు ఆటవికుల వంటి అనాది జాతులతో కలిసి మెలిసి తిరుగుతూ ఎన్నో విషయాలు సేకరించి "టోటం అండ్ టాబూ" అనే గ్రంథం వ్రాశాడు. మనం ఉపాకర్మనాడు ఉదయం "కామో కార్షీత్, మన్యు రకార్షీత్, కామః కర్తా, నాహం కర్తా, కామః కారయితా, నాహం కారయితా, ఏషతే కామ కామాయ స్వాహా" అని కామమే నన్ను అన్ని పనులూ చేయమంది. అన్నిటికీ అదే మూలం అని జపం చేస్తున్నట్టు, ఫ్రాయిడ్ అన్నిటికి కామ ప్రవృత్తే కారణమని, తల్లి పిల్లకు పాలివ్వడం కూడా కామ ప్రవృత్తే అని అన్నాడు. పిదప కామ విజ్ఞానానికి నికషంగా డాక్టర్ హెవలాక్ ఎల్లిస్ "సైకాలజీ ఆఫ్ సెక్స్" అనే ఉద్గ్రంథం వెలువడింది. "టెక్నిక్

ఆఫ్ మేరేజ్"లో వైట్ గేట్ వివాహ వ్యవస్థను చక్కగా చర్చించాడు. అంద్రె మోర్వా వ్రాసిన "ఆర్ట్ ఆఫ్ లివింగ్"తోని "ఆర్ట్ ఆఫ్ మేరేజ్", "ఆర్ట్ ఆఫ్ హాపీనెస్" ప్రకరణాలు అమూల్యమైనవి. మన పాత పుస్తకాలలోని విపరీత బంధాల వలెగాక మేరీ స్టోప్స్ తన గ్రంథంలో ఆరోగ్యకరమైన విషయాలను శారీర శాస్త్రానుగుణంగా వర్ణించింది. "సిన్ అండ్ సైన్స్" అతిచార, వ్యభిచార నిర్మూలనానికి ఎంతో ఉపయోగకరం.

ప్రేమ కామాల విలువ తెలియనివారు వాటిని గురించి చౌకగా వ్రాస్తారు. విజ్ఞానశాస్త్రం మూడాకులు ఆరు పూవులుగా వికసిస్తున్న ఈ రోజులలో ప్రాచీన ప్రాచ్య కామశాస్త్ర గ్రంథాలవల్ల కలిగే ప్రయోజనం అత్యల్పం. ఈ కామశాస్త్ర విజ్ఞానాన్ని, ప్రతీచీన సంస్కృతిని జీర్ణించుకున్న పండితులు శారీరశాస్త్రానుగుణంగా ఉత్తమ గ్రంథాలు రచించి సంఘసేవ చేయవలసి ఉంది.

* * *

పెండ్లి పెక్కేండ్ల పంట—అంటారు పెద్దలు. ఎంతోకాలం మంతనాలు జరిపి, పొంతనాలు చూశాక కాని పెండ్లిడ్లు చేయరు. మరి కాపురంలో పొందిక కుదరకపోతే కాలకూటం పుట్టిందన్నమాటే.

ఈ పొందికకు దంపతులలో సెక్స్ వైషమ్యం - కామోపభోగంలో విషమత - లేకపోవడం ప్రధానం. సెక్స్‌ను మించిన హృదయావేగం మరొకటి లేదు. సెక్స్ జీవికి ప్రధానమైన కోరిక అని ఇదివరకే అన్నాము. కామం శరీర స్థితి హేతువు కావడంవల్ల ఆహారం వంటి నిత్యావసర మవుతూ, ధర్మార్థాలకు ఫలభూతమైన పురుషార్థమూ అవుతున్నది - అన్నాడు వాత్స్యాయనుడు ఈ పురుషార్థం సఫలం కాకపోతే, సంతృప్తి కలుగకపోతే కలిగే ప్రమాదాలు కొల్లలు.

కాపురంలో పొందిక లేకపోవడానికి కారణాలు శారీరకంగాను, మానసికంగాను, స్వభావ సంస్కారాలనుబట్టి వుంటాయి ఇవి కాపురం ఆరంభమైన కొన్నాళ్ళకే ఆరంభమై ఇంతింతై, హృదయ నభోమండలంలో అంతై వ్యాపిస్తాయి. పెండ్లి, కాపురం అనగానే దంపతులు ఏవేవో మధుర మధుర భావాలతో స్వప్న వీథులలో విహరిస్తారు. కాపురం పెట్టడంతోటే తమ ఆశలన్నీ నిరాటంకంగా, నిరంతరంగా నెరవేరుతాయనీ అడియాసలు పడుతారు. ముఖ్యంగా పురుషుకు తన ఆశలన్నిటినీ పిండివేయడానికి ఉబలాట పడుతాడు. కాని స్త్రీ పురుషుడు చూపినంత ఆవేగం చూపదు. దీనితో ఆమె అప్రవర్తకత్వం - చొరవ చూపకపోవడం - గుర్తించడంతో పురుషుకు కొంచెం వెనుతగ్గి, భార్య తన వాంఛలను తీర్చలేకపోతున్నది; తాను చూపుతున్న సంరంభం చూపలేకపోతున్నది - అనే అపోహ పడతాడు. గార్హస్థజీవితం తొలినాళ్ళలో పురుషులకు

కామవాంఛ హెచ్చని, పది పన్నెండేళ్ళు కాపురం చేసిన తర్వాత - ప్రారంభ కాల పరిస్థితికి విరుద్ధంగా - కామవాంఛ లొచ్చని శాస్త్రజ్ఞులంటారు. ఈ తొలి నాళ్ళలోనే పురుషుడు దురుసుగా ప్రవర్తించడం వల్ల స్త్రీకి వైముఖ్యం ఏర్పడడం - ఆమె మగడంటే ఎంత ప్రేమ గలదైనా - సంభవిస్తుంది. కాపురం చాల సున్నితమైంది. హెచ్చు లొచ్చులు లేక సమ్మసరిగా ఉంటేనే ఏపుగా పెరుగుతుంది. సమవేగంగా వున్నపుడే సుఖమూ సంతోషమూను. నాయకుడు చిరవేగుడు, చండవేగుడు అయితే - ఎంతకూ వదలనివాడయితే - స్త్రీలకు అసహ్యం కలుగుతుంది; శీఘ్రవేగుడు, మందవేగుడు అయితే భావప్రాప్తి కలుగక ఈసు పుడుతుంది. కనుక ఉభయత్రా సమవేగం అవసరం - అంటాడు వాత్స్యాయనుడు. కామమనేది ప్రకోపించిన పిదప త్వరగా శాంతించదు; మనస్సు స్తిమితం కోల్పోతుంది. ఇలా మరికొన్నిసార్లు జరిగితే కాపురం పొందిక ప్రిదిలిపోతుంది.

కాపురం కలతలపాలు కావడానికి మరొక కారణం స్తబ్ధత - జడత్వం. ఈ స్తబ్ధత సెక్సును గురించి పెద్దవారు చెప్పిన లేనిపోని భయాలవల్ల, ముఖ్యంగా స్త్రీలలో ఏర్పడుతుంది. కొత్త శోభనపు పెళ్ళికూతుర్ని శోభనపుగదిలోకి పంపుతున్నప్పుడు కూడా పక్కింటి పొరిగింటి అమ్మలక్కలు మొగుని తాకిడిని చిలవలు వలవలుగా చెప్పి బెదరగొట్టడం నేడూ మన గ్రామాలలో, పట్టణాలలో జరుగుతున్నదే. ఈ మాటలతో, మనసులో చీకట్లు కమ్మినవారు కొన్నేళ్ళు కాపురం చేసినా స్తబ్దులుగానే ఉంటారు. "భార్య భర్తనే నమ్ముకొని, ఏకచారిణిగా, భర్తపై భారమంతావేసి అతనినే దేవతగా భావించి అనుకూలంగా ప్రవర్తించాలి" అని పదే పదే ఉపదేశామృతం వీనుల పడడంవల్ల నవ వధువు బిక్కుబిక్కుమంటూనే భర్త కోరికలు తీర్చినా, మనసిచ్చి మసలదు; తీవ్రత చూపదు; చల్లబడి వుంటుంది. దీనితో క్రమంగా భర్త అంటే వెగటు, వైరస్యం పెరిగిపోతాయి ఆమెలో. సంప్రయోగంలో త్వరగా ద్రవించదు - అంటే మామూలు మాటలలో నడుము సడలించదు; ఒళ్ళు కదలదు. దీనితో ఆమెకు మూర్ఛాపస్మారాదిరోగాలు పుట్టే ప్రమాదం కూడా ఉంది. ఇలాగే పురుషుని స్తబ్ధతను కూడా స్త్రీ ఉపేక్షగాను, ప్రేమరాహిత్యంగాను భావిస్తుంది దానితో రెచ్చిపోయి, పెడదారి తొక్కడమూ సంభవిస్తుంది. ఈ విధంగా కామోపభోగంలో వైషమ్యం పోనుపోను ఉభయుల హృదయాలలోను సీలిసీడలు పడవేసి వ్యభిచారానికి దిగజారజేయడానికి ప్రధాన కారణ మవుతుందన్నా అతిశయోక్తి కాదు.

నిజానికి, ఎంతో మనోవ్యథ, కష్టం తర్వాతగాని వ్యభిచారంలో ప్రవృత్తి ఏర్పడదని మానవజాతి చరిత్రలు పరిశీలిస్తే తెలుస్తుంది. వ్యభిచారమనేదాని నిర్వచనమూ యుగ యుగాలలో మారుతూనే ఉంది. ఒకానొక కాలంలో ఇంటికి విచ్చేసిన అతిథికి గృహస్వామి తన భార్యను సకలోపచారాలకు అప్పగించడం ధర్మం. దానిని కాదన్నవారిని, రాజులను రాజర్షులను కూడా - శపించిన గాథలు భారతంలో ఉన్నాయి నిన్న మొన్నటివరకు ఈ ఆచారం ఎస్కిమోలలో ఉండేదని చరిత్రకారులు అంటారు. తనకు అపూర్వానంద మిస్తున్న వస్తువును అతిథికి అర్పించి ఆనందింప జేద్దామనే సత్సంకల్పమే ఈ ఆచారానికి మూల హేతువు కావచ్చు. బహుపతిత్వం ఒకప్పుడు ఆచారం; ధర్మం. నేడది ఎంతో అపహాస్య భాజనం; అవమానకరం. బహుపత్నీత్వం మొన్నటివరకు శాస్త్ర సమ్మతం; నేడది నేరం. ఏమైనా, వివాహమనే వ్యవస్థ ఏర్పడడానికి ముందూ, తర్వాత కూడా అన్ని కాలాలలోను కామోప భోగ విషయంలో ఆర్జవం అత్యవసరమనేది అన్ని దేశాలవారూ గుర్తించిన ధర్మం; అతి పవిత్రమైన ధర్మం, కామ ప్రవృత్తి ఆకలీదప్పులవంటి ప్రవృత్తి సామాన్యంకాక తదతీతమైందనడం స్పష్టం గనుక యాదృచ్ఛికంగా సృష్టికి కారణమవుతూ, అనితర సాధ్యమైన ఆనందాన్ని పొందించేది గనుక, స్నేహానికి పరాకాష్ఠ గనుక, తత్సాధనమైనవారిని అదుపులో పెట్టడం, కట్టుబాట్లు సంఘంలో అనాదిగా ఏర్పడడంవల్ల, ఈ విషయంలో అనార్జవం మహాపాతకంగాను, మహాపరాధంగాను భావించారు; వర్ణించారు; పరస్పరం మరణ పర్యంతం వ్యభిచారమనేది తల పెట్టకుండా కాపురం చేయడం స్త్రీ పురుషులకు పరమోత్తమమూ, సమానమూ అయిన ధర్మం. కనుక ఉభయులూ ఆర్జవంతో ప్రవర్తించాలి, స్త్రీ భర్తను మీరి పెడదారి తొక్కితే లోకంలో నిందను మోసి, పాపం పొంది, రోగాలతో నవిసి, మరుజన్మలో జిత్తు ఒమారి నక్కై పుడుతుంది - అని మనువు అన్నాడు. అన్ని మతాలలోను ఇలాటి విధి నిషేధాలే ఉన్నాయి. ఏకపత్నీవ్రతానికి, పాతివ్రత్యానికి ప్రాధాన్యమిచ్చే కథలు, గాథలు నేల నాలుగు చెరుగులా వినిపించేవే. వ్యభిచారం అన్ని మోసాలకన్నా "మహా మోసం"గా భావించడంవల్ల, సంఘవ్యవస్థ మంచి బిగువుగా ఉండడంవల్ల, మనలో సెక్స్ విషయమై అనార్జవం తక్కువే - ముఖ్యంగా స్త్రీలు వ్యభిచరించడమనేది అరుదే. పతిపై అనురాగం. తన పిల్లా జెల్లాపై వాత్సల్యం, వయస్సు మళ్ళిపోవడం, అవమానం, కష్టం కలుగుతాయన్న ఆశంక, అందని మానుపండులే అన్న అప్రత్యయం, మననుంచి మరొకరికి మనఃక్లేశం ఎందుకులే అన్న మంచితనం, గుట్టు బయటపడితే గుంపునుంచి వెలి అనే గాబరా, భర్తే మరొకరి ద్వారా మభ్యపెట్టించి పరీక్షిస్తున్నాడేమోనన్న విమర్శ, అన్నిటికీ

మించి ధర్మాపేక్ష స్త్రీలలో వ్యభిచార వ్యావర్తన కారణాలు - అని వాత్స్యాయను డన్నాడు.

కాని నేడు కొందరు వ్యభిచారం గురించి భిన్నాభిప్రాయంతో సమర్థించే వారూ ఉన్నారు. మన వివాహ వ్యవస్థ, సెక్స్ సిద్ధాంతాలు, నిబంధనలు 'మధ్య తరగతి నాగరికత' పాదులో మొలచినవి నీతి అనేది ఎప్పటి కప్పటికి మారేది గనుక సహేతుకం కాదు. మానవుని కామప్రవృత్తి అనుభవ వైవిధ్యం లేకపోతే అతృప్తంగానే ఉండిపోతుంది. ఒకే ఒక ఒత్తిపెళ్ళాంతో విసుగెత్తిపోతుంది. కనుక మనస్సంతృప్తికి పలువురు పడతులు అవసరం—అని వీరు వాదిస్తారు.

ఇక స్త్రీలలో సంప్రయోగం చేతనే తృప్తి పొందక సంతానం కోసం - చిట్టి చేతులు తమ పాలిండ్లు పట్టుకొని, పట్టు పెదవులతో పాలు పీల్చే అపూర్వాను భూతి కోసం - కాలు జారేవారు. తమ భర్తలకు ఆదాన సామర్థ్యం తగ్గిందనే భ్రాంతితో పక్క దోవలు చూచేవారూ ఉన్నారు. సంప్రయోగ సుఖానికీ - భావ ప్రాప్తికీ - సంతానప్రాప్తికీ సంబంధం లేదని మొదట్లోనే చర్చించాము. కాని సుశ్రుతుడు భావప్రాప్తి లేనిదే బీజాదానం కలుగదన్నాడు. "నహ్యసత్యాం భావ ప్రాప్తౌ గర్భ సంభవ ఇతి బాభ్రవీయాః" (భావప్రాప్తి లేకపోతే గర్భం సంభ వించదని బాభ్రవీయులు అంటారు) అని వాత్స్యాయనుడన్నాడు.

సామాన్య వ్యావహారిక జీవితంలోనే ఆర్జవం అత్యవసరమైనప్పుడు జీవన సహచరులలో ఆర్జవం అతి ముఖ్యమనడం చెప్పనక్కరలేదు. ఏవో తాత్కాలి కోద్రేకాలతో అవే నిజమైన కారణాలని భ్రాంతిపడి పెడదారి తొక్కడం పీడలకు కారణం. వాటిని అదుపులో పెట్టుకొనడంలోనే ఉంది సుఖమంతా. వెలిచవులు తాత్కాలికంగా నిషా కలిగించినా, కొత్త సమస్యలను, చిక్కులను పుట్టించి, గార్హస్థ్య జీవితాన్ని గిట్టించి, మరింత విషాదం కలిగిస్తాయి. వ్యభిచారం చాలా వరకు సెక్స్‌లో పొత్తుకుదరక పోవడంవల్లనని కనుగొన్నాము. గనుక ఈ వైష మ్యాన్ని పోనాడి, పొందిక పొందడం సాధ్యమా? సాధ్యమే

సెక్స్ నేడు పూర్వంలాగ ప్రజనన సాధనంగాను, సుఖోపకరణంగాను ఉండడం మాత్రమే కాక, అంతకన్నా ఎంతో ముందుకే పోయింది. కేవలం విషయ సుఖమే ప్రధానమైతే మానవుడు విచ్చలవిడిగా తిరిగేవాడే. అలాకాక నేడు సెక్స్ బహుళ స్నేహానికీ, సాహచర్యానికీ ప్రధాన పీఠంగా పరిణమించింది. ఈ సెక్స్ సవ్యంగా లభించేది గార్హస్థ్యంలోనే.

గార్హస్థ్యం స్నేహ పరాకాష్ఠ; ప్రణయ పరమావధి; సాహచర్య సుఖానికి సీమ అన్నాం కదా! సంప్రయోగం మాత్రమే దాని ప్రధాన ప్రయోజనం కాదు. పూర్వం ప్రజ; నేడు ప్రజతోపాటు మైత్రితో విలసితమైన సాహచర్యం. ఈ

మైత్రి అరమరలు లేక గడవడానికి ఉభయులూ కొంత త్యాగం చేయవలసి ఉంటుంది. కొంత నిగ్రహం చూపవలసి ఉంటుంది. తిక్కలు తగ్గించుకొని అనుసరణతో మనవలసి ఉంటుంది. ఇద్దరిలో ఎవరికి వైరస్య వైముఖ్యాలు కలిగినా, కారణాలు తెలుసుకొని, చక్కదిద్దుకోవడమే జీవిత సౌఖ్యానికి కీలకం. మనసెరిగి మసలుకోవడం తెలిసినవారి సుఖానికి అంతుండదు. పరస్పర ప్రవృత్తులను పరిగణించి సహనం చూపడం ముఖ్యం. సెక్స్ అనేది మన వ్యక్తిత్వానికి వెలిగా ఉండదు. స్వస్థ మనస్కు డెవడూ సెక్సు చిక్కులతో బాధపడడు. కనుక సెక్సు చిక్కులకు సహన ప్రేమలను మించిన మందు లేదన్నారు మనస్తత్వవేత్తలు. ఈ సులు వెరిగితే, కామవాంఛ చాల సంతోషదాయకమౌతుంది.

స్త్రీ పురుషులలో—దంపతుల మాట—కామ ప్రవృత్తి, వేగం సమానంగా ఉండవు. సులు వెరిగి ప్రవర్తిస్తే స్తబ్ధత ఎవరిలో ఉన్నా మంచులాగ కరిగిపోతుంది; వెచ్చదనం విస్తరిస్తుంది. దేనికైనా 'అభ్యాసం కూసు విద్య', "సాధనమున పనులు సమకూరు ధరలోన." కొత్తలో కలిగిన లోపాలను; వైషమ్యాన్ని గ్రహించి సర్దుకొని ప్రవర్తిస్తే, సహజంగా సమకాలంలోనే ఉభయులకూ భావప్రాప్తి కావడానికి, అసంతృప్తి అంతమైపోవడానికి అవకాశం ఏర్పడుతుంది. స్త్రీల ప్రీతిని గుర్తించి, లక్షణాలను అరసి, అదనెరిగి, నమ్మకం కలిగించి, ఆభిముఖ్యం చేకూర్చుకొని ప్రవర్తిస్తే సమాన స్వభావ భావాలు గలవారికి సమాన సుఖం కలుగుతుందన్నాడు వాత్స్యాయనుడు. అట్టి రాగోదయ ప్రక్రియలు అన్ని దేశాలవారూ తెలిపారు. అవి హృదయాలు కలిస్తే తమంతటనే పుట్టుకు వస్తాయి. వాటికి క్రమం శ్రమం అంటూ లేవు. అదొక లోకం. "నియతి కృత నియమరహితం." ఇది ఫలానా విధంగా చేయాలి, ఇది ఈ రీతి — అనే గిరి గీచే సూత్రాలేవీ లేవు. ఇంగితజ్ఞానం, హృదయావబోధం, పరస్పర విశ్వాసం ఇవే మూల సూత్రాలు. కనుకనే—

"శాస్త్రాణాం విషయ స్తావత్
యావన్మందరసా నరాః,
రతిచక్రే ప్రవృత్తే తు
నైవ శాస్త్రం న చ క్రమః"

అన్నాడు కామశాస్త్రకారులు. మానవునికి కామరసం ఎక్కనంతవరకే శాస్త్రం, గీస్త్రం. రతిచక్రం ప్రారంభమయితే, శాస్త్రం లేదు, క్రమం లేదు.

ఏవంచ : మనం గ్రహించినది వ్యభిచారాది దుష్టమార్గాల నివారణకు ఆభిముఖ్యాది సుమార్గ సాధనకు పతిపత్నులు పరస్పరం తమ వైయక్తికాభ్యాసాలను, విభేదాలను సమీచీన దృష్టితో చూచి సరిదిద్దుకోవడం ఉత్తమమని, ఈ

విభేదాలను తమ గార్హస్థ్య జీవిత సంబంధంలోని సామాన్యాంశాలుగా వారు భావించాలే గాని విడదీసే విశేషాంశాలుగా భావించరాదని, వాటిని వారివారి సంస్కారాలను బట్టి పెద్దవిగాను వరిగణించవచ్చు, చిన్నవని తోసివేయనూవచ్చు. గార్హస్థ్య జీవితం పరస్పర సంతృప్తి పరిణామమనే దృష్టి కలిగితే — సామాన్య వ్యవహారంలో లాగే — పట్టువిడుపులు అవసరమని అనుభవమే పాఠం చెబుతుంది.

* * *

కామప్రవృత్తి జీవి సామాన్య సహజ స్వభావ మన్నారు; సృజన కారణ మన్నారు; గార్హస్థం జోడెడ్లబండి అన్నారు: ఇద్దరూ సరిసమానంగా గృహ నిర్వహణ బాధ్యత వహిస్తూ జీవయాత్ర సాగించాలన్నారు: దీనికి లాంఛనంగా వివాహసమయంలో కాడి కూడా నూతన వధూవరుల మెడలపై మోపి, ఇద్దరూ సమానం సుమా అని పదిమంది పెద్దల ఎదుటా రుజువు చేశారు; ఈ సమాన ధర్మాన్నే ఉపనిషత్తులూ "మాతా పూర్వరూపం, పితోత్తరరూపం, ప్రజా సంధిః, ప్రజననం సంధానం" అని భార్యాభర్తలలో ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అనేదేమీ లేదు. ఒక నాణెపు రెండు ప్రక్కలే అనీ ఉద్ఘోషించాయి! ధర్మశాస్త్రాలు, శాసనాలు ఇద్దరూ ఒక్కటేనని పదే పదే ప్రకటించాయి. ఇద్దరూ సమానమే అయితే, మరి సెక్స్ ఎందుకింత తీవ్ర సమస్యగా పరిణమించింది? పెనుభూతంగా పలువురికి కనిపిస్తుంది ?

దీనికి కారణం పురుషుని స్వార్థచింతేనని, అధికార బలమేనని నిర్ణయించవలసివస్తుంది. స్త్రీ దేహంలో కొంత వయసు రాగానే కలిగే మార్పులకు విస్తుపోయి, తనంత స్వరూపం అకస్మాత్తుగా కడుపుచించుకొని ఎదుటపడి కేరుమన్నందుకు కారణం తెలీక, అదేదో మాయ, శక్తి అనుకొని స్త్రీకి ప్రాధాన్యమిచ్చిన మాతృలీన సంఘవ్యవస్థనాటి సంగతి వేరు. స్త్రీ తన సహజ శారీరక పరివర్తనంతో సాలీడులాగ తన చుట్టూ మోహజాలం అల్లుకొని, పురుషులను ఆకర్షించి, దగ్గర చేరిన వారిని బిగువుగా పట్టుకొని గుప్పిట్లో పెట్టుకొనేది. అప్పుడామె దేవత; శక్తి; కాళి; సృష్టిస్థితి లయకారిణి అయింది. కాని పురుషుడు తన కాయబలం గుర్తించి ప్రజనన కర్మలో తనకూ ప్రధానభాగం ఉంది, తను లేనిదే సుఖం, సృష్టి కలుగవు — అని పదిలపరచుకొన్న తరువాత పరిస్థితి తారుమారైంది; మాతృలీన వ్యవస్థ ముక్కచెక్క లయింది. పురుషుడు తన శరీర బలంతో సాధ్యమైనంత మంది ఆడవారిని అదుపులో పెట్టుకోసాగాడు. వారంతా తన ఉపభోగంకోసమే నని నమ్మకం ఏర్పరచుకున్నాడు. తను పురుషుడు, సృష్టికర్త. తను అనుకుంటే అన్నీ చేయగలడు. స్త్రీ తనకు అపూర్వానందం కలిగించి, తనను లాలన, పాలన చేస్తున్నమాట నిజమే. అయినా ఇల్లు కదలి

కష్టపడి సంపాదించి తెచ్చేవాడు - అది అనాగరిక కాలంలో వేటతో కావచ్చు, తర్వాత కృషి మున్నగువాటితో కావచ్చు - తనే అన్న ఆత్మవిశ్వాసం కలుగ గానే స్త్రీని కట్టుదిట్టం చేసుకోడం ప్రారంభించాడు. ఆమె తన ఆస్తి; తనకు ఉపయోగించే గుర్రం, ఎద్దు, ఆవు వంటిది అని నిశ్చయించుకొన్నాడు. సంపా దించే కష్టం కొంచెమైనా లేక తన చుట్టూ అందరిని చాంద్రాయణం చేయించగల స్త్రీ శారీరకంగా పురుషుని కంటే శక్తిహీనురాలు కావడంవల్ల క్రమంగా తన అధికారాలు కోలుపోయి, పాణిగృహీతి, ద్వితీయ, సహధర్మచారిణి అయివున్న ఆమె కేవలం భార్యగా (భరింపబడేదిగా), జాయగా (పిల్లలు కనేదిగా) దిగజారి పోయి, పురుషునికి లొంగవలసి వచ్చింది. ఇక ఆమెను చట్టాల చట్రంలో బిగించివేసే మేధావులకు కొదవా ?

"యత్ర నార్యస్తు పూజ్యంతే
రమంతే తత్ర దేవతాః"

అన్న మను మహాభాగుడే "అస్వతంత్రాః స్త్రియః" అని తెగేసి చెప్పాడు. తోబుట్టువునైనా, తండ్రినైనా, కొడుకునైనా అందంగా ఉంటే సరి ఆడది నోరూర్చుకుంటుంది. కనుక జాగ్రత్తగా ఉండు అని హెచ్చరించాడు. మనకు అనుకూలంగా చెప్పినమాట వినే స్త్రీలను పూజిస్తాము. ఎదురు తిరిగితే ఊరు కుంటామా? కదలనివ్వం, చిన్నప్పుడు తండ్రి పొరుగున, వయసులో మొగుని పక్కన, ముసలిముప్పులో కొడుకు పంచన పడి వుంటుంది, ఉండాలి-అన్నాడు మనువు. నేను సంపాదించి పెడుతున్నాను గదా, నీ కెందుకు శ్రమ? ఇల్లు ఎందుకు కదులుతావు? ఎవరైనా లాక్కొపోతే నాలాగా నిన్ను చూచుకోరు. నా దగ్గరే ఉండు. నాలో సగం నీవు నీకేం తక్కువ చేశాను. నేను మరొకతెను తెచ్చి పెట్టుకుంటే నీదేం పోయింది?—ఇదీ స్త్రీకి అధికార ప్రాధాన్యం అంతరించిన తర్వాత పురుషునికి గలిగిన చూపు. ఇదే సెక్స్ సమస్యగా, ప్రహేళికగా పరిణమించడానికి ప్రధాన కారణం.

ఒకప్పుడు మానవునికి సంతానమే లక్ష్యం, ఆదర్శం, ప్రయోజనం, పురుషార్థమూను. తన గుంపు పెరగాలి. తనకు అండగా ఉండేవారు కావాలి. తనే కాదు, తన గుంపులోనివారు ఎవరు తన వంశంలోని ఆడవారికి సంతానం కలిగించినా తనకు సంతానం కలిగినట్టే, తన బలగం పెరిగినట్టే. దేవర న్యాయంతో కాని, నియోగంతో కాని, మరేవిధంగా గాని సంతు కలగాలి. ఈభావం ప్రబలంగా ఉన్నప్పుడు-

"ఔరసః క్షేత్రజ శ్చైవ
దత్తః కృత్రిమ ఏవచ
గూఢోత్పన్నో పవిద్ధశ్చ"

అని పలువురు పుత్రరత్నాలను పరిగణించి, క్షేత్రజునకు రెండవస్థానం ఇచ్చిన సంఘంలో, క్రమంగా దేవర న్యాయంపై రోత కలిగించబడి, అన్న భార్య తల్లి అనేభావం పెంపొందించబడింది. శూర్పణఖ ముఖం ముచ్చటగా చూచి, ముక్కు ఎక్కడుందో పసిగట్టి పట్టికొని చక్కగా చెక్కి వేసిన లక్ష్మన్న "సీత నగలు ఆనవాలు పట్టగలవా?" అని రామన్నయ్య అడిగితే "అన్నయ్యా! నీతోడు. ఈ దండ కడియాలసంగతి, కుండలాల కథ నాకు తెలీదు. నిత్యం పాదాభివందనం చేసేవాడ్ని గనుక ఈ అందెలు మాత్రం వదినవే" అని పలికాడు, వాల్మీకి చెప్పినట్టు. ఎందుకు? అంతవరకు ఇంటికంతా ఉమ్మడిగా ఉన్న వధూనిక-తనకోసం ఇట్లోవున్న అన్నదమ్ములంతా ఈర్ష్యాద్వేషాలతో తన్నుకొని చావడం వల్లనో ఏమో - తల్లిలాంటి పెద్దమనిషి అయింది. తన కిక పోటీ లేకపోడంవల్ల పెద్దన్న తమ్ములను ప్రేమతో చూడడూ మరి? సౌభ్రాత్రం సహస్రదళాలుగా విడగడూ? ఈ సౌభ్రాత్రం ఎంతవరకు వచ్చిందంటే, "పశు పత్ని సుతులు ఋణానుబంధ రూపేణ వస్తారు. పెండ్లాం పోతే మరొక పెండ్లాం వస్తుంది. కొడుకుల్ను ఎంత మందినైనా కనవచ్చు. తమ్ముడు పోతే మరొక తమ్ముడు వస్తాడా?" అని వాల్మీకి రామునివంటి అవతార పురుషునితోనే పలికించేవరకు. పెండ్లాం, పిల్లలు కొత్తగా వచ్చినప్పుడు, తమ్ములు రాలేరూ? అంటే, దేవరన్యాయానికి ప్రతికూల ప్రచారం అంత ఎత్తున-పెద్ద ఎత్తున అవసరమైందన్నమాట. (అయినా, నేటికీ ఉత్తరాపథంలోని కొన్ని రాష్ట్రాలలో దేవర న్యాయం - అన్న అంతరించగానే వదినెను పెండ్లాడడమనే ఆచారం-పెద్ద కులాలలోనూ పోలేదు.) ఈ ప్రచారం కోసం పత్నీ స్థానం పశువుకు - ఇంటిలోని గొడ్డుగోదకు - తర్వాతనే అన్నంతగా దిగజారడం ఎందుకో! కామిర్లరోగికి అంతా పచ్చగానే కనిపించినట్లు పురుషుని చూపుమారడంతో ఆడవారు ఆస్తిగా మారిపోయారనీ అప్పటి నుంచి సెక్స్ ఏదో గడ్డు సమస్యగా కరుడుగట్టుకొన్నదని స్పష్టం చేయడం కోసమే ఇంతగా వివరించాను ఇదంతా. పురుషుడు బహుదారలను పొంది కూడా సమానుడుగా, దక్షిణ నాయకుడుగా, ప్రవర్తింగలడనీ, స్త్రీ మాత్రం సాపత్నికం (సవతిపోరు) కలిగినా, నాయకుడు ఇలాటి అపచారాలు మరొకచోట చేసినా కలుషితం గాక పల్లెత్తుమాట పలుకరాదనే నిర్ణయాలు ఎంత అన్యాయ పూరితమైనవో తెలుపడానికే ఇంతగా చర్చించాను.

మరొక వింతేమిటంటే, మగవాడు స్త్రీ అంటే ప్రలోభపడడం పొరపాటనుకోవడం పోయి, స్త్రీ విషావర్తమని నిందిస్తూ, ఆమె కొరకే తిరుగుతూ కొట్టుకులాడడం, ఇవన్నీ నాగరకత, సభ్యత అనబడేవి ప్రబలిన మధ్యయుగాల తర్వాతనే. అంతకుముందు కామ ప్రవృత్తి నిషిద్ధమేమీ కాదు; సెక్సు సమస్యే కాదు. సెక్స్‌ను సభ్యంగా, సహజంగా చూసిన గాథలు పురాణేతిహాసాలలో ఎన్నో ఉన్నాయి. (రాజరికపు నాగరకత, సంస్కృతి సెక్సును రాజులకు, రాజాశ్రితులకు మినహాగా నిషిద్ధం చేయడంవల్ల లేనిపోని బెమరు పుట్టుకు వచ్చింది.) ఇప్పటిలాగ ప్రజననాంగాలను ఉచ్చరించడం పాప మేమీ కాదు. బూతుతిట్లు కూడా స్త్రీల స్వంత ఆస్తి, అన్యాక్రాంతం కాకూడదనే భావంవల్ల పుట్టుకువచ్చినవే. కామ ప్రవృత్తి నీచమనే భావం తరతరాలుగా మనలో నాటుకు పోవడం వల్ల దాని ఎడ మనకు ఏవగింపు చిన్ననాటినుంచే కలిగే కట్టుదిట్టాలు సంఘంలో ఏర్పడ్డాయి. ఈ ఏవగింపును పాశ్చాత్య నాగరికత మరింత పట్టి బిగించింది. మనం పిల్లలను అటు చూడరాదు, ఇటు చూడరాదు; అటుపోరాదు, ఇటు పోరాదు. అని గిరిగీచి పడతాము. దీనివల్ల వారిలో సెక్స్ అంటే ఏమిటో తెలియకముందే ఏవో దురభిప్రాయాలు, భయ సంకోచాలు జనిస్తాయి. ఆడ పిల్లలలో ఇవి మరీ పాతుకుపోతాయి. వారు గట్టిగా మాట్లాడరాదు; పెదవి విప్పి నవ్వరాదు; కళ్ళెత్తి చూడరాదు; కాలు సాచి నడవరాదు. ఇవి ఉల్లంఘిస్తే, నీవు ఆడది కాదేమే, ఏమిటే నీ మగరాయుడితనం—అని పెద్దల పెత్తనాలు.

నిజానికి పిల్లల ఆటలే వారి భావి జీవితానికి ప్రతిబింబాలు. అప్పుడే, అజ్ఞాతంగానే, సెక్సు పుడుతుంది. అమ్మాట, నాన్నాట, పంతులాట, వారి బాల్యోద్వేగానికి, ఆవేశానికి నిదర్శనాలు. బాల్యంలో బీజప్రాయంగా ఉన్న ఈ సెక్స్ బాలబాలికలకు 12, 13 ఏండ్ల బాల్య యౌవన మధ్యస్థమైన ఈడులోనే శరీరంలో సహజ వికారాలు ముప్పిరి గొనగా, అంగవికారాలవల్ల స్ఫుటం కాదొడగుతుంది. సెక్సు అప్పటికి పరిస్ఫుటంగా రూపు తీర్చుకొంటుందని అందాం. అదేమిటో వారికి తెలియకముందే వారిని మనం నిరుత్సాహ పరుస్తాం. ఈ దశలోని మనస్తత్వం వ్యక్తులను బట్టి విభేదించవచ్చు. ఈ సమయంలో ఉద్బుద్ధమైన భావాలే వారి పరిణయ జీవితాన్ని పరిణతం చేస్తాయి గనుక, వారి కామ ప్రవృత్తిని సవ్యమైన మార్గంలో పెట్టవలసిన బాధ్యత, అదను ఇప్పుడే. ఇదంతా దాంపత్యజీవిత ఫలాస్వాదనం కోసమే. ఆ సుఖాన్ని మనసారా క్రోలాలన్నా, సంఘానికి సార్థకంగా ప్రవర్తించాలన్నా సెక్స్ విజ్ఞానం వారికి అవసరం. ఆ వయస్సంధిలో పెడదారిపట్టినవారు జీవితమంతా కాకపోయినా, కొంత భాగమైనా వ్యర్థం, విషాదమయం చేసుకొనే దురవస్థ ఏర్పడుతుంది. సెక్స్

దుర్జ్ఞేయంగాను, గహనంగాను ఉండి, కేవలం ఔత్సుక్యంతో దారితప్పేవారూ ఉన్నారు. దీని కన్నా కూడా విరుగుడు సెక్స్ పరిజ్ఞానం. జ్ఞానం కలిగితే భయం, ఔత్సుక్యం, ఉద్రేకం అదుపులో వుంటాయి. విషయం విడమరిస్తే ఏ చిక్కు ఉండదు. అజ్ఞానం కంటే జ్ఞానం మెరుగు గదా! అజ్ఞానంతో అంధకారంలో పడతారు! జ్ఞానం కలిగి కాలు జారినా మరలా గట్టు ఎక్కగలుగుతారు.

మన ప్రాచీనులకు కూడా సెక్స్ విజ్ఞానం తెలియజేయాలనడంలో విప్రతిపత్తి యేమీలేదు. తన విషయం, స్త్రీల విషయం బాగా ఎరిగి, ప్రవర్తించిన వాడు సఫలు డౌతాడని వాత్స్యాయను డన్నాడు:

''స్థిరతా మాత్మనో జ్ఞాత్వా
లింగా నుస్మృయ యోషితః.
వ్యావృత్తి కరణోచ్ఛేదీ
నరో యోషిత్సు ఒర్ధ్యతే.''

ఈ విజ్ఞానం అరయనివారు పెడదారిపట్టి, ఈ విషయం రహస్యం కావడంవల్ల, మనస్సు చంచలం కావడంవల్ల ఎవరు ఎప్పుడు ఏమి చేస్తారో తెలుసుకోలేము గనుక, ప్రతివాడూ, ఇతర విషయాల జ్ఞానం లేకపోయినా కామ విజ్ఞానానికి సంబంధించిన, రాగవర్ధనమైన చతుష్షష్టి కళలు తెలుసుకొన్నవాడై మెప్పు పొంది, జీవితం సుఖమయం చేసుకొంటాడని వాత్స్యాయను డన్నాడు:

''వర్జితో వ్యన్య విజ్ఞానైః
ఏతయా యస్త్వలంకృతః,
స గోష్ఠ్యాం నరనారీణాం
కథా స్వగ్రం విగాహతే.''

ఈ జ్ఞానం కోసమే దేవాలయాలపై బూతు బొమ్మలు, పండుగలు, పర్వాలలో శృంగార చేష్టలూ, గర్భాదాన మంత్రాలలో తంతు వివరణమూను. చెప్పకపోతే అబ్బాయికి ఎలా తెలుస్తుంది అని - మన మంత్రద్రష్టలు అనాగతాన్ని దర్శించి "ఆరోహోరుం ఉపబర్హస్వ బాహుం, పరీష్వ జస్వ జాయాగ్ం సుమనస్యమానః" (తొడలపైన కూర్చో. బాహువులను తలగడగా చేసుకో. భార్యను కౌగలించుకో. మనస్సును ఉల్లాసంగా ఉంచుకో) అని స్పష్టంగా సంప్రయోగ ప్రక్రియను ఉపదేశించారు. పూర్వం గురుకులాలలో విద్యార్థి స్నాతకుడు కావడానికి ముందుగా, గురువు స్వయంగా కామపురుషార్థాన్ని ప్రవచించేవాడట.

చిన్ననాడే ఈ విషయం తెలియకపోతే, ఉత్తరోత్తరా వారి జీవితం కష్టమయం కాగలదన్నా తప్పులేదు. నేడు పారిశ్రామిక నాగరికత విస్తరిస్తున్నది.

వివిధ స్వభావాలవారు, మనస్తత్వాలవారు నిర్బంధంగా ఒకచోట కలసి పని చేయవలసి వస్తున్నది. అలాటివారిలో సరళత అవసర మౌతుంది. కామప్రవృత్తి అసంతృప్తంగానో, అసహజంగానో ఉన్నవారు తమ తోటివారితోను, కిందివారితోను సహజంగా, సరళంగా ప్రవర్తించక విషమ చిత్తవృత్తి ప్రదర్శించడం కద్దు; ఊరికే శిక్షించి బాధించడమూ కద్దు. అలాటివారు తమ స్వభావాన్ని మృదు పరుచుకొనడానికి చిన్ననాడు సెక్స్ ప్రవృత్తిని సక్రమంగా సంయతం చేసుకొనవలసి ఉంటుంది. అది సెక్స్ విజ్ఞానం లేక సాధ్యంకాదు.

ఈ సందర్భంలో చిన్ననాటి అనుభవాలు ఎలా ఉత్తర జీవితాన్ని ప్రభావితం చేస్తాయో తెలుసుకొనడం అవసరం. సెక్స్ పరిపాకానికి తల్లి ప్రాపు పెద్ద అంతరాయమంటారు సెక్స్ పండితులు. స్త్రీలను అందరినీ తల్లిలాగా గౌరవంతో చూడనేర్చిన వాడు భార్యను గూడ పెద్దగా చూచి, జంకుతాడని, దానితో సంప్రయోగ సమయంలో ధ్వజ భంగం కలగవచ్చుననీ అంటారు. అలాగే ఆడపిల్లలకు హెచ్చుగా తండ్రి లాలన, వారి సెక్స్ భావాలను అభివృద్ధి పరచనీయక, మగరాయుళ్ళుగా మారుస్తుంది. పెద్దవారయిన తర్వాత ఇలాటివారు ఏదో ఉద్యోగమే ప్రధానంగా భావించి, పనినే పరమార్థమనుకొని గడపడమూ కద్దు. ఇలాటి అధికార దర్పం కోరేవారు మెతక మనుష్యులను పెండ్లాడి వారిపై పెత్తనం చెలాయిస్తారు. ఇలా కాక సెక్స్ విజ్ఞానం ఆకళించుకొని, లోపాలు సవరించుకొని వివాహితులైన వారిలో సారళ్యం, ప్రేమ, సమచిత్తవృత్తి కనిపిస్తాయి. ఈ దృష్టితోను సెక్స్‌ను బోధించక తప్పదు.

వ్యభిచారం ప్రణయ జీవితానికి పరశువు వంటిదని ఇదివరకే చర్చించాము. వ్యభిచారాన్ని అరికట్టడానికికూడా చిన్ననాడే సెక్స్ విషయాలు తెలుసుకొనడం అవసరం. కాపురంలో పొందిక లేకపోవడమే కాక తక్కినవీ వ్యభిచారానికి కారణాలు కావచ్చు. తప్పులు చేయనివాడు ఉండడు. దోషాలు లేనివాడొక పూర్ణ పురుషుడైన పరమాత్మే అన్న తలపు మనసులో వెలిగితే, పొరపాటున కాలు జారినవారిని కనికరించడం అన్యాయం కాదని తోస్తుంది. ఇంతకూ పెడదారి తొక్కడం ప్రేమించడమంత సులభం కాదని ఇదివరకే అనుకున్నాము.

సెక్స్ విజ్ఞానం బాల్యంలోనే ఆవశ్యకమనడానికి మరొక బలమైన వాదమూ ఉంది. అది సంతాన నిరోధం. సంతాన నిరోధం, నిష్ఫలమైన సంప్రయోగం భ్రూణహత్యగా నిరసించారు పూర్వులు. కాని, నేడిది శాసన సమ్మతం. ప్రభుత్వమే "తిండి పెట్టలేను మొర్రో— మనుష్యులు చిక్కబట్టుకోండి" అని ప్రచారం ప్రారంభించింది. పూర్వపు దృష్టి బహ్వీ ప్రజ అయితే, ఇప్పటి దృష్టి పరిమిత ప్రజ. కుటుంబ నియంత్రణానికి కూడా చిన్ననాటినుండే సెక్స్ విజ్ఞానం

కలిగిఉండడం ఉపయోగకరం. ఋతుకాలంలో సంప్రయోగంవల్ల సంతానప్రాప్తి కలుగుతుందని, సామాన్య సుఖప్రాప్తికి ఆ ఋతుకాలం వదలవచ్చునని అన్నారు ప్రాచీనులు, ఆయుర్వేత్తలూనూ. అధునాతనులు కూడా ఈ పద్ధతినే మరికొంత మార్పులో ప్రచారం చేస్తున్నారు.

సంతాన నిరోధ ప్రచారం నేడు ప్రభుత్వమే చేస్తున్నది. ప్రభుత్వమంటే నిర్బంధం అన్న భావం ప్రజల మనసునుంచి పోలేదు. చట్టంతో బెదరించి చేసే సంస్కారాలన్నీ ఎంతమాత్రం సంఘంలో విస్తరించాయో మనకు తెలియనిది కాదు. కనుక సంఘసేవా సంస్థలు ఈ ప్రచారానికి పూనుకోడం శ్రేయస్కర మనుకుంటాను.

ఇంతటి సమీచీన సెక్స్ పరిజ్ఞానం కలుగడానికి యౌవన ప్రాదుర్భావం తోనే మనస్సులో భావాలు నాటితే యౌవన వికాసంతో ఉత్తమ కామ పురుషార్థ దృష్టీ, ఆరోగ్యచింతా ఏర్పడుతాయి.

కాపురంలో పొందిక ఏమిటి? విడాకుల చట్టమే వచ్చింది. ఎప్పుడు బడితే అప్పుడు తెగతెంపులు చేసుకోవచ్చు - అంటారు కొందరు లోకాయతికులు, పార దారికులు. విడాకుల చట్టమే ఎందుకు?

"నష్టే మృతే ప్రవ్రజితే
క్లీబేచ పతితే పతౌ
పంచ స్వాపత్సు నారీణాం
పతి రన్యో విధీయతే"

అని పరాశరుడు చెప్పే ఉన్నాడు. విధవలుకూడా నియోగంవల్ల ఒక్క కొడు కును కనవచ్చునని మను వన్నాడు. కొన్ని కులాలలో ఓలి యిచ్చి మారుమనువు చేసుకొనడం భారతదేశమంతటా ఉంది ఎంతోకాలంగా. కొన్ని వీథి మొదలయిన రూపకోపకాలలో పునర్భువు నాయికగా ఉండడం భరత శాస్త్రసమ్మతం.

కాని, ప్రణయం స్నేహపరాకాష్ఠ అనుకోడంవల్ల, అలాటి ఆచారం గౌణం అనుకోవడంవల్ల, సంఘవ్యాప్తం కాలేదు. నేడు పాశ్చాత్యులు కూడా విడాకులవల్ల వైవాహిక జీవితం వ్యవస్థితం కాకపోగా కొత్తచిక్కులు తలఎత్తు తున్నాయంటున్నారు. కనుక విడాకుల చర్చను వదలిపెడదాం.

"భద్రం ప్రేమ సుమానుషస్య కథమ
ప్యేకం హి త త్ప్రాప్యతే"

# విమతులకు పులి, విశ్వాసభాజనులకు చెలి

"ఢిల్లీ సుల్తాన్ పట్టుకు పోతాన్!
ఆరు నెల్లకు పట్టుకుపోతాన్!
ఇదిగో ఇప్పుడే పట్టుకుపోతాన్!''

అన్న పిచ్చివాని కేకలు ఎరుగని ఆంధ్రు డుండడు. తరం క్రిందట ఈ కేకలు యావదాంధ్రంలోను మారు మ్రోగేవి. నేడు కూడా జనరంజక మవుతున్నాయి.

ధీరశాంతుడైన ఒక మంత్రి నోట వెలువడి, రెండు విరుద్ధ పాత్రల గుణాలను ఏకముఖాన సంఘటించి, రసభంగానికి మారు రసపోషణ కావించిన ఈ కేకలను సృష్టించి, సంస్కృత నాటకాల సంప్రదాయానుసారంగా పాత్రోచిత భాషను తొలిసారిగా వాడిన మహాప్రజ్ఞ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారిది, దేశ క్షేమానికి భాషా క్షేమం పునాది అని చాటిన సత్యదృష్టి వారిది.

ఆంధ్ర వాఙ్మయ నవయుగ వైతాళికులలో ఒకరు శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు. "కవి పండితుడు కాదు. పండితుడు కవి కాదు" అనే అపవాదు శ్రీ శాస్త్రిగారివల్ల అపాస్తమైనది. వారు ఒక వ్యక్తి కాదు - సంస్థ. వారు భిన్నరుచులు గలవారిని తనియింపజేసిన మహా రచయితలు. కథా ప్రియులను దశకుమార చరిత్రము, కథా సరిత్సాగరము మొదలయిన వాటితోను; నాటక ప్రియులను నాటకాలతోను; వ్యాఖ్యాన ప్రియులను నైషధాముక్తమాల్యాదివ్యాఖ్యలతోను; సాహిత్య విమర్శకులను శారదా కాంచికతోను; సల్లాప ప్రియులను చమత్కార సంభాషణలతోను సంతోషపెట్టిన బహుముఖ ప్రజ్ఞాశాలులు వారు. ఆ నాడు చెన్నపురిలో పలువురికి సింహ స్వప్నంగా ఉన్న ఉద్దండ పండితులు వారు.

వారు 1853 డిసెంబర్ 21 తారీఖున చెన్నపట్టణంలో జన్మించారు. వారి తండ్రి వేంకటరమణ శాస్త్రిగారు సంస్కృతాంధ్రాలలో గొప్పపండితులు. వారు పరవస్తు చిన్నయ సూరికి సహపాఠులు. వారు ఉద్యోగవశాన పలు పట్ట

ణాంలో నివసించవలసి వచ్చింది. వారితోపాటు వేంకటరాయ శాస్త్రిగారూ చిన్న తనంలో తెలుగు దేశంలో పెక్కు పట్టణాలలో గడపవలసి వచ్చినందున వారికి చిన్నప్పటినుంచే ఆయా ప్రాంతాల ఏసలు, బలుకుబళ్ళు పరిశీలించే పాటవం కలిగి, అది తర్వాత తర్వాత నాటకాలలో ప్రతిఫలించింది.

శ్రీ వేంకటరాయ శాస్త్రిగారు బాల్యంలో తండ్రిగారివద్ద, పిదప స్వయం కృషితోను పాండిత్యం గడించారు. రాజమండ్రిలో ఎఫ్. ఎ. పరీక్షలో ఉత్తీర్ణు లయ్యారు. వారూ తండ్రిగారిలాగే వివిధ ప్రాంతాలలో ఉద్యోగాలు చేశారు. దీని వల్లకూడా వారికి లోకవృత్త పరిశీలనం సూక్ష్మంగా జరపడానికి అవకాశం కలిగింది.

అప్పటికింకా వారికి పేరు ప్రతిష్ఠలు అంతగా రాలేదు. అప్పుడు వీరేశ లింగంగారు ప్రారంభించిన విధవా వివాహోద్యమాన్ని ప్రతిఘటించడంతో బాద కోవిదులలోను, మహాపండితులలోను వారిపేరు ఎక్కింది. 'శ్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణం' అనే గ్రంథం ప్రకటించారు. దీనివల్ల వారి జీవితం కొత్త దారి తొక్కింది. పాండిత్యం వారికి ఆపర్ట్, మిల్లర్‌వంటి పాశ్చాత్య విద్వాంసు లతో మైత్రి కలిగించింది. దీని ఫలితంగా 1887 లో వారికి క్రిస్టియన్ కళా శాలలో సంస్కృతోపాధ్యాయ పదవి లభించింది. 1890 లో జ్యోతిష్మతీ ముద్ర ణాలయం నెలకొల్పి గ్రంథాలు ముద్రించారు. క్రిస్టియన్ కళాశాలలో ఇరవై నాలుగు సంవత్సరాలపాటు పనిజేసి, 1910 లో విరమించారు. ఈ ఇరవైనాలుగు ఏండ్లపాటూ, తర్వాతనూ, వారు సాగించిన సారస్వత జీవితం ఆంధ్ర వాఙ్మ యంలో చిరస్థాయి అయింది.

శాస్త్రిగారు స్వతంత్రులు; ఇచ్చకం కోసం తల ఒగ్గినదిలేదు. ఉద్యోగ ధర్మం చక్కగా నిర్వహించేవారు. అధికారులు మర్యాదకు వెలితిగా ప్రవర్తిస్తే విసరికొట్టేవారు. నిర్భీకులు. తమ స్వాతంత్ర్యానికి భంగకరమైన పనులు తల పెట్టేవారేకారు వారు "విమతులకు పులి, విశ్వాస భాజనులకు చెలి." వారి నిర్భీకతను గురించి రెండు ఘటనలు తెలపడం అప్రస్తుతం కాదు.

వారు చోడవరం తాలూకా స్కూలు హెడ్‌మాస్టరుగా ఉన్నప్పుడు ఆ స్కూలులో పేరిగాడనే ప్యూను ఉండేవాడట. వాడు సరిగ్గా పనిచేయక నిద్ర పోయేవాడట. ఉపాధ్యాయులు ఏమీ చేయలేక పోయేవారట. వాడికి బుద్ధి చెప్ప దలచి ఒకనాడు శాస్త్రిగారు వాడు నిద్రపోతుంటే బెత్తంతో కొట్టారట. వాడు సెక్రటరీ వద్ద మొర పెట్టుకున్నాడు. సెక్రటరీ శాస్త్రిగారిని తన ఇంటికి రమ్మని కబురంపాడట. "మేము ఇందుకోసము సెక్రటరీగారి ఇంటికి రాము. ఈ విష యమున మా యింటికి వారు రావచ్చు. లేదా, స్కూలుకు వచ్చి మాట్లాడవచ్చు" అని శాస్త్రిగారు సమాధానం పంపారట. సెక్రటరీ లొంగక తప్పలేదు.

క్రిస్టియన్ కాలేజీలో వేసవిలో ఒకనాడు శాస్త్రిగారు పాఠం చెబుతున్నారట. తరగతిలో విద్యార్థి ఒకడు నిద్రపోతున్నాడు. ప్రిన్సిపాలు వారి అనుమతి లేకనే తరగతిలో ప్రవేశించి, ఆ విద్యార్థిని లేపి, "Do you allow the boys to sleep in the class?" అని అడిగారట. తమ అనుమతిలేకనే ప్రిన్సిపాలు తరగతిలో ప్రవేశించినందుకు శాస్త్రిగారు కోపంతో 'I do my duty' అని సమాధాన మిచ్చారు. ప్రిన్సిపాలు ఏమీ చెప్పక వెళ్ళిపోయారు.

శాస్త్రిగారు స్వయంగా పెక్కు పుస్తకాలు ముద్రించడంవల్ల, గ్రంథాలు సేకరించడంవల్ల, కుటుంబ బాహుళ్యంవల్ల ఋణగ్రస్తులయ్యారు. శ్రీనాథుడు "ఎట్లు చెల్లింతు టంకంబు లేడు నూర్లు?" అని దుఃఖించాడు. శాస్త్రిగారు ఆముక్తమాల్యదను వ్యాఖ్యానంతోసహా ముద్రించి, అసలు ఫాయిదాలతో సహా ఏడువేలు అప్పుపడి తీర్చలేక బాధపడ్డారు.

''అయిదువేలు పట్టె నచ్చు వేయింపగా,
నందు రెండువేల కప్పువడితి;
దాని దీర్పలేక తంటాల నున్నాడ;
శర్వు డొకడె నాకు శరణమింక.
అప్పుతీర్చి, ఆత్మ ఆత్మలో నలయించి,
మూడవస్థలందు మోహ ముడిపి,
సచ్చిదాదులందు సాక్షాత్స్వరూపత
బరగ నా సమాధి భాగ్యమెపుడో !"

అని వారు వాపోయారు. నెల్లూరు ప్రముఖులైన వారి రెడ్డి మిత్రులు ఆ ఋణం తీర్చి, వారిని ఋణవిముక్తులు చేశారు. ఆ సంతోషంలో వారు కొన్ని నిమిషాల పాటు ఏడ్చారట. పిదప నిశ్చింతగా 76 వ ఏట (1929 జూన్ 18 వ తేదీన) కీర్తికాయులయ్యారు. ఇది రేఖామాత్రంగా వారి జీవిత సంగ్రహం.

వారి సారస్వత జీవితం వైవిధ్యంతో విలసిల్లేది. వారు సవ్యసాచిగా అటు అనువాదాలు, ఇటు స్వతంత్ర రచనలు సాగించారు. సంస్కృత భాష అందరికీ అత్యంతావశ్యకమని, ఉపాధ్యాయ నిరపేక్షంగా నేర్వదలచిన వారికి వీలుగా ఉంటుందని వారు భోజ విక్రమార్క చరిత్రలు, హితోపదేశం, మేఘ సందేశం, భర్తృహరి సుభాషితాలు, రఘువంశ కుమారసంభవాలలో మొదటి కొన్ని సర్గలు, అమరుకం, రసమంజరి, పుష్పబాణవిలాసం మున్నగువాటిని తెలుగు టీకా తాత్పర్యాలు వ్రాసి ప్రకటించారు. కథాసరిత్సాగరం, దశకుమార చరిత్ర అనువదించారు.

ఈ ధోరణిలోనే సారంగధర చరిత్ర, విజయ విలాసం, హరిశ్చంద్ర ద్విపద మొదలయిన తెలుగు కావ్యాలకూ లఘుటీక వ్రాశారు. శృంగార నైషథానికి సర్వంకషవ్యాఖ్య, అముక్తమాల్యదకు విపుల వ్యాఖ్య రచించారు. దీనిని ముద్రించినపుడు వారు-

"ఇన్ని కడగండ్ల పాలయి యిపుడు దీని
నచ్చు పొత్తంబు కాగంటి హర్షమొసగ"

అని వ్రాసుకున్నారు. దీనిని వారు నాలుగు నెలల్లో ముద్రించారు. ఇంతటి మహా వ్యాఖ్యాకారులను నెల్లూరి వర్ధమాన సభవారు "అభినవ మల్లినాథ" బిరుదంతో గౌరవించడం ఆశ్చర్యమేమీ కాదు. ఆంధ్ర విశ్వవిద్యాలయం "కళా ప్రపూర్ణ" బిరుదంతో సన్మానించింది. ఈ కళాప్రపూర్ణ బిరుదం వీరితోనే ప్రారంభ మయింది.

అది తెలుగులో స్వతంత్ర నాటకాలు పొటమరించే నవయుగం. శాస్త్రిగారికి నాటక రచనాభిలాష కలిగింది. "షేక్స్పియర్ కాళిదాసులను చదివి ఆశ్చర్యపడి నాటక రచనాభిలాష వహించితిని... సంస్కృత నాటకములను చదువగా నాటక రచనాభిలాష పొడమినది. నాటక రచనము నాకు శక్యమే అని తలంచితిని... స్వతంత్ర కల్పనకు వెనుదివిసి, తొలుత అభ్యాసార్థము నాగానందము నాంధ్రీకరించితిని ... నీరసమగు నా వ్రాతలేల? కాళిదాసాది మహనీయుల కవన రసము కరతలామకము గావించుట వాస్తవమైన భారతీ సేవ అని యెంచి శాకుంతలాది గీర్వాణ నాటకముల ఆంధ్రీకరించితిని" అని వారు ఒకచోట తెలుపుకున్నారు. ఈ నిర్ణయం మేరకు వారు నాగానందం, శాకుంతలం, ప్రియదర్శిక, మాళవిక, ఉత్తర రామచరిత్ర, విక్రమోర్వశీయం, రత్నావళి—ఈ ఏడు నాటిక నాటకాలు తెలిగించారు. ఇంగ్లీషు కింగ్ లియర్ కూడా కొంత తెలిగించి ఆపివేశారు. ఈ అనువాదాలలో పాత్రోచితంగా భాషను వాడి, కొత్తదారి చూపారు. దీనిని అప్పటి పండితులందరూ మెచ్చారు.

వారు కేవలం అనువాదాలతోనే తనియలేదు. అనువాదాలు వారికి స్వతంత్ర నాటక రచనకు శిక్షణ ప్రాయాలు మాత్రమే. చిన్ననాడు తమ తండ్రిగారివద్ద విన్న ప్రతాపరుద్ర కథ ఆధారంగా ప్రతాపరుద్రీయం (1897), ఉషాపరిణయం, బొబ్బిలి నాటకం స్వతంత్రంగా రచించారు వీటిలో ప్రతాపరుద్రీయం వారికి శాశ్వత కీర్తి తెచ్చింది.

ఢిల్లీ సుల్తాన్, సర్వసేనాపతి అయిన వలీఖాన్ పేటకు వచ్చి, అడవిలో అలసి నిద్రిస్తున్న ప్రతాపరుద్రుణ్ణి బందీగా చేసి ఢిల్లీకి తీసుకొనిపోవడం, అతని మంత్రి యుగంధరుడు పిచ్చివాని వేషంతో ఢిల్లీకి పోయి, ఆరునెలలపాటు "ఢిల్లీ

సుల్తాన్ పట్టుక పోతాన్" అని కేకలువేస్తూ, వీథుల్లో తిరుగుతూ, వలీఖాన్ పోలి కలకు మోసపోయి, ప్రతాపరుద్రునికి మారు చాకలి పేరిగాణ్ణి పట్టుకు వచ్చాడనే అపవాదు పుట్టించి, వలీఖాన్‌ను మోసంతో చంపించి, రాజును విడిపించి, సుల్తానును కూడా తీసుకువస్తాడు.

దీనిలో పేరిగాడు లోగడ తెలిపిన స్కూలులోని ప్యూను పేరిగాడే. ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడు ఒకచోట "నేను కండభీమను, ఏమనుకున్నావో? పట్టుకుంటే, వదలను" అని అంటాడు. ఈ మాటలు వారు విశాఖపట్టణంలో ఉన్నప్పుడు పొరుగింటి ముసలి మగడు, పడుచు భార్యను అంటున్న మాటలట. వాటిని పిచ్చివానికి వాడారు. ప్రతాపరుద్రీయంలోని మహమ్మదీయ పాత్రల భాషకు ఆధారం చిన్ననాడు తమ తండ్రిగారి మిత్రుడు ఒక సాహేబు మాటలేనట. ఆ సాహేబు "అ అరాబియా దేశంలో వఖ్ వజీర్" అనే తీరుగా మాట్లాడేవాడట. అట్లే బొబ్బిలి నాటకంలోని సారాదుకాణాదారు బొడ్మిన్ విశాఖపట్టణంలోని ఒక సారా దుకాణదారుడట. 'జహోవా' అని బుస్సీ పలికే మాటకూడా ఎవరి అలవాటు నుంచో సంగృహీతమే.

పేరిగాడు తెలుగు సాహిత్యంలో శాశ్వతుడై పోయాడు—పేరిగాని రాజ్యం, పేరిగాని సంగీతం, సారాసపు తాడు - అని.

నాటక కర్త ప్రయోక్తగా ఉన్నప్పుడే నాటకాలు రాణిస్తాయి. శాస్త్రిగారు ఈ రహస్యం తెలిసినవారు గనుక "ఆంధ్రాభిమాని సమాజం" అనే నాటక సంఘం స్థాపించి (1896) నాటకాలు ప్రచారం చేశారు. 'భారత రూపక మర్యాదలు' అనే వ్యాసంలో వారు నటులకు ఎన్నో సలహాలిచ్చారు. ముప్ఫయి సంవత్సరాలపాటు నాటకాలు ఆడించారు.

శాస్త్రిగారికి పండితులలో ద్వేష్యవర్గం సిద్ధపరచింది 'శారదాకాంచిక.' ఈ శీర్షికలో ప్రథమ కింకిణి, ద్వితీయ కింకిణి అని వరుసగా సమకాలిక పండితులను, వారి గ్రంథాలను విమర్శించారు. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి రచనలను, వ్యవహారభాషను, ధర్మవరం రామకృష్ణమాచార్యులవారిని విమర్శించారు. శాస్త్రిగారి గ్రంథాలపై గిడుగు రామమూర్తి పంతులుగారు 'భాషాభేషజం' తోను, శ్రీ దీపాలపిచ్చయ్య శాస్త్రిగారు 'జితకాశి' తోను దుమ్ము తూర్పారపట్టక పోలేదు. (గిడుగు వారికి శాస్త్రిగారు సరైన సమాధానం ఇవ్వలేదు)

శాస్త్రిగారిని ఆంధ్ర సారస్వతసభ 'మహోపాధ్యాయ' బిరుదుతో గౌరవించింది. పూరీ శంకరాచార్యులవారు 'సర్వతంత్ర స్వతంత్ర' బిరుదంతో సత్కరించారు.

శ్రీ శాస్త్రిగారి సారస్వతసేవను వారి మనుమలు శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు కొనసాగిస్తున్నారు, వారిలాగే ఇతర సాహాయ్య నిరపేక్షంగా పుస్తకాలు ప్రచురిస్తూ, చరిత్ర పరిశోధన జరుపుతూ సరస్వతీ సేవ చేస్తున్నారు.

# తెలుగునాట తొలినాటకం - క్రీడాభిరామం

నాటికీ, నేటికీ దేశానికి కొత్త తెన్నులు చూపుతూ అభ్యుదయ పథంలో అంగలు వేస్తున్న తెలుగునాట, భావుకత పొంగిపొర్లే తెలుగు జాతికి మొన్నటి దాకా నాటకాలు లేవంటే నమ్మడ మెలా? కనిపించినదాని నంతా కవిత్వంతోనే కనులపండువు చేసుకుంటూ కలలుగాంచే తెలుగువాడు దృశ్యకావ్యాన్ని భావించక పోయాడంటే, ఒప్పుకోడ మెలా? నేటివలె-నాడుకూడా "పైవారి" ఉపేక్షే మన నాటకాలు ఖిలమైపోవడానికి కారణమై వుంటుంది.

ఇంగ్లండులో పదిహేడో శతాబ్దిని ఒక వింత జరిగింది. నాటకాలు చూచి ప్రజలు పతితులైపోతారనే భయంతో సనాతనులు (ప్యూరిటనులు) నాటకాలపై కత్తి కట్టారు. నాటక ప్రదర్శనాలకు అవకాశమిస్తే గదా ఈ చిక్కు?-అనే అభిప్రాయముతో దేశంలో వున్న రంగస్థలాలన్నిటినీ మూయించివేశారట. మన సనాతనులు-స్మృతికారులు ఆ ప్యూరిటనులకన్న రెండాకు లెక్కువ చదివిన వారే. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" (కావ్యాలాపాలు కూడదు. వాటిని మానాలి) అని శాసించారు. నటులు అపాంక్తేయులని బహిష్కరించారు. అయినా, అభినవ గుప్తాచార్యుడు ప్రకరణాంతరంలో అన్నట్టు భరతముని కాలంనుంచి నేటివరకు మహానటులూ వున్నారు, నాట కకళా నశించలేదు. (కింతు ప్రథమానాట్యావసర క్రమ ప్రవత్త విరించి వచన ప్రవర్తక భరతముని శాసనానువర్తి శిష్య పరంపరా పరిచయా గతావ్యతన కాలావధి మహానటజన స్వక ప్రవృత్తి విశేషోపదేశపరం )దీనికి కారణం నాటక కళ మానవ జీవితంతో రంగరించుకొని పోవటమే.

కళల కన్నిటికీ అనుకరణం మూలమైనట్టే, నాటక కళకు కూడా మూలం అనుకరణమే. కారు మబ్బులు చూచి మత్తిల్లి నర్తించే నమిళ్ళు, కలకలలాడే కోయిలలు, చీమచిటుక్కుమనినా బెదరిపోయే లేళ్ళు, ఆది మానవునికి భావ రాగ తాళాలను నేర్పివుంటాయి. అయినప్పుడు మానవజాతి తొలి సాహిత్యభండార మైన వేదంలో రూపక బీజాలు కానరావడంలో వింతేముంది?

ఋగ్వేదంలోని సరమా - ఫణి సంవాదం, యమ - యమీ సంవాదం. పురూరవ - ఊర్వశీ సంవాదం మన రూపకాలకు తొలిచ్ఛాయలు. పివప ఎన్న

దగినవి. బృహదారణ్యకంలోని విదుషి, వాచక్నవి అయిన గార్గి యాజ్ఞవల్క్యుని తోను, అతని పత్ని మైత్రేయితోను జరిపిన బ్రహ్మ మీమాంస. ఇవన్నీ ఛాయా మాత్రాలు. కాని, పాణిని కాలానికి నాటకాలు ప్రచురంగా వుండడం మాత్రమే కాక, నాట్యసూత్రాలను కృశాశ్వ, శిలాలులనేవారు రచించినట్టు అష్టాధ్యాయే సాక్షి.

ఇక, రామాయణ రచనాకాలానికి శైలూషులు, సమాజాలు (నాటక మందిరాలు), నాటకాలు వున్నట్టు పెక్కు నిదర్శనాలు కలవు. ("స్వయం తు భార్యాం కౌమారీం చిర మధ్యుషితాం సతీం, శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతు మిచ్ఛసి" - అయోధ్య. వాదయంతి తదా శాంతిం లాపయం త్యపి చాపరే. నాటకాన్యపరేస్మాహుర్హాస్యాని వివిధాని చ - అయోధ్య.) అరాజకం వుంటే ప్రహృష్టులైన నటనర్తకులు ఉండరు. దేశాన్ని అభివృద్ధికి తెచ్చే ఉత్సవాలు, సమాజాలు (రంగస్థలాలు) పెంపొందవని వాల్మీకి మరొకచోట అంటాడు. (నారాజకే జనపదే ప్రహృష్ట నటనర్తకాః, ఉత్సవాశ్చ సమాజాశ్చ వర్ధంతే రాష్ట్ర వర్ధనాః. అయోధ్య.)

బౌద్ధయుగంలో రకరకాల రూపకాలు వెలసినవి. బుద్ధుడు స్వయం నాట్య శాస్త్రవేత్త అని "లలిత విస్తరం"లో (బుద్ధుని తొలి జీవిత చరిత్రలో) వున్నది. బుద్ధుడు రాజగృహంలో వున్నప్పుడు ఆయన శిష్యులు మౌద్గల్యాయనుడు. ఉపతిష్యుడు తమ నటన కౌశలం చూపారట. బింబిసారుని ఆస్థానంలో నాగరాజుల గౌరవార్థం నాటకం ప్రదర్శించబడిందట. బుద్ధుని ఎదుట రాజగృహంలో "కువలయ" అనే దాక్షిణాత్య నటి ఆయన చరిత్రనే అభినయించిందట. కుశ జాతకం, ఉదయజాతకం, కనవేర జాతకం మున్నగు జాతక కథలలో నట, సమాజ, నాటకాల ప్రసక్తి పెక్కుసార్లు వచ్చింది. అశోక చక్రవర్తికి నాటకాలంటే చాలా ఇష్టమన్నట్టు గిర్‌నార్ శాసనంలో ఉల్లేఖించబడింది. ఉత్సవాల్లో నాటకాలు ఆడేవారని మహావంశంలో ఉదాహరించబడింది. అశ్వఘోషుడు సారి పుత్రుని బౌద్ధమత దీక్షను ప్రకరణంగా రచించాడు.

వేదాలలో రూపక బీజాలున్నవి కనుకనే బ్రహ్మ ఋగ్వేదంనుంచి వాచికాన్ని, సామవేదంనుంచి సంగీతాన్ని, యజుర్వేదంనుంచి అభినయాన్ని, అధర్వణవేదంనుంచి రసాలను గ్రహించి, సార్వవర్ణికమైన నాట్యవేదమనే పంచమ వేదాన్ని ప్రవచించాడని భరతుడు తన నాట్యశాస్త్రంలో వివరించాడు. (జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యో గీత మేవ చ. యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణా దపి వేదోపవేదైః. స్సంబద్ధో నాట్యవేదో మహాత్మనా. ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా, లలితాత్మకం. న వేదవ్యవహారోయం సంశ్రావ్యః శూద్రజాతిషు, తస్మాత్సృజాపరం వేదం పంచమం సార్వవర్ణికం.)

వివిధ రూపాలలో వున్న ఈ రూపకాలను వింగడించినవాడూ తొలుత భరతుడే. అతడు రూపకాలలో పది ప్రధాన భేదాలను, 14 ఉప భేదాలను తెలిపాడు. తర్వాతి వాడయిన ధనికుడు తన దశరూపకంలో భరతుని పద్ధతినే అనుసరించాడు. కోహలుడు పది ప్రధాన రూపకాలను, ఇరవై ఉప రూపకాలను; భావ ప్రకాశనంలో శారదా తనయుడు పది రూపకాలను, ఇరవై ఉప రూప కాలను; విశ్వనాథ కవిరాజు సాహిత్య దర్పణంలో పది రూపకాలను, పద్దెనిమిది ఉప రూపకాలను; వేమ భూపాలుడు సాహిత్య చింతామణిలో మొత్తం ఇరవై రూపకోప రూపకాలను; సర్వజ్ఞ సింగ భూపాలుడు రసార్ణవ సుధాకరంలో పది రూపకాలను నిర్వచించారు. లాక్షణికుల సమకాలిక మానవజాతి చిత్తవృత్తి ఈ రూపకాల పరిగణనకు కారణం కావచ్చు.

కోహలుడు ఉపరూపకాలలో మార్గి, దేశి అనే భేదాలు వివరించి విశిష్టత సంపాదించుకున్నాడు. ఇతని ఉపరూపకాలలో పది మార్గీ రీతివి:- నాటిక. ప్రక రణిక, భాణిక, హాసిక, వియోగిని, డిమిక, కలోత్సాహవతి, చిత్ర, జుగుప్సిత, చిత్రతాళ. వీటిలో నాట్యం కాని, సంగీతం కాని వుండదు. దేశీరీతివి నృత్యసంగీత ప్రధానాలు; డోంబిక, భాణకం, ప్రస్థానం, షిద్గకం, భాణిక, ప్రేరణం, రామ క్రీడ, రాగకావ్యం, హల్లీసం, రాసకం. వీటిలో తుది ఆరు సుకుమార నృత్యాలట.

అర్వాచీన అలంకారికులకు మార్గదర్శకుడైన సాహిత్య దర్పణకారుడు నాటకం, ప్రకరణం, భాణం, ప్రహసనం, డిమం, వ్యాయోగం, సమవకారం, వీథి, అంకం, ఈహామృగం అనే రూపకాలకు, నాటిక, తోటకం గోష్ఠి, పట్టకం, నాట్యరాసకం, ప్రస్థానం, ఉల్లాస్యం, కావ్యం, ప్రేక్షణం, రాసకం, సంలాపకం, శ్రీగదితం, శిల్పకం, విలాసిక, దుర్మల్లి, ప్రకరణిక, హల్లీశం, భాణిక - అనే ఉపరూపకాలను చెప్పాడు.

ప్రధాన రూపకాలలో ఐదు - భాణం, ప్రహసనం, వ్యాయోగం, అంకం, వీథి ఏకాంకిక లైనట్లే; ఈ ఉపరూపకాలు పద్దెనిమిదింట పది - గోష్ఠి, నాట్య రాసికం. ఉల్లాస్యం, కావ్యం, ప్రేక్షణం, రాసకం, శ్రీగదితం, విలాసిక, హల్లీశం, భాణిక - ఏకాంకికలు కావడం గమనించదగింది. భాణం, వీథివంటి ఏకపాత్రాభి నయం, ఏకపాత్రానుకృతిగల ఏకాంకికలు సంపూర్ణ నాటకానికి మూలమయి వుంటాయి. మొదటి అపరిష్కృత నాటకాన్ని భాండమని, పరిష్కృత నాటకాన్ని నాట్యమని వ్యవహరించే వారని అభినవగుప్తాచార్యు డన్నాడు. (తస్యశాస్త్రం శాసనం బాహ్యా భాండ నాట్యాది వైలక్షణ్యేన సమ్యక్ తత్స్వరూపాగవ మోపాయం.)

ఏకాంకిక లన్నిటిలోను తక్కిన రూపకాలకు వీథి మూల మనడానికికూడ ప్రధాన కారణ మిది. అలంకారికులు చెప్పిన వీథిలక్షణాలన్నీ దాదాపు ప్రస్తావ నాంగాలే. ప్రస్తావన నాటకానికి ఆముఖమైనప్పుడు వీథి రూపకాలకు మూలమనడం అసమంజసం కాదు.

వీథి అంటే, బజారు. బజారులో వివిధ వస్తువులను చూస్తూ వెళ్ళే తెరువరి వలె, వీథీరూపకంలో నటుడు వివిధ రసాలను వరుసగా సూచిస్తూ, వివిధ వస్తువు లను వర్ణిస్తూ సామాజికులను రంజింపజేస్తాడు. (వీథివ నాన్నా రసానాం చ అత్ర మాలారూపతయా స్థిరత్వా ద్వీథీ - సాహిత్యదర్పణం.)

దశరూపక కారుడు మొదలు సింగభూపాలుని వరకు లాక్షణికులు నిర్వ చించిన వీథీ లక్షణ సారాంశమిది: "వీథీరూపకంలో శృంగారరసం ప్రధానం. అదికూడ సూచ్యం. తక్కినరసాలు స్పృశించవచ్చు. ఒకే అంకం వుండాలి. ముఖ, నిర్వహణ సంధులు చాలును. ఒకడు గాని ఇద్దరు గాని పాత్రలుండాలి. వృత్తి కైశికి, ఆముఖానికి వుండే వీథ్యంగాలు తప్పవు. లాస్యాంగాలు వుంచినా వుంచవచ్చు, లేదా మానవచ్చు. నాయిక అనురాగవతి అయిన సామాన్య, లేక పరకీయ. వీథ్యంగాలు ఎక్కువగా గల వస్తువైనందున కులస్త్రీని నాయికగా వర్ణించరాదు."

దీనికి ఆముఖానికి సమానంగా వుండితీరాలన్న అంగాలు పదమూడు; ఉద్ఘాత్యకం, అవలగితం, ప్రపంచం, త్రిగతం, ఛలం, వాక్కేళి, ఆదిబలం, గండం, అవస్కందితం, నాళిక, అసత్ప్రలాపం, వ్యాహారం, మార్దవం (మృదవం).

సంస్కృత సాహిత్యంలో వీథి రూపకాలెన్నో వెలసివుంటాయి. కాని మన కిప్పుడు లాక్షణికులు తమ గ్రంథాలలో ఉదాహరించిన పేర్లు తప్ప లభించడం లేదు. శారదా తనయుడు బకుళ వీథిని, ఇందులేఖను (యథా బకుల వీథీస్యా దిందులేఖా దయో యథా), సాహిత్యదర్పణకారుడు మాళవిక వీథిని, సింగభూపా లుడు మాధవీ వీథికను పేర్కొన్నారు. మాలతిక, కామదత్త అనే మరి రెండు వీథులపేర్లు వింటున్నాము. ఇప్పటికి మూడు పద్యాలన్నా దొరికిన మరొక వీథి ప్రేమాభిరామం. ఇది రావిపాటి త్రిపురాంతకుడు రచించినది. ఈయన కృతులలో త్రిపురాంతకోదాహరణం మాత్రమే మనకు పూర్తిగా లభించినది. ఈ ప్రేమాభి రామమే శ్రీనాథుని క్రీడాభిరామానికి మాతృక (చూడుడు :- క్రీడాభిరామ పీఠిక, పుట 85...)

తెలుగులోను మనకు లభించిన వీథినాటకాలు రెండే మొదటిది శ్రీనాథుని క్రీడాభిరామం. రెండవది విజయనగరాస్థాన విద్వత్కవులు శ్రీ పేరి కాశీనాథ శాస్త్రి గారిది.

తెలుగు లాక్షణికులలో మొదటివాడయిన విద్యానాథుని కాలానికే బహువిధ నాటకాలున్నట్టు బసవపురాణం చాటినా, ఆ లాక్షణికుడు సంస్కృతంపై చూపిన మమతలో తెలుగుపై ఆవంతైనా చూపలేదు. పెదకోమటి వేమరెడ్డి, సర్వజ్ఞ సింగభూపతి తమ సంగీత లక్షణగ్రంథాలలో దేశిగతులను నిర్వచించినా, నాటకాల విషయంలో పక్షపాతం చూపారు. తుదకు నాటక లక్షణం చెప్పిన శ్రేయస్సు తొలిసారిగా చిత్రకవి పెద్దనకు దక్కింది (1550). ఈ పెద్దన తన లక్షణసార సంగ్రహంలో ఇలా అన్నాడు:

"తెలుగున నాటక లక్షణ
మిల నెవ్వరు జేయలేదు వృషదశ్వసుతా
లలితమతి నీదు కృపచే
దెలిసిన యంతయు నొనర్తు దితిజధ్వంసీ"

(తృతీయ 57 పద్యం)

తెలుగులో అన్నిరకాల రూపకాలకూ, నాటకమనే వ్యవహారం ఉండేది. దానిని చిత్రకవి పెద్దన లక్షణబద్ధం చేశాడు.

'నాటకము ప్రకరణము భాణము ప్రహస
నము డిమ వ్యాయోగ సమవకార
ములు వీథియును నంకమును మరి యీహా మృ
గము గూడి దశరూపకంబు లిన్ని
నాటకంబనుపేర బాటిలు నిందుకు
సంధులు గలవైదు సరవితోడ"

(తృతీయ 75)

అతడు చెప్పిన వీథీ లక్షణ మిది:

"ఎనిమిదవ వీథియను నాటకంబునందు గల్పిత మితి వృత్తంబును, ధీరోద్ధత నాయకుండును, శృంగార రస సూచనా మాత్రంబునై యుండు"

(తృతీయ 79)

సీ. శృంగార రసము కైశికవృత్తి భాణవ
దంగంబు లుద్ఘాత్య కాదులయిన
యంగముల్ పదమూట నగును సువీథి య
న్నాటకం బెన్నగ..."

(తృతీయ 90 వ.)

తనే మొదట నాటక లక్షణం చెప్పినట్టు ఈయన గర్వపడినా చెప్పిన దంతా అంతకుముందు దాదాపు నాలుగైదు శతాబ్దాలకే ఆగిపోయి, సంస్కృతాభిమానులయిన కొందరి గోష్ఠిలో మాత్రమే వున్న సంస్కృత రూపకాల లక్షణమే. తెలుగు దేశీ నాటకాలను ఈయన తడవనైనా తడవలేదు. లాక్షణికులు కనులు మూసుకున్నంత మాత్రాన నాటక రచన ఆగిపోయి వుండదు.

ఏతావతా మనకు ఉపలబ్ధమైనంతలో శ్రీనాథుని క్రీడాభిరామమే తొలి తెలుగునాటక మనుకుందాం. రూపకాలకు మూలమనదగిన వీథినే మొదట శ్రీనాథుడు తెలిగించడం కూడా వింతే.

క్రీడాభిరామం బల్లాళ రాజుల రాజధాని అయిన ద్వారసముద్రం నుంచి వచ్చిన నటులు మోపూరి భైరవుని తిరునాళ్ళలో ప్రదర్శించిందట.

"నటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు కవిది వినుకొండమహా
పుటభేదన మీత్రితయము
నిట గూర్చెను బ్రహ్మ రసికులెల్లను మెచ్చన్."

(క్రీడాభి 98 పుట)

ఈ వీథి వస్తుసారం యిది. కాసల్నాటి మాధవుని కుమారుడు, మీసాలప్పయ్య మేనల్లుడు, గోవింద మంచన శర్మ ఓరుగంటిలో తన ప్రియురాలు కామమంజరి అనే పునర్భువుతో వుంటూ, పనివడి పరదేశం వెళ్ళి తన నర్మ సుఖుడు టిట్టిభసెట్టితో తిరిగి ఓరుగల్లు చేరుకుంటాడు. టిట్టిభసెట్టి, మంచన ఒక నాటి వేకువజామున ఏకశిలానగరం వెలిపాళెం మీదుగా ప్రవేశించి నగర వీథులలో వింతలు, విశేషాలు చూచి వినోదించి, రాత్రి కామమంజరి ఇల్లు చేరి నిండు చందురునికి అంజలి ఘటించి కామోత్సవానికి పూనుకుంటారు. నగర వీథులలో కన్పడిన వివిధ విషయాలను ప్రసక్తానుప్రసక్తంగా టిట్టిభసెట్టి వివరిస్తాడు.

ఆ నాటి తెలంగాణా ప్రజల జీవితం, ముఖ్యంగా ఏకశిలానగర వైభవం, నాగరికత ఈ వీథినాటకంలో చిప్పిలుతుంటాయి. ఆ నగరంలోని క్రింది తరగతి వారి ఆచార వ్యవహారాలు, కర్ణాటి పామరిభామ, కర్ణాట కరణ కాంత, కనుమ అవ్వలి కరణకాంత, గానుల కన్నె, కాపుటాలు, జక్కులపురంధ్రి మున్నగు వివిధ కులాల స్త్రీల వేష భాషలు, ఓరుగల్లుకోటపైని గడియారం, పూటకూటిండ్ల భోజనం, పాములాట, పొట్టేళ్ళపోరు, కోడిపోరు, బంతులాట, దొమ్మరాట, అదీ ఇదీ అనేదేమి— ప్రజాసామాన్యం జీవనమంతా నవరత్నాల రాశిగా పోశాడు శ్రీనాథుడు దీనిలో.

దీని రచనాకాలం ప్రబంధాల ప్రారంభ యుగం. అభిజ్ఞాన శాకుంతలవంటి నాటకాన్ని - కాళిదాసు ఏమనుకుంటాడనే భయం కించిత్తైనా లేని - పిల్లలమర్రి పినవీరభద్రుడు ప్రబంధంగా పిండికొట్టిన కాలమది. అందువల్ల ఈ వీథి తెలుగు సేతలోను శ్రీనాథుడు రూపక లక్షణాలను అనుసరించడం కంటే, ప్రబంధపు పోకడలే పోయాడనాలి. పాత్రల అభినయం కోసం కవి సూచనలిచ్చే వాక్యాలు, పాత్రల వాచికం కలగాపులగంగా వున్న పద్యాలు పెక్కుచోట్ల వున్నాయి. (క్రీడాభిరామం పుట 24, 26) ప్రస్తావన, ఇద్దరు పాత్రలు, వృత్తి, నాయిక, శృంగార ప్రధానంగా ఇతర రసాల సూచన ముఖ్యాంశాలను కవి పాటించినట్టుందే గాని, వీథ్యంగాలు పూర్తిగా పాటించినట్టు తోచదు.

ఇక ఈ రూపకం చూచినా, చదివినా కలిగే పర్యవసానమేమిటి? అనే ప్రశ్న వుండనే వుంది. దీనికి కారణం దీనిరచన కేవలం కాముక చిత్తవృత్తితో కామోద్దీపన దృష్టితో జరగడమే. మన నాటకాల లక్ష్యం వినోదం మాత్రమే కాదు, చతుర్విధ పురుషార్థ సాధనకు ప్రజలను ప్రోత్సహించడంద్వారా సంఘ క్షేమానికి తోడ్పడడం. ప్రపంచములోని ఏవస్తువునన్నా ఈ చతుర్వర్గ సాధనకు ఉపదేశికంగా వినియోగించుకో వచ్చునని అన్నాడు భరతుడు. (న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా, నాసౌ యోగో న త త్కర్మ యన్నాట్యే స్మి న్న దృశ్యతే.) అలంకారికులు ఇన్ని రూప కోప రూపకాలలోను నాటకాన్ని మొదట పేర్కొనడం, దాని ప్రాశస్త్యాన్నిబట్టే, తక్కినవన్నీ మానవ మనస్తత్వ విశ్లేషణ కుపకరించేవి మాత్రమే నంటే తప్పేమీ కాదు. అయినప్పుడు భాణం, ప్రహసనం, వీథివంటివి సంఘాభ్యున్నతికి ఎంతవరకు ఉపకరిస్తాయి? - అని ఇప్పటి దృష్టితో మరల ప్రశ్నిస్తే "అప్పటి రచనలను అప్పటి దృష్టితోనే చూడాలి. అప్పటి సంఘంలోని కుళ్ళును చూపడం మాత్రమే శ్రీనాథుని లక్ష్యం" అని జవాబు చెప్పేవారున్నారు.

కాని, సంఘంలోని కుళ్ళును కడిగివేయడానికి ప్రయత్నించక ఆనాటి మృచ్ఛకటికం, దానిలోని శకారుణ్ణి, వసంతసేనను జీర్ణించుకున్న నేటి కన్యాశుల్కం వంటి నాటకాలముందు క్రీడాభిరామం వెలవెలబోదా? అని మనలను ఒక్కొక్కప్పుడు వెన్నాడే విచారాన్ని క్రీడాభిరామం తొలినాటకం కావడం, దాని అపూర్వ రచనా చమత్కృతి కొంత దూరంలోనే వుంచుతాయి. ఇట్టి అనుపమ రత్నపేథిని అర్ధ శతాబ్దికి ముందే అందజేసిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారికి, ఒక తరం క్రింద "ఈ చతురకృతి సమసి పోగూడదను నభిమానముచే" ఆవిష్కరించి విపుల పీఠికతో ప్రచురించిన కీర్తిశేషులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి తెలుగుజాతి అప్పుపడి వుంది.

# త్యాగయ్యగారి కృతులలో రాగ రచనా సమన్వయం

రసభావ వ్యంజనకు రీతి వృత్తిశయ్యాపాకాలు అనుగుణంగా ఉండాలని ఆలంకారికుల ఉపదేశం. శృంగార కరుణ రసాలకు ఆరభటి వృత్తిలాగే వీర రసానికి కైశికీ వృత్తి వ్యంజకం కాకపోగా భజంకం అవుతుందనీ వారన్నారు. కోపం వచ్చినప్పుడు, ఆవేశాలు వచ్చినప్పుడు గట్టిగా మాట్లాడడం మానవ సహజం. అలాగే మంచి విషయాలు, సున్నితమైన విషయాలు చెప్పవలసి వచ్చినప్పుడు, మృదు పదప్రయోగం సహజం. ఈ మానవ సహజ ధర్మాన్ని అనుసరించే ఆలంకారికులూ ఆ విధంగా నిర్ణయించారు.

రచనకు వృత్తి రీతి శయ్యా పాకాలలాగే రాగానికి కూడా తదనుగుణమైన రస సాహిత్యాలు అవసరమని సంగీత శాస్త్రజ్ఞులు అంటారు. ఉద్రేకపరచడానికో రెచ్చగొట్టడానికో వాడవలసిన రాగాన్ని భక్తిభావ ప్రదర్శనకో, కరుణ రస ప్రఖ్యాపనానికో వాడడం ఎబ్బెట్టుగా వుంటుంది. కీర్తనలోని సాహిత్యం-పదప్రయోగరీతి - రసానుగుణంగా లేకపోతే రాగానుగుణం కాక, రాగోద్దిష్టమైన రసస్ఫూర్తికి గాని, భావ ప్రకటనకు గాని సహాయకం కాజాలదు. గొప్ప గొప్ప వాగ్గేయకారులందరూ ఈ రాగ రస సాహిత్యాల సమన్వయం సాధించినవారే. అందులోను, త్యాగయ్య గారి కృతులలో ఈ సమన్వయం యాదృచ్ఛికంగా సహజసుందరంగా విభాసించిందని ఎవరైనా గ్రహించవచ్చు.

ఆయా వృత్తి రీతి శయ్యా పాకాలకు రసవ్యంజకత వున్నట్లే ఆయా రాగాలకు కూడా రసవ్యంజకత వుంది. ఉదాహరణకు కరుణ రసాన్ని ఆహిరి రాగంతోను, గౌళిపంతు రాగంతోను వ్యంజింప చేయవచ్చు. ఈ రాగాలు నిస్సహాయతను, అశక్తతను ధ్వనింపచేస్తాయి. బీభత్సాన్ని, అసహ్యాన్ని వరాళి రాగం వ్యంజింప జేస్తుంది. అద్భుతానికి బేహాగ్ వంటి రాగాలు వ్యంజకాలు. శాంతరసాన్ని శామరాగంతోను, భుక్తిని కేదార గౌళతోను, భైరవితోను వ్యంజింప చేస్తారు. సంతోషాన్ని, ఆనందాన్ని బిలహరి, మోహన రాగాలు

వ్యక్తం చేస్తాయి. వాత్సల్య భావాన్ని నీలాంబరిరాగం వ్యంజింప జేస్తుంది. ఖమాసు భక్తిని, శృంగారాన్ని వ్యంజింపజేస్తుంది. శోకంలోను ఎన్నో అంత రాలు వున్నాయి. అందువల్ల శోకస్థాయిభావమయిన కరుణరసాన్ని వ్యంజింప చేయడానికి ముఖారి, నాదనామక్రియ, పున్నాగవరాళి, ఘంట, అహిరి వంటి రాగాలు సమర్థాలు. అరభి, అఠాణాలు ఆగ్రహావేశాలను వ్యంజింప జేస్తాయి. కదనకుతూహలం వంటి రాగాలు ఎంతో హాయినిచ్చే రసానందాన్ని కలిగిస్తాయి. దేవగాంధారి ప్రార్థనను, అభ్యర్థనను, తత్పరాకాష్ఠ అయిన భక్తిని ఎంతో రమ్యంగా ధ్వనింప జేస్తుంది. ఆనంద భైరవి ఆధ్యాత్మిక మనఃప్రవృత్తిని, విరాగాన్ని, వైరస్యాన్ని, సంసారాసారతను ధ్వనింపజేస్తుంది.

ఈ దృష్టితో చూచినప్పుడు త్యాగయ్యగారు రాగ సంచారంతో పాటు రసానుభూతిని, తద్వ్యంజక రచనా చమత్కృతిని ఏకకాలంలోనే ఎలా వూహించ గలరా - అని ఆశ్చర్యపడవలసి వస్తుంది.

రాగసుధారస పానము జేసి,
రాజిల్లవే ఓ మనసా!
యాగ యోగ త్యాగ
భోగ ఫల మొసంగే ॥రా॥

సదాశివ మయమగు
నాదోంకర స్వర
విదులు జీవన్ముక్తులని,
త్యాగరాజు తెలియ ॥రా॥

ఈ కీర్తన రాగం ఆందోళిక. ఆందోళిక అంటే పల్లకి. ఈ కీర్తన వింటుంటే పల్లకి ఎక్కి సవారి చేస్తున్నట్టు వుంటుంది. కీర్తన పల్లవి పదవిన్యాసం కవితా దృష్టితో చూచినా, మూడు భగణాలు వరుసగా పడి వింతయిన గతిని కల్పిస్తున్నవి. ఈ కీర్తన వింటున్నంత సేపు రాగసుధా రసపానం చేసి ఊగిసలాడి పోతున్నట్టే వుంటుంది.

అలాగే "నిధి చాలా సుఖమా" అన్న కీర్తన. దీని రాగం కల్యాణి. కల్యాణి నెమ్మదిగా ప్రారంభమై మనస్సుకు అంతులేని హాయిని చేకూర్చే రాగం. ఈ కీర్తన కవితాదృష్టిలోను గొప్పది.

బేహాగ్ ఆశ్చర్య రస వ్యంజక మన్నాను గదా! దీనికి త్యాగయ్య గారి "నేనెందు వెదకుదు రా" గొప్ప ఉదాహృతి. కీర్తనంతా అద్భుత రసాన్ని ముద్దకట్టి పడిస్తుంది.

నే నెందు వెదకుదు రా హరి
ఆ నాల్గు మోముల వాని మొర
నాలకించి రాని నిన్ను ॥నేను॥

కలుషాత్ముడై దుష్కర్మయుతుడై
పలుమారు దుర్భాషియై
ఇలలో భక్తాగ్రేస
రుల వేషియౌ త్యాగరాజపూజిత ॥నేను॥

నాలుగు మోములవాని మొరే నీవు వినలేదు. ఇక నాకేమి పలుకుతావు? - అనే ఆశ్చర్యం, దానిలో కొంత బింకం స్ఫురిస్తాయి. రాగానుగుణమైన మాటలు సంతోషంతో పొంకంగా పడ్డాయి.

ఆనంద సంతోషాలను బిలహరి తెలుపుతుందన్నాను. త్యాగయ్యగారి 'కనుగొంటిని శ్రీరాముని నేడు' అన్న కృతి సాధారణంగా వచనంగా చదివినా, ఆయన హృదయంలో అద్దలమై మొగ్గ తొడిగే ఆనంద సంతోషాలు వ్యక్తమవు తాయి.

సంతోషోత్సాహాలను త్యాగయ్యగారు మోహనరాగంతో "నను పాలింప" కృతిలో మహా కమనీయంగా వ్యంజింపచేశారు. ఆ కృతి మామూలుగాను కవితో దాహరణ అనవచ్చు.

నను పాలింప నడచి వచ్చితివో
నా ప్రాణ నాథ!
వనజనయన నీ మోము జూచుట జీ
వనమని నెనరున మనసు మర్మము దెలసి.

సురపతి నీలమణినిభ తనువుతో
ఉరమున ముత్యపు సరుల చయముతో
కరమున శర కోదండ కాంతితో
ధరణి తనయతో త్యాగరాజార్చిత.

చరణంలోని శయ్యా సౌభాగ్యాన్ని సహృదయులు గుర్తిస్తారు.

"రఘునాయక" అన్నది హంసధ్వని రాగం కీర్తన. హంసలు కలియుగంలో లేవని ప్రథ. వాటి కూజితం మనమెవరమూ వినలేదు. కాని, "రఘునాయక" కీర్తన రచనారమణీయకమే హంసధ్వనిని మించిపోయింది.

రఘునాయకా నీ పాదయుగ
రాజీవములనే విడజాల శ్రీ.

అఘజాలముల పారద్రోలి న
న్నాదరింప నీవే గతికాదా! శ్రీ.

భవసాగరము దాటలేక నే
బహు గాసివడి నీ మరుగు జేరితిని
అవనిజాధిపాశ్రితరక్షక
ఆనందకర శ్రీ త్యాగరాజనుత శ్రీ.

సగణ యగణ భగణాలు వరుసగా పడగానే హంసకూజితం పుడుతుంది.

శుద్ధసావేరిలోని "కాలహరణ మేల రా హరే సీతారామ" అనే కీర్తన అభ్యర్థనకు ఎంతగా రూపు కట్టిస్తున్నదో చెప్పనక్కరలేదు.

ఎక్కడో వున్నవారిని పిలిచి మొరపెట్టుకొనడానికి దేవగాంధారి వంటి రాగంకన్నా మించినది లేదేమో! త్యాగయ్యగారి "క్షీరసాగర శయనా" కృతి భక్తుని మొరకే తార్కాణం. అది కవితాదృష్టితోనూ గొప్పది.

క్షీర సాగర శయనా నను
చింతలు బెట్టవలెనా రామ !

వారణ రాజును బ్రోవను వేగమే
వచ్చినది విన్నాను రా రామ !

నారీమణికి చీర లిచ్చినది
నాడే విన్నాను రా రామ!

ధీరుడౌ రామదాసుని బంధము
ద్రెంచినది విన్నాను రా రామ !

నీరజాక్షికై నీరధి దాటిన నీ
కీర్తిని విన్నాను రా రామ !

తారక నామ! త్యాగరాజనుత !
దయతో నన్నేలుకో రా, రామా ! క్షీర ...

దీనిలోని ప్రతి పదమూ మొరను మ్మమ్మరంగా తెలిపేదే.

నా దృష్టిలో "మధ్యమావతి" రాగంలోని "అలక లల్లలాడగ గని" కృతి త్యాగయ్యగారి కవితా కమనీయతకు పరాంకోటులయిన కృతులలో ఒక్కటి. త్యాగయ్యగారు యుద్ధంచేస్తూ రాక్షసులనుపారద్రోలుతూ ఈషణ్మాత్రమైనా శ్రమ చూపని రాముని బాలసుందర వదనాన్ని, లలాట పర్యంత విలంబితాలకమైన దానిని ఊహించి పొంగిపోయారు. ఆ పొంగులు రామలక్ష్మణులకు శస్త్రవిద్యను నేర్పిన విశ్వామిత్రుని దృష్టితో ఊహించారు.

"అలక లల్లలాడగ గని
యా రాణ్ముని యెటు పొంగెనో!
చెలువు మీఱగను మారీ
చిని మదమణచెడివేళ.
ముని కనుసైగ గని శివ
ధనువును విఱచెడి సమయ
మున త్యాగరాజ విను
తుని మోమున రంజిల్లు
అలక లల్లలాడగ గని."

ఇదేమిటి కీర్తనా? కవితా? రాగానుగుణ మయిన, అద్భుత రసానుగుణ మైన పదగుంఫన ఎంత సహజంగా సాగిందో! పల్లవిలోని పూర్వార్ధం కదం తొక్కుతూ నడిచి, అలకలు గాలికి ఎగురుతున్నట్టు కదలి, ఉత్తరార్ధంలో రేచిత గతిని అందుకొంది. దానితో పూర్వార్ధంలో అలకలను చూచినప్పటి ఆసక్తి, ఉత్తరార్ధంలో రాణ్ముని ఎడదలోని పొంగూ కనులకు కట్టాయి. శివధనుస్సును అనాయాసంగా విరిచాడనే భావాన్ని చరణం పూర్వార్ధంలోని లఘువుల రచనతో తెలిపారు కవి త్యాగయ్యగారు.

కేవలం కవితా దృష్టితో చూచినా కదలక నిలబడే కృతులలో ఒక్కటి "కద్దను వారికి."

"కద్దను వారికి కద్దు కద్దని మొరనిడు
పెద్దల మాటలు నే డబద్ధమవునో ,

అద్దంపు చెక్కిళ్ళనే
ముద్దుగాను మోము జూడ
బుద్ధి గల్గినట్టి మా
వద్ద రావదేమి రా!
నిద్దుర నిరాకరించి
ముద్దుగా తంబురబట్టి
శుద్ధమైన మనసుచే
సుస్వరముతో
పద్దు తప్పక భజియించే
భక్తపాలనము చేయు
తద్దయాళాలివి నీవే
త్యాగరాజ సన్నుతా."

త్యాగయ్యగారు రాగావతారం, మహా కవులకు భావానుగుణమైన భాషా, వృత్తమూ సహజంగానే సమకూరి నట్లే, త్యాగయ్యగారి రాగ ప్రస్తారానికి అనుగుణమైన రస భావ భాషలను కృతులు రూపొందించుకున్నాయి. రాగ రస భావ భాషలతో కృతులు సమగ్ర సుందర కుసుమాలుగా వికసించాయి. ఆయన దృష్టి రాగ సుధారసమే కాని కవితారసం కాదు. అయినా, అది కాకతాళీయంగా కాక, సహజసుందరంగా రాగ రస భాషలకు పూవులోని రేకులకు, కేసరాలకు, సౌరభానికిగల సమపొత్తులా సమన్వయం కూర్చింది.

నాకు, సంగీతానికి సగమెరిక. అందువల్ల కవితాదృష్టితో మాత్రమే నేను త్యాగయ్యగారి కృతులను చదివి ఆనందిస్తుంటాను. అవి ఆయనను కవిగానూ కలకాలం నిలుపగల చేవ గలవని నమ్మేవారిలో నేనూ ఒక్కణ్ణి.

# తెలుగువ్యాస పరిణామం
## (1862-1900)

ఆంగ్లభాషా సాహిత్య ప్రభావంతో తెలుగులో వెలసిన సాహిత్య ప్రక్రియలలో వ్యాసం విశిష్టమైంది. ముద్రణ యంత్రాలతో పత్రికలు, పత్రికలతో వ్యాస రచన 18వ శతాబ్దం ఉత్తరార్ధంలో చాల ప్రాచుర్యం పొందింది. ఏ విషయం గురించి సామాన్యులకు చెప్పవలసి వచ్చినా, వ్యాసమే శరణ్యమయింది; కనుక కావ్యనాటకాదులకంటే సర్వసామాన్య ప్రక్రియగా రూపొందింది. అందువల్లనే వ్యాసకర్త గ్రంథకర్తగా పేరుపొందాడు. 1852 నాటికే బ్రౌను ఇంగ్లీషు-తెనుగు నిఘంటువులో Essay అనే మాటకు వ్యాసం అని అర్థమిచ్చి, Essayist అంటే గ్రంథకర్త అని అర్థమిచ్చాడు.[1] వ్యాసకర్తను గ్రంథకర్తగా చెప్పినప్పుడు వ్యాసానికున్న విశిష్టత బోధపడుతుంది. పాశ్చాత్య ప్రభావంతో కలిగిన వచన రచనా వికాసంతో దేశీయ సాహిత్యంలో తొలిసారిగా విరిసిన సాహిత్యప్రక్రియ వ్యాసం అనే అనవచ్చు.

## ఆంగ్ల ప్రభావం

ఇంత ప్రచురము, శక్తిమంతయు అయిన ఈ వ్యాసప్రక్రియ 16 వ శతాబ్దానికి గాని పాశ్చాత్య భాషలలో స్పష్టమైన ఆకృతి ధరించలేదు. మొట్టమొదటిసారిగా ఈ ప్రక్రియ రూపొందింది ఫ్రెంచి భాషలో. దీనిని ఆ భాషలోను ఎస్సే అన్నారు. దీని అర్థం ప్రయత్నం, కృషి. 16 వ శతాబ్దంలో ఉన్న ఫ్రెంచి రచయిత మాన్‌టేన్ మహాశయుడు (Montaugne) తన వచన రచనకు Essay అని పేరు పెట్టాడు. ఈ పదానికి ప్రయత్నం, కృషి, ప్రయత్నించు చిన్న రచన అని అర్థాలలోను తన రచన నూతన ప్రయత్నం, నూతనకృషి అని ఈయన ఉద్దేశమయివుంటుంది. ఈయన 1533-92 లో ఉన్నవాడు. ఈయన తొలి వ్యాసం 1571లో వెలువడింది.[2] అదే పేరును ఆంగ్ల రచయిత ఫ్రాన్సిస్ బేకన్ (1561-1626) స్వీకరించి, ఆంగ్ల సాహిత్యంలో ఈ ప్రక్రియను ప్రవేశపెట్టాడు. ఇది 18 వ శతాబ్దం ఉత్తరార్ధంలో తక్కిన ఆధునిక ప్రక్రియలన్నిటికన్నా ముందుగా తెలుగులో రూపురేఖలు దిద్దుకుంది.

## క్రోడపత్రాలు

అయితే, మన సాహిత్యంలో నేటి వ్యాసానికి మూలబీజాలు లేకపోలేదు. పండితులు వివిధ విషయాలను ఉపన్యసించి సిద్ధాంతీకరించే వాక్యార్థాలు, శాస్త్రార్థాలు, వాటితో ఏర్పడిన క్రోడపత్రాలు ఒక విధంగా వ్యాసాలే. విషయనివేదన, ప్రతిపాదన, వివరణ, ప్రతిపక్షమత ఖండన, స్వమత స్థాపన, ఉపసంహారం వంటి నేటి వ్యాసస్వరూపమంతా చాలవరకు క్రోడపత్రాలలో ఉన్నది. క్రోడమంటే ఒడి, మధ్యప్రదేశము అని అర్థం. ఒక శాస్త్ర విషయంలో విడిపోయినట్టు గ్రంథకర్త గాని ఇతరులు భావించే అంశాన్ని అనుపూర్వితో చేర్చే భాగాన్ని క్రోడపత్రమంటారు.[3] మూలవిషయాలకంటే ఈ క్రోడపత్రాలే మిన్నంగా ఉంటూ మూలకారుని మతాన్ని ఉజ్జ్వలం చేస్తాయి. కాని ఈ క్రోడపత్ర పద్ధతి శాస్త్ర విషయాలకే పరిమితమైనందున, పండిత సాధారణమైనందున తెలుగులో లిఖిత రూపం పొందలేదు. పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్ల కొత్త రూపంలో వికసించింది. దీనికి ముద్రణ, పత్రికలు దోహదమయ్యాయి.

## వ్యాసం స్వరూపం

వ్యాసం అనే పదానికి విరివి అని, ఏదేని ఒక విషయమును విరివిగా వ్రాయుట అని శబ్దరత్నాకరం అంటున్నది.[4] ఈ ప్రక్రియలో ఒక విషయాన్ని గురించి సూటిగా, స్పష్టంగా ఎదుటివాని మనస్సులో హత్తుకొనేట్టుగా విషయ ప్రతిపాదనం ఉండడంవల్ల దీనిని మతప్రచారకులు, సంఘసంస్కర్తలు తమ ప్రధాన ప్రచార సాధనంగా చేసుకొన్నారు. కనుక వ్యాసం 1. అతి దీర్ఘంగా ఉండరాదు, 2. సంగ్రహంగా, క్లుప్తంగా ఉండాలి, 3. వక్తవ్యాంశం విషయ విభాగంతో ఉండాలి, 4. ప్రత్యేక శీర్షికలు ఉండాలి, 5. విషయోద్దేశం నిర్దిష్టంగా ఉండాలి, 6. పుటలు నియతంగా ఉండాలి, 7. భాష నిర్దుష్టం, సుబోధగ్రాహ్యం అయి ఉండాలి, 8. ఉపక్రమ ఉపపాదన ఉపసంహారాలు క్రమంగా పాటించాలి– అనే పద్ధతిలో అభివృద్ధి చెందింది క్రమంగా సాహిత్యేతర విషయాల నుంచి సాహిత్య విషయాలకు, ఇతర సర్వసామాన్య విషయాలకూ ఇది విస్తరించింది నేడు శాఖోపశాఖలై ఇతర ప్రక్రియలన్నిటినీ మించి విరాడ్రూపం దాల్చి సకల సాహిత్యస్వరూపస్వభావావిష్కరణావగాహనలకు కూడ ప్రధానసాధనమయింది.

## ప్రమేయం : సామినేని వారు

ఇది కొత్తరూపంలో అవతరించిన తొలిదశలో ప్రమేయము, సంగ్రహము, ఉపన్యాసము అని వ్యవహృత మయింది. ఈ 'ప్రమేయము' అన్న పేరును తన లఘురచనలకు మొదటిసాగిగా వాడినవారు సామినేని ముద్దు నరసింహ నాయనిం

వారు. ఈయన రాజమహేంద్రవరంలో ఫస్ట్‌క్లాస్ డిస్ట్రిక్ట్ మున్సిఫ్ పదవిలో ఉన్నవారు. ఈయన మచిలీపట్నంనుంచి వెలువడుతున్న హితవాది పత్రికలో (1842-47) ఈ 'ప్రమేయముల'ను మొదటిసారిగా ప్రచురించారు.[5] వీటిని ఈయన కుమారులు రంగప్రసాదు నాయనింవారు 1862 లో 'హితసూచని' అన్న పేరుతో పుస్తకరూపంగా ముద్రించారు. "ఈ లోకమునందు సకల శ్రేయస్కరంబులకు సాధనంబులగు సుగుణ వివేక సంపత్తులకు వలసిన చర్చా విషయము లనేకము లుండినను, వానిలోని కొన్ని విషయములు ప్రజలకు సుబోధకమగునట్లు ముద్రాక్షరాంకితములుగా చేయకుండెడి లోపములను వారింపవలయునని"[6] తమ తండ్రిగారు రచించిన ఈ ప్రమేయములను ముద్రించినట్లు శ్రీరంగప్రసాదు నాయనింవారు ఈ గ్రంథం ముఖపత్రంలో పేర్కొన్నారు. ఈ విధంగా శ్రీ సామినేని ముద్దు నారసింహ నాయనింవారే ఆధునిక తెలుగు వ్యాసానికి ప్రవర్తకులని చెప్పవచ్చు. రంగప్రసాదు నాయనింవారు రాజమహేంద్రవరము జిల్లా డిస్ట్రిక్టు ఆక్టివ్ గవర్నమెంటు వకీలు.

ఈ హితసూచని డెమ్మీ 224 పుటల గ్రంథం. దీనిలో ఎనిమిది 'ప్రమేయములు' - వ్యాసాలు ఉన్నాయి. 1. విద్యాప్రమేయము 2. వైద్యప్రమేయము, 3. సువర్ణ ప్రమేయము, 4. మనుష్యేతర జంతు సంజ్ఞా ప్రమేయము, 5. రక్షః ప్రభృతి ప్రమేయము, 6. మంత్ర ప్రమేయము, 7. పరోక్ష జ్ఞాన ప్రమేయము, 8. వివాహ ప్రమేయము - అని. ఈ ప్రమేయములకు వాడిన భాష అప్పటివారు టీకలకు, పురాణ ప్రవచనాలకు, సామాన్య కథలకు, పత్రికావార్తలకు వాడిన శిష్టవ్యావహారికం కావడం గమనించవలసినది. ఈయన తన 'హిత సూచని' పీఠికలో తాము వాడిన భాషను గురించే ఇలా వివరించారు :

"గ్రామ్యోక్తి ఆంధ్రభాష తాలూకు అంశములలో నొకటిగా లక్షణ గ్రంథములయందు చెప్పబడి యున్నది. ఈ పదములు ఛందోబద్ధములయిన గ్రంథములయందు చేర్చడము అరుదై యున్నది. కాని వాక్యములయందును, భాషయందును, వాటి వాడుక తరుచై యున్నది. కనుక సాధారణమైన భాషయందు వాడుకలోనున్న రచనలో అంగీకరింప తగినవిగా నేను ఎంచుకుంటున్నాను."

ఈ గ్రాంథిక వ్యావహారికవాదం సాహిత్యం ప్రారంభమయినప్పటినుంచి వున్నట్టుంది. శూద్రకుని పద్మ ప్రాభృతకంలో కర్ణీసుత మిత్రుడయిన విటశేఖరుడు శశుడు దత్తకలిసి అనే వైయాకరణుని వెక్కిరిస్తాడు - "ఓ మహానుభావా! కట్టెలతో కొట్టినట్టు నిష్ఠురమైన మారుమూల వ్యాకరణ ప్రయోగాలతో, పిడుగులు రాల్చకు. సరళమైన వ్యావహారిక వాక్కులతో మాట్లాడవయ్యా. ఒంటె త్రేన్పులవంటి కర్కశమైన మాటలను నా చెవుల్లో విషంలాగ పోయ

కయ్యా!" అంటాడు. "నార్హాన్యస్మాన్ ఏవం విధైః కష్టప్రహార నిష్ఠురైః వాగశనిభిః అభిహంతుం. సాధువ్యవహారికయా వాచావద, అభిజనంహివయం ఈదృశానాం కరభోద్గార దుర్గంధానాం శ్రోత్రవిషనిషేక భూతానాం వైయాకరం వాగ్వ్యసనానామ్."

ఈయన హితసూచనని పరిశీలించగా, ఆంగ్లభాషాకోవిదత్వము, వైజ్ఞానిక దృష్టి, హేతువాదము, సంస్కరణాభిలాష నాటిమేధావులలో ఎంతగా వ్యాపించి వుండేవో తెలుస్తుంది. నాడు ప్రజలలో వ్యాపించిన మూఢవిశ్వాసాలను, సువర్ణ కరణము, దయ్యములు భూతాలలో నమ్మిక, కన్యాశుల్కము, నిర్బంధ వైధవ్యము మొదలైన వాటిని ఈయన తన ప్రమేయాలలో తీవ్రంగా విమర్శించారు. వివాహ ప్రమేయములో స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహము, రజస్వలానంతర వివాహము, ప్రేమవివాహము, అతి బాల్యవివాహంవలన కలిగే కీడు, పెద్దల విపరీతమైన వేడుకలు, వివాహసంబంధమైన అమితవ్యయము, దానివల్ల కలిగే కుటుంబ హాని మొదలైన విషయాలు చర్చించారు. మంత్రప్రమేయంలో జ్యోతిశ్శాస్త్రంలోని ముహూర్త జాతక భాగాలు, పరకాయప్రవేశం, విద్యలూ కలవనే మూఢత్వం, ప్రశ్నలు చెప్పేవారి ప్రవర్తన, సాముద్రికశాస్త్ర విషయాలు తీవ్రంగా నిరసించారు. మనుష్యేతర జంతు సంజ్ఞాప్రమేయములో జంతువులు మాట్లాడగలవనే వాదం ఖండించారు. పరోక్షజ్ఞానప్రమేయంలో మనుష్యులకు దివ్యదృష్టికలదనడం పొరపాటని, వైద్యప్రమేయములో గృహవైద్యాన్ని గూర్చి వివరించి, సువర్ణప్రమేయములో నీచలోహాలు బంగారుగా మారడం అసంభవమని నిరూపించారు. రక్షఃప్రభృతి ప్రమేయములో దయ్యాలు కలవన్న మూఢ విశ్వాసాన్ని ఖండించారు.[7]

ఈయన శైలి హేతువాద విమర్శరీతి, సంస్కరణాభిలాష తెలియడానికి ఆ ప్రమేయముల నుంచి కొన్ని భాగాలు ఉదాహరిస్తాను:

1. "శాస్త్రములయొక్క గ్రంథములున్ను, ఇతరాంశములను గురించిన గ్రంథములున్ను సులభముగా బోధపడేలాగు దేశభాషలలో వాక్యగ్రంథములుగా వ్రాయించి ప్రింటుచేయించి అవే బాలురకు చెప్పించే పక్షమునందు బాల్యకాలములోనే శాస్త్రములయొక్క, ఇతరములైన అంశములయొక్క జ్ఞానము వారికి త్వరగా కలుగడమునకు సందేహమేమియులేదు" (విద్యా ప్రమేయము పు 6). ఈయన వందసంవత్సరముల క్రింద ప్రకటించిన ఈ భావం నేటికీ మనకు ఉపాదేయంగానే ఉండి, విజ్ఞానశాస్త్రం నాడునాటికి విస్తరించిపోతూ వుండడంవల్ల "బంగారము చేసేవిద్యను సాధిస్తామనే వారిలో బుద్ధిమంతులున్ను ఉందురుగాని గ్రహచార సామాన్యముచేత వారిబుద్ధులు పొరపాటును పొందడమువల్ల ఇటువంటి

యత్నములకు వారు పూనుకుంటున్నారని తోస్తున్నది" అని ఈయన ఆవేదన పడుతూ ఆధునిక వైద్యలోహశాస్త్రానుగుణంగా బంగారును చేయడం అసంభవ మని ఇలా వ్రాశారు:

2. "రాగి కరిగియున్నప్పుడు (ఒకానొక వస్తువు) అనగా లోహసంబంధము గలిగియున్న పాదరసభస్మము మొదలయినవాటిలో నొకటి అందులో నుంచిన పక్షమునందు రాగికి నిజకాంతికంటె భిన్నకాంతి రావచ్చునుగాని అది సువర్ణము కానేరదు. దానియొక్క సూక్ష్మభాగములకు సువర్ణము తాలూకు సూక్ష్మ భాగములయొక్క సత్త్వమును, కాంతియున్ను కలుగనేరవు" (సువర్ణ ప్రమేయము పుట-34).

ఇక వివాహప్రమేయము ఆయన ఆవేదనిర్వేదాలకు అద్దం. దానిలోని కొన్ని భాగాలు ఇవి:

3. "బాలికకు అక్కర బట్టని పెండ్లి-యనగా చిన్నతనములోనే పెండ్లి చేసిన గర్భాధానము కాకమునుపే ఆ పెండ్లికుమారుడు చనిపోతే, ఆ పిల్లకు తిరిగి పెండ్లిచెయ్యక, ఆ చిన్నది ఆవిడెయొక్క యౌవనము దుఃఖముతోనే వెళ్ళబుచ్చుకొనేలాగు కనిపెట్టడమునకు బాధ్యతగల వాడయ్యే తండ్రి ఎంత పాపమును, ఎంత దుఃఖమును పొందవలసియున్నదో వివేకశాలులయిన వారు యోచించవలసినది." (పుట - 221)

4. "సుఖమునున్ను, సంతోషమునున్ను, వివాహపరిస్థితినిన్ని పొందే హక్కు భగవంతుడు స్త్రీ పురుషజాతులకు సమానముగానే కలుగజేసియున్నాడు. గనుక తప్పితమేమీలేనిది. అటువంటి హక్కువల్ల నుంచి స్త్రీ జాతిలో కొందరిని తప్పించడమునకు ఎవరికిన్ని న్యాయము ఉన్నట్టు ఎంచేవల్ల లేదు" (పుట.223).

పైన ఉల్లేఖించిన భాగాలనుబట్టి పాశ్చాత్య సంస్కృతి ప్రభావంవలన ఆంధ్రదేశంలో 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో కలిగిన భావపంచలనానికి సామినేని ముద్దునారసింహనాయనిం వారివంటి మేధావులు ఏ విధంగా అనురణించిందీ, ఏ విధంగా కదలిపోయి భావప్రకటన చేసిందీ తర్వాత వీరేశలింగం పంతులుగారి వంటి వారినిగూడ ఎంతగా ప్రభావితులను చేసిందీ స్పష్టమవుతుంది.

ప్రమేయము అనే పదానికి కొలవదగింది, తెలుసుకొనదగింది అనే అర్థాలు ఉండడంవల్ల ఒక విషయాన్ని పరిమితంగా తెలుసుకొనడం, పరిమితిలో వ్రాయటం అనే భావంతో ఈ ప్రమేయం అనే మాటను సామినేనివారు వాడిఉంటా రని భావిస్తున్నాను. తర్వాతి వ్యాసకర్తలెవ్వరూ తమ వ్యాసాలకు ప్రమేయా పదాన్ని పర్యాయంగా వాడలేదు. ప్రమాణ ప్రమేయాలన్నవి మనకు తర్క వేదాంత శాస్త్రాల ముఖ్యాంశాలు.

## సంగ్రహము - పరవస్తువారు :

ఈ వ్యాసప్రక్రియకు ప్రవర్తకులలో రెండవవారుగా మనకు తెలిసిన శ్రీ పరవస్తు వేంకట రామానుజాచార్యులయ్యవారు తమ వ్యాసాలకు "సంగ్రహములు" అని పేరు పెట్టారు ఈయన విజయనగర వాస్తవ్యులు. 1822 - 1900 లలో ఉన్నవారు. సంస్కృత ప్రాకృతాది భాషలలోను, అనేక శాస్త్రాలలోను మహా విద్వాంసులు, "పండితాఖండల" బిరుదాంకితులు, గొప్ప వక్తలు. సంస్కృతంలో 'శబ్దార్థ సర్వస్వం'అనే విజ్ఞానసర్వస్వం కూర్చినవారు. భారతవర్షంలో ప్రప్రథమ మహామహోపాధ్యాయులు. ఆర్ష వాఙ్మయ ప్రచారానికి ఒక ముద్రణాలయం స్థాపించినవారు. ప్రాచీన భారతీయ మత ధార్మిక సాహిత్య సంస్కృతుల ప్రచారం లక్ష్యంగా వ్యాసాలు వ్రాశారు. ఒక్కొక్క వ్యాసాన్ని విడివిడిగా చిన్న పుస్తకాలుగా ప్రచురించారు. ఈయన మొత్తం 23 సంగ్రహములు వ్రాశారు. 1. అలంకార సంగ్రహము, 2. వర్ణనిర్ణయ సంగ్రహము, 3. ఆర్షమత సంగ్రహము, 4. ఆత్మసంగ్రహము, 5. శాఖా సంగ్రహము, 6. శ్రుతి సంగ్రహము, 7. స్మృతి సంగ్రహము, 8. వర్ణ సంగ్రహము, 9. వేద సంగ్రహము, 10. వివాహ సంగ్రహము, 11. దేవతా సంగ్రహము, 12. ధర్మ జన్మ సంగ్రహము, 13. గుణ సంగ్రహము, 14. అవతార సంగ్రహము, 15. కళా సంగ్రహము, 16 కర్మ సంగ్రహము, 17. ముక్తి సంగ్రహము, 18. ముక్తిమార్గ సంగ్రహము, 19. ప్రమాణ సంగ్రహము, 20. ప్రాయశ్చిత్త సంగ్రహము, 21. పునర్వివాహ సంగ్రహము, 22. రహస్య సంగ్రహము, 23. హిందూశాస్త్ర సంగ్రహము. వీటిని ఈయన సమకాలిక పత్రికలలోను ప్రచురించారు.[7] ఈయన శైలికీ, ధర్మాభినివేశానికి ఒకటి రెండు మచ్చులు ఉదాహరిస్తాను.

1. "నమః పరమ ఋషిభ్యః - ధర్మ సంగ్రహము.

మేలు చెందుటకును, కీడు దొలగించుటకును ప్రయత్నము సేయుట సర్వసాధారణము. మేలనగా సుఖకరము కీడనగా దుఃఖకరము. తత్కాలములందలి మేలుకీడులకంటె నుత్తరకాలమునందలి మేలుకీడుల నాలోచించి నడచుట తెలివికి ఫలము. ఎంతదూరము వ్యాపించు మేలుకీడుల నాలోచించిన నంత ఎక్కుడు తెలివిగలవాడని తెలియవచ్చును."

2 "ధర్మము జేసినవాడు దాని ఫలము పరునిం జెందింప బ్రార్థించిన నీశ్వరుడందుల కియ్యకొనును. బరుని యధర్మ ఫలమును దానునుభవించెదనని మరియొక్కడు ప్రార్థించిన నా యొరుని యధర్మ దండనము దప్పించునుగాని వాని యధర్మ మెంతడియగునో యంతకుందగిన దండము దాజెందవలయును" (పురుషార్థ ప్రదాయిని - 1872 అక్టోబరు సంపు. 1, సం. 10).

సామినేనివారి 1850 ప్రాంతపు వ్యాసానికి, పరవస్తు వారి 1872 నాటి వ్యాసానికీ ఉన్న రెండు దశాబ్దాలలో ఏర్పడిన శైలీభేదం, విషయ వివరణభేదం స్పష్టం. పరవస్తు వారి వ్యాసాలు ఉపక్రమోపవాదనోపసంహారాలతోను, గ్రాంథిక భాష అయినా చిన్న చిన్న వాక్యాలతోను విషయనివేదనైక ప్రవణతతోను ఉండడం చూడగా వ్యాసరచనలో ఎంతో మార్పు ఏర్పడినదనడం చెప్పనక్కర లేదు. కనుకనే వీరేశలింగం పంతులుగారి శైలికి పరవస్తువారి శైలి మాతృక అని శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు పెద్దాపుర సంస్థాన చరిత్ర విమర్శ పీఠికలో ప్రస్తావించడం అప్పటి వ్యాసరచనా గతిని సూచిస్తుంది.

పరవస్తువారు తమ వ్యాసాలకు సంగ్రహమన్న పేరు పెట్టడానికి కారణం సంస్కృతంలో శాస్త్ర సంప్రదాయంలోని పద్ధతే అయివుంటుంది. అర్థసంగ్రహం, స్మృతి సంగ్రహం, తర్క సంగ్రహం వంటి శీర్షికలు, వైష్ణవ సంప్రదాయంలో తమిళంలోని "చురుక్కం" (సంగ్రహం) అనే పేరుతో భగద్విషయాలను క్రోడీకరించి సంగ్రహించి చెప్పే తీరు తెలిసినవారు గనుక ఈయన "సంగ్రహము" అనే పేరును ఎన్నుకొని ఉంటారు. తమది తమ భావాల క్రోడీకరణ సంగ్రహం గనుక, అని భావిస్తున్నాను.

## శ్రీ జియ్యరు సూరి :

ప్రాచీన వ్యాసకర్తగా పేర్కొనదగిన మూడవవారు శ్రీ జియ్యరు సూరి గారు. ఈయన బెంగుళూరులో 26 వ పదాతి పటాలపు బాలికా పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులు. 18 వ శతాబ్దం ఉత్తరార్థంలో ఉన్నవారు. 1875 లో "స్త్రీ కళా కల్లోలిని" అనే గ్రంథం ప్రకటించారు. దీని రెండవ భాగమైన "స్త్రీ విద్యామణి"లో 69 వ్యాసాలున్నాయి. ఈ వ్యాసాలన్నీ స్త్రీల విద్యాభివృద్ధినీ, విజ్ఞానాన్నీ ప్రతిపాదించేవి. ప్రతి వ్యాసమూ రెండు మూడు పుటల పరిమితితో సులభ సుందర శైలిలో ఉంది. ఇందులోని వ్యాసాలలో స్త్రీలకు విద్య ఆవశ్యకము, చదివిన వారికిని చదువని వారికిని గలభేదము, విద్య స్త్రీలను చెరుపదు, భగవంతుని నరయ విద్యవలయును, చదువని స్త్రీలు ప్రసంగము వినువిధము, స్త్రీలు చదివిరేని పురుషులకు సహాయము, స్త్రీలు చదివిరేని బిడ్డలకు నుపయోగము, పాతివ్రత్యమునకు విద్యయే రక్షకము, భగవన్మహిమను, జనులందరు సమానులు, పురుషుడు స్త్రీని ప్రవర్తింపజేయవలసిన ప్రకారము, స్త్రీ ధనము, వితంతు నిర్భాగ్యము - మొదలయిన వ్యాసాలలోని భావాలు తర్వాత శ్రీ వీరేశలింగంగారిని ప్రభావితులను చేసినవని చెప్పవచ్చును. ఈ గ్రంథం 'వివేక వర్ధని' పత్రికలో సమీక్షితం కావడంవల్ల, సంఘసంస్కరణ దృష్టి ఉభయులకు సమానం కావడంవల్ల ఈ శీర్షికలను పోలిన శీర్షికలతో కొన్ని

సందర్భాలలో దాదాపు ఒకే శీర్షికతో శ్రీ పంతులుగారు వ్యాసాలు వ్రాయడంవల్ల జియ్యరు సూరి వ్యాసాలను ఆయన ఆకళించుకొన్నారనడం నిస్సంశయం.

శ్రీ జియ్యరు సూరి శైలి మొదలయినవి తెలియడానికి ఈయన వ్యాసములలోని రెండు భాగాలు ఉదాహరిస్తాను.

## స్త్రీలు చదివిరేని పురుషులకు సహాయము

"స్త్రీలు చదివిరేని వారలకు సకల వివేకములును గలుగును గావున, వారలు పురుషులకు మంత్రుల వలె సమయమునందు బుద్ధిగఱపుదురు; కార్యదర్శుల వలె గృహకృత్యముల నంతయు నడిపించుకొందురు; గణకుల వలె గృహసంబంధమగు లెక్కలనంతయు వ్రాసికొందురు; జనని వలె బురుషులను సంరక్షింతురు. కావలివారి వలె నింటి వస్తువుల నంతయుం గాపాడికొందురు; పాచకవర్యుల వలె బురుషుల నాలుకల కింపగునట్లు భక్ష్యాదుల వండి యుపచరింపుదురు; వైద్యుల వలె దేహ సౌఖ్యమున కుచితమగు కార్యములను వెదకి యొనర్పుదురు. సంగీత పాఠకుల వలె నింపగు పాటల బాడియు, ఇంగితమెఱిగి మాటలాడియు పురుషుల యాయాసముల దీర్తురు; ఉత్తమ మిత్రుల వలె బురుషుల యాపదల కొదగుదురు; పురుషులు పొరబాటుగా నడిచిరేని, వారలకు గురువు వలె నుపదేశింపుదురు. స్త్రీలకు విద్య గఱపని హేతువు వలన నింతటి ప్రయోజనములను పురుషులు పడయకపోవుట యెంత బుద్ధిహీనతయో యోచింపవచ్చును. ఇప్పుడు స్త్రీలు చదువనివారుగా నుండుటవలన పురుషులు తమ కృత్యములకు సంబంధించిన వెలిపనులతోఁగూడ నింటి పనులను సయితము వహించుకొని, రెండు గుఱ్ఱములు కట్టి యీడ్వవలసిన బండిని నొక గుఱ్ఱము మాత్రమే యీడ్చునట్లు తాము శ్రమపడవలసి యుండును.

"గొప్ప కుటుంబముల యందు ననేకులు బంధువులను, బిడ్డలును, పనివారలును ఉండుటవలన మాటిమాటికి కలహములును, మనస్తాపములును సంభవించుచునే యుండును. కుటుంబపు బెత్తనకర్త చదువని యవివేక శిరోమణిగా నుండెనేని యది యా కలహసంకటముల నివర్తిసేయును, తక్కినవారికి బుద్ధి గఱపను ఎట్లు సాధ్యమగును? గ్రుడ్డివానికి గ్రుడ్డివాడు త్రోవఁజూపను, మొండివానికి మెండివాడు భరతనాట్యము నేర్పింపను గూడునా? నిరక్షరకుక్షినిగా నుండెడు పెత్తనకర్త పనివాండ్రు సేయు గ్రుచ్చిములను, తచ్చనలను, మోసములను, వేసములను కనిపట్టి పదార్థచ్ఛేదము రానట్లు కుటుంబము నేలాగు పరామర్శింపఁగూడును? 'మూఢుని యాస్తి మొదటికే నాస్తి' యనునట్లు స్త్రీలకు చదువు లేకుండుటంజేసి ద్రవ్యనష్టము సయితము సంభవింప నెడము గలుగుచున్నది". (శ్రీకళాకల్లోలిని - పుట. 63, 64).

## అవిద్యావతులు బాలురకు శత్రువులు

"ఇదియుఁగాక చదువని స్త్రీలకు విద్యాప్రభావము తెలియనందువలన వారు బిడ్డల చదువునకు సయితము విఘ్నము సేయుచుండెను. చదువునట్లు బిడ్డలను తండ్రిగారును, ఉపాధ్యాయులును దండించునప్పుడు వారిని తల్లిగారు దండించి చదువునకు విఘాతము చేసెదరు. 'తాఁజెడిన కోతి వనమంతయుఁ జెడిపెను' అను సామెత దీనికి మిగుల సానుకూలమై యున్నది." - శ్రీ కళా కల్లోలిని - (పుట 47).

## ఉపన్యాసం - వ్యాసం

వీరేశలింగం పంతులుగారు వ్యాసప్రక్రియను చేపట్టేకాలానికి వ్యాసానికి సంగ్రహమనే పేరు మరుగై 'ఉపన్యాసము' అనే పేరు ప్రచారంలోకి వచ్చింది. నేడు వాగ్రూపమయిన వివరణనే మనం ఉపన్యాసమని వ్యవహరిస్తున్నాము. కాని, ఆనాడు లిఖితరూపమయినదానికే ఉపన్యాస పదం పర్యాయంగా ఉండేది. ఒక వ్యాసం అచ్చు ప్రతి ముఖపత్రం మీద "తేదీ 15-8-1875 రాజమహేంద్ర వరమున విజయనగరము మహారాజావారి బాలికా పాఠశాలయందు కందుకూరు వీరేశలింగంచే నీయబడిన ఉపన్యాసము" అని మొదటి ముద్రణ సమయంలో ఉన్న మాటలు తర్వాత మారాయి. పంతులుగారు స్వీయచరిత్రలో వ్యాసము అనికూడ చాలాచోట్ల ఉదాహరించడంవల్ల ఈయన కాలంలోనే ఉపన్యాసమనే వ్యవహారం సన్నగిల్లి వ్యాసమనే మాటే స్థిరపడినట్లు తోస్తుంది. ఇలా స్థిరపడ డానికి కారణం వ్యాసమనే సంస్కృత పదానికిగల వ్యుత్పత్తే కావచ్చు.

## శ్రీ వీరేశలింగం పంతులుగారు :

ఆధునికాంధ్ర సాహిత్యంలో అనేక ప్రక్రియలకు శ్రీకారం చుట్టి, మరి కొన్నిటికి ప్రామర్యం కలిగించి పట్టంకట్టిన వీరేశలింగం పంతులుగారే ఈ వ్యాసప్రక్రియనుగూడ సుసంపన్నం చేశారు. ఈయన సంఘ సంస్కరణోద్యమ సారధులు కావడంవల్ల అనేక విషయాలపై వ్రాయడం, ఉపన్యసించడం అవసర మయింది. ఈ ప్రక్రియలో ఈయన స్పృశించని విషయం లేదు. మత సాంఘిక రాజకీయార్థిక నైతికాది విషయాల పరిశీలన పరామర్శ విమర్శనాలే ఈయన వ్యాసపరంపర. "పంతులుగారి వచన రచన సరళమును, ప్రసాదగుణభూయిష్ఠ మునునై యుండును. పేలవముగాని పేశలతయు, కటువుగాని గ్రాంథికత్వమును పంతులుగారి వచనశైలి సొంపునకు చిహ్నములు" అని శ్రీ రాయసం వెంకట శివుడుగారు వ్రాశారు. ఆయన సంఘశ్రేయస్సే లక్ష్యంగా గలవారు గనుక "వివేకవర్ధని" "సతీ హితబోధిని", "సత్యసంవర్ధిని" "చింతామణి" పత్రికలను

నడిపి వ్యాసపరంపరను ధారా సంపాతకంగా కురిపించారు. అందువల్లనే ఈయన తక్కిన రచనలన్నీ ఒక యెత్తు, వ్యాసాలే మరొకయెత్తు అన్నట్టు ఉంటుంది.

ఈయన రచనలలో వ్యాసాలు దాదాపు నాలుగువేల పుటలు. ఆయన వివిధ విషయాలపై రచించిన వ్యాసాలు, వివిధ సమావేశాలలో ఇచ్చిన లిఖితో పన్యాసాలు దాదాపు 200 ఉంటాయి. వీటిని స్థూలంగా 1. మత నైతిక విషయాలు, 2. సాధారణ సాంఘిక విషయాలు, 3. రాజకీయాలు, 4. శాస్త్రీయ విషయాలు, 5. స్త్రీ విద్యా. స్త్రీ పునర్వివాహ విషయాలు, 6. జీవిత చారిత్రాత్మకాలు- అని ఆరు విభాగాలు చేయవచ్చు. ఈయన 1875 మొదలు 1897 వరకు అనర్గళంగా వ్యాసాలు వ్రాశారు. ఈయన చివరివ్యాసం "బమ్మెరపోతనామాత్యుడు" -ఆంధ్రపత్రిక 1918 సంవత్సరాది సంచికలో ముద్రితమైంది.

పంతులుగారు సంఘసంస్కరణ తత్పరుల గనుక వారి వ్యాసాలు ఈ విషయమయ్యే ఎక్కువ సంఖ్యలో ఉన్నాయి దేశీయమహాసభ-దాని ఉద్దేశములు, ఇంగ్లీషు ప్రభుత్వమువలన లాభములు, రాజ్యాంగ సంస్కరణము - కులాచార సంస్కరణము, మొదలయిన వ్యాసాలలో ఈయన రాజకీయాభిప్రాయాలు తెలుసుకోవచ్చు. హిందూదేశాభివృద్ధి మార్గము, కృష్యాది వ్యాపారము- అనే వ్యాసాలు భారతదేశపు ఆనాటి ఆర్థిక విషయాలను గురించి ఈయన అభిప్రాయాలు తెలుపుతాయి. విద్య, విద్యాభ్యాసోద్దేశము, సంఘ విద్యాభ్యాసము, రాజకీయ పాఠశాలలు- అనేవి ఆనాటి విద్యాసమస్యలను చర్చిస్తాయి. కాలమును సద్వినియోగమునకు దెచ్చుట, అసద్గ్రంథములు, కాలముయొక్క విలువ దేశభాషలు, ఆంధ్రభాషాభివృద్ధి మొదలయినవి భాషాసాహిత్యాలపై ఈయన మనోభావాలు తేటతెల్లం చేస్తాయి. పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, పండిత రమాబాయి, సరస్వతి, అహల్యాబాయి మొదలయిన వ్యాసాలు జీవితచరిత్రలకు సంబంధించినవి. ఆనీబిసెంటు, బండారు అచ్చమాంబ, విక్టోరియా మహారాజ్ఞి, దేశిరాజు పెదబాపయ్య మొదలయినవారినిగూర్చి వ్యాసాలు వ్రాశారు. నీతి, సుజ్ఞానము, విద్యకంటె నీతి ముఖ్యము, ఇతరులను సత్కార్యమునకు త్రిప్పువారి క్రమమము, మన బాలుర నీతివర్తనము, నీతివిద్య, మానుషధర్మము, జీవితముయొక్క పరమార్థము, దానిని పొందుమార్గము- అనేవి పంతులుగారు నైతిక విషయాలపై వ్రాసిన వ్యాసాలు. స్త్రీలకోసమై శాస్త్ర విషయాలను 'సతీహితబోధిని' అనే మాసపత్రికలో ప్రచురించారు. జ్యోతిశ్శాస్త్రము, సూక్ష్మవస్తు దర్శనయంత్రము, మంచుగడ్డ, అగ్నిపర్వతములు - మొదలయినవి ఆధునిక శాస్త్ర విషయకాలు. ఈయన వ్యాసాల విషయవైవిధ్యం, సత్యసాన్నిధ్యం, శైలి తెలుపడానికి రెండు మూడు వ్యాసభాగాలు ఉదాహరిస్తాను.

1. "కాలమును సద్వినియోగమునకుఁ దెచ్చు విషయమయిన విధులను వ్రాయఁ బూనుకొనుట యెంతయుఁ గష్టమయిన పనియే యయినను, ఆ విషయమును గూర్చి చక్కఁగా వ్రాయఁగలిగినచో నంతకంటె లోకమున కధిక ప్రయోజనకరమగునది మఱియొక్కటి లేకపోవుట చింతించి, లోకోపకారమే ముఖ్య ప్రయోజనముగా నెంచుకొనుచుండెడి యే విలేఖకుఁడును దాని విషయమయి కొన్ని పంక్తులయినను దన శక్తికొలఁదిని వ్రాయక యూరకుండఁజాలఁడు గదా! కాబట్టి యట్టి మహా విషయమును సవిస్తరముగా వ్రాయ శక్తులము కాకపోవుట యెఱింగియు, మేమును శక్త్యనుసారముగా నించుకంత ప్రయత్నించి చూతముగాక యని మాకుఁదోఁచిన యభిప్రాయములను గొంచెము వ్రాయఁబూనుకొన్నారము. గుణగ్రహణపారీణులు మా వాక్యముల యందలి గుణమునే గ్రహింతురుగాక!" (కాలమును సద్వినియోగమునకుఁ దెచ్చుట, ఉపన్యాస మంజరి, 8వ సంపు. పుట. 189).

2. "అతిబాల్య వివాహములలో వధూవరుల పరస్పరానురాగమును, ఇష్టమును లేకపోవును గనుక తఱుచుగా బహుదంపతులు సుఖమెఱుఁగనివారుగానే యుందురు; కొన్ని సమయముల యందు వారు పెద్దవారు గాకమునుపే యెవ్వరికో దైవయోగముచేత ప్రాణవియోగము సంభవించి వృథావ్యయమునకుఁ గారణమగుటయే గాక నిరపరాధినులయిన కన్నియలు యావజ్జీవమును మరణమునకంటెను హీనమయి తీవ్ర వేదనాకరమయిన దుర్భర వైధవ్య దుఃఖము పాలు కావలసినవారగుచున్నారు. కొన్ని సమయముల యందు మరణము సంభవింపక పోయినను వ్యాధులచేత దంపతులయందెవ్వరైన వికలాంగులును, దుర్బలులును నగుట సంభవించి బహుకష్టముల పాలగుచుందురు" (అతిబాల్య వివాహము - 8 వ సంపు., 420 పుట).

3. "మనదేశములో నంతకంతకు విద్యాభివృద్ధి కావలసినంత యగుచున్నను, విద్యార్థుల నీతి ప్రవర్తనము విషయమయి లేశమయినను శ్రద్ధ వహించి వారిని సన్మార్గమున నడిపించుటకు తగిన సాధనముల నేమియు నాలోచించుచుండలేదు. అందుచేత మన విద్యార్థులు కొంత వయస్సు రాఁగానే పాపకార్యములలో నెల్లను పరమ హేయమయిన వ్యభిచారమునందు ప్రవేశించి తమ దేహములను చెడగొట్టుకొని, యనేకములయిన యితరాపత్తులనుకూడ దెచ్చుపెట్టుకొనుచున్నారు. దీనికి నిదర్శనముగా మొన్న నీ నడుమను కలకత్తా నగరమునందు జరిగిన యొక వ్యసనకరమయిన కథను కొంత వివరించుచున్నాను..." (మన బాలుర నీతివర్తనము. సంపుటి-8, పుట 426.)

పంతులుగారి వ్యాసాలు, ఉపన్యాసాలు పరిశీలిస్తే, ఈయనకు విప్లవవాది, క్రాంతదర్శి, దేశోద్ధారకుడు, సంఘసంస్కార దీక్షితుడు, మహిళా జనరక్షకుడు, దీనజనబాంధవుడు అని విశదమవుతుంది. "వ్యాసమునకు రచయిత యొక్క వ్యక్తిత్వము ప్రధానము. జీవితమును గురించియు, వ్యాసవిషయమునుగూర్చియు నాతని నాలోచనలును, అతని భావపరిణామమును ముఖ్యములు. తన యభిప్రాయములనెట్లు ఉపక్రమించి, సాగించి, యుపసంహరింపవలయునో యాతడెఱిగి, యందలి మెలకువను గ్రహించుచుండవలెను"9 అని శ్రీ రాయసం వేంకట శివుడుగారన్న వాక్యాలతో పరిశీలిస్తే, వీరేశలింగం పంతులుగారి వ్యాసాలు ఆ కాలపు వ్యాసరచనకు ఉత్తమ దృష్టాంతాలు.

## ఉపన్యాస, వ్యాసపద చర్చ

ఇప్పటికి-అంటే ఆయన కాలానికి ప్రమేయం, సంగ్రహం, ఉపన్యాసం అనే పదాలు వైదొలగి వ్యాసం అన్నమాట స్థిరపడిందని ఇదివరకే అన్నాను. పంతులుగారి కాలంలోనే మొదట్లో ఉపన్యాసం అనే పదం వాడుక కావడానికి కూడ కారణం ఉంది. "ఉపన్యాసము = ఏదేని విషయము నెత్తి విస్తరించి చెప్పుట; ఉపన్యసించు = ఉనుచు; 'పురుషోత్తమునందు చిత్తంబుపన్యసించి'— భాగ-స్కం-2, "ఉపన్యాసము చేయు" అని శబ్దరత్నాకరం అంటున్నది. వాచస్పత్యంలో-"ఉపన్యాసః = 1. వాక్యోపక్రమే, 2. వాక్యప్రయోగే ఉపదారచ్ఛం శబ్దే, ఉదా: తస్మాద్ బ్రహ్మ జిజ్ఞాసోపన్యాసముఖేన-శరీర. భాష్య. మూలవికాయ మయ ముపన్యాసః శంకయతి - మూలవిర్. 3. విచారే - పుణ్యముపన్యాసం విబోధత - మను. ఉపన్యాసం - విచారం - కుల్లూకభట్టు. 4. విశ్వాసేన స్వసమీపేద్రవ్యాదిన్యాసే ఉపనిధేచ" అని అర్థాలున్నాయి. అంటే 'ఉప'ని ఉపసర్గపూర్వక అస ధాతువుకు ఉంచు, ఉపక్రమించు, మాటలు ఉపక్రమించు భావాలు తెలుపు అనే అర్థాలు ఉండడంవల్ల, తన భావాలు తెలిపే మాటలకు ఉపక్రమించడం ఉపన్యాసం గనుక, అది లిఖితరూపమైనా, వాగ్రూపమైనా, ఉపన్యాసమనే మాట వాడుకకి వచ్చి ఉంటుంది. కాని, తర్వాత లిఖితరూపమైన ఉపన్యాసం వాక్ప్రసక్తి లేక, ప్రసంగించే అవసరంలేక లిఖిత రూపంగా విస్తరించడం పరిపాటి కావడం వల్ల ఉపన్యాసపదాన్ని వ్యాసపదం త్రోసిరాజన్నది. వ్యాస పదానికి అమరకారుడు "విస్తారో విగ్రహో వ్యాసః" అని మరి రెండు పర్యాయాలు ఇచ్చాడు, విస్తరించుట అనే అర్థంలో. విస్తరించి వింగడించి చెప్పడం ప్రధానం కావడంవల్ల వ్యాస శబ్దానికి ప్రాచుర్యం వచ్చివుంటుంది. అలా విషయ విభాగం చేసినవాడే కదా వ్యాసుడు.

## వీరేశలింగం సమకాలికులు

వీరేశలింగ యుగం అన్ని నవీన సాహిత్య ప్రక్రియలకూ పంటభూమి అయినట్లే వ్యాస ప్రక్రియకూ అయింది. ఈయన సమకాలికులైన పలువురు మహోద్దండ పండితులు ఈ ప్రక్రియను చేపట్టారు. ఇది కేవలం మత ప్రచార సంఘ సంస్కరణలకే కాక శాస్త్రీయ దృక్పథం గల పరిశోధన రంగానికీ, ఇతర విషయాలకూ విస్తరించి - భాషాసాహిత్యం, చరిత్ర, భూగోళం మొదలయిన విజ్ఞానశాస్త్రాది విషయాలపై ఆకరము, సూచికలు ఇచ్చి అధునిక రీతిలో వ్యాసాలు వ్రాయడానికి నారులు పోయడం జరిగింది. ఇలాటి రచనలు సాగించిన వారిలో వీరేశలింగం పంతులుగారి సమకాలికులలో పేర్కొనదగిన ప్రముఖులు కొందరిలో కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారొకరు.

ఈయన "అల్పదోషమునైనను కావ్యమునందు సహింపక, విమర్శ చేసేటప్పుడు, యమునికన్న ఎక్కువ నిర్ఘృణుడని పేరుపొందిన పండితుడు" అని గిడుగు రామమూర్తిపంతులు గారిచే ప్రశంసింతులు. ఈయన వీరేశలింగం గారికి ప్రధాన ప్రత్యర్థి. పంతులుగారి మత సాంఘిక సాహిత్య రచనలన్నిటిని విమర్శిస్తూ పరశ్శతంగా వ్యాసాలు వ్రాశారు. ఈయన సంస్కృతాంధ్రాంగ్లభాషా సాహిత్యాలలో నిష్ణాతుడు. తులనాత్మక పరిశీలన చేసి, పెక్కు విమర్శవ్యాసాలు, ప్రకృతి శాస్త్రవిషయక వ్యాసాలు రాశారు. తత్త్వమసి, శ్రీకృష్ణుడు జారుడా?, రావుబహద్దరు వీరేశలింగం పంతులుగారి ఆత్మజ్ఞానము, బ్రహ్మసమాజికులు, - విగ్రహారాధము, అద్వైతము - తద్విరోధులు, హిందూమతమును - దాని ధర్మములను, - మొదలైన విమర్శవ్యాసాలే కాక, జగము సృజింపబడినదా?, భూమి తిరుగుచున్నదా?, భూమి తిరుగుటకు ఆధారమేమి?, రాశిచక్రము, పంచభూతములు భూమి యొక్క ఆకర్షణశక్తి, రామాయణమునందలి వానరు లెవరు?, గ్రహణకథాదర్పణము - మున్నగు విజ్ఞాన శాస్త్రీయ వ్యాసాలు ప్రాక్ప్రతీచీ విజ్ఞానసమ్మేళనంతో వ్రాశారు. ఇవన్నీ తర్వాత ఉపన్యాసపయోనిధి (1910), ఉపన్యాసమంజరీ విమర్శనం అనే వ్యాస సంపుటాలలో చేర్చ బడ్డాయి.

శ్రీ దాసు శ్రీరాములుగారు బందరులో జన్మించారు. తర్కవ్యాకరణ వేదాంత, సంగీత సాహిత్యశాస్త్రాలలో మహాపండితులు (1846-1908). ఈయన 'అనల్ప జల్పితాకల్పవల్లి' అనే పత్రిక నిర్వహించి, దురాచారభంజని, ఆచారనిరుక్తి మొదలయిన వ్యాసాలు వ్రాశారు. కాని, ఈ రెండు మాత్రమే ఉపలభ్యాలు. ఆచారనిరుక్తి 1890లో రచితం. దీనిలో ఆచారమనే పదానికి భిన్నార్థాలు తెలుపుతూ, ఆచారాచరణావశ్యకత వివరిస్తూ, పెక్కు స్మృతి

పురాణాలు ఉదాహరించారు. దురాచార భంజనిలో దురాచారాలు ఖండించబడ్డాయి. ఏలూరులో న్యాయవాదవృత్తి అవలంబిస్తూ సారస్వత కృషి ఆటవిడుపుగా సాగించిన దాసు శ్రీరాములుగారు ఆచారమంటే, "ధర్మముయొక్క రూపము" అని వివరించడం గమనించదగింది.

మహోపాధ్యాయ బిరుదాంచితులైన ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ వైజ్ఞానిక వ్యాసాలు వ్రాసిన తొలి వ్యాసకర్తలలో ఒకరు (1864-1935). ఈయన 'సుజన ప్రమోదిని' పత్రికను (10-6-1881) నడిపి తమ వ్యాసాలను ప్రచురించారు. విజ్ఞాన విషయాలపై వ్రాసిన వ్యాసాలను "రహస్య దర్పణము" (1894) అనేపేర సంపుటంగా ప్రచురించారు.[10]

వ్యాసప్రక్రియను చరిత్ర పరిశోధనరంగానికి మళ్ళించి, పాశ్చాత్యులు అవలంబించిన పరిశోధన పద్ధతులను ఆకళించుకొని, భారతీయ పరిస్థితులకు అనుగుణంగా మలచుకొని చారిత్రక వ్యాసాలు రచించిన ప్రప్రథములు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు (1872-1939). ఈయన వీరేశలింగం గారిపైన "ఆంధ్రప్రకాశిక" అనే పత్రికలో వ్యాసం వ్రాశారు. దేశోపకారి, విబుధరంజని పత్రికలలో పనిచేసి, పెక్కు చారిత్రక వ్యాసాలు వ్రాశారు.

20 వ శతాబ్దంలో సాహిత్యోద్యమానికి మూలస్తంభమై విజ్ఞాన సర్వస్వం వంటి ఉద్గ్రంథానికి నారులుపోసిన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారిని 19 వ శతాబ్దం చిట్టచివరి వ్యాసరచయితలలో ప్రధానులుగా పేర్కొనవచ్చు. ఈయన 1877-1923 లో ఉన్నవారు. 1898 లో తెలుగు జనానా పత్రికలో "విశ్వంయొక్క విరాట్ స్వరూపము", విశ్వంయొక్క బాహ్యస్వరూపము" అనే వ్యాసాలను సంభాషణ స్వరూపంలో వ్రాశారు. విజ్ఞానచంద్రికా గ్రంథమాలతో వైజ్ఞానిక, రాజకీయ విషయాలతోను, విజ్ఞాన సర్వస్వంతో విశ్వవిషయ పరిజ్ఞానంతోను ఆంధ్రావళిని సంపన్నులను చేయడానికి 19 వ శతాబ్ది చివరిలోనే మూలబంధం వేశారు.

## వ్యాసం-పత్రికల దోహదం

వ్యాస ప్రక్రియ ఇంతగా విస్తరింప చేసినవి పత్రికలు. ఇవికూడ మనకు పాశ్చాత్య ప్రభావంవల్ల వచ్చినవే. ఇవి తొలిరోజులలో మత ప్రచారం కోసం, సంఘ సంస్కరణకోసమూ వెలువడినా తర్వాత తర్వాత వీరేశలింగం పంతులుగారు, కొక్కొండ వేంకటరత్నం పంతులుగారివంటి వారి చేతులలో సాహిత్య ప్రచార సాధనాలుగాను అయ్యాయి.

తెలుగులో మనకు తెలిసినంతవరకు వెలువడిన తొలిపత్రిక 'సత్యదూత' (1835). ఇది బళ్లారి క్రైస్తవ సంఘంవారి నిర్వహణలో మద్రాసునుంచి వెలు

వడేది. దీని తర్వాత చెప్పదగింది 'వృత్తాంతిని' (1840?). తర్వాతది 'వర్తమాన తరంగిణి' (1842-57). పిదప సంబోధకౌముది (1852), దినవర్తమాని (1861-68), హితవాది (1842-47?). శ్రీ యక్షిణి (1863-67) మొదలయిన ప్రత్రికలు వచ్చాయి. అయితే వీటిని గురించిన వివరాలు మనకు అంతగా తెలియవు అంటే వ్యాసాలు ప్రచురించిన విషయం 1864 లో ప్రారంభమైన 'తత్త్వబోధిని' మొదలుకొని లెక్కకు మిక్కిలిగా మత నైతిక సాంఘిక విద్యాసాహిత్య విషయాలు ప్రచురించాయి.

ఈ 'తత్త్వ బోధిని' చెన్నపురి వేదసమాజం యాజమాన్యాన వెలువడేది. వేదసమాజమనేది బ్రహ్మసమాజానికి పూర్వరూపం. ఈ తత్త్వబోధిని ప్రభావం వీరేశలింగంగారిపై చాలవుంది. దీనిలో వచ్చిన వ్యాసాలన్నీ తత్త్వబోధిని 1, 2, 3 అనే పేరుతో సంపుటాలుగా వెలువడ్డాయి. వీరేశలింగంగారు తమ వివేకవర్ధినిని ఇలాగే సంపుటాలుగా ప్రకటించడానికి తత్త్వబోధినే కారణం కావచ్చు.

తత్త్వబోధిని తర్వాత అదే సమయంలో వెలువడిన సుజనరంజనిని (1864) పేర్కొనవచ్చు. ఇది ఆ కాలంలో ఇంగ్లాండునుంచి ప్రచురితమయ్యే "ది జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషన్" అనే పత్రికతో సాటి వచ్చేదని తత్త్వబోధిని పత్రికే ప్రశంసించింది.[11]

తర్వాత చెప్పదగినది మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి ఆంధ్రభాషా సంజీవని (1871 నవంబరు 28). ఈ పత్రికలో సారస్వత విషయ చర్చలు, సాంఘిక రాజకీయ విషయాలు, గ్రంథ సమీక్షలు, కవితలు మొదలయినవి ప్రచురితమయేవి. ఇది దాదాపు 20 సంవత్సరాల పాటు వచ్చింది. ఈ పత్రికను గురించి సమకాలిక పత్రిక 'పురుషార్థ ప్రదాయిని' "ఈ పత్రికయందు చదువుటకు మిగుల నానందముగను, ఉపయుక్తముగాను నుండు ఆంధ్రభాషా విషయములును,... దేశ భాషాభివృద్ధి కరములగు నికరములైన పద్ధతులును, మంచి వృత్తాంతములును, ఇంకను కొన్ని కొన్ని విషయములును, ఎన్నికకు రాదగిన తిన్నని మధురమైన శైలితో వ్రాయబడుచున్నవి" (1872 జులై సంపు - 1, సంచి - 7) అని ప్రశంసించింది.

శ్రీ ఉమా రంగనాయకులుగారి సంపాదకత్వంలో బందరునుంచి వెలువడుతున్న ఈ పురుషార్థ ప్రదాయినికిని (1872), ఆంధ్రభాషా సంజీవనికిని విద్యావిషయకమైన వాదవివాదాలు జరిగేవి. పురుషార్థ ప్రదాయినిలో సామెతలు, సమస్యాపూరణములు, సాంఘిక రాజకీయార్థిక రాజకీయ మత నైతిక విషయాలు, శాస్త్ర చర్చలు, సారస్వత విమర్శలు, ప్రకృతి శాస్త్ర వ్యాసాలు, తక్కిన ఉప

యోగకర విషయాలు వెలువడేవి. "ఈ పత్రికయందు శాస్త్రము, భాష, మతము, వైద్యము, ఔషధములు, నీతి, వ్యవసాయము, దోహదము, విద్యావిషయములు, దేహారోగ్య విషయములు, గృహవిద్యలు, దేశకాల జీవనచరిత్రలు, పురాతన స్థితులు, ధర్మశాస్త్ర విషయములు, వృత్తాంతములు మొదలగునవి ప్రచురితము లగును" అని ఈ పత్రిక ప్రతి సంచికలోను ప్రకటన చేసేది.

దీని తర్వాత చెప్పదగినది విశాఖపట్టణం నుంచి వెలువడిన "సకల విద్యాభివర్ధని." దీనిలో కవి జీవితములు, వైద్యము, అర్థశాస్త్రము మొదలయిన వానిని గూర్చిన వ్యాసాలు ఉండేవి. అప్పటి విచిత్రమేమిటంటే, ప్రశ్నోత్తర రూపవ్యాసాలు వెలువడడం. ఈ పత్రికలోనే శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యు లయ్యవారు తమ సంగ్రహములను ప్రచురించారు.

ఆ కాలంలో శ్రీ వీరేశలింగం గారికి ప్రముఖ ప్రచారసాధనమైన 'వివేక వర్థని' 1874 లో మాసపత్రికగా ప్రారంభమై, పక్షవారపత్రికగా మారి, దాదాపు 20 సంవత్సరాల పాటు వెలువడింది. పంతులుగారు దీనిలో దాదాపు 200 వ్యాసాలు వ్రాశారు.

దీనికి సమకాలికమైనవే లోకరంజని, సుధారంజని, బ్రహ్మాండరంజని, విద్వన్మనోహారిణి మొదలైన పత్రికలు. 1880 లో శ్రీ గురజాడ శ్రీరామమూర్తి గారి సంపాదకత్వంలో "ప్రబంధ కల్పవల్లి" అనే పత్రిక, అముద్రిత గ్రంథ చింతామణి (1885), హిందూజన సంస్కారిణి (1885), చింతామణి (1891), సతీహితబోధిని (1887), నాదెళ్ళ పురుషోత్తమ కవిగారి బుధవిధేయి (1887), సత్యసంవర్థిని (1887), గట్టుపల్లి శేషాచార్యుల సంపాదకత్వంలో శశిరేఖ (1892), రాయబహదూరు పనప్పాకం ఆనంతాచార్యుల సంపాదకత్వాన శ్రీ వైజయంతి (1894 జనవరి), చిలుకూరి వీరభద్రరావుగారి సంపాదకత్వాన విబుధరంజని (1898) పత్రికలు వెలువడి వివిధ విషయాలపై పుంఖాను పుంఖంగా వ్యాసాలు ప్రచురించాయి.

ఈ పత్రికలన్నిటిలోను మత రాజకీయ విషయాల జోలికిపోక కేవలం సాహిత్యానికే అంకితమైన పత్రికలలో ఎన్నదగినవి 'అముద్రిత గ్రంథచింతా మణి', 'శ్రీ వైజయంతి' పత్రికలు.

అముద్రిత గ్రంథచింతామణి నెల్లూరినుంచి వెలువడేది. దీని సంపాదకులు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు. ఈ పత్రికలో అప్పటి మహోద్దండ పండితులు మహాభినివేశంతో చర్చలు జరిపేవారు. ఎక్కువగా పదసాధుత్వ చర్చ, గ్రంథ సమీక్షలు, భాగాలుగా ప్రాచీనగ్రంథ ప్రచురణ ఈ పత్రికలో ఉండేవి. పేరుకు తగినట్లు ప్రాచీనగ్రంథ ప్రచురణేకాక, నాటి కాలదేశ నిర్ణయాలపై చర్చలు జరి

గేవి. అవసరమనుకొన్నప్పుడు పత్రికాధిపతే గ్రంథసమీక్షలు చేసేవారు. కన్యాశుల్కం నాటకంపై రామకృష్ణయ్యగారు చేసిన సమీక్షలో కొన్ని భాగాలు ఉదాహరిస్తాను.

"శ్రీ విజయనగర రాజ్యమున ప్రాచీన లిపి పాఠకులగు మహారాజశ్రీ గురజాడ అప్పారావు పంతులు బి. యే. గారిచే రచితమైన 'కన్యాశుల్కము' అను నాటకము గ్రంథకర్తగారిచేఁ పంపఁబడినందునఁ గృతజ్ఞతాభివందనములతో నందికొని సాంతముగఁ జదివినారము. ఈ నాటకమున కిడిన పేరువలననే గ్రంథకర్తగారి యభిప్రాయము స్పష్టమగుచున్నది గదా. మనదేశములో నీ దుర్వ్యాప్తి నానాటికి వృద్ధియగుచున్నది. ప్రతిమండలములో నిట్టి కార్యములు పెచ్చు పెరుగుచున్నవి. వీనిని రాజ్యాధిపతులు నివారింపవలెను. ... ఇట్టి యకృత్యములు దండనముచేగాని చక్కబడవని రూఢిగఁ జెప్పఁగలము. అయినను లోకములోని దుర్నీతి యిట్టిదని నాటకములచేఁ బ్రదర్శించిన నట్టివారికిఁ గొంత విషయమైనను బోధపడునని కాఁబోలు గ్రంథకర్తగారీ గ్రంథమును లిఖించినందులకు మేమెంతయు సంతసించుచున్నారము. బహుకాలమునుండి సర్వతోముఖముల వ్యాపించియున్న యట్టి యకార్యముల నొక్కపెట్టుగఁ గొట్టుటకు నెట్టివారికైన సాధ్యమగునా?

"ఈ నరమాంస విక్రయమను కన్యాశుల్కము ముఖ్యముగ నింగ్లీషు వాసన తెలియనివారిలో నిప్పుడు జరుగుచున్నది. దాని నాపవలయునని గ్రంథకర్తగారి ఉద్దేశము. అట్టివారికి స్పష్టముగఁ తెలియుటకై గ్రామ్యోక్తులిందుఁ జేర్పఁబడినందులకై మేమామోదించితిమి. ఇట్టి గ్రంథములకు సలక్షణమగు గ్రాంథికభాష నిరుపయోగముగాన 'శశిరేఖ' యభిప్రాయముతో మేమేకీభవింపముగాని యింగ్లీషు పదములు విశేషముగఁ జేర్చినందులకై మాత్రము కొంచెమాలోచించుచున్నాము. ... ఇంగ్లీషుపదములలో వాడుకలో నుండువానిని ప్రయోగించినచో నాభాషాజ్ఞానములేనివారికిఁ దెలియునని మా వాదముగాని వాని బొత్తిగాఁ బ్రయోగింపగూడదనికాదు. ప్రాకృతమునకు ఛాయవ్రాసినట్టుగ నట్టివాడుకలేని యింగ్లీను మాటలకు నొక తెలుఁగర్థముగల ఛాయగ్రంథమున సంపూర్ణముగ నున్నను గొంత మేలని తోఁచెడి. ..." [12]

సమీక్షలు గూడ వ్యాసాలవంటివే గనుక, పాత పత్రికలలో సమీక్షారీతి ఎట్లుండో తెలియడం ఆధునికులకు అవసరం గనుక కొన్ని భాగాలు ఉదాహరించాను.

"శ్రీ వైజయంతి" కూడ ఈ పద్ధతిని అనుసరించింది. దీనిలో "పద్యవిషయవ్యాసములు, పురాతన గ్రంథ గుణాగుణ ప్రదర్శకములగు చర్చలును, నముద్రితంబులగు పూర్వకృతి రత్నంబులను, నవీనకావ్య మణులును, నాధునిక

గ్రంథ విమర్శనంబులును, లక్షణజ్ఞాన ప్రదంబులగు లేఖలును" ప్రచురిస్తామని మొదటి సంచికలో సంపాదకులు ప్రతిజ్ఞ చేశారు. ప్రసిద్ధ విద్వాంసులు, ఆంధ్ర సాహిత్యానికి కుమారసంభవం, క్రీడాభిరామం వంటి అపూర్వకావ్యాలు, సంస్కృత సాహిత్యానికి కుందమాల, చతుర్భాణి, భరతనాట్యశాస్త్రం వంటి వాటిని "తాళీదళ ప్రకరకాంతారంబుల" నుండి వెదికి ఇచ్చిన సుగృహీత నామ ధేయులు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఈ వైజయంతిలో పెక్కు గ్రంథ సమీక్షలు వ్రాశారు; వీరేశలింగం గారి కవులచరిత్ర ద్వితీయభాగాన్ని 1895 ఏప్రిల్ సంచికలో సమీక్షించారు 1897 లో ఉత్తర హరివంశ విశేషాలపై వ్యాసం వ్రాశారు. ఈయన మహాకావ్యం 'మృగావతి' దీనిలోనే ధారావాహికంగా ప్రచురించబడింది.

## తొలి వ్యాసకర్త్రి జానకమ్మ

శ్రీమతి పోతం జానకమ్మ అనే మహిళ ప్రథమ వ్యాసకర్త్రిగా మనకు దర్శనమిస్తారు. ఈమెను శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి మాటలతో పరిచయం చేస్తాను. "పోతం జానకమ్మయను విదుషీమణి 1874 సంవత్సరమున ఫిబ్రవరి 24 వ తేదీ నొక్కవ్యాసమును విదేశయాత్రల గూర్చి వ్రాసి శ్రీమదాంధ్ర భాషా సంజీవనిలో బ్రకటించియున్నది. ఆ వ్యాసమునందలి శైలి, యందలి యుక్తులు మిక్కిలి ప్రౌఢములుగా నున్నవి. ఈమె తన భర్తతో నింగ్లాండు వెళ్ళివచ్చి, పిమ్మట నీ వ్యాసము వ్రాసి ప్రకటించినది" అని శ్రీ శాస్త్రిగారు వ్రాశారు. ప్రముఖ విద్వాంసులైన శాస్త్రిగారి దృష్టి పడిన వ్యాసం చాలా మట్టుకు అపూర్వము, విషయ భరితము అయివుంటుందనడంలో సందేహంలేదు" (ఆర్యమత బోధిని 1913 సెప్టెం. సంపు-9, సంచి-9).

ఈ విధంగా 19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో పత్రికలు వ్యాసప్రక్రియను ప్రచురంగా ప్రవర్తింపజేసి, తెలుగు సాహిత్యానికి చేసిన సేవ ఇంతింతనరానిది. ఆ కాలంలో ప్రతి విద్వాంసుడు ఒక ముద్రణాలయం స్థాపించి, సారస్వత పత్రికను నిర్వహించాడు. 19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో, ముఖ్యంగా ఉత్తరార్ధం నాల్గవ పాదంలో మత నైతిక సాంఘిక రాజకీయ సారస్వత స్థితిగతుల సమగ్ర స్వరూపానికి ప్రతిబింబాలు ఈ పత్రికలు అంటే అతిశయోక్తి కాదు.

## ఉపసంహారం

ఏతావతా వ్యాసం బీజాలు మన సాహిత్యంలో ఉన్నప్పటికీ, 18 వ శతాబ్దం ఉత్తరార్ధంలో అది పాశ్చాత్య సాహిత్య సంబంధంతో కొత్తరూపుతో ప్రమేయ మనే పేరుతో అవతరించింది. అప్పుడు కేవలం సంఘ సంస్కరణ, మూఢవిశ్వాస నిర్మూలనకు వినియోగపడింది. పిదప ఇరవై యేళ్ళకు సంగ్రహమనే పేరుతో

మత, ధర్మ, సంఘ సంస్కరణలకు వినియోగపడింది. మొదట ఇది విషయ నివేదనోపయోగ వ్యవహార భాషతో దర్శనమిచ్చినా, పిదప గ్రాంథిక భాషను గ్రహించింది. తర్వాత వీరేశలింగంగారి కాలానికి ఉపన్యాసమనే పేరుపొందినా, వ్యాసమని స్థిరపడింది. ఒక్క సంఘ సంస్కరణ, మత విషయాలకేకాక వివిధ విషయాలకు విస్తరించి 18వ శతాబ్దం చివరికి చరిత్ర పరిశోధన భాషా పరిశోధన, సాహిత్య శాస్త్రాలే ప్రధానంగాను గ్రహించాయి. ఇలా వ్యాస ప్రక్రియా సుందరి 20వ శతాబ్దంలో అడుగు పెట్టేసరికి వివిధ పత్రికల, విద్వాంసుల పోషణలో సర్వాంగీణ సౌందర్యం సంతరించుకొన్నది. అనవసర మైన పాతపద్ధతులను వదలుకొన్నది. సరళతను, సరసతను, విజ్ఞానదృష్టిని సొంతం చేసుకొన్నది. కొత్త పోకడలతో, ముందు చూపుతో తనులేనిది సాహిత్యమే లేదన్న విశ్వాసం చేకూర్చుకుంది.

## పరామర్శ గ్రంథాలు, పత్రికలు


1. బ్రౌను ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు
2. The Reader's Digest Great Ensyclopaedic Dictionary Vol 1, PP 306.
3. వాచస్పత్యం-సంపు-3.
4. శబ్దరత్నాకరము-పుట 321.
5. ఉషఃకిరణాలు-శ్రీవాత్సవ : పుట 321.
6. వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన, డాక్టర్ అక్కిరాజు రమాపతి రావు, పుట 216.
7. తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావము-డాక్టర్ కొత్తపల్లి వీరభద్ర రావు, పుట 276.
8. 1. నూరేళ్ళ తెలుగువ్యాసం - శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఆంధ్ర పత్రిక శార్వరి సంవత్సరాది సంచిక.
   2. తెలుగు భాషాసమితి విజ్ఞాన సర్వస్వము-సంపుటి-3, పుట 1112.
9. ఆంధ్రపత్రిక ఉగాది సంచిక-1933, పుటలు 58-61.
10 తెలుగు భాషాసమితి విజ్ఞానసర్వము-సంపుటి 3, పుట 1126.
11. ప్రాచీనాంధ్ర వార్తా పత్రికలు - శ్రీ నిడుదవోలు వేంకటరావు, భారతి 1929 మే.
12. పరిశోధన - గురుజాడ సంచిక, సంపాదకుడు - తిరుమల రామచంద్ర, 1956 డిసెంబరు.

# తెలుగు కల్పనా సాహిత్యంపై అమెరికా ప్రభావం

ఈ శతాబ్దంలో భారత దేశం అమెరికాకు ఎంతో ఋణపడి వుందని చెప్పవచ్చు. భారత స్వాతంత్ర్య సమరం అమెరికా పద్ధతులని పుణికి పుచ్చుకుంది. అమెరికా భారత విప్లవ నాయకుల కెందరికో ఆశ్రయ మిచ్చింది. గాంధీజీ భారత రాజకీయ రంగంలో అడుగు పెట్టిన తరువాత కలిగిన మార్పు-సత్యాగ్రహం-అమెరికా నాయకుల సాత్త్విక నిరోధ ప్రభావమేనని రాజనీతిజ్ఞులు అంటారు. రాజకీయంగా యింత ప్రభావం కలగడానికి కారణం సాహిత్యం. భారతదేశంలోని యితర ప్రాంతాల సంగతి యెలాగున్నా ఆంధ్ర ప్రాంతంపై అమెరికా ప్రభావం ఈ శతాబ్దం మొదటి దశాబ్దం నుండే ఆరంభమైంది.

అమెరికా ప్రభావం అంటే నా ఉద్దేశ్యం యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా సాహిత్య ప్రభావం అనే. అదృష్టవశాత్తు తెలుగువారికి అమెరికాతో పరిచయం మంచి పద్ధతినే జరిగింది. ఈ శతాబ్దం తొలి దశాబ్దంలో శ్రీ కొమర్రాజు లక్ష్మణ రావుగారి సంపాదకత్వాన ప్రపంచ విజ్ఞానాన్ని ఆంధ్రప్రజకు అందివ్వడానికి అవతరించిన విజ్ఞానా చంద్రికా గ్రంథమండలి 1910 ప్రాంతంలో "అబ్రహాం లింకను జీవిత చరిత్ర"ను ప్రచురించింది. ఇది 300 పుటల స్వతంత్ర రచన. శ్రీ గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారు రచించారు నాకు తెలిసినంతలో అమెరికాను గురించి ఆంధ్రుల ఆసక్తికి యిదే మొదలు. స్వాతంత్ర్య సమరంలో ముందంజ వేసిన తెలుగువారి హృదయాలలో లింకన్ అపూర్వోదాత్త జీవితగాథ గాఢంగా హత్తుకుంది.

కానీ, స్వాతంత్ర్యానంతరమే భారతీయులకు, ముఖ్యంగా తెలుగు వారికి అమెరికాపై ఆసక్తి విస్తరించింది. దీనికి కారణం డాక్టర్ హరదయాల్ వంటి పరిశోధకుల "ఇండియన్ అమెరికా" వంటి గ్రంథాలు అనవచ్చు. స్వాతంత్ర్యానంతరం భారత విశ్వ విద్యాలయాలలోను అమెరికాపై ఆసక్తి విస్తృతమైంది. అదివరకు లాంగ్ ఫెలో, విట్‌మన్ వంటి వారి కవితలు కొన్ని మాత్రమే విశ్వ విద్యాలయాల పద్య పాఠ్యాలలో ఉండేవి. స్వాతంత్ర్యానంతరం పెక్కు విశ్వ

విద్యాలయాలలో అమెరికా సాహిత్యం, అమెరికా చరిత్ర ప్రత్యేక పాఠ్య విషయాలుగాను నిర్దేశితమయ్యాయి. ఇటీవల ఆంధ్రప్రదేశ్ రాజధాని అయిన హైదరాబాదులో నెలకొల్పబడిన అమెరికన్ స్టడీస్ సెంటర్ అమెరికాను తెలుగు వారికి మరీ సన్నిహితం చేసింది. పలువురు విద్యార్థులు అమెరికా ప్రజలకు, రాజకీయాలకు, సాహిత్యానికి సంబంధించిన వివిధ విషయాలపై పరిశోధనలు జరుపుతున్నారు.

ఈ విధంగా విస్తరించిన అమెరికా ప్రభావాన్ని మనం మూడు విధాలుగా విభజింపవచ్చు. 1. అనువాదాలు; 2. అనుసరణలు; 3. ప్రభావం.

నవ్యాంధ్ర సాహిత్యంలో కాల్పనిక శాఖకు మూలపురుషులయిన భావకవులెవ్వరూ అమెరికా సాహిత్య ప్రాభవానికి లోనైనట్లుగాని, అనువాదాలు, అనుసరణలు వెలువరించినట్లుగాని కనిపించదు. వారిని ఎక్కువగా షెల్లీ, వర్డ్స్‌వర్తు, మిల్టన్ వంటి ఆంగ్ల కవులు, ఫ్రెంచి కవులు ప్రభావితులను చేశారు.

విద్వాన్ విశ్వంవంటివారు కొందరు చెదురుగా యుద్ధ సమయంలో అమెరికా సాహిత్యాన్ని అనువదించారు. విద్వాన్ విశ్వం స్టైన్‌బెక్ సుప్రసిద్ధ రచన "మూన్ ఈజ్ డౌన్" అనే నవలను "దురాక్రమణ" అన్న పేరుతో 1942లోనే అనువదించారు.

కానీ ఈ లోటును పూడ్చడానికి ప్రయత్నించి పెద్ద ఎత్తున కృషి చేసినవారు అభ్యుదయ కవులనే చెప్పాలి. వారు నేటి అమెరికా ప్రభుత్వం సామ్రాజ్యవాది అని అనుకోవడంచేత, తాము ప్రజాతంత్ర సంప్రదాయం మూర్తీభవించినట్లు భావించిన కొందరు అమెరికన్ రచయితల మీదనే తమ దృష్టిని ఎక్కువగా నిలపడం చేత "అభ్యుదయ" పత్రిక అమెరికా సాహిత్య ప్రత్యేక సంచికను వెలువరించ దలచారు. ఇది—1948-49 ప్రాంతంలో. కాని కొన్ని అవాంతరాల వల్ల ఆ పత్రిక ఆగిపోయింది. తర్వాత నెల్లూరి నుంచి శ్రీ నారపరెడ్డి రామిరెడ్డి సంపాదకత్వాన వెలువడసాగిన "అరుణ రేఖ" అనే మాసపత్రిక 1949లో "అమెరికన్ ప్రజాసాహిత్య సంచిక" అనే పేరుతో ప్రత్యేక సంచిక వెలువరించింది. ఇదే తెలుగులో పెద్ద ఎత్తున అమెరికా సాహిత్యం రావడానికి నాంది అనవచ్చు. శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగారు, శ్రీ కె. వి. రమణారెడ్డిగారు ఈ ప్రత్యేక సంచికా సంపాదకులుగా ఉన్నారు. శ్రీ కె. వి. రమణారెడ్డిగారు సంపాదకీయ వ్యాసాన్ని థామస్ జఫర్‌సన్, అబ్రహాం లింకన్ వంటి అమెరికా ప్రజాతంత్రవాదుల సూక్తులను కొన్నిటిని ఉట్టంకిస్తూ, అమెరికా కార్మికులు, నీగ్రోలు, సామ్రాజ్యవాద వంచితులు, సామ్రాజ్యవాద పీడితులు మొదలయిన వారి

పక్షాన వాదిస్తూ, పాల్ రాబ్సన్, హోవర్డు ఫాస్టు మొదలయిన సమకాలిక అమెరికా కళాకారులను ప్రస్తుతిస్తూ, అమెరికా సామ్రాజ్యవాదాన్ని ఖండిస్తూ, యుద్ధానికి విముఖత ప్రకటిస్తూ, ప్రజాస్వామ్య వాదాన్ని సమర్థిస్తూ మహావేశంతో వ్రాశారు. ఆ ప్రత్యేక సంచికలోని ప్రధానాంశాలని పేర్కొనడం అప్రస్తుతం కాదు.

వాల్టు విట్‌మన్ "లీవ్స్ అఫ్ ది గ్రాస్" లోని ఖండికలను శ్రీయుతులు శ్రీరంగం శ్రీనివాసరావు, ప్రయాగ కోదండరామశాస్త్రి, కె.వి. రమణారెడ్డిగార్లు అనువదించారు. "కేప్టన్ ఓ కేప్టన్" అనే గేయాన్ని శ్రీ ప్రయాగ కోదండ రామశాస్త్రిగారు అనువదించారు :—

"ఓ నా కెప్టన్! కెప్టన్!
మన భయద ప్రస్థానం ముగుస్తున్నది.
ప్రళయాంభ్రం వగుల్చుకొని
ప్రభంజనంలా అదే ఓడ!
మన కోరిన పరమార్థం ఫలించింది,
గంటలు వినబడుతున్నై, రేవు చేరువైంది."

ఈ విధంగా సాగింది అనువాదం.

"కామ్రేడ్" అనే గేయాన్ని శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు అనువదించారు.

"నీ తొడపై శిరస్సుంచి నేనిలా పడుకున్నప్పుడు, కామ్రేడ్,
ఇదివరకు నీతో, గాలితో అన్నదే ఇప్పుడు అంటున్నాను మళ్ళీ.
"ఔను, నేనెరుగుదు నాకు శాంతి లేదని, ఇతరులను గూడ
అశాంతిలో ముంచుతానని..."

కెన్నెత్ పాచెన్ గేయాన్ని కీర్తిశేషులు శ్రీ బాలగంగాధర తిలక్ గారు "ఉగాది" అని అనువదించారు.

"ఇక ముందు ఓ తండ్రీ
మేం మ్రోగించే గంటలు క్రొత్తవి,
మేం నడిచే బాటలు క్రొత్తవి."

ఈ విధంగా సమాప్త మౌతుందని ఈ అనువాదం. కెన్నెత్ పాచెన్ మరొక గేయాన్ని శ్రీ తిలక్ గారు "చలికాలం" అనే పేరుతో అనువదించారు. నీగ్రో కవుల గేయాలు కూడా కొన్ని అనూదితాలయ్యాయి.

"అమెరికా సినిమా పరిశ్రమ"ను గురించి శ్రీ కొడవటిగంటి కుటుంబ రావుగారు, "శాస్త్రాభివృద్ధి - అమెరికా" గురించి డాక్టర్ డి.వి.పి.యస్. నారాయణ రావుగారు స్వతంత్ర వ్యాసాలు వ్రాశారు.

శ్రీ బి.ఎ. బోట్కిన్ వ్రాసిన ''న్యూ మాసస్'' అనే వ్యాసాన్ని శ్రీ కె వి. రమణారెడ్డిగారు "అమెరికన్ జానపద గీతాలు" అనే పేర అనువదించారు.

లారెన్స్ జెఫర్ సన్ కథను ఒకదానిని ''జన్మహక్కు'' అనే శీర్షికతో ఎవరో అనువదించారు. మార్క్ట్వైన్ కథను "వచ్చిన పని" అనే పేరుతో శ్రీ ప్రయాగ కోదండ రామశాస్త్రిగారు అనువదించారు. ఈరాజాలన్ కథ ఒకటి అనూదితమైంది. హోవర్డు ఫాస్టు రచన నొక దానిని "కలకత్తాలో ఒక సాయంత్రం" అనే శీర్షికతో ఎవరో అనువదించారు.

కొన్ని నవలలలోని ప్రకరణాలను గూడ ఈ ప్రత్యేక సంచిక అనువదించి ప్రచురించింది. జాక్ లండన్ నవల "ది ఐరన్ హీల్"లో ఒక అధ్యాయాన్ని శ్రీ కె. వి. రమణారెడ్డిగారు అనువదించారు. క్లిఫర్డు ఆడెట్స్ వ్రాసిన "వెయిటింగ్ ఫర్ లెఫ్టీ"లో ఒక భాగాన్ని శ్రీ ఆవంత్స సోమసుందర్ అనువదించారు,

న్యూయార్క్ నగరం నుంచి గోర్కీ వ్రాసిన ఒక లఘు రచనను, ప్రచారానికీ, కళకూ ఉండవలసిన బాంధవ్యం గురించి అప్టన్ సింక్లేర్ ప్రశ్నోత్తర రూపంగా వ్రాసిన ఒక వ్యాసాన్ని మరిద్దరు అనువదించారు.

ఏమైనా అమెరికా సాహిత్యం గురించి ఈ మాత్రమైనా తెలుగువారికి తెలియజేసిన ప్రయత్నం మరొకటి లేదు అయితే "అరుణరేఖ" పత్రిక అంత ప్రచారం గలది కాదు గనుక, ఈ ప్రత్యేక సంచిక అంతగ వ్యాప్తికి రాలేదు.

అమెరికా సాహిత్య ప్రభావం అనువాదాలు, అనుసరణలు, ప్రభావ - అని మూడు విధాలుగా విడిగడించవచ్చు నన్నానుగదా! మొదటిదయిన అనువాదాలను కొన్నిటిని పేర్కొంటాను.

కథల అనువాదం: అమెరికా కథకులలో ఓ హెన్రీ తెలుగు యువకులకు ఎక్కువగా నచ్చాడు. ఒక దారిన పోతున్న కథ చిన్న మలుపుతో తద్విరుద్ధంగా గాని, తద్విశేషంగా గాని వెళ్ళి చమత్కార జనకమయ్యే ఓ. హెన్రీ పద్ధతే అతని యువక ప్రియార్చనకి కారణమనుకుంటాను.

ఓ. హెన్రీ, విలియం సారోయన్ కథలను 1950 ప్రాంతాలలో మాన్స్ అనే కథకుడు అనువదించి 'ఆనందవాణి'లోను, ఇతర పత్రికలలోను ప్రచురించారు.

విలియం సారోయన్ కథలను కొన్నిటిని శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు అనువదించారు. డోరోతీ పార్కర్ కథ "కస్టర్డ్ హార్ట్"ను శ్రీ శ్రీనివాసరావుగారే 'అడ్డూలాంటి గుండె' అని అనువదించారు.

హోవర్డ్ ఫాస్ట్ కథలను అతివాద కమ్యూనిస్టులు పలువురు అనువదించారు. శ్రీ ఆనిసెట్టి సుబ్బారావుగారు కొన్ని అమెరికన్ కథలను అనువదించారు.

శ్రీ చందూరు నాగేశ్వరరావుగారు 1956 లో ఆంబ్రో బైర్స్ కథ "ఎన్ అక్కరెన్స్ ఎట్ ఔల్ క్రీక్ బ్రిడ్జ్"ను "ఉరితీయబడ్డ మనిషి" అని, నారా ఆర్నీ జ్యూయెట్ కథ 'ఎవైట్ హెరాన్'ను "నారాయణ పక్షి" అని, జాక్ లండన్ కథ 'ది హీథెన్'ను "పదేళ్ళ స్నేహం" అని, నెథానియల్ హాతరన్ 'ది యాంబిషస్ గెస్ట్,ను 'అతిథి' అని, ఆ రచయితదే "ది గ్రేట్ స్టోన్ ఫేస్"ను "శిలాముఖము" అని, విలియం ఫాక్నర్ "ది బేర్"ను "ఎలుగుబంటి" అని 'ఆరు కథలు' అనే పేర పుస్తకంగా ప్రచురించారు. విలియం ఫాక్నర్, ఎడ్నా పెర్బర్, మేరీ ఇ విల్కిన్స్, జాన్ స్టీన్‌బెక్-వీరి ఆరు కథలను "మరొక ఆరు కథలు" అనే పేరుతో అనువదించారు.

నవలల అనువాదాలు: ఇక నవలల అనువాదాలు పలువురు చేశారు.

శ్రీ నండూరి రామమోహనరావుగారు మార్క్ ట్వైన్ వ్రాసిన "టామ్ సాయర్" అనే నవలను అనువదించారు. ఇది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా పడి, పుస్తక రూపం దాల్చింది.

హోవార్డ్ ఫాస్ట్ నవల "స్పార్టకస్"ను శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు అనువదించారు. దీనిని విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ప్రచురించారు. ఫాస్ట్ మరొక నవల "ది లాస్ట్ ఫ్రంటిన్"ను "మానధనులు" అనే పేరుతో శ్రీ కె.వి. రమణారెడ్డిగారు అనువదించారు. దీనిని కూడా విశాలాంధ్ర ప్రచురణాలయమే ప్రచురించింది.

జేన్ మెక్ లవైన్ రచించిన "ఇట్ హాపెన్స్ ఎవ్విరీ థర్స్‌డే" అనే నవలను "ప్రతి గురువారం" అనే పేర, విల్లా కథిర్ రచించిన "డెత్ కమ్స్ ఫర్ ది బిషప్" అనే నవలను "ప్రేమగాథ" అనే పేర, కార్నెల్ రచించిన 'ఫోర్ డేస్ ఇన్ జూలై"ని "స్వాతంత్ర్య రథం" అనే పేర శ్రీ చందూరు నాగేశ్వరరావుగారు అనువదించారు. ఈయన మరెన్నో అమెరికా శాస్త్ర గ్రంథాలను, నవలలను, కథా సంపుటాలను, జీవిత చరిత్రలను అనువదించారు. అమెరికా సాహిత్యాన్ని విశేషంగా అనువదించి ఆంధ్రావళికి అందజేసిన కీర్తి శ్రీ చందూరు నాగేశ్వరరావు గారికే దక్కింది.

అనుసరణలు : అనువాదాలంత స్పష్టంగా అనుసరణలను గురించి చెప్పడం కష్టం. చిత్తశుద్ధిగల రచయితలైతే ఫలానా కవిని అనుసరించాను అని చెప్పుకుంటారు; అలాంటి వారు కానప్పుడు పాఠకుడైనా, విమర్శకుడైనా అనుసరణని కనుగొనడం కష్టం.

ఎడ్గర్ ఎలెన్‌పో కవిత ఆధునిక ఆంధ్ర కవులలో-ముఖ్యంగా అభ్యుదయ కవులలో - పలువురిని ప్రేరేపించింది. ఎలెన్‌పో 'బాడిలేర్' అనే ఫ్రెంచి కవికి వరవడి పెట్టడం ద్వారా "సింబాలిజం" అనే ఉద్యమానికి ప్రథమ స్థానం మరుగున ఉన్నాడు. సింబాలిజంను అంతో ఇంతో ఆపోశనం పట్టిన శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు గారికి ఎడ్గర్ ఎలెన్‌పో యిష్టుడు కావడంలో ఆశ్చర్యంలేదు. ఆయన "మహా ప్రస్థానం"లోని గేయాలతో ఒకటైన "గంటలు" ఎలెన్‌పో "ది బెల్స్" అనే దానికి అనుసరణ.

ఈ "గంటలు"కు ప్రకాశాంతమైన అనుసరణ శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారి "మంటలు! మంటలు!" అనే గేయం.

మార్క్‌ట్వైన్ వ్రాసిన "ఇండియన్ క్రో" అనుసరణ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి 'కాకి' ఇది 'మాటా మంతీ' వ్యాస సంపుటిలో ఒక్కటి.

"దారిని పోయే దానయ్య" అనే రూపకం "మిస్టర్ ఎక్స్ పాసస్ బై" అనేదాని అనుసరణ. దీనిని శ్రీ గోకుల్‌చంద్ రచించారు.

ప్రభావం : అమెరికా రచయితల ప్రభావం గురించి చాలానే చెప్పవచ్చు. ఓ. హెన్రీ ప్రభావం ఆధునికాంధ్ర కథకులపై విశేషంగా ఉంది. పాత రచయితలలో శ్రీ గుడిపాటి వెంకటచలంగారి "సరస్వతీ ప్రసన్నం," "వేదాంతం" మొదలయిన కథలలో చివరి మలుపు ఓ. హెన్రీ ప్రభావ మనడానికి సాహసిస్తున్నాను. యువ రచయితలలో శ్రీ వాకాటి పాండురంగారావుగారి "అపరాజిత" మొదలయిన కథలలో చివరి మలుపులూ ఓ. హెన్రీ ప్రభావమే. శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి రచనా విధానంలోనూ, శ్రీ బుచ్చిబాబుగారి 'చివరికి మిగిలేది' మొదలయిన నవలలోను హెమింగ్వే ప్రభావం-కథనరీతి, వాక్యాలు మధ్య ఆపడం, సగమే పలకడం వంటివి నా మటుకు నాకు కనిపిస్తున్నవి.

పెరల్ బక్ ప్రభావం తన రచనలలో ఉన్నట్టు యిటీవల శ్రీమతి ద్వివేదుల విశాలాక్షిగారు తెలిపారు.

ఇటీవలి రోజులకు వస్తే శ్రీ ఆరుద్రగారు "ఇంటింటి పజ్యాలు" పేరిట వ్రాసిన లఘు రచనలకు ప్రేరణ అమెరికా కవి ఆగ్డన్ నాష్ అయినట్లు ఆయనే వ్రాసుకొన్నారు. అలాగే ఇ. ఇ. కమ్మింగ్స్ అనే అమెరికన్ కవి ప్రభావం

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు, శ్రీ ఆరుద్రగార్ల వంటి విచిత్ర కవితావాదుల వైచిత్రిపై ఉంది.

ఈనాటి తెలుగు కవిత్వంలో ప్రముఖంగా కన్పిస్తున్న "దిగంబర కవులు" ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం అమెరికాలో బయల్వెడలిన "డి బీటెన్ జనరేషన్" (బీట్స్, బీట్నిక్స్) రచయితలతో ప్రభావితు లయినారనే నా విశ్వాసం. దిగంబర కవులలో ఒకరైన శ్రీ కె. యాదవరెడ్డి గారు "నిఖిలేశ్వర్" అనే మారుపేరుతో దిగంబర కవుల గురువులను గురించి "ప్రపంచ సాహిత్యంలో యువతరం తిరుగుబాటు" అనే వ్యాసం "భారతి" 1967 జనవరిలో ప్రచురించారు.

అమెరికా కవులలో ఆంధ్రకవులను, ముఖ్యంగా అభ్యుదయ కవులను ప్రభావితులను చేసిన కవి చిలీదేశకవి పాబ్లో నెరూడా. శ్రీ శ్రీరంగం శ్రీనివాస రావు గారు, శ్రీ కె. వి. రమణారెడ్డిగారు, మరికొందరు ఈ కవి రచనలను అనువదించారు.

(ఇక తెనుగు అపరాధక పరిశోధన వాఙ్మయం చూస్తే అగాతా క్రిస్టీ స్టాన్లీ గార్డెనర్ల అనుసరణలు, ప్రభావితాలు చాలా ఉన్నాయి.)

నేడు ప్రపంచంలోనే అమెరికా ప్రభావం ముఖ్యంగా యునైటెడ్ స్టేట్స్ ప్రభావం వ్యాపిస్తున్నది. అలాంటప్పుడు అమెరికా సాహిత్యం మనకు మరింత సన్నిహితం కావడంలో ఆశ్చర్యం లేదు.

ఈ చిన్న వ్యాసంలో గడచిన అర్ధశతాబ్దిగా తెలుగు కల్పనా సాహిత్యంపై. ముఖ్యంగా కథలపైన, నవలలపైన అమెరికా సాహిత్య ప్రభావాన్ని దిఙ్మాత్రంగా చూపడానికి ప్రయత్నించాను. సహృదయతే దీని బాగోగుల ప్రమాణం.



సాహితీ సుగతుని స్వగతం — డా॥ తిరుమల రామచంద్ర

## మా వద్ద లభించు

## భాష, సాహిత్య, విమర్శ, సిద్ధాంత గ్రంథాలు

| | | |
|---|---|---|
| సాహిత్య తత్వం | - ఆర్.వి.ఆర్. | 13.0 |
| గౌతమ వ్యాసములు | - పింగళి లక్ష్మీకాంతం | 20.00 |
| మధుర పండితరాజము, ఆత్మలహరి | ,, ,, | 20.0 |
| తెలుగు పత్రికల సాహిత్య సేవ | - డా॥ తిరుమల రామచంద్ర | 5.0 |
| లిపి పుట్టుపూర్వోత్తరాలు | ,, ,, | 35. |
| ఆధునికాంధ్ర కవిత్వం | - సి. నారాయణరెడ్డి | 80. |
| తుమ్మల సాహిత్యం | - సం॥ ఏటుకూరి ప్రసాద్ | 50.00 |
| తాపీ ధర్మారావు జీవితం, రచనలు | - ఏటుకూరి ప్రసాద్ | 80. |
| గురజాడ యుగం | - సెట్టి ఈశ్వరరావు | 10. |
| తెలుగు భాషాతత్వం | - కొమర్రాజు వేంకట లక్ష్మణరావు | 25. |
| సాహితీ వ్యాసాలు | - బూదరాజు రాధాకృష్ణ | 18. |
| భాషాశాస్త్ర వ్యాసాలు | ,, ,, | 25. |
| సారస్వత వివేచన | - రాచమల్లు రామచంద్రారెడ్డి | 20.00 |
| కృష్ణశాస్త్రి కవితాత్మ | - ఆవంత్స సోమసుందర్ | 11.00 |
| విజయ విలాసం (హృదయోల్లాస వ్యాఖ్య) | - తాపీ ధర్మారావు | 80.00 |
| సాహిత్య వ్యాసాలు | - ప్రేమ్‌చంద్ | 7. |

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞానభవన్, 4-1-435 బ్యాంకు స్ట్రీటు,

హైదరాబాదు - 500 001

**విశాలాంధ్ర బుక్ హౌస్**

విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్టణం, తిరుపతి

గుంటూరు, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.

ISBN 81-7098-230-8

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyderabad-20.